# FOREWORD

A good portion of the Sanskrit Literature in the field of Purānas and Kāvyas, and latterly in the field of Dramas, has been already rendered into Telugu. There are also a few books in Telugu on Dharmaśāstras, Mathematics, Medicine and Philosophy. But the bulk of the Sanskrit scientific literature is yet a sealed book to the non- Sanskrit -Knowing Andhras, and the publication of the present volume under the auspices of the Andhra University, is, therefore, welcome. Mīmāmsā—literally enquiry—is the name given to the science which enquires into, and determines the things predicated in the Vedas. The Vedas are usually regarded as consisting of two parts—viz— an Early (Pūrva) part, and a later (Uttara) part, the former consisting of the Vedas proper, and the latter of the Upanishats. Uttaramīmāmsā (enquiry into the Upanishats) is another name for Metaphysics or philosophy proper, and is fairly well known in learned circles. The present volume is a primer of Pūrvāmīmāmsā and explains, in a succinet form, the first principles of interpreting the Vedic Texts, and their application to the ritual enjoined therein.

Unlike Uttaramīmāmsā, the discourses of Pūrvamīmāmsā are rather technical in their scope. But it will be found that the general principles underlying these discourses are capable of wider application, and are, as a matter of fact, applied in interpreting the Dharma śastras, for instance. It is in this respect of its wider applicability that the Science of Pūrvamīmāmsā is of interest to the general reader, and Mr. Gopalakrishnamma is to be congratulated on being the first to attempt to introduce the subject to the Telugu readers. None is more competent than he to do it. His language is chaste. An average general reader would, perhaps, wish th style were less terse and more explanatory; but the auth seems to have preferred to stick to the form of the original as far as [illegible] to ensure its sense being brought out in tact.

# కృతజ్ఞత

ఈ గ్రంథములు రచించుటయం దావశ్యకమగు పుస్తకసామగ్రిని సంపాదించి వినియోగించుటయందును, దీనిని ముద్రించుసందర్భమున ప్రూఫులను (proofs) సవరించుట మున్నగు విషయములందును, మిగుల సాహాయ్య మొనర్చిన—రాజమహేంద్రవరములోని గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీపండితులైన శ్రీమాన్ 'విద్వాన్' కలవపూఁడి వేంకటాచార్యులవారికి నేను మిక్కిలిగఁ గృతజ్ఞుఁడను.

కూచిమంచి గోపాలకృష్ణమ్మ.

# విషయానుక్రమణిక

:o:

# సంకేతాక్షర వివరణము

—:o:—

ఆప. శ్రౌ. సూ—ఆపస్తంబ శ్రౌతసూత్రము
ఆప. ధ. సూ—ఆపస్తంబ ధర్మసూత్రము
ఐ. బ్రా—ఐతరేయ బ్రాహ్మణము
కా. సం—కాఠక సంహిత
కా. శ్రౌ—కాత్యాయనశ్రౌతము
జై. సూ—జైమినిసూత్రములు
తా. బ్రా—తాండ్యబ్రాహ్మణము
తై. బ్రా—తైత్తిరీయబ్రాహ్మణము
తై. సం—తైత్తిరీయసంహిత
తం. ర—తంత్రరత్నము
తం. వా—తంత్రవార్తికము
న్యా. సు—న్యాయసుధ
పా. సూ—పాణిని సూత్రములు
మీ. న్యా. ప్ర—మీమాంసాన్యాయప్రకాశము
మ. స్మృ—మనుస్మృతి
మై. సం—మైత్రాయణీయ సంహిత
రా—రాణకము
వాల్మీ. రా—వాల్మీకిరామాయణము
శ. బ్రా—శతపథబ్రాహ్మణము
శా. భా—శాబరభాష్యము
శ్రీ. భ. గీ.—శ్రీభగవద్గీత
శ్లో. వా—శ్లోకవార్తికము

—

*

# తప్పొప్పుల పట్టిక

—————: ౦ :—————

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౧ | ౩ | మాలము. | మూలము. |
| ౨౩ | ౧ | ఏకహాయిన్యా | ఏకహాయన్యా |
| ౨౫ | ౨౭ | సోమేస | సోమేన |
| ౨౬ | ౨౭ | సర్గము | స్వర్గము |
| | ౧౭ | యచేత | యజేత |
| [illegible] | ౨౫ | వాక్యమున | వాక్యము |
| ౩౧ | ౨౧ | ధధ్నా | దధ్నా |
| ౩౨ | ౨౩ | దావి | దాని |
| ౩౩ | ౩ | అగ్నిహూత్రంజుహూతి | అగ్నిహోత్రంజుహోతి |
| ౩౬ | ౧౯ | ఆను | అను |
| ౪౦ | ౧౭ | నళ్చసి | సళ్చసి |
| ౪౨ | ౧౨ | భానవను | భావనను |
| ,, | ౨౦ | కారకములట్ల | కారకములట్లు |
| ౪౮ | ౨౬ | మాత్ర్రము | మాత్రము |
| [illegible] | ౮ | గర్దము | గర్తయే |
| [illegible]౮ | ౯ | నమాఖ్య | సమాఖ్య |
| [illegible]౫ | ౭ | శబ్దముపకు | శబ్దమునకు |
| [illegible]౭ | ౩ | ప్రథాన | ప్రధాన |
| ,, | ౨౩ | ఔదుంబరత్వమున | ఔదుంబరత్వమన |
| [illegible]౭ | ౭ | యష్టులందు | యిష్టులందు |
| | ౨౭ | జనింపజేయుటంచేసి | జనింపఁజేయుటంజేసి |
| | ౭ | ఈంయగము | ఈయంగము |
| | ౨౯ | ఇట్లీయితరనాక్యములకు | ఇట్లేయితరవాక్యములకు |
| | ౧౧ | పాఠముకంటె | పాఠముకంటె |
| | ౧౫ | అగ్నిషోమీయ | అగ్నీషోమీయ |
| [illegible]౭ | ౧౦ | దెలిసికొను | దెలిసికొను |
| ౩౭ | ౨౬ | మర్ధ్య | మధ్య |
| ౪౦ | ౨౫ | ప్రజాపతి | ప్రజాపతి |
| [illegible]౩ | ౨౨ | రావచ్చు | రావచ్చు |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౪౯ | ౨ | రాజూ | రాజా |
| ౧౫౨ | ౧౧ | వనమర్థుఁడు | వషమర్థుఁడు |
| ౧౬౭ | ౨౪ | తెలియఁచేయు | తెలియఁజేయు |
| ౧౭౬ | ౪ | ఆఘోరాగ్ని | ఆఘారాగ్ని |
| ౧౯౯ | ౧౬ | అను | అను |
| ౨౦౬ | ౧౫ | విముకుఁడు | విముక్తుఁడు |
| ౨౦౭ | ౧౦ | లిఙ్గు | లిఙ్గు |
| ౨౧౪ | ౧౫ | ర్తవ్యముగా | కర్తవ్యముగా |
| ౨౧౭ | ౭ | ప్రాప్తించునవి | ప్రాప్తించునని |
| ౨౨౪ | ౧౧ | లనూయాజ | ననూయాజ |
| ౨౨౫ | ౧౬ | అనారభ్యాధీత | అనారభ్యాధీత ,౬ |
| ౨౩౭ | ౯ | సవిహిత | సమీహిత |
| ౨౩౯ | ౩ | లిఙ్త్వాంశము | లిఙ్త్వాంశము |
| ౨౪౨ | ౧౧ | చేసినసిదప | చేసినపిదప |

## మఱికొన్ని సవరణలు

(౧) ౪౩ పేజిలో ౧ నెం. కు టిప్పణి ౪౨ పేజిలో ౪-వ నెంబరుగా పడినది.

(౨) ౯౫ పేజిలో ౧ నెం. టిప్పణి ౯౪ పేజిలోని ౧౨, ౧౩ పంక్తులలోని విషయమున సంబంధించునది.

(౩) ౧౧౫ పేజిలో ౨౫ పంక్తిలో 'ప్రాయణీయము - ఉదయనీయము' అనుచోట 'ప్రాయణీయము' అనినఁ జాలును. 'ఉదయనీయము' అనునది యావశ్యకము కాదు.

(౪) ౧౨౬ పేజిలో ౧౨-వ పంక్తిలో 'యవాగ్వా అగ్నిహోత్రం జుహోతి' అనుచోట నుండవలసిన ౫ సంఖ్య ౧౬ పంక్తిలో నున్న 'పాఠక్రమము' కంటె అనుచోటఁ బడినది. కను ౫ నెంబరు టిప్పణి 'యవాగ్వా అగ్నిహోత్రం పచతి' అను వాక్యమునకే యని తెలియఁ దగును. అట్లే 'పాఠక్రమము' అనుచో నుండవలసిన ౬ సంఖ్య ౧౯ పంక్తిలోని 'అగ్నిహోత్ర హోమము' అనుచోఁ బడినది. 'అగ్నిహోత్ర హోమము' అనుదాని ౧౨౬ పేజిలో ౧ నెంబరుగా నున్నది. ౧౨౬ పేజి ౨ పంక్తిలో 'ప్రయోజనము దానికి నెంబ రక్కఱలేదు.

(౫) ౨౦౬ పేజిలో ౨ సంఖ్య అయిన పిదప మరల ౧, ౨, ౩, ౪, ౫ అంకెలు వేయఁ వానిలో ౧ సంఖ్యకు మాత్రము టిప్పణి యీ పేజిలోనే పడినది. మిగిలినవి ౨౦౭ పేజీఁ బడినవి.

(౬) ౨౨౨ పేజిలో ౧౨-వ పంక్తి ౧౩-వదిగాను, ౧౩-వ పంక్తి ౧౨-వదిగాను పడినవి.

# ఉపోద్ఘాతము

ఇంతకుముందు రచియింపఁబడిన 'ఆంధ్రమీమాంసాపరిభాష' 'ఆంధ్రమీమాంసార్థసారము' నను రెండు గ్రంథములకును నుపోద్ఘాతములు వ్రాయఁబడినవి. వానిలో మొదటి యుపోద్ఘాతమునఁ బూర్వమీమాంసాశాస్త్రమునకు సంబంధించిన, శాస్త్రోత్పత్తి, శాస్త్రమును బ్రతిపాదించు వాఙ్మయము, శాస్త్రమునందలి పంద్రెం డధ్యాయములందు నిరూపింపఁబడిన ప్రమేయముల సంగ్రహము, మున్నగు ననేకవిషయములాస్తికులకు సుబోధ మగురీతిని వివరింపఁబడినవి.

రెండవ యుపోద్ఘాతమునం దన్ననో, యీశాస్త్రమునందలి విషయముల స్వరూపమును 'స్థాలీపులాకన్యాయము'గఁ దెలియంజేయుటకై కొన్నివిషయములు సులభశైలినిఁ జర్చింపఁబడినవి. నే నింతకుముందు రచించిన రెండు గ్రంథములందును పూర్వమీమాంసాశాస్త్రమునందలి 'విధులు', 'మంత్రములు', 'నామధేయములు', 'నిషేధములు', 'అర్థవాదము' లనెడి విషయము లన్నియు సంగ్రహముగ వివరింపఁబడినవి. అయినను, వైదికాచారానుప్రాణిత మయిన కర్మకాండమునకును, లోకవ్యవహారమునకును, బలువిధములుగ నుపకరించు ననేకవిషయములు, న్యాయములును బూర్వమీమాంసాశాస్త్రములో వివరింపఁబడినట్లు తెలిసికొని యుండుటంజేసి, యీ విధులు, మంత్రములు, మున్నయిన విషయములనుగూర్చి యించుక విస్తరముగఁ దెలిసికొనఁ గుతూహల మాంధ్రులలో ననేకులకుఁ గలిగినది. 'ఆంధ్రమీమాంసాన్యాయప్రకాశిక', 'జైమినీయన్యాయమాలావిస్తరము', 'భాట్టదీపిక', 'శాస్త్రదీపిక', 'శాబరభాష్యము' మొదలుగాఁగల గ్రంథము లన్నియు సంస్కృతభాషలోనే రచియింపఁబడి యుండుటవలన నాగ్రంథములను బాగుగఁ జదువుటమూలముగా నీవిధులు, మంత్రములు మున్నగు విషయములఁగూర్చి సవిస్తరముగాఁ దెలిసికొనుట యాంధ్రులలో ననేకుల కశక్యము. కావున నీవిషయముల నాంధ్రులకు సులభముగాఁ దెలియంజేయుటకై యీ 'యాంధ్రమీమాంసాన్యాయముక్తావళి' యను గ్రంథమును రచించితిని.

కూచిమంచి గోపాలకృష్ణమ్మ.

*

# ఆంధ్ర మీమాంసా న్యాయ ముక్తావళి



## ధర్మలక్షణము

పరమదయాళువును బూజ్యుఁడును నగు జైమినిమునిచే "అథాతో ధర్మజిజ్ఞాసా[౧]" అనునీమున్నగు[౨] సూత్రములమూలముగాఁ బన్నెండధ్యాయములుగల గ్రంథ(ము)ందు వేదసారమగు ధర్మము విమర్శింపఁబడినది. వేదముచే నేదే నొక ప్రయోజ(న)ము[3] నుద్దేశించి విధింపఁబడు నర్థము[౪] ధర్మ మనఁబడును. ఉదా. యాగము మున్న(గ)నవి. అట్టియాగము "యజేత స్వర్గకామః[౫]" అనునిట్టి వాక్యములచే స్వర్గమను (ప్ర)యోజనము నుద్దేశించి విధింపఁబడుచున్నది. అది యెట్లంటేని!—ఈ విధియందలి (య)జేత' అను క్రియాపదమందు 'యజ్' అను ధాతువును 'త' యనెడి ప్రత్య(య)ము ననెడు రెండంశములు[౬] గలవు. ఈ 'త' ప్రత్యయమునందుఁగూడ 'ఆఖ్యా(త)త్వము[౭]' 'లిఙ్‌త్వము[౮]' అనెడు రెండంశములు[౯] గలవు. వానిలో నాఖ్యాతత్వ(మ)నునది పది లకారములయందును[౧౦] సాధారణముగా[౧౧] నుండునది. లిఙ్‌త్వ మనునది

౧. అథ=వేదమును జదివిన పిదప, అతః=వేదమును జదువుట ప్రయోజనము కలది కనుక, ధర్మ(జిజ్ఞా)సా=అట్టి వేదమునకర్థమగు ధర్మముయొక్క విమర్శనము చేయవలసి యున్నది. (జై. సూ. ౧.౧.౧.)

౨ "అథాతో ధర్మజిజ్ఞాసా" అను సూత్రము మొదలుకొని 'అన్వాహార్యేచ దర్శ(నా)త్' అను సూత్రమువఱకు నుండునట్టి.

3. ఫలము.

౪. క్రియ మున్నగు వస్తువు

౫. స్వర్గకామః = స్వర్గమును గోరువాఁడు, యజేత = యాగముచే ( = యాగము నాచరించుట (ద్వార)ముగా) నిష్టము నుత్పాదింపవలయును.

౬. శక్తిమూలముగా నర్థమును బోధించు రెండుశబ్దములు.

౭. క్రియాసామాన్యమును బోధించుట.

౮. విధించుట యనెడి క్రియావిశేషమును బోధించుట.

౯. శబ్దమునందలి యర్థవిశేషమును బోధించు ధర్మము. ఒకయధికారియందు మనుష్యత్వము (బ్రా)హ్మణత్వము అధికారిత్వము మున్నగు ననేకధర్మములున్నను వానిలో నధికారిత్వ మనెడి ధర్మము (మూల)ముగనే యతఁడు చేయునధికార మెట్లు ప్రవర్తింపఁగలదో యట్లే.

౧౧ సంస్కృతమునందు వర్తమానము, భూతము మున్నగు పదిలకారములను దెలియఁజేయు

· అవిశేషముగ.

మట్టుకు విధిని బోధించు 'లిజ్' అను లకారవిశేషమునందు మాత్రమే యుండున ఇచట 'ఆఖ్యాతత్వము' 'లిజ్త్వము' అను రెండంశములచేతను ముందు చెప్ప బడఁబోవు రీతిని, రెండు[1] విధములగు భావన తెలియంజేయఁబడుచున్నది. భావ యనఁగా 'పుట్టునది పుట్టునట్లు చేయుటకై పుట్టించువాఁడు చేయువ్యాపారవి షము.[2] అది 'శబ్దభావన' యనియు 'అర్థభావన' యనియు రెండు విధములుగ నున్నది.

## శబ్దభావన

వానిలో శబ్దభావన యనఁగాఁ బురుషుని ప్రవృత్తి[3] కనుకూలించునదియు, ప్రవృత్తిని బుట్టించువాఁడు చేయునదియు నగు నొకానొక వ్యాపారము. అది 'శ ప్రత్యయమందుండు లిజ్త్వ మనునంశముచే బోధింపఁబడుచున్నది. లిజ్ప్రత్యయవ గల క్రియాపద మేదేని ప్రయోగింపఁబడునపుడెల్ల నట్టిప్రయోగ మెవరికొఱకు శింపఁబడునో వాఁడు 'ఈ క్రియను బ్రయోగించువాఁడు న న్నేదే నొకపనియందు బ్రవర్తింపఁజేయుచున్నాఁడు.' లేదా 'ఈ నా ప్రవృత్తి కనుకూలించు వ్యాపారః నితఁడు చేయుచున్నాఁడు.' అని తప్పక తెలిసికొనును.

ఏది యేశబ్దముచేఁ దప్పక తెలియఁజేయఁబడు చున్నదో, యది దా శక్యార్థ మగుచున్నది. ఉదా. 'గోవును దీసికొని రమ్ము' అను నిట్టివాక్యమునందలి గోశబ్దముచే నెప్పుడును గోజాతి[4] తెలియఁజేయఁబడు చుండుటచే నది గోశబ్దము కర్థ మగుచున్నది. పురుషుని ప్రవృత్తి కనుకూలించు నా వ్యాపారవిశేషము 'గోవున దీసికొని రమ్ము' 'పాఠము చదువునది' ఈ మున్నగు నేదే నొకపురుషుని ప్రయోగింపఁబడు లౌకికవాక్యములయందు[5] వానిని బ్రయోగించు పురుషుని ప్రాయవిశేష మగుచున్నది. 'వేదమును[6] యథావిధిగాఁ జదువునది' ఈ మున

౧. అర్థభావన, శబ్దభావన యనునవి.

౨. ఒకానొక వ్యాపారము.

3. పురుషుఁడు తా నపేక్షించు ఫలమును గలిగించు నేదే నొక పనిని జేయుటకు యత్నించు

౪. గోవులయందెల్ల నుండునదియు, నితరములయందెచటను నుండనిదియు నగు నాకృతివిశేష

౫. లోకమందొకపురుషుఁడు మఱియొకని నేదే నొక పనియందు నియమించుటకు నుద్దేశించి ప్రయోగించు వాక్యము.

౬. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః"

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారిచే రచియింపఁబడిన ఆంధ్రమీమాంసా భాషను, ఆంధ్రమీమాంసార్థసారమును బూర్తిగాను, ఆంధ్రమీమాంసాన్యాయదీపికను స్థాలీపుల న్యాయముగను నచ్చటచ్చటను చూచి మిగుల నానందించితిని. ఈగ్రంథములు సుకుమారమును సలక్ష్య మును నగు నాంధ్రభాషలో రచింపఁబడినవి. పారిభాషికపదములకు టిప్పణములు విపులముగా వ్రాయఁబడినవి. శాస్త్రగ్రంథములను శాస్త్రసంప్రదాయముల కించుకైనను బాధ కలుగకుండ నిట్లు సుబోధములుగ నొనర్చుట మిగులఁ గష్టసాధ్యము. మీమాంసాశాస్త్రప్రచారము మిగులఁ దక్కువగా నుండుమనదేశమున, సంస్కృతభాషానభిజ్ఞు లగు నాంధ్రులకుఁగూడఁ బూర్వమీమాంసాశాస్త్రము నందలి విషయములు సుబోధములుగా నొనర్చిన వీరియుద్యమ మెంతయు శ్లాఘ్యము. ఈవిషయమున నాంధ్రలోకము వీరియెడలఁ గృతజ్ఞత చూపవలసియున్నది. శ్రీ గోపాలకృష్ణమ్మగారిపరిశ్రమమునకు భగవానుఁ డనుకూలఫలము నచిరకాలమునఁ బ్రసాదించునుగాక.

వడలి లక్ష్మీనారాయణశాస్త్రి

పిఠాపురము, 10-1-1933

Amnayardha Vachaspati, Veda Vedanga pandit.

పరమకారుణికైః కూచిమంచి గోపాలకృష్ణశర్మభిః లోకానుజిఘృక్షయా అధునా ఆంధ్రీకృత్య ప్రకాశితః మయా స్థాలీపులాకన్యాయేనావేక్షితోఽయం గ్రంథరాజోఽభూతపూర్వమానందం విద్వద్వరేణ్యానాం సంపాదయిష్యతీతి మన్యే. యద్యపి కైశ్చిద్బుద్ధిమద్భిరాంధ్రీకృత్య సంప్రేషితాన్ ప్రాచీనగ్రంథరాజానద్రాక్షమ్. యత్రక్వాప్యేతాదృశస్తు నైవ దరీదృశ్యతే. శాస్త్రీయగ్రంథా ఏవాంధ్రీకృతా విరలాః, యత్రక్వచన యద్యాంధ్రీకృతాః, తేచ తత్తచ్ఛాస్త్రీయసమస్తపదాన్యే వాంధ్రప్రత్యయశిరస్కాని సముద్వహంతః ప్రయాసమాత్రప్రయోజనాః నైవ లోకోపకారాయ కల్పేరన్. అయంతు గ్రంథరాజో వ్యుత్పిత్సూనాం పూర్వమీమాంసాపరిజ్ఞానం సమ్యగ్జనయన్ సకలశాస్త్రీయ గ్రంథాన్వయపాటవం సంపాదయిష్యతీత్యేతన్నిర్వివాదం. అధునాతనాసు విద్వాన్ శిరోమణీత్యాది నామాంకితకక్ష్యాచిత్రితాసు కలాశాలాసు అయంగ్రంథరాజోఽవశ్యాధ్యేతవ్యత్వేన నియతశ్చేదేత ంథోపయోగస్సర్వేషాం సువిదితో భవిష్యతి. అన్యచ్చ బుద్ధిమద్భిరేతైరితః పూర్వమాంధ్రీకృత్య కాశితం పూర్వమీమాంసాపరిభాషార్థసారాఖ్యం గ్రంథద్వయం ఏతద్గ్రంథసుఖబోధాయోపకుర్వత్ వర్ణసుమాయమానస్య ప్రకృతగ్రంథరాజస్య ఆమోదస్థానీయతాం భజతే. కించ, ఆంగ్లభాషాధ్యయన జాతబుద్ధికౌశలసచివయా సర్వశాస్త్రీయగ్రంథసంశోధననిష్ణాతయా మనీషయా ద్విత్రపదగర్భా రేకైరేవ సమస్తపదాని ప్రయుజ్య సుధాసధ్రీచీభి ర్లలితలలితాభి ర్వాగ్భిరనతివిస్తీర్ణం అసర్వసాధా ం గ్రంథరాజ మాంధ్రీకృత్య సర్వజనానందసముత్పాదనేన ఆత్మానం కృతార్థయతాం తత్రభవ ం యశశ్చంద్రికా గ్రంథరాజేనసాక మాచంద్రార్కం మోదతామితి శమ్.

కాకినాడ,
20-7-33.

వేదభాష్యవిశారదః,
ఉప్పులూరి గణపతిశాస్త్రీ.

# పండితాభిప్రాయములు

---

హారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారిచే రచియింపఁబడిన యాంధ్ర మీమాంసా క్తావళి యను గ్రంథమును స్థాలీపులాకన్యాయముగఁ జూచి యచ్చటచ్చట నుండు కఠినములగు లలను బరిశీలించితిని. ఇంతవఱ కాంధ్రభాషలోఁ బరివర్తింపఁబడిన శాస్త్రగ్రంథములే యరుదుగ నున్నవి. పూర్వమీమాంసాశాస్త్ర మింత కెవరిచేతను నాంధ్రభాషలో వివ డియుండలేదు. ఆంధ్రదేశమున నీవఱకున్న మీమాంసాసిద్ధాంతపరిజ్ఞానము మిగుల సంకుచిత న్నది. వేదార్థమును వివరించుటకై పూర్వమీమాంసాశాస్త్ర మితరశాస్త్రములకంటె నెక్కు పకరించు ననుసంగతి యెల్లరకును విశదమే. ఇట్లు కర్మకాండవిచారమునకును లోకవ్యవహార ను నుపకరించు ననేకన్యాయములను బోధించెడి యీపూర్వమీమాంసాశాస్త్రసంప్రదాయము కర్తలచే నింతకుముందు రచియింపఁబడిన 'ఆంధ్రమీమాంసాపరిభాష', 'ఆంధ్రమీమాంసార్థ ము' అను రెండుగ్రంథములయందు నతిసంగ్రహముగాఁ దెలియఁజేయఁబడుచున్నవి. వీ రిప్పుడు యించిన 'ఆంధ్రమీమాంసాన్యాయముక్తావళి' యను గ్రంథమునం దన్ననో అతివిస్తీర్ణ మగు మాంసాశాస్త్రమునందలి ప్రధానసిద్ధాంతవిషయము లన్నియు వివరముగాను, ఇతరశాస్త్రముల , లోకవ్యవహారములకును నుపకరించునట్లును, నిరూపింపఁబడియున్న వని నేను దృఢముగా నమ్ము న్నాను. ఆంధ్రలోకమున కిట్లుపకరించు నీ 'ఆంధ్రమీమాంసాన్యాయముక్తావళి' యను గ్రంథ ను ద్వరలో ముద్రించి దీనిని విపులప్రచారమునకు వచ్చునట్లు చేసి, యీ గ్రంథకర్తగారు చేసిన హోపకారము నాంధ్రలోకమును నాంధ్రభాషయును బొందునటులు చేయుట విద్యాభిమానుల వశ్యకర్తవ్య మని తలంచుచున్నాఁడను.

ఇంతియకాక యీశాస్త్రమం దుండు పారిభాషికపదములను జనుల కత్యంతసుబోధ మగునటు లాంధ్రభాషలో వివరించియున్నారు. వీ రిందలి దుర్బోధక మగువిషయములను దృష్టాంతప్రదర్శన పూర్వకముగా సుబోధము లగునటు లుపన్యసింపఁగలరు. ఈ దృష్టాంతవివరణ, గ్రంథబాహుళ్య మగు నని యిచట వ్రాయఁబడియుండలేదు.

పిఠాపురము.

శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రి
న్యాయవేదాంతశాస్త్రాధ్యాపకులు.

మహారాజశ్రీ, కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు రచియించిన యాంధ్రమీమాంసాన్యాయ ముక్తావళి యను గ్రంథమును స్థాలీపులాకన్యాయముగ నే నచ్చటచ్చటఁ జూచితిని. ఈవఱ కాంధ్ర భాషలో పూర్వమీమాంసావిషయగ్రంథములు లేవు. వీరిచేఁ రచియింపఁబడిన యర్థసారము, పరి భాషామాత్రమును గలవు. అవి మిక్కిలి సంక్షిప్తము లగుటచే పూర్వమీమాంసాసిద్ధాంతములను విశద ... కాని సిద్ధాంతము దెలిసికొనుటకు ప్రథమసోపానముగ నుపచరింపు

చున్నవి. ఈ మీమాంసాన్యాయముక్తావళి యనుగ్రంథము సులభముగను విశదముగను ి తెలియఁజేయుచున్నవి. ఈగ్రంథమును బాగుగఁ జూచిన సంస్కృతగ్రంథసహాయ మీమాంసాసిద్ధాంతములను బాగుగఁ దెలిసికొనఁగలరు. ఈ గ్రంథము మీమాంసాన్యాయ సంస్కృతగ్రంథము ననుసరించి, దానికంటె హెచ్చు అంశములను వివరించుచున్నది. ఆ నీవఱ కున్న మీమాంసాసిద్ధాంతపరిజ్ఞానము సంకుచిత మైయున్న దనుకొంటే నీగ్రంథ చున్న దని నానమ్మకము. ఈగ్రంథము ప్రచారములోనికి వచ్చినచో నాంధ్రభాషకును దే విశేషించి మేలు కలిగించు నని నాదృఢవిశ్వాసము. ఈగ్రంథము విపులప్రచారములోనికి తోడ్పడి ఈ గ్రంథకర్తగారు చేసిన యుపకారమును ఆంధ్రలోకము పొందునటులు చేయుట మానుల కవశ్యకర్తవ్య మని తలంచుచున్నాఁడను.

మహామహోపాధ్యాయ,

తాతా సుబ్బారాయశాస్త్రి

విజయనగరము 29-2-193

సాంసారికక్లేశనిమగ్ను లగు మానవుల నుద్ధరింపఁబూని పరమకారుణికుఁ డను జైమినిమ పూర్వమీమాంసాదర్శనమును రచించె ననునది సర్వవిద్వద్విదితము. ఇయ్యది చాల సంకుచితం సూత్రభాష నుండుటం జేసి బహుజనసుబోధంబు గాకుండుటం జేసి, పిమ్మట శబరస్వామి ము మహనీయులు చాల విపులముగఁ, జర్చించి దాని గూఢాశయముల నెల్లడించియుండిరి. అయి దాని స్వాభావికగాంభీర్యమునుబట్టి సర్వసాధారణము గాక దుర్బోధమె యగుచున్నది. ఈద మభ్యాసావస్థయం దుండెడివారలకు సుబోధ మగున ట్లొనర్పఁబూని శ్రీ ఆపదేవపండితుఁ 'మీమాంసాన్యాయప్రకాశ' మనుపేర నొక ప్రకరణమును రచించెను. కాని అదియు సంస్కృ భాషయందే యుండుటంజేసియు చాల పారిభాషికపదములచే నిండియుండుటచేతను ఆంధ్రలో మునకు దుర్బోధమె యగుచున్నది. ఇట్టిగ్రంథము లెప్పుడైన నాంధ్రభాషను బరివర్తితంబు లయి నాంధ్రలోకమున కెంతేని యుపకృతి గలుగఁగల దని యాధునికప్రాజ్ఞులు తఱచుగఁ బ్రసంగించునట్టి ఇక్కాలమున నీగ్రంథము నాంధ్రీకరించిన (మ-రా-శ్రీ, సు. గో. M. A.) గా రెంతేని యాంధ్ర భాషాసేవచే కృతార్థు లైరని ఈగ్రంథములను బఠించినవా రంగీకరింపక తప్పదు. ఈగ్రంథమున వేద మునం దుండెడి విధి, నిషేధాదులస్వరూపము, వాని యుపయోగములు, పారిభాషికపదములకు, సుబోధ మగు వివరణము చక్కఁగ పొందుపఱుపఁబడియున్నది. ఈగ్రంథమును శాస్త్రసంప్రదాయము చెడ కుండ నింత సుబోధముగ రచించి మీమాంసాశాస్త్రాభిలాషుల కెంతేని మహోపకృతి నొనర్చిన ఈగ్రంథకర్తలయం దాంధ్రలోకము కృతజ్ఞము గాకతప్ప దని విన్నవించుచున్నాఁడను.

ఇట్టిగ్రంథము నాంధ్రభాషాభిమానులు ప్రచురించి యాంధ్రభాషయం దుత్తమపరీక్షలలో బోధ నీయగ్రంథముగఁ జేర్చి యాంధ్రదేశమున మీమాంసాశాస్త్రస్వరూపమును విస్తరింపఁజేయుదురుగాత మనియుఁ గోరుచున్నాఁడను.

చిట్టిగూడూరు,
కృష్ణజిల్లా.

K. సోమేశ్వరశాస్త్రి
నారసింహ సంస్కృతకలాశాల.

వైదికవాక్యమునం[1] దన్ననో, యట్టివాక్యమును బ్రయోగించుపురుషుఁడు లేనందున, భావన యగు వ్యాపారవిశేషము దానియందలి సంస్కృతభాషయం దుండు 'లిఙ్, లోట్, తవ్య' అను శబ్దములయం దుండునదియే.

# వేద మపౌరుషేయము

వేద మేపురుషునిచేతను[2] రచింపఁబడి యుండలేదుగదా! ఈకాలమునందు వేదమును జదువుట గురువునుండి నియమపూర్వకముగా నేర్చుకొనుట మూలముగానే జరుపఁబడుచున్నట్లే సమస్తవేదమును జదువుటకూడ గురువునుండి నేర్చుకొనుట మూలముగానే జరుపంబడవలసి యున్నది. (శ్లో. వా. ౩౬౬) ఈ మున్నగు శ్లోక[3]వార్తికమందలి వార్తికముచే వేదము పురుషనిర్మితము కాదని తెలియఁ జేయఁబడుచున్నదిగదా! "ప్రతికల్పమునకును[4] బూర్వము మఱియొకకల్ప ముండనే యున్నది." అనున్యాయముచే 'సంసార మనాది'[5] యని సాధింపఁబడుటవలనను, ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁ[6] డగుటవలనను, నట్టి యీశ్వరుఁ డంతకుముందు గతించిన కల్పమునందలి వేదము నాకల్పమునందు జ్ఞప్తికి దెచ్చుకొని దానిని జనుల కుపదేశించు నని సమర్థించుటయే యుక్తముగా నుండఁగా, నీశ్వరుఁడు ప్రమాణాంతరముచే నర్థమును గ్రహించి, యట్టి యర్థమును బోధించు వేదమును గ్రొత్తగా నిర్మించె నని యూహించుట తగదు కావునను, వేదము పురుషనిర్మితము కానేరదు. కాఁగా, వేదమును రచించినపురుషుఁ డెవఁడును లేకపోవుటవలన నీవ్యాపారవిశేషమగు భావన లిఙాదిశబ్దములయం దుండునదియే. కనుకనే యిది మీమాంసకులచే 'శబ్దభావన' యని వ్యవహరింపఁబడుచున్నది.

౧. వేదమునందలిదియుఁ బురుషుని నేదే నొకకర్మమునందుఁ బ్రవర్తింపఁజేయునదియు నగు విధివాక్యము. ఉదా. 'సత్యం వద', 'ధర్మం చర' మొ. (=సత్యమును బలుకవలెను. ధర్మము నాచరింపవలయును.)

౨. వేదము నిత్యమనియు, నే పురుషునిచేతను నిర్మింపఁబడలేదనియు మీమాంసకుల సిద్ధాంతము.

౩. కుమారిలభట్టుచే రచింపఁబడిన శ్లోకవార్తిక మనెడు గ్రంథము.

౪. అతిదీర్ఘమైన కాలపరిమాణము. ఉదా. బ్రహ్మకల్పము = బ్రహ్మయొక్క జీవితకాలము.

౫. పుట్టుక లేనిది.

౬. అన్నివిషయములను దెలిసికొనినవాఁడు.

అట్టి శబ్దభావనయందు 'సాధ్యము[౧]', 'సాధనము[౨]', 'ఇతికర్తవ్యత[౩]' అను మూఁడంశము లావశ్యకము లగుచున్నవి.

దీనియందు సాధ్య మేది యని యాకాంక్ష[౪] కలుగఁగా ముందు వివరింపఁబో మూఁడంశములతోఁ గూడినయర్థభావన, సమానాభిధాన[౫] మైనశబ్దమగు 'ల ప్రత్యయముచేతనే తెలియఁజేయఁబడున దగుటవలన, సాధ్యముగా నన్వయిం చున్నది. ఆలోచింపఁగా సంఖ్య, కాలము, కర్త మున్నగునవి కూడ నర్థభావనవలె 'త' అను నొకటే ప్రత్యయముచేఁ దెలియఁజేయఁబడుచున్నవి. అయినను న యయోగ్యము[౬] లగుటవలన నీభావనయందు భావ్యముగా[౭] నన్వయింప నేరవు.

కరణ[౮] మేది యని యాకాంక్ష కలుగఁగా లిఙ్, లోట్, తవ్య (ఇ సంస్కృతభాషయందు విధిని బోధించుప్రత్యయములు) ప్రత్యయములయర్థమున దెలిసికొనుట కరణముగా నన్వయించుచున్నది. ఇంద్రియములకును బదార్థములకున గలసంబంధము, రూపము మున్నగువాని జ్ఞానము నుత్పాదించుట మూలముగా న రూపాదులజ్ఞానమున కెట్లు కరణ మగుచున్నదో యట్లు, లిఙ్ మున్నగువానిజ్ఞానము శబ్దభావన నుత్పాదించుటమూలముగా నాభావనయందుఁ గరణముగా నన్వయించుట లేదు. మఱే మన, నారీతిగానే యన్వయించినచో, నింద్రియపదార్థములకు సంబంధమ కలుగుటకు ముందు రూపజ్ఞాన ముండనట్లు, లిఙు మున్నగువాని జ్ఞానము కలుగుటక ముందు భావన యుండకపోవలసివచ్చును. కనుక లిఙాదిజ్ఞానము (అంతకు ముం యుండు భావనను స్ఫురింపఁజేయుటంజేసి,) శబ్దభావనయందలిభావ్యమును నిర్వర్తింప జేయుట[౯] మూలముగానే, శబ్దభావనయందుఁ గరణముగా నన్వయించుచున్నది.

౧. 'దేనిని జేయవలయును?' అనుప్రశ్నమున కుత్తరమే సాధ్యము.

౨. 'దేనిచేఁ జేయవలయును?' అనుదాని కుత్తరము సాధనము.

౩. 'ఎట్లు చేయవలయును?' అనుదాని కుత్తరము ఇతికర్తవ్యత = ఇత్థంభావము = కథంభావః పనిని జేయువిధము.

౪. తెలిసికొనవలయు ననెడియిచ్ఛ.

౫. శబ్దభావనను, అర్థభావనను సమానముగా బోధించునది.

౬. సంఖ్య, కాలము మున్నగునవి మఱియొకదానిచేఁ జేయఁబడవలసినవి కావు గనుక సాధ్యముగా నన్వయింపఁదగినవి కావు.

౭. సాధ్యము = సాధింపఁదగినది.

౮. సాధనము.

౯. సిద్ధింపఁజేయుట.

తారముచే నొకకట్టెను ఛేదించి రెండుగాఁ జీల్చునపుడు, అది (
ముచేఁ గలుగు రెండుగాఁ జీలుటను జనింపఁజేయుట మూలముగా,
ముయం దెట్లు కరణ మగుచున్నదో యట్లే లిఙాదిజ్ఞానము శబ్దభావనయందు
ను నర్థభావనను నిర్వర్తింపఁజేయుచున్నది. కావుననే యా లిఙాదిజ్ఞానము, శబ్ద
వనయందుఁ గరణముగా నన్వయించుచున్నది.

ఇచట 'ఇతికర్తవ్యత యేది?' అని యాకాంక్ష కలుగఁగా విధింపఁబడుదాని
ందలి ప్రాశస్త్యమును[1] దెలిసికొనుట యితికర్తవ్యతగా నన్వయించుచున్నది.
స్తి ప్రాశస్త్యజ్ఞానము "వాయువుఁ మిగుల వేగముగా సంచరించు దేవుఁడు"
ను నీమున్నగు నర్థవాదములమూలముగాఁ గలుగుచున్నది. ఆ యర్థవాదములు
నయందలి పదముల వాచ్యార్థమును[3] మాత్రమే తెలియఁజేసినచో వ్యర్థము
వలసివచ్చును గనుకఁ దమయందలిపదముల శక్యార్థము[4] మూలముగాఁ బ్రయో
ము పొందనివై, 'లక్షణ'[5] యను 'పదసామర్థ్యము' మూలమునఁ దమతో
కవాక్యతను బొందు "వాయవ్యగ్ం శ్వేత మాలభేత భూతికామః"[6] ఈ

౧. ప్రశస్తముగా నుండుట = గుణము గలుగుట.
౨. "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా."
3 "ఈపదముచే నీయర్థమును గ్రహింపవలయును" అని ఈశ్వరుఁడు చేసిన సంకేతము
పటు) మూలమున నొకపదముచేఁ దెలియఁజేయఁబడునర్థము = సంకేతితార్థము.
౪. వాచ్యార్థము.
౫. పదమందలి సంకేతితార్థమును గ్రహింపఁజేయు సామర్థ్యము శక్తి యనియు నాయర్థము
క్యార్థ మనియు వ్యవహరింపఁబడుచున్నవి. ఏచటఁ బదమువలన శక్యార్థము గ్రహించినచో వాక్యా
ర్థము (తాత్పర్యము) కుదురదో, యచట శక్యార్థమును విడిచి, యాపదమువలననే శక్యార్థముతో
ంధించు మఱియొకయర్థమును గ్రహింపవలసి యున్నది. ఇచట మఱియొక యర్థము 'లక్ష్యార్థ'
ము, దీనిని గ్రహింపఁజేయుపదసామర్థ్యము 'లక్షణ' యనియు నలంకార శాస్త్రమున వ్యవహారము
ం. ఉ. 'గంగయందు గొల్లపల్లె కలదు.' ఈవాక్యమునందు 'గంగ' పదమునకు శక్యార్థమైన
ప్రవాహము ననుసరించినచో, వాక్యార్థము కుదురదు గావున, శక్యార్థమైన జలప్రవాహముతో
ంధముగల 'తీరము' (ఒడ్డు) అను లక్ష్యార్థము, నా గంగాపదమువలననే గ్రహింపవలసి
న్నది. ఇట్లయినచో 'గంగాతీరమందు గొల్లపల్లె కలదు.' అని సరియైనయర్థ మేర్పడుచున్నది.
౬. భూతికామః = ఐశ్వర్యమును గోరువాఁడు, వాయవ్యం = వాయుదేవునికొఱకు నుద్దేశింపఁ
, శ్వేతం = తెల్లనిపశువును, ఆలభేత = ఆలంభించి యజించుట మూలముగా నిష్టము నుత్పా
వలయును. ఆలంభనము = యాగమునకుఁ బశువును నవరంధ్రములను మూసి ప్రాణము విడుచునట్లు
యాగమునందు వినియోగించుట.

…్యములచే విధింపఁబడు వాయవ్యపశుయాగము మొదలుగాఁ …చుండు ప్రాశస్త్యమును విశదపఱచుచున్నవి. అర్థవాదములు కొ…యినను నిష్టమే యని చెప్పుట తగదు. వేదము చదువుటను విధి… "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను విధియందలి 'స్వాధ్యాయ' యనుపదమ…కర్థ మగు వేదమునందుఁ దాముకూడఁ జేరిన వగుటంజేసి యీ యర్థవాదమ… వ్యర్థము కాఁగూడదుగదా! అది యెట్లంటేని:—"స్వాధ్యాయోఽధ్యేతవ్య… అను వేదమును జదువుటను విధించు విధివాక్యము 'వేద మంతయు నియమముత… జదువఁబడవలసినది' అని బోధించుచు, నట్లు బోధించుటమూలమున సమస్తవేదమ… నేదే నొకఫలమును గలిగించునర్థమును దెలియఁజేయు నని సూచించుచున్న… ప్రయోజన మేమియు లేనిదానిని జదువుట యనావశ్యకము గదా!

## విధివిచారము

అట్టివేదము విధి, మంత్రము, నామధేయము, నిషేధము, అర్థవాదము నైదువిధములుగా నున్నది. వానిలో విధి యనునది స్వర్గము మున్నగు ప్రయో…ములను గలిగించు యాగము మొదలగువానిని విధించుటచే సార్థకం[1] మగుచున్న… అట్టివిధి, యే యితరప్రమాణముచేతను దెలియఁబడని యర్థమును[2] విధించుచున్న… ఉదా. "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః[3]" అనువిధి, యేయితరప్రమాణములచేతను దెలియఁబడనిదియు, స్వర్గ మనెడి ప్రయోజనమును సాధించునట్టిద నగు హోమమును విధించుచున్నది. ఈ విధివాక్యమువలన "అగ్నిహోత్ర ః హోమముచే స్వర్గము నుత్పాదింపవలెను" అనునర్థ మేర్పడుచున్నది.

## గుణవిధివిచారము

ఏవిధియందలికర్మము ప్రమాణాంతరముచేత[4] దెలియఁబడియుండునో, విధియం దట్టికర్మము నుద్దేశించి యేదే నొకగుణము మాత్రము[5] విధింపఁబడ

౧. సఫలము.

౨. యాగము మున్నగు కర్మములు.

3. స్వర్గకామః = స్వర్గమును గోరువాఁడు, అగ్నిహోత్రం జుహుయాత్ = అగ్ని… మనుహోమము నాచరించుటమూలముగా స్వర్గము నుత్పాదింపవలయును.

౪. ఈ విధి గాక మఱియొక ప్రమాణము.

౫. ద్రవ్యము దేవత మున్నగునవి.

ఇట్లు గుణమునుమాత్రము విధించువిధి 'గుణవిధి' యని చెప్పంబడుచున్నది. ఉదా. "దధ్నా[1] జుహుయాత్" ఈవిధియందు హోమము "అగ్నిహోత్రం జుహుయాత్" అను విధ్యంతరముచేఁ దెలియఁబడిన దగుటంజేసి, దానిని (హోమమును) 'జుహుయాత్' అను క్రియాపదముచే నుద్దేశించి, పెరుఁగుమాత్రము గుణముగా విధింపఁబడుచున్నది. ఈ విధివాక్యమువలన 'పెరుఁగుచే హోమము నాచరింపవలయును' అనునర్థ మేర్పడుచున్నది.

## గుణవిశిష్టకర్మవిధి

ఎచట గుణము కర్మము ననురెండును ప్రమాణాంతరముచేఁ దెలియఁజేయఁబడవో యచట 'గుణవిశిష్ట'[2] మగు కర్మము విధింపఁబడును. ఈవిషయము "మఱియొకవిధిచే విధింపఁబడనియెడల" ననునర్థము నిచ్చు మీమాంసాదర్శనమునందలి ప్రథమాధ్యాయచతుర్థపాదమం దుండు "తద్గుణాస్తు విధీయేరన్. అవిభాగా ద్విధానార్థే, న చే దన్యేన శిష్టాః" అనెడు తొమ్మిదవసూత్రమునందుఁ జెప్పఁబడియున్నది. ఉదా. "సోమేన[3] యజేత" అనునది. ఇచట సోమరస మనెడు గుణము యాగము ననునీరెండును ప్రమాణాంతరముచేఁ బ్రాప్తింపని వగుటవలన, సోమవిశిష్టమగు[4] యాగము విధింపఁబడుచున్నది. సోమపదమునకు మత్వర్థ ('అది కలది' యనునర్థ)ము నందు లక్షణ నంగీకరించుటచే, నీవిధినుండి, 'సోమముగల యాగముచే నిష్టము నుత్పాదింపవలసినది.' అనునర్థము సిద్ధించుచున్నదిగదా! ఈవిధి సోమము యాగము ననురెండింటిని విధించుటచే, నిచట 'యాగముచే నిష్టము నుత్పాదింపవలయును' 'సోమముచే యాగము నుత్పాదింపవలెను' అని వాక్యభేదము[5] సంభవించెడి నని శంకింపరాదు. ఇచట సోమమును యాగమును ప్రత్యేకించి విధింపఁబడక, సోమవిశిష్ట

౧. దధ్నా = పెరుఁగుతో, జుహుయాత్ = హోమము చేయుటచే నిష్టము నుత్పాదింపవలయును.

౨. గుణముతోఁ గూడినది=గుణము గలది.

3. సోమముతోఁ గూడిన యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదింపవలయును.

౪. సోమముతోఁ గూడినది. ఈ విధియందు సోమమును, యాగమును, భావనను దెలుపు పదములే యున్నవి కాని యిష్టమును బోధించు పదము లేదు. అయినను విధిని బోధించు లిఙ్ ప్రత్యయము (యజేత) ఉండుటంజేసి, యావిధి ప్రవర్తనారూప మగుట మూలముగాఁ దనచే విధింపఁబడు యాగ మిష్టసాధన మని తెలియంజేయుచున్నది—

౫. ఒకటే యన్వయముగల వాక్యమును రెండు వేఱువాక్యములుగా నన్వయించుట.

మగు యాగ మొక్కటియే విధింపఁబడుచున్నది. విశిష్ట మగుదానిని విధించునపుడు, మత్వర్థమందు ('అది కలది' అనునర్థమునందు) లక్షణ యావశ్యకము. ఇచట 'సోమ' అనుపదమువలన 'సోమము కలది' అనునర్థము లక్షణామూలముగా బోధింపఁబడుచున్నది. 'ఇచట మత్వర్థమునందు లక్షణ నంగీకరింపకయే సోమపదమున కన్వయము కుదురుచుండఁగాఁ గ్లేశమును గలిగించులక్షణ నేల యంగీకరింపవలెను?' అని శంకింపరాదు. ఈవిధియందు మత్వర్థలక్షణ నంగీకరింపనియెడల సోమపదమున కన్వయము కుదురదుగదా! 'సోమముచేతను యాగముచేతను ఇష్టము నుత్పాదింపవలయును' అని సోమమును యాగమును భావనయం దొకటేరీతిగాఁ గరణములుగానే యన్వయింపవచ్చు ననునెడల రెండింటిని విధించుటచే నిచట వాక్యభేదము సంభవించెడిని. మఱియు సోమము ఫలభావనయందుఁ[1] గరణ మగుటంజేసి దానికి (సోమమునకు) యాగమునకువలెఁ బ్రాధాన్యమును, అది (సోమము) యాగమున కంగముగా నుండ నేరకపోవుటయు; నిచట[2] ఫలముకొఱకు విహితమగు సోమము ప్రసంగవశమున నాయాగమునకుమాత్ర ముపకరించున దైనను, నిట్టి జ్యోతిష్టోమయాగము లందు నియతముగాఁ బ్రాప్తింపకుండుటంజేసి, జ్యోతిష్టోమసామాన్యమందు ద్రవ్యమేదియు లేకపోవలసియుండుటయు; 'యజేత' పదమందలి 'త' ప్రత్యయముచే బోధింపఁబడు ఫలభావనయందుఁ గరణ మేది? యను నాకాంక్ష యా 'యజేత' పదమందే యుండు 'యజ్' ధాతువువలన బోధింపఁబడు యాగముచే నుపశమించిన దగుటంజేసి, యా 'యజేత' పదముకంటె వేఱగు సోమపదముచేఁ దెలియఁజేయఁబడు సోమరస మాఫలభావనయందుఁ గరణముగా నన్వయించుట కుదురకపోవుటయును సంభవించెడిని. ఇట్లు 'సోమేన యజేత' అను విధియందు సోమమును, యాగమును నొండొంటితో సామానాధికరణ్య[3] మను సంబంధ ముండున ట్లన్వయింపనేరకపోవుట వివరింపఁబడినది. ఇఁక ముం దీరెండును

౧. ఇష్టభావన = ఇష్ట మనుదాని నుత్పాదించుట.

౨. "గోదోహనేన పశుకామస్య ప్రణయేత్ =" 'పశువులను గోరువాఁడు గోవులను బాలు పిదుకువేళ నగ్నిని బ్రణయింపవలయును.' అనువిధియందు ఫలముకొఱకు విధింపఁబడిన గోదోహనకాలము, ప్రసంగవశమున నగ్నిప్రణయనమున కుపచరించున దైనను నిత్యము నగ్నిని బ్రణయించునపు డెట్లు ప్రాప్తింపదో యట్లే.

౩. సమాన మగు నధికరణము కలవగుట = సమానముగా నాశ్రయము కలవగుట. లేదా విశేషణ విశేష్యములుగా నుండుట.

నొండొంటితో వైయధికరణ్యమను[1] సంబంధ ముండునటులుఁ గూడ నన్వయింప నేర వని విశదపఱుపఁబడుచున్నది.

ఇచట సోమమును యాగమును నొండొంటితో వైయధికరణ్య మనుసంబంధ ముండున ట్లన్వయించునెడ, నీముందు వివరింపఁబోవు ననుపపత్తులు[2] సంభవించెడిని. ఇచట 'యాగముచే సోమము నుత్పాదింపవలయును.' అని యన్వయింపరాదు.[3] యాగము 'యజేత' పదమందలి 'యజ్' ధాతువుచే బోధింపఁబడుటంజేసి, యా పదమందే యుండు 'త' ప్రత్యయమున కర్థమగు ఫలభావనయందుఁ గరణముగా నన్వయించినది గనుక, మరల నాయాగమే సోమము ఫలముగాఁగల భావనయందుఁ గరణముగా నన్వయింపనేరదు గదా! మఱియు నీయాగము, సోమము నుత్పాదించుట కుపచరించునది కావలసి వచ్చును. "'భూతం భవ్యా యోపదిశ్యతే'[4] అను న్యాయము ననుసరించి, సిద్ధమగు సోమము ఫలభావనయందుఁ గరణముగా నన్వయించుచుండఁగా, మిగిలినది సోమము నుత్పాదించుటకొఱకే యగును గాన, నీ యాగము సోమము నుత్పాదించుటకే యుపకరించున దైనను బాధ యేమియు లేదు" అని చెప్పఁదగదు. అట్లు చెప్పినచో రెం డదృష్టములను గల్పింపవలసివచ్చును. అది యె ట్లంటేని:—యాగము దృష్టమగు[5] ప్రయోజనము నుత్పాదించుటమూలముగా సోమమున కుపకరించునది కానేరదు. అవఘాతముచేతనే[6] వ్రీహులయందుఁ దండులములుగా మార్చుట యను దృష్టప్రయోజనము కలిగింపఁ జేయఁబడునట్లు, యాగముచే సోమమందు దృష్టమగు ప్రయోజన మొకటియు జనింపఁజేయఁబడుట లేదు. కావునఁ బ్రోక్షణముచే[7] వ్రీహులయందువలె, యాగముచే సోమమందుఁ గొంచె మదృష్టము జనింపఁజేయఁబడఁగలదు. ఇట్లు యాగము సోమమున కుపచరించున దగుచుండఁగా ఫలభావనయందు సోమమే కరణముగా నన్వయించు నని చెప్ప

౧. =సామానాధికరణ్యమునకు విరుద్ధమగు సంబంధము.

౨. అనుపపత్తి=కుదురకుండుట.

3. వైయధికరణ్య మనుసంబంధ ముండునట్లు సోమమును యాగమును నన్వయింపఁజేయు రీతులలో నిది యొకటి.

౪. సిద్ధ మయినదే సాధ్య మగుదాని కుపచరించును.

౫. ప్రత్యక్షము.

౬. =అవహననము = దంచుట.

౭. మంత్రము నుచ్చరించుచు జలమును జిలుకరించుట.

వలసియున్నది. భావనయందుఁ గరణ మగుట యనఁగా భావనయందు భావ్యా[1] మగుదానిని నిర్వర్తింపఁజేయుటయే.[2] సోమ మదృష్టము మూలముగాఁ గాక వేఱొకవిధముగా ఫలము నుత్పాదింపనేరదు. "గ్రహైర్జుహోతి"[3] అనువాక్యముఁ వలన విధింపఁబడు హోమముచేత నీసోమము, భస్మ మయిపోవుచున్నదిగదా! కావున రెండదృష్టములు కల్పింపవలసివచ్చుటంజేసి, యాగము సోమమున కుపచరించునది కానేరదు. కనుక 'యాగముచే సోమము నుత్పాదింపవలయును' అని యన్వయము కుదురదు. మఱియుఁ గరణముగా నుపస్థితమగు సోమము సాధ్యముగా నన్వయించుట కుదురదు.

ఇఁక వైయధికరణ్య మను సంబంధ ముండునట్లు సోమమును, యాగమును నన్వయింపఁజేయు వేఱొకరీతి యుపన్యసింపఁబడుచున్నది. "అయ్యా! ఈవిధియందు 'సోమముచే యాగము నుత్పాదింపవలయును' అనునన్వయ మేర్పడవచ్చును." అనునదియే యట్టి రెండవరీతినమన్వయము. దాని క్రిందిది సమాధానము. విచారింపఁగా నిచట సోమము కరణ మగుటమూలముగా యాగముకొఱకు కుపకరించున దగుటంజేసి, యాగోత్పత్తి యనెడి దృష్టప్రయోజనమే సోమమునకు లభించుచున్నది. కావున రెండదృష్టములను గల్పింపవలసినయావశ్యకత లేదు. మఱియు సోమము కరణము గానే యన్వయింపవలసియుండుటంజేసి, కరణముగా నుపస్థితమగు సోమము సాధ్యముగా నన్వయింపఁదగ కుండుటయును లేదు. అయినను వేఱొకవిధియందుఁ బ్రాప్తింప కుండుటంజేసి, యిచ్చటి ఫలభావనయందుఁ గరణముగా నన్వయించినయాగము, సోమమునకు సాధ్యముగా నన్వయింపనేరకుండుట యట్లే వెనుకటివలెనే యనివార్యముగా నున్నది.

"అయ్యా! 'యజేత' అను పదమునందు యాగము కరణ మగుటను, భావ్య మగుటను బోధించు తృతీయాద్వితీయావిభక్తులు లేకుండుటవలన, నాయాగము కర

౧. =సాధ్యము.

౨. =ఉత్పాదించుట = జనింపఁజేయుట = పుట్టించుట.

3. గ్రహము లనఁగా సోమమును ధరించు తొట్టివంటి యాకారముగల పాత్రవిశేషములు, కాఁగా నీవిధినుండి 'సోమరసమును గ్రహించుపాత్రములచే హోమము నాచరింపవలయును' అనునర్థము లభించును. ఇది పార్థసారథిమిశ్రమతము. 'గృహ్యన్త ఇతి గ్రహాః' = 'గ్రహింపఁబడునవి కాఁబట్టి గ్రహము లగుచున్నవి' అను కర్మవ్యుత్పత్తిచే గ్రహము అనుపదమునకు సోమరసమే యర్థ మగు నని కాశికమునందుఁ జెప్పఁబడియున్నది.

ణముగాఁ గాని భావ్యముగాఁ గాని యుపస్థిత మగుటలేదు. 'మఱే మన యాగమునకు సమానపదశ్రుతిచే భావనతో నేదే నొకసంబంధముమాత్రము ండునట్లు తెలియుచున్నది. యాగము భావనయందుఁ గరణముగాను సాధ్యముగాను సంబంధించి యన్వయింపఁదగును. ఇచట యాగము కరణ మగునెడ ఫలముతో సంబంధించుటయు, సాధ్య మగునెడల గుణముతో సంబంధించుటయు సంభవించెడిని ' అనుశంక క్రిందిది సమాధానము. ఈ యుపన్యసింపఁబడినశంక సరికాదు. విమర్శింపఁగా నిచట యాగమునకుఁ గొంచె మేదే నొకసంబంధముమాత్రమే యుండునట్లు తెలియుచున్నది. అయినను యాగము కరణముగాఁ దెలియఁబడునపుడు సాధ్యముగాఁ దెలియఁబడదు. కరణ మగునపుడు విధేయ మగుటంజేసి ప్రమాణాంతరముచేఁ దెలియఁజేయఁబడకుండుటవలనను, సాధ్య మగునపు డుద్దేశ్య మగుటంజేసి ప్రమాణాంతరముచేఁ దెలిసికొనఁబడుటవలనను, గరణ మగుట సాధ్య మగుట యనునీరెండును బరస్పరవిరోధము కల వగుచున్నవిగదా! మఱియు సాధ్యమందు 'ఉద్దేశ్యత్వము '[2] 'అనువాద్యత్వము ', 'ప్రధానత్వము ', అను నొక త్రికమును,[3] గరణమందు 'విధేయత్వము,' 'ఉపాదేయత్వము ', 'గుణత్వము ' అను మొదటిత్రికమునకు విరుద్ధమగు వేఱొక త్రికమును సంభవించును. కాఁగా, నిచట యాగము కరణముగాను, సాధ్యముగాను నుపస్థిత[4] మగునపుడు దానియం దీపరస్పరవిరుద్ధములగు రెండు త్రికములును సంభవించెడినిగదా! కావున యాగముచే స్వర్గము (ఇష్టము) నుత్పాదింపవలయును అని యాగమును భావనయందుఁ గరణముగా నన్వయింపఁజేసి, పిదప 'సోమరసముచే యాగము నుత్పాదింపవలయును ' అని యాయాగమునే భావనయందు సాధ్యముగాఁ దప్పక యన్వయింపఁజేయవలసియున్నది. అట్లు చేసినచో 'యాగముచే నిష్టము నుత్పాదింపవలయును ' 'సోమరసముచే యాగము నుత్పాదింపవలయును ' అని వాక్యభేదము సంభవించెడిని. 'యజేత ' పదమందలి 'త ' ప్రత్యయముచే బోధింపఁబడు భావనయొక్క స్వరూపమందు, 'యజ ' ధాతువున కర్థమగు

౧. యాగమును భావనయును 'యజేత ' అను నొకటే పదమువలనఁ దెలియఁజేయఁబడుట.

౨. ఉద్దేశ్య మగుట. ఇచట 'త్వ ' అను ప్రత్యయమునకు 'భావము ' = 'అగుట ' '=స్వభావము ' అని యర్థము. ఇట్లే ప్రధానత్వము, అనువాద్యత్వము అనునిట్టిపదములకు 'ప్రధాన మగుట ' అనువదింపఁబడుట' అను నిట్టి వర్థము లని తెలిసికొనునది.

3. మూఁడిటియొక్క సముదాయము.

౪. మనసునకు స్ఫురించునది = తోఁచునది = స్మరింపఁబడునది = జ్ఞప్తికి వచ్చునది.

యాగముయొక్క స్వరూపముమాత్ర మన్వయింపవచ్చు నని చెప్పఁదగదు. కర్త, కర్మ (సాధ్య)ము కరణము, మున్నగు కారకములే కాని, స్వరూపముమాత్రము క్రియతో నన్వయింప నేరదుగదా! కాఁగా, 'సోమేన యజేత' అనువిధియందు సోమము యాగముతో సామానాధికరణ్య ముండునట్లు గాని వైయధికరణ్య మను సంబంధ ముండునట్లు కాని యన్వయింపనేర దని సిద్ధించుచున్నది.

"అయ్యా, ఇచట 'యజేత' పదమందలి 'త' ప్రత్యయముచే నభిహితమగు భావనయందుఁ గరణ మేది? యని యాకాంక్ష కలుగఁగా, యజధాతువున కర్థమగు యాగము కరణముగా నన్వయించునట్లే, యితికర్తవ్యతాకాంక్ష కలుగఁగా సోమ మితికర్తవ్యతగా నాభావనయందే యన్వయింపవచ్చును. ఇట్లయిన నో మత్వర్థలక్షణ నంగీకరింపఁబనిలేదు." అనుశంక కీక్రిందిది సమాధానము. సోమేన (= సోమముచేత) అను పదనమునందలి కరణత్వమును బోధించు ('చేత' అను) తృతీయావిభక్తివలన, సోమ మితికర్తవ్యత యని బోధింపఁబడుట లేదుగదా! ఇచట 'సోమేన' (సోమము చేత) అనుపదమునందలి తృతీయావిభక్తిచే లక్షణమూలమున సోమ మితికర్తవ్యతగా బోధింపఁబడవచ్చు నని చెప్పనెడల, నంతకంటె 'సోమేన' అనుపదమునందలి ప్రకృతి యగు[1] సోమపదమునందే మత్వర్థలక్షణ యంగీకరించుట శ్రేయము. 'ప్రధానము నందుఁ[2] గాక గుణమునందే[3] లక్షణ నంగీకరించుట న్యాయ్యము' అనున్యాయము కలదు. దీని ననుసరించియే సోమేన (సోమ + ఇన) అనుపదమునందలి ప్రధానమగు 'ఇన' అను తృతీయావిభక్తియందుఁ గాక, గుణమగు 'సోమ' అనెడి ప్రకృతియందే లక్షణ యంగీకరింపవలసియున్నది.

"అయ్యా! 'వేదో వా ప్రాయదర్శనాత్' (పూ. మీ. ద. 3-3-౨

౧. సోమేన (సోమ + ఇన) అను పదమునందు 'సోమ' అనునది ప్రకృతి. 'ఇన' అనునది తృతీయావిభక్తిప్రత్యయము. ఇట్లే పదము లన్నిటియందును ప్రకృతులు ప్రత్యయములు వేఱుగాఁ దెలిసికొనవలయును.

౨. ఈ న్యాయము మీమాంసాదర్శనమందలి అ. ౯. పా. 3. సూ. ౧౫-వ దగు 'విప్రతిపత్తౌ వికల్పస్స్యాత్, సమత్వాత్, గుణే త్వన్యాయ్యకల్పనైకదేశత్వాత్' అను సూత్రమందు వివరింపఁబడియున్నది.

3. = అప్రధానము: గుణము ప్రధానము అను జంటలో గుణశబ్దమునకు 'అప్రధానము' అని యర్థము. దీనినుండియే 'గౌణార్థము' అను దానికి 'అప్రధానార్థము' అను నర్థ మేర్పడుచున్నది—

సూత్రము) అనునధికరణమునం దిట్లు వివరింపఁబడుచున్నది. "ఉచ్చైః[౧] ఋచా క్రియతే, ఉపాంశు యజుషా, ఉచ్చైః సామ్నా" అను వాక్యములందుండు ఋక్కు, యజుస్సు, సామము అనుపదములు మంత్రపరములా? వేదపరములా? యని సందేహించి, యీవిధులకు సంబంధించునర్థవాదములగు "అగ్నే ర్ఋగ్వేదః[౨] వాయోర్యజుర్వేదః, ఆదిత్యాత్సామవేదః" అనువాక్యము లందు వేదపరములుగా వినంబడు ఋక్కు, యజుస్సు, సామ అను శబ్దములతో విరోధము కలుగకుండుటకుఁగాను, (అనఁగా 'అసంజాతవిరోధిత్వము' అను న్యాయము ననుసరించి) 'ఉచ్చైర్ఋచా క్రియతే' మొదలగు మూఁడువిధులయందలి ఋక్కు, యజుస్సు, సామము అను పదములు వేదపరములే యని నిర్ణయింపఁబడినవి. కావుననే యజుర్వేదమందుండు ఋఙ్మంత్రములుకూడ యజుర్వేదమువలె మెల్లగానే పఠింపఁబడుచున్నవి. ఇట్లే యీ యసంజాతవిరోధిత్వ మను న్యాయము ననుసరించి, 'సోమేన' అను పదముచివర నుండు ప్రధానమగు తృతీయావిభక్తిప్రత్యయముతోఁ బ్రకృతియైన సోమపదము విరోధింపకుండుటకుఁగాను సోమపదమందు లక్షణ సంగీకరింపక, ప్రధానమగు తృతీయాప్రత్యయమునందే లక్షణ నంగీకరించుట యుక్తము." అనుశంక క్రిందది సమాధానము. పయి నుదాహరింపఁబడిన న్యాయము సరియగునదేయైనను సోమము భావనయం దితికర్తవ్యతగా నన్వయింపఁదగదు. సిద్ధమగు వస్తు వితికర్తవ్యతగా నన్వయింప నేరదుగదా! ద్రవ్యము కేవల మంగముగానే యుండఁదగిన దగుటంజేసి యేదే నొక క్రియయే యితికర్తవ్యతగా నన్వయింపవలసియున్నది. ద్రవ్య మితికర్తవ్యతగా నన్వయింపనేరదు కావునఁ బ్రకరణప్రమాణముచే నట్లు గ్రహింపఁబడదు. ఇందులకు 'ప్రస్తుతపుఁగ్రియల[౩] సందర్భమునందు వినఁబడు ద్రవ్యముగాని, గుణముగాని యేక వాక్యముచేఁ గల్పింపఁబడిన యేదేనొక యవాంతరవ్యాపారముతో సంబంధించినఁ గాని యాక్రియలయం దితికర్తవ్యతగా నన్వయింపనేరదు.' అనుప్రమాణము కలదు. ఇంతే కాక 'సోమేన యజేత' అనునది యాగమున కుత్పత్తివాక్యమే కాని యధి

౧. ఋక్కుల నుచ్చైస్స్వరముతోను, యజుస్సులను మెల్లగాను, సామముల నుచ్చైస్స్వరముతోను బఠింపవలయును.

౨. అగ్నినుండి ఋగ్వేదము, వాయువునుండి యజుర్వేదము ఆదిత్యునినుండి సామవేదమును బుట్టినవి.

3. "నావాంతరక్రియాయోగా దృతే వాక్యోపకల్పితాత్ । గుణద్రవ్యే కథం భావైర్ గృహ్ణన్తి ప్రకృతాః క్రియాః" తంత్రవార్తికము ౧-౪-3. పే. ౨౯3.

కారవాక్యము కానేరదు. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అనునదియే యధికారవాక్య మగుచున్నదిగదా! ఉత్పత్తివాక్యమం దితికర్తవ్యత యేది? యని యాకాంక్షయే కలుగదు. ఉత్పత్తివాక్యమం దెల్ల 'నిష్ట మేది?' యనునాకాంక్ష తప్పక కలుగుటంజేసి యితికర్తవ్యత యేది? యను నాకాంక్ష పుట్టనేపుట్టదు. కాఁగా సోమము భావనయం దితికర్తవ్యతగా నన్వయింపనేర దనియుఁ, గావుననే విశిష్ట విధియం దెల్ల నన్వయము కుదురకుంచుటంజేసి మత్వర్థలక్షణ తప్పక యంగీకరింప వలసియుండు ననియు సిద్ధించుచున్నది.

"అయ్యా! ఇట్లయినను 'సోమేన యజేత' అను విధివాక్యమందు సోమ విశిష్టమగు యాగము విధింపఁబడునెడ నన్వయక్లేశమును, నిందలి సోమపదమందు మత్వర్థలక్షణ యంగీకరింపవలసివచ్చుటయును సంభవించును గావున, నిచట విశిష్టమగు యాగము విధింపఁబడఁగూడదు. మఱే మన, 'దధ్నా జుహోతి' యను విధియందు దధి యనెడు గుణము, జుహోతిపదముచే బోధింపఁబడు హోమము నుద్దేశించి యెట్లు విధింపఁబడుచున్నదో, యట్లే 'యజేత' పదమందలి 'త' ప్రత్యయమందుండు విధించుశక్తి, గుణమగు సోమమందు సంక్రమించుటంజేసి,[1] యిచటఁగూడ సోమమనెడి గుణముమాత్రమే యాగము నుద్దేశించి విధింపఁబడవచ్చును. ఇందులకు "ఏవిధియందు[2] 'ఆఖ్యాతము[3]' తో నేకవాక్యతను బొందు వేఱొక పదము వినఁబడునో యచట విధిశక్తి[4] యాపదమందు సంక్రమించుటవలన నందలిధాతువు తన కర్థ మగు క్రియ ననువదించుచున్నది" అను ప్రమాణము గలదు. ఇచటి యాగము వేఱెచ్చటను విధింపఁబడలేదు గనుక దాని నుద్దేశించి సోమ మనుగుణము విధింపఁబడనేర దని చెప్పఁదగదు. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత[5]" అను

౧. ప్రవర్తించుటవలన.

౨. "సర్వత్రాఖ్యాతసంబద్ధే శ్రూయమాణే పదాంతరే । విధిశక్త్యనుసంక్రాంతే స్స్యాద్ధాతో రనువాదతా॥" తంత్రవార్తికము ౧-౪-3. పే. ౨౯౦.

3. క్రియాసామాన్యమును బోధించుటకై ధాతువునకుఁ జేర్పఁబడు ప్రత్యయము అని యర్థము. కాని యిచట ఆఖ్యాత మను పదమునకు 'భావప్రధానమాఖ్యాతమ్' అను వైయాకరణన్యాయము నందువలె ఆఖ్యాత మంతమందుఁగల క్రియాపద మర్థము.

౪. విధించుశక్తి.

౫. స్వర్గమును గోరువాఁడు జ్యోతిష్టోమ మనుయాగము నాచరించుటచే నిష్టము నుత్పాదింప వలయును.

వాక్యమునందు యాగము విధింపఁబడుచున్నది గదా! ఈవిధి యధికారవిధి[1] యగుటంజేసి యుత్పత్తివిధి[2] కానేరదని చెప్పవలదు. "ఉద్భిదా[3] యజేత పశుకామః" అనువిధి యుత్పత్తివిధియు, నధికారవిధియుఁగూడ నెట్లగుచున్నదో, యట్లే యీ విధికూడ నుభయవిధి[4] కాఁగలదు. కాఁగా 'సోమేన యజేత' అను విధి యందు సోమపదమునకు మత్వర్థలక్షణ యంగీకరింపఁ బనిలేదు. ఇచట సోమపదమున కన్వయము కుదురదు గనుక, సోమవిశిష్ట మగు యాగము విధింపఁబడుచున్న దని చెప్పెడుపక్షమునఁగదా సోమపదమునకు మత్వర్థలక్షణ యంగీకరింపవలసివచ్చును. ఇచటి యాగము "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను వాక్యముచే విధింపఁబడినచో[5] నిటువంటి స్థలములయం దెచటను మత్వర్థలక్షణ నంగీకరింపవలసిన యావశ్యకత యుండదు. అది యెట్లంటేని:— "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అనువాక్యమందు 'జ్యోతిష్టోమ మను పేరుగల యాగముచే స్వర్గము నుత్పాదింపవలెను' అని జ్యోతిష్టోమపదము నామధేయమై, యాగముతో సామానాధికరణ్య మను సంబంధ ముండున ట్లన్వయించును గనుక, నిచట మత్వర్థలక్షణ నంగీకరింపఁ బనిలేదు. "సోమేన యజేత' అను వాక్యమునందుఁగూడ 'సోమముచే యాగము నుత్పాదింపవలయును' అని యింతకుముందే విహితమగు[6] యాగము నుద్దేశించి సోమము గుణముగా విధింపఁబడవచ్చును గనుక, మత్వర్థలక్షణ నంగీకరింపవలసిన యావశ్యకత లేదు. యాగ మనువదింపఁబడినపుడుకూడ మత్వర్థలక్షణ కావలసియే యున్నది. కనుకనే "యాగము[6] విధింపఁబడినను అనువదింపఁబడినను భావనయందుఁ గరణముగానే యన్వయింపఁ జేయఁబడును. ఆ యాగమును బోధించు పదమునకు సమీపమునందుండు తృతీయాంతమగు పదముకూడ నాకరణమును బోధించుచునేయుండును." అని తంత్రవార్తికమునందుఁ జెప్పఁబడియున్నది. కాఁగా

౧. యాగమునకు ఫలముతోఁగల సంబంధమును బోధించువిధి.

౨. యాగస్వరూపమునుమాత్రము మొదట విధించువాక్యము.

3. పశువులను గోరువాఁడు ఉద్భిత్తనుపేరుగల యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదింపవలయును.

౪. ఉత్పత్తివిధియు, నధికారవిధియు ననఁదగిన విధివాక్యము.

౫. 'జ్యోతిష్టోమేన' ఈమున్నగువాక్యముచే విధింపఁబడినది.

౬. "విధానే వానువాదే వా యాగః కరణ మిష్యతే। తత్సమీపే తృతీయాన్త స్తద్వాచిత్వం న ముంచతి॥" తంత్రవార్తికము, ౧-౪-౨ వార్తికము.

"విశిష్టవిధియందువలె[౧] గుణవిధియందుఁగూడ మత్వర్థలక్షణ యంగీకరింపకతప్పదు" అని చెప్పవలదు. గుణమును బోధించుపదమున కన్వయము కుదురనిపక్షమునఁగదా మత్వర్థలక్షణ యంగీకరింపవలసివచ్చును! ఎచట ధాతువున కర్థమగు యాగము భావన యందుఁ గరణముగా నన్వయించునో, యచట గుణమును బోధించుపదమున కన్వయము కుదురకుండుటంజేసి మత్వర్థలక్షణ యంగీకరింపవలసియుండును. గుణవిధి యందు ధాతువున కర్థమగు యాగము తగినప్రమాణము లేకుండుటచేఁ గరణముగా నన్వయింపదు. 'దధ్నా జుహోతి' అనెడు గుణవిధియందుఁ గరణమును బోధించు తృతీయ మొదలగు ప్రత్యయములు హోమమును విధించుపదమునకు లేకుండుటవలన హోమము కరణముగా వినఁబడుటలేదు.

ఇచట హోమమును బోధించుధాతువే లక్షణామూలముగా 'హోమము కరణము' అనునర్థమును బోధింపఁగల దని కల్పింపరాదు. ఇచట 'దధి గుణముగా విధింపఁబడుట క్లిష్ట మగుచుండుటవలన, 'దధి యనెడుగుణమునకు సాధ్య మేది?' అనెడి యాకాంక్షయే యుచిత మగుచున్నది. కనుక 'దధిచే హోమము నుత్పాదించునది' అని ధాతువున కర్థమగు హోమమును సాధ్యముగాఁ గల్పించుటయే శ్రేయము. 'భావనయందు ధాతువున కర్థ మగునది కరణముగానే యన్వయింపవలెను గాని వేఱొకరీతిగా నన్వయింపరాదు.' అనునియమము లేదు. అట్లుండినచో మీమాంసాదర్శనమందలి షష్ఠాధ్యాయమందుండు ప్రథమాధికరణమునం దుపన్యసింపఁబడిన పూర్వపక్షము కుదురకపోవలసివచ్చును. అది యెట్లంటేని:—షష్ఠాధ్యాయమందలి మొదటియధికరణమునం దిట్లు చెప్పఁబడియున్నది. "యజేత స్వర్గకామః[౨]" అనునిట్టి వాక్యములయందు 'యజ్' ధాతువున కర్థమగు యాగము 'త' ప్రత్యయమున కర్థముగా వివరింపఁబడఁబోవునర్థభావనయందు 'సమానపదశ్రుతి'[3] యను ప్రమాణముమూలమున, భావ్యముగా నన్వయింపవచ్చునా? యని శంకించి, యాగము పురుషార్థము[౪] కాకపోవుటంజేసి, భావ్యముగా నన్వయింపనేర దని

౧. ద్రవ్యము మున్నగు గుణములలో నేదే నొకదానితోఁ గూడిన కర్మమును విధించుట.

౨. స్వర్గమును గోరువాఁడు యాగము నాచరించుటమూలముగా నిష్టము నుత్పాదింపవలయును.

3. = ఏకపదశ్రుతి = 'యజేత' అను నొకపదమునందలి 'యజ్' ధాతువువలన యాగమును, 'త' ప్రత్యయమునందుండు నాఖ్యాతత్వ మనునంశముమూలమున నర్థభావనయుఁ దెలియఁజేయఁబడుట.

౪. పురుషునిచేఁ గోరఁబడునది.

సమాధానము చెప్పఁబడియున్నది. ధాతువున కర్థ మగునది భావనయందుఁ గరణము
గానే యన్వయింపవలయు నను నియమ మున్నయెడల, నిచట యాగము భావ్య
ముగా నన్వయింపనగునా యని శంక కలుగనే కలుగదు. కాఁగా, షష్ఠాధ్యాయము
నందలి మొదటియధికరణము వ్యర్థము కానగుసివచ్చును.[౧] ఇంతేగాక, వాజపేయ
మనుయాగమును వివరించినయధికరణమునందు "వాజపేయేన స్వారాజ్యకామో
యజేత"[౨] అను విధివాక్యమందలి ధాత్వర్థమగు వాజపేయయాగమునకుఁ దంత్ర
సంబంధముచే[౩] నొకతేమాఱు ఫలముతోను గుణముతోను నన్వయము తగునా యని
యాశంకించి, య ట్లన్వయించినచో ధాత్వర్థమునందు విరుద్ధములగు రెండుత్రికములు
రావలసియుండుటంజేసి యట్టియన్వయము తగ దని నిర్ణయింపఁబడినది. ధాత్వర్థము
కరణముగానే యన్వయింపవలయు నను నియమ ముండునెడ, నట్టి తంత్రసంబంధ
మునుగూర్చి శంక కలుగకయేపోవును. ఇదియునుంగాక ధాత్వర్థము కరణముగానే
యన్వయించు నను నియమము లేదు. గుణకామాధికరణమునందు[౪] ధాత్వర్థము
'ఆశ్రయము'గా నన్వయింపవలయు నని చెప్పంబడియున్నదికదా! అది యె

౧. షష్ఠాధ్యాయమందలి ప్రథమాధికరణమునకుఁ దాత్పర్యము, 'ధాతువున కర్థమగునది కరణము కానేను' అని కాదు. మఱేమనఁ బురుషార్థములగు యాగము మొదలగునవియే భావ్యములు కాఁదగినవి యని తాత్పర్యము. ఇట్టితాత్పర్యమును బోధింను ప్రయోజన ముండుటంజేసి, యీ యధికరణము వ్యర్థము కానేరదు కనుక, ధాత్వర్థము కరణముగానే యన్వయించు ననునియమము లేదని చెప్పుటకు మఱియొకప్రమాణ మిఁకనుం గుపన్యసింపఁబడుచున్నది.

౨. అ. ౧. పా. ౪ సూ. ౬. మీమాంసాదర్శనము "స్వర్గరాజ్యమును గోరువాఁడు వాజపేయ మను యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును."

౩. "వాజపేయేన స్వారాజ్యకామో యజేత" అను విధియందు వాజపేయశబ్ద మందలి 'వాజ' పదమున కర్థమగు నన్నము గుణముగా విధింపఁబడునెడల, యజ్ ధాతువున కర్థమగు 'యాగము' 'త' ప్రత్యయమున కర్థమగు భావనతో సామాన్యసంబంధము కలిగియుండుటంజేసి, యొకతేమాఱు స్వారాజ్యఫలభావనయందుఁ గరణముగాను, వాజపేయ మనెడుగుణమునకు భావ్యముగాను నుండవలసివచ్చును. ఇచట ధాత్వర్థ మొకతేసారి ఫలముతోను, గుణముతోను నన్వయించుటయే తంత్ర సంబంధ మనఁబడును ఇట్టి తంత్రసంబంధ మవలంబించినచో, ధాత్వర్థమగు యాగమునందు వెనుక వివరింపఁబడిన విరుద్ధత్రికములు రెండును సంభవించెడిని. కావున నిట్టి తంత్రసంబంధ ముండ దని నిర్ణయింపఁబడినది.

౪. ఒకానొకఫలమునకొఱ కొకానొకగుణమును విధించునధికరణము. ౨ అ. ౨ పా. ౧౧ అధికరణము.

ట్లంటేని :—"దధ్నేంద్రియకామస్య జుహుయాత్"[౧] అను విధియందు 'జుహుయాత్' అను పదమునందలి ధాతువున కర్థమగు హోమ మిచట విధింపఁబడుటలేదు. 'అగ్నిహోత్రం జుహుయాత్'[౨] అనెడు వేఱువిధివాక్యముచే విహిత మగుచున్నది గదా! ఈ "దధ్నా..." మున్నగువిధియందు హోమముతో ఫలమునకు సంబంధ ముండునట్లు కూడ వినఁబడుట లేదు. అట్లయినచో గుణమును బోధించు 'దధి' యను పదము నిష్ఫలము కావలసివచ్చునుగదా! లేదా యీవిధియందు హోమమునకు దధి యనెడుగుణముతో సంబంధ ముండునట్లును విధింపఁబడుట లేదు. అట్లయిన యెడల ఫలమును బోధించు నింద్రియ మనెడు పదమున కానర్థక్యము[3] సంభవించెడిని. ఈవిధియందు హోమమునకు ఫలముతోను గుణముతోను గూడ సంబంధ ముండునట్లు విధింపఁబడుట లేదు. వేఱువిధియందుఁ బ్రాప్తించిన[౪] కర్మము నుద్దేశించి యనేకము లగువానిని విధించినచో వాక్యభేదము సంభవించెడిని గదా! దీనికిఁ బ్రమాణము.[౫] "ఒకకర్మ మొకవిధియందుఁ బ్రాప్తమై యుండఁగా, మరల దాని నుద్దేశించి యనేక కారకములు మున్నగునవి విధింపఁబడఁ గూడదు. అట్లయినచోఁ గర్మభావన ప్రాప్తమైయుండుటవలన, నిచట మరల విధింపఁ బడనేరకుండుటంజేసియు, నిచట విధివ్యాపారము కారకములు మున్నగువానిలోఁ బ్రతిదానియందును సంక్రమించుటంజేసియు, విధి కావృత్తి[౬] కలుగుట యనెడు వాక్యభేదము సంభవించెడిని. కర్మము, వేఱొకవిధియందుఁ బ్రాప్తింపని పక్షమందన్ననో, కర్మభావనయే సర్వత్ర ప్రధానమై వాక్యార్థ మగుటవలన, దానియందే యనేకము లగు కారకములు, గుణములు, మున్నగున వన్నియు నంగములుగా

౧. = ఇంద్రియమును గోరువాఁడు పెరుగుతో హోమము చేయుటచే నిష్టము నుత్పాదింపవలయును.

౨. = అగ్నిహోత్ర మను పేరుగల యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.

3. = అనర్థక మగుట, నైరర్థక్యము = నిరర్థక మగుట, నైష్ఫల్యము = నిష్ఫల మగుట = వైయర్థ్యము = వ్యర్థ మగుట.

౪. = ప్రాప్తించిన, విధింపఁబడిన.

౫. "ప్రాప్తే కర్మణి నానేకో విధాతుం శక్యతే గుణః । అప్రాప్తేతు విధీయన్తే బహవోఽప్యేకయత్నతః" (తంత్రవార్తికము, అ. ౨. పా. ౨. సూ. 3.) పే. ౪౭౬.

౬. = ఒకమాఱు ప్రవర్తించినదానిని మరలమరలఁ బ్రవర్తింపఁజేయుట.

నన్వయింపఁదగియుండుటంజేసి, వాని యన్నిటితోఁ గూడిన కర్మభావన యొకటియే, యొకటేవిధివ్యాపారముచే, వాక్యభేదము లేకుండ విధింపఁబడును గావున, నిట్టిచోట్లు లందుఁ గారకాదు లనేకము లైనను నొకటే విధివ్యాపారముచే విధింపఁబడఁగలవు." (తం. వా. అ. ౨. పా. ౨. సూ. 3) ఈ ప్రమాణమునందుఁ గర్మపదమును గుణ పదమును నుపలక్షణము[1] లగుటంజేసి 'కర్మము' అను పదమునకు 'వేఱొకవిధి యందుఁ బ్రాప్తింపఁదగిన దే దైనను' అనియు, 'గుణ' పదమునకు ప్రాప్తించిన దాని నుద్దేశించి విధింపఁదగిన దే దైనను' అనియు నర్థము లని గ్రహించునది. ప్రాప్తించిన యే దేనొకదాని నుద్దేశించి యనేకము లగునవి విధింపఁబడునెడలఁ బైని వివరింపఁబడినరీతిని వాక్యభేదము సంభవించెనని గదా! పై ప్రమాణమునం దుండు 'కర్మ' అను పదము 'ఉపలక్షణము' అయి ప్రాప్తింపఁదగునవేని నైనను దెలియఁ జేయుచున్నది. కనుకనే గ్రహైకత్వాధికరణమం[2] దిట్లు వివరింపఁబడియున్నది; 'గ్రహం సమ్మార్ష్టి'[3] అను విధియందు 'గ్రహ' పదముచే 'గ్రహైర్జుహోతి'[4] అను వేఱువిధివలనఁ బ్రాప్తించిన గ్రహము నుద్దేశించి 'గ్రహమ్' (= గ్రహమును) అనుపదమందలి యేకవచనముచేఁ దెలిసికొనఁబడు నేకత్వమును,[5] 'సంమార్ష్టి' పదమందలి 'సం + మార్జ్' అను ధాతువున కర్థమగు సంమార్జనమును (= తుడుచుట) విధింపఁబడునెడ, వాక్యభేదము సంభవించును గావున, గ్రహమం దేకత్వమును వివక్షింపక 'గ్రహము లన్నిటికిని సంమార్జనము జరుగవలయును.' అనునదియే యీవిధి కర్థ మని నిర్ణయింపఁబడినది. ఈనిమూలముగాఁ బై నుదాహరింపఁబడిన ప్రమాణమునందలి కర్మపద ముపలక్షణ మని తెలియుచున్నది. మఱియు నిట్లే రేవత్యధికరణమందుఁ గూడ[6] "ఏతస్యైవ[7] రేవతీషు వారవంతీయ మగ్ని

౧ = ముఖ్యార్థములకంటె వేఱగునర్థములను దెలియఁజేయునవి.

౨. మీమాంసాదర్శనమందలి 3 అధ్యా. ౧ పాద. ౭ అధికరణము.

3. గ్రహము = యజ్ఞమునందు వాడఁబడుపాత్రము. "గ్రహమును తుడువవలయును."

౪. గ్రహములతో హోమము చేయుటచే నిష్టము నుత్పాదింపవలయును.

౫. ఒకటి యగుట.

౬. మీమాంసాదర్శనము, ౨ అ. ౨ పా. ౧౨ అధికరణము

౭. పశువులను గోరువాఁడు రేవతి యనుపేరుగల ఋక్కులను బఠించునపుడు వారవంతీయ మనుపేరుగలదియు, అగ్నిష్టోమ మనెడియాగమును సమాప్తి నొందించునదియునగు సామమును గానము చేయుటమూలముగా అగ్నిష్టోమమునకు వికృతియగు 'అగ్నిష్టుత్' అనెడి యాగము నాచరించుటచే

ష్టోమసామ కృత్వా పశుకామో హ్యేతేన యజేత" అను విధియందు 'ఏతస్యైవ' అను పదముచే "త్రివృ దగ్నిష్టు దగ్నిష్టోమ స్తస్య వాయవ్యాస్వేకవింశ మగ్నిష్టోమ సామ కృత్వా బ్రహ్మవర్చసకామో యజేత" అను విధివలనఁ బ్రాప్తించిన 'అగ్నిష్టుత్' అనుయాగము నుద్దేశించి 'వారవంతీయము' అనుదానికి రేవతులతో సంబంధమును,[1] అగ్నిష్టోమసామముతో సంబంధమును, బశువులనెడిఫలముతో సంబంధమును విధింపఁబడిన పక్షమున వాక్యభేదము సంభవించెడిని. కావునఁ బశువు లనెడు ఫలమును సంపాదించునదియు, నీమూఁడుసంబంధములును గుణములుగాఁ గలదియునగు నగ్నిష్టుత్తునకంటె వేఱగు భావన యిచట విధింపఁబడుచున్న దని నిర్ణయింపఁబడినది. దీని మూలముగాఁ బై నుదాహరింపఁబడిన "ప్రాప్తే కర్మణి" అను ప్రమాణమునందలి కర్మపదము, ఉపలక్షణ మని తెలియుచున్నది. కాఁగా "దధ్నేంద్రియకామస్య జుహుయాత్" అనువిధియందలి 'జుహుయాత్' అనుపదమునం దుండుధాతువుచే, "అగ్నిహోత్రం జుహుయాత్" అను విధివలనఁ బ్రాప్తించినహోమము నుద్దేశించి దధి, ఇంద్రియమనెడి ఫలము ననునీరెండును విధింపంబడఁదగవు. లేదా, "అగ్నిహోత్రం జుహుయాత్" అనువిధివలనఁ బ్రాప్తించిన హోమముకంటె వేఱగు హోమ మిచట విధింపఁబడుచున్న దని చెప్పటయును దగదు. అట్లు చెప్పినచో, దధి, ఇంద్రియము ననెడు ననేకములందుఁగాని, వానితో విశిష్టమగు హోమమునందుఁగాని విధివ్యాపారమును గల్పించుక్లేశము సంభవించెడినిగదా! మఱియు "అగ్నిహోత్రం జుహుయాత్" అను విధివలనఁ బ్రాప్తించుటచేఁ బ్రకృతమగు హోమమును విడిచి క్రొత్తగా విధింపఁబడుటచే నప్రకృతమగు హోమాంతరమును గల్పించుట సంభవించును. ఇంతే కాక, యిచట దధితో విశిష్టమగు హోమమును విధించునెడ దధి యనుపదమునకు 'దధికలది' అనునర్థమును జెప్పుటమూలముగా మత్వర్థలక్షణ యంగీకరింపవలసి వచ్చును. లేదా, "దధ్నేంద్రియకామస్య జుహుయాత్" అనువిధియందు వేఱొక విధివలనఁ బ్రాప్తించినహోమము నుద్దేశించి దధిమాత్రము కరణముగా విధింపఁబడుచున్న దని చెప్పుటయును

నిష్టము నుత్పాదించుకొనవలయును. రే అనునక్షరము పలుసారులు వచ్చుఋక్కులు గనుక వానికి రేవతులు అని పేరు కలిగినది. అవి 'రేవతీర్నస్సధమాదః' ఈ మున్నగునవి. వారవంతీయము = "అశ్వం న త్వా వారవంతమ్" అను నీమున్నగు ఋక్కు పఠించునపుడు గానము చేయఁదగిన సామము. యాగములలో అగ్నిష్టోమము ప్రకృతి, మిగిలిన వన్నియు వికృతులు.

౧. అగ్నిష్టోమమును సమాప్తి నొందించుసామము.

దగదు. కర్తచే నేదే నొకవ్యాపారముమూలముగా నుపయోగింపఁ బడునదియో కరణము కాఁగల దనునియమము లోకమం దుండుటంజేసి, యేవిధమగు వ్యాపారము మూలముననుు నుపయోగింపఁబడని కేవలద్రవ్యము కరణమగుట కుదురదుగదా! ఇట్లయినచో నీవిధియందు విధింపఁబడున దేది యని ప్రశ్నింప, "దధ్నా" ( = దధిచేత) అను పదమందలి తృతీయావిభక్తిప్రత్యయముచే లక్షణాద్వారమునఁ[1] దెలియంజేయఁబడు 'దధి కరణ మగుట' యనునది ఫలభావనయందుఁ గరణముగా విధింపఁబడుచున్న దని చెప్పవచ్చును. కరణ మగుట యనునది 'దధ్నా' అనుపదమందలి తృతీయావిభక్తి కర్థ మగుటంబట్టి, దధి యను ప్రకృతి కర్థ మగు పెరుఁగుకంటెఁ బ్రధాన[2] మగుచున్నది గదా! కాఁగా, నీవిధినుండి "ఇంద్రియమును గోరువాఁడు దధియం దుండు 'కరణ మగుట' అను స్వభావముమూలమున నిష్టమగు నింద్రియము నుత్పాదింపవలెను" అనునర్థ మేర్పడుచున్నది. దధియం దుండు కరణత్వ[3] మనుదానికి 'ప్రతియోగి'[4] యేది యని యాకాంక్ష కలుగఁగా, 'దధ్నా' అనుపదమునకు సమీపమునందు వినఁబడు 'జుహుయాత్' పదమందలి ధాతువున కర్థమగు హోమము ఆశ్రయముగా సంబంధించుచున్నది. కాఁగా ధాత్వర్థ మాశ్రయముగా నన్వయింపవచ్చు నని సిద్ధించుచున్నది.

ప్రస్తుతము ననుసరింతము. ఇంతవఱకును వర్ణింపఁబడిన యుపన్యాసముచే ధాత్వర్థము కరణముగానే యన్వయింపవలె నను నియమము లే దని యేర్పడినది. ఇఁక మఱియేవిధముగా నన్వయింపవచ్చు నన ఉత్పత్తివిధియందుఁ[5] గరణముగాను,

౧. ఇచట "దధ్నా" అను పదమునందలి తృతీయావిభక్తిప్రత్యయము, శక్తిమూలమున ఫలభావనయందు స్వరూపసంబంధముచే నన్వయించుటకు యోగ్యమును కరణత్వమును (దధి కరణ మని) బోధించును. కావున నా ప్రత్యయము కరణముగా నన్వయింపఁదగు 'కరణమగుట' యనుదానిని లక్షణాద్వారమున బోధింపవలసియున్నది.

౨. ప్రకృతియొక్క యర్థముకంటెఁ బ్రత్యయముయొక్క యర్థము ప్రధాన మను స్మృతి యిచటఁ బ్రమాణ మగుచున్నది.

౩. కరణ మగుట.

౪. దధియందుండు కరణత్వమును నిరూపించునది లేదా నిర్ణయించునది, లేక నిర్దేశించునది. కావుననే దధిని కరణముగా నుపయోగించుటకు ఆశ్రయ మగునది. ఆశ్రయ మనఁగా ఆధారము.

౫. ఉత్పత్తివిధి "అగ్నిహోత్రం జుహుయాత్" అను నిట్టిది.

గుణవిధియందు[౧] సాధ్యముగాను, గుణఫలసంబంధవిధియందు[౨] ఆశ్రయము గాను నన్వయించు నని తెలియునది. గుణవిధియందు ధాత్వర్థము సాధ్యముగా నన్వయించును గనుక గుణమును బోధించుపదమందు మత్వర్థలక్షణ యంగీకరింపఁ బని లేదు. ఇంతే కాదు. గుణవిధియందు మత్వర్థలక్షణ నంగీకరించునెడల గుణము ధాత్వర్థమున కంగ మని చెప్పుటకుఁ బ్రమాణ మేమి కలదు? శ్రుతిప్రమాణ మున్న దని చెప్పందగదు. ఏల యన—మత్వర్థలక్షణ యంగీకరించునపుడు, తృతీయావిభక్తి[3]యనెడి శ్రుతి, మత్వర్థమే యంగ మని చెప్పుటకే కాని గుణ మంగ మని చెప్పుటకుఁ బ్రమాణము కానేరదు. లేదా, పదముల కూడికయగు 'వాక్యము'[౪] ప్రమాణము కావచ్చు నని చెప్పునెడ, వాక్యము స్వాతంత్రముగానే ప్రమాణ మగునా? లేక లింగమును శ్రుతిని గల్పించుట మూలమునఁ బ్రమాణ మగునా? వాక్యము స్వాతంత్రముగాఁ బ్రమాణము కానేరదు. ఏల యన నట్లయినచో బలాబలాధికరణముతో[౫] విరోధము సంభవించును. ఆయధికరణమందు వాక్యము, లింగమును శ్రుతిని గల్పించుటమూలముగా నంగత్వమును నిర్ణయించుటకుఁ బ్రమాణ మగుచున్న దని చెప్పఁబడినది. లేదా, వాక్యము, లింగమును శ్రుతిని గల్పించుటమూలము గానే ప్రమాణ మగు నని చెప్పినపక్షమునఁ బ్రత్యక్షమగు శ్రుతిని విడిచి 'దధ్నా' అను వేఱుశ్రుతిని గల్పించుటకుఁ గాని, లేక యా ప్రత్యక్షశ్రుతినే యింకొకమా ఱుచ్చరించి ప్రవర్తింపఁ జేయుటకుఁగాని, వ్యర్థమగు ప్రయాసమును బొందవలసివచ్చును.

౧. గుణవిధి. "దధ్నా జుహోతి" అను నిట్టిది.

౨. గుణఫలసంబంధవిధి. "దధ్నేంద్రియకామస్య జుహుయాత్" అను నీరీతిది. దీనికే గుణకామవిధి యనియుఁ బేరు గలదు

3. 'దధ్నా' అను పదమునందలి తృతీయావిభక్తి.

౪. ద్రవ్యము మొదలగునవి యాయాక్రియల కంగము లగు నని నిర్ణయించుటకు. (౧) శ్రుతి, (౨) లింగము, (3) వాక్యము, (౪) ప్రకరణము, (౫) స్థానము, (౬) సమాఖ్య అను నాఱుప్రమాణములు కల వని ముందు వివరింపఁబడును.

౫. మీమాంసాదర్శనమునందలి 3 అ. 3 పా. ౭ అధికరణము. అది "శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థానసమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్" 3 అ. 3 పా. ౧౪ సూత్రము. ఈ సూత్రవ్యాఖ్యానమందు, శ్రుతి మున్నగు నాఱు ప్రమాణములలో ముందుముం దుండునది వెనుకటిదానికంటె దుర్బల మగుచున్న దని విశదపఱుపఁబడినది.

‘అరుణయా పింగాక్ష్యా ఏకహాయిన్యా గవా సోమం క్రీణాతి’ అను నిట్టి విశిష్టవిధియందన్ననో వేఱొకయుత్పత్తివిధి యేదియు లేకుండుటంజేసి, గుణముల నన్వయింపఁజేయు వేఱొకగతి లేనందున శ్రుతి నావర్తింపఁజేసి[2] యొక్కొక విశేషణమందును బ్రవర్తింపఁజేయుట కాని, వేఱుశ్రుతిని గల్పించుట కాని యావశ్యకము కావచ్చును. ఇదియునుంగాక ప్రత్యక్షశ్రుతికంటె వేఱుశ్రుతిని[3] గల్పింపఁగాక. అట్లు కల్పించినను నాకల్పితశ్రుతితోఁ గూడిన ప్రత్యక్షశ్రుతియే గుణము ధాత్వర్థమున కంగ మని విధించుచున్నదా? లేక కల్పింపఁబడిన వేఱువిధియే యట్లు విధించుచున్నదా? కల్పితమగు విధియే యట్లు విధించు ననుచో, (దాని చేతనే గుణము ‘అగ్నిహోత్రం జుహోతి’ అను వేఱొకచోటఁ బ్రాప్తమైన ధాత్వర్థమున కంగముగా విధింపఁబడుటచేతను, నిఁక విధింపఁబడవలసినది మఱేమియు లేకుండుటచేతను) మొదట నున్న ‘దధ్నా జుహోతి’ అను ప్రత్యక్షవిధి వ్యర్థము కావలసివచ్చును. పోనీ యనఁ బ్రత్యక్షవిధిచే నిపుడు గుణము విధింపఁబడుటలేదు. అట్టిగుణమును ధాత్వర్థమున కంగముగా విధించుటకు వేఱువిధి కల్పితమైన దని యంగీకరింపఁబడినదిగదా! మఱియుఁ బ్రత్యక్షవిధిచే ధాత్వర్థమును విధించుట లేదు. అట్టి ధాత్వర్థము ‘అగ్నిహోత్రం జుహోతి’ అను విధ్యంతరముచే విహితమైనది గదా! ఇఁకఁ బ్రత్యక్షముగా వినఁబడువిధియే కల్పితవిధితోఁ గూడినదై గుణమును ధాత్వర్థమున కంగముగా విధించుచున్న దని చెప్పినచో, నిచట ధాత్వర్థమున కన్వయ మెట్లు? అది కరణముగా నన్వయింపనేరదు. అట్లు కరణమైనచో నన్వయము కుదురదు. ‘దధ్నా’ (= దధిచే) ‘హోమేన’ (= హోమముచే) ‘ఇష్టం భావయేత్’ అనునన్వయము సంభవింపనేరదుగదా! లేదా; ‘దధ్నా హోమం భావయేత్.’ అనురీతిని ధాత్వర్థము సాధ్యముగా నన్వయించు నని చెప్పుటయును దగదు. అట్లు చెప్పినచో “ధాత్వర్థము వేఱొకచోటఁ బ్రాప్తమై యనువదింపఁబడి

౧. ‘ఎఱ్ఱనిదియుఁ బచ్చని కన్నులు గలదియు నొకసంవత్సరము వయస్సు గలదియు నగు గోవు నిచ్చి సోమమును గొనవలయును.’ ఇచట వేఱుగ నుత్పత్తివిధి లేకపోవుటచే ‘ఆరుణ్యము మున్నగు విశేషములతోఁ గూడిన విశిష్టక్రయభావన విధింపఁబడుచున్నది. ఇట్టిదే విశిష్టవిధి యనఁబడుచున్నది.

౨. మరల నుచ్చరించి.

౩. దధ్నా అను శ్రుతిని.

౪. “దధ్నా జుహోతి” అనునది.

నపుడుకూడఁ[1] గరణముగానే యన్వయించును." అనువాక్య మప్రమాణము కావలసివచ్చును. మఱియు మత్వర్థలక్షణ నంగీకరింపకయే, దధి హోమమునకు గుణముగా నన్వయింపవలయు నను నిష్టమైన యర్థ మంగీకరింపఁబడిన దగును. కావున గుణవిధియందు మత్వర్థలక్షణ నంగీకరించు నావశ్యకత లేదు. లేదా; ధాత్వర్థ మనువదింపఁబడునపుడుకూడఁ గరణముగానే యన్వయించు నని చెప్పుటకు 'విధానే వానువాదే వా' ఈ మున్నగువార్త్తికము ప్రమాణము గాఁగల దందురేని, యావార్త్తికము లోకపువాడుక ననుసరించి చెప్పఁబడినదియే కాని, యథార్థమగు స్థితి ననుసరించి చెప్పఁబడియుండలేదు. అది యెట్లంటేని, 'అగ్నిహోత్రం జుహుయాత్' అనువాక్యమును గమనింపక, 'దధ్నా జుహోతి' అను వాక్యమునుమాత్ర మాలోచించునపుడు, షష్ఠాద్యన్యాయము ననుసరించి హోమము భావ్యము కానేరదని తెలిసికొనినట్టియు, 'ప్రతిపదాధికరణము' యొక్కయు, 'భావార్థాధికరణము'యొక్కయుఁ దాత్పర్యమును గ్రహించినట్టియు జనులకు 'దధిమతా[2] హోమేన ఇష్టం భావయేత్' అనునిశ్చయ మేర్పడును. ప్రతిపదాధికరణమునం[3] దిట్లు వివరింపఁబడియున్నది. 'సోమేన యజేత' అను నిట్టివిధులయందు, సోమ మనుగుణము యజధాతువున కర్థమగు యాగము ననునీరెండును, ఫలభావనయందుఁ గరణముగా నన్వయించునా? లేక, వీనిలో నొకటియే యట్లన్వయించునా? అను సందేహము కలుగఁగాఁ బ్రధానమగు భావనతో సంబంధము లభించుటకొఱకును, నీరెండింటిలో నొకటియే కరణముగా నన్వయించు ననుటకుఁ బ్రమాణము లేకపోవుటచేతను నన్నియు ఫలభావనయందుఁ గరణములుగా నన్వయింపవచ్చు నని శంకించుకొని, సులువుకొఱకు[4] నొక్కటియే ఫలభావనయందుఁ గరణముగా నన్వయించు నని చెప్పఁబడినది. భావనయందుఁ గరణ మగుట, భావనయందలిభావ్యమును నిర్వర్తించుట మూలముగా సిద్ధించును. భావ్యమగు స్వర్గము మున్నగునది యదృష్టము లేనిదే సిద్ధింపనేరదు. కావున ననేకములను గరణములుగా నంగీకరించినచో ననేకాదృష్టములను గల్పింపవలసివచ్చుటంజేసి, వానిలో నొక్కటియే కరణము కాఁదగినది.

౧. తిరిగి చెప్పంబడుట.

౨. దధి కలదగు.

3. ప్రతిపదాధికరణము. ౨ అ. ౨ పా. ౧ అధికరణము. మీమాంసాదర్శనము.

౪. ఒకటే యదృష్టమును గల్పించుటకొఱకు.

భావార్థాధికరణమం[1] దిట్లు వివరింపఁబడియున్నది. ఒక్కటియే, భావనయందుఁ గరణము కాఁదగిన దనుపక్షమునందును ద్రవ్యమును గుణమును, ఫలభావనయందుఁ గరణములు కాఁదగినవా? లేక, ధాత్వర్థము కరణము కాఁదగినదా? యని సందేహము కలుగఁగా, 'భూతం భవ్యాయోపదిశ్యతే' అనున్యాయము నవలంబించి, ద్రవ్యము గుణము నను నీరెండుమాత్రమే భావనయందుఁ గరణములుగా నన్వయించు నని యాశంకించుకొని, 'ఏకపదశ్రుతి' యను ప్రమాణముచే ధాత్వర్థమే భావనయందుఁ గరణము గాఁదగిన దని చెప్పఁబడినది. కాఁగా; 'అగ్నిహోత్రం జుహుయాత్' అనువాక్యము నాలోచింపక, 'దధ్నా జుహోతి' అనువాక్యమునుమాత్రమె విమర్శించునపుడు, గుణవిధియందుఁగూడ ధాత్వర్థము కరణము కాఁగల దని నిర్ణయింపఁబడఁగా, గుణమును బోధించుపదమందు మత్వర్థలక్షణ యావశ్యక మగుచున్నది. ఎప్పుడు హోమమును విధించు 'అగ్నిహోత్రం జుహుయాత్' అను వాక్యమాలోచింపఁబడునో, యాపు డావాక్యముచే హోమము విహిత మగుటంజేసి, 'దధ్నా జుహోతి' అనువాక్యముచే 'జుహోతి' అను పదముమూలమున వేఱొకచోట విహితమగు హోమము నుద్దేశించి దధి యనెడు గుణముమాత్రము విధింపఁబడుచున్నది గనుక గుణమును బోధించు 'దధి' యనుపదమందు మత్వర్థలక్షణ యంగీకరించునావశ్యకత లేదు. కావుననే పార్థసారథిమిశ్రులచే 'ఆఘారాగ్నిహోత్రాధికరణ'మందు, (మీ. దర్శ. ౨ అ. ౨ పా. ౫ అధికరణము) 'దధ్నా జుహోతి' అనువాక్యము యథార్థస్థితి ననుసరించియే గుణవిధి యగుచున్నది, గాని లోకమందలి ప్రతీతిమాత్రము ననుసరించి కాదు.' అని చెప్పఁబడినది. లేదా; "విధానే వానువాదే వా" అనునీమున్నగు వార్త్తికము 'అధికారవిధి' నుద్దేశించి ప్రవర్తించుచున్నది. 'ఉద్భిదా యజేత పశుకామః' అను నిట్టి విధు లధికారవిధు లని యంగీకరింపఁబడుచున్నవిగదా! 'ఉద్భిదా యజేత పశుకామః' అనువాక్యమందు యాగము విధింపఁబడుఁగాక. లేక, వేఱొక యుత్పత్తివాక్యముచేఁ బ్రాప్తించినయాగ మనువదింపఁబడుఁగాక: ఎట్లయినను, ధాత్వర్థము కరణముగానే యన్వయింపవలసియుండుటంజేసి, ధాతువునకు సమీపమునందు వినఁబడు 'ఉద్భిదా' అను తృతీయాంతము వేఱొకరీతిగా నన్వయించుటకు వీలు లేదు గనుకఁ గరణమగు ధాత్వర్థమునకే విశేషణముగా నన్వయించును. కాఁబట్టి, గుణవిధియందు మత్వర్థలక్షణ నంగీకరింపకయే యన్వయము కుదురుటంజేసి, మత్వర్థలక్షణ నంగీకరించునావశ్యకత లేదు. కాఁగా 'సోమేన

౧. మీ. దర్శ. ౨ అ. ౧ పా. ౨ అధికరణము.

యజేత' అను విధియందు గుణవిశిష్టమగు యాగము విధింపఁబడుట లేదు. ము త్రేమన గుణముమాత్రమే విధింపఁబడుచున్నది. ఇచట నుద్దేశింపఁబడు యాగ మన్ననో వేఱొకచోట విధింపఁబడక యిచటనే కరణముగా నన్వయించిన దో, సోమపదమందు మత్వర్థలక్షణ యంగీకరింపఁబడవలసివచ్చును గనుక, 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అను వేఱొకవిధిచే నాయాగము విధింపఁబడుచున్న దని యంగీకరించుటయే యుక్తము. ఇట్లు 'సోమేన యజేత' అనువాక్యము గుణవిధియే యనియుఁ, గావుననే మత్వర్థలక్షణ యావశ్యకము కా దనియుఁ బూర్వపక్షము రాఁగా దానికి సమాధాన మీక్రింది విమర్శింపఁబడుచున్నది.

విమర్శింపఁగా 'సోమేన యజేత' అను వాక్యమునందు యజిధాతువున కర్థమగు యాగము నుద్దేశించి సోమము విధింపఁబడు నెడ నన్వయమున కనుపపత్తి లేదు గనుక మత్వర్థలక్షణ యావశ్యకము కాకపోవచ్చును. అయినను నీయాగము వేఱొక విధియందే చెప్పటను ప్రాప్తింపకుండుటవలన, యజ్ ధాతువుమూలముగా యాగము నుద్దేశించి సోమము గుణముగా విధింపఁబడుట సంభవింపనేరదు. 'ఈ యాగము "జ్యోతిష్టోమేన అను నీమున్నగువాక్యముచేఁ బ్రాప్తించినది గనుక, దీని నుద్దేశించి సోమ మను గుణముమాత్రము విధింపఁబడఁగలదు." అని చెప్పుటకు వీలు లేదు. 'జ్యోతిష్టోమేన...' అను నీ మొదలగు విధి యధికారవిధిగా నంగీకరింపఁబడినది గనుక నుత్పత్తివిధి కానేరదు గదా! కర్మముయొక్క స్వరూపమునుమాత్రము బోధించువిధి యుత్పత్తివిధి యనఁబడును. దానిచే విహితమగు కర్మమున కొకానొకఫలముతో సంబంధ ముండునట్లుమాత్రము 'అధికారవిధి' చే బోధింపఁబడును. వేఱొకచోట విహితమగు కర్మమునకును నొకానొకఫలమునకును గల సంబంధమును బోధించు విధియే యధికారవిధి యని యంగీకరింపఁబడుచున్నది గదా! ఉదా. "యదాగ్నే యోఽష్టాకపాలోఽమావాస్యాయాం పౌర్ణమాస్యాం చాచ్యుతో భవతి"[౧] అను విధిచే విహితమగు కర్మమునకు స్వర్గమనెడు ఫలవిశేషముతో సంబంధ ముండునట్లు మాత్రము "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత"[౨] అను విధిచే బోధింపఁ

౧. అక్షయ మగు ఫలము కోరువాఁడు, అమావాస్యయందును పౌర్ణమాసియందును నగ్ని దేవతకొఱకు ఎనిమిది ప్రమిదలయందు సంస్కరింపఁబడిన పురోడాశము నిచ్చి యజించుటమూలముగా నిష్ట ముత్పాదించుకొనవలయును.

౨. స్వర్గమును గోరువాఁడు దర్శేష్టిని (అమావాస్యయందుఁ జేయునది) బూర్ణమాసేష్టిని నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.

బడుచున్నది. కనుక "దర్శపూర్ణమాసాభ్యాం..." అను నీమున్నగు విధి, యధికార విధి యగును గాని, యుత్పత్తివిధి కానేరదు. పయిని నిరూపింపఁబడిన దృష్టాంతమునకును, దార్ష్టాంతికమునకును వైషమ్యము గలదని యొకఁడిట్లు శంకింపవచ్చును. "దర్శపూర్ణమాసాభ్యాం..." అను నీమొదలగువాక్య ముత్పత్తివిధి కానేరదు. అట్లయినచో "యదాగ్నేయోఽష్టాకపాలో..." ఈ మున్నగు వాక్యము వ్యర్థము కావలసివచ్చును. "దర్శపూర్ణమాస" వాక్య ముత్పత్తివిధి యని యంగీకరింపఁబడునెడ, 'యదాగ్నేయ...' అను నీమొదలగు వాక్యముచేఁ గర్మము విధింపఁబడు నావశ్యకత లేదు. అట్టికర్మ ముత్పత్తివిధి యగు 'దర్శపూర్ణమాసా...' ఈమున్నగు వాక్యముచే విహిత మగుచున్నదిగదా! లేదా; 'యదాగ్నేయ...' మున్నగు వాక్యముచే గుణము విధింపఁబడుటయును సంభవింపనేరదు, 'దర్శపూర్ణమాస' విధిచేఁ బ్రాప్తించిన కర్మము నుద్దేశించి, యిచట నగ్ని యను దేవత, ప్రమిదలసంఖ్య, పురోడాశము, అమావాస్యాపౌర్ణమాసు లను కాలములు, ననెడు ననేకగుణములు విధింపఁబడునెడల వాక్యభేదము సంభవించునిగదా! ఇట్లు దర్శపూర్ణమాసవాక్య ముత్పత్తివిధిగా నంగీకరించునెడ 'యదాగ్నేయ...' ఈమున్నగువాక్యము వ్యర్థము కావలసివచ్చును గనుక, 'యదాగ్నేయ...' ఈమొదలగు వాక్యము నుత్పత్తివిధి గాను, 'దర్శపూర్ణమాస ..' ఈమున్నగువాక్యము నధికారవిధిగాను నంగీకరించుట యుక్తము. నీచే నధికారవిధిగా నంగీకరింపఁబడిన 'జ్యోతిష్టోమేన' ఈ మున్నగు వాక్య మన్ననో 'ఉద్భిదా యజేత పశుకామః' అనువాక్యమువలె నుత్పత్తివిధిగాఁ గూడ నంగీకరింపఁబడినచో మ తేవిధికిని వైయర్థ్యము సంభవింపదు. అపుడు 'సోమేన యజేత' అనునది గుణవిధి కావచ్చును గనుకను, 'జ్యోతిష్టోమేన' ఈ మొదలైన యుత్పత్తివిధిచే విధింపఁబడిన యాగము నుద్దేశించి సోమ మనెడుగుణము మాత్ర మిచట విధింపఁబడవచ్చును గనుకను నిచట వాక్యభేదము సంభవింపదు. ఇట్లు నిరూపింపఁబడిన శంక సరి కాదు.

ఏల యన విచారింపఁగా 'సోమేన యజేత' అను వాక్యమందు గుణము మాత్రము విధింపఁబడుటచే వాక్యభేదము రాదు; కాని నీచే నుత్పత్తివిధిగా నంగీకరింపఁబడిన 'జ్యోతిష్టోమేన'... ఈ మున్నగు వాక్యమందుఁ గర్మస్వరూపమును, దానికి స్వర్గ మనుఫలముతోఁగల సంబంధమును విధింపఁబడునెడల, నన్వయక్లేశమును గలిగించు వాక్యభేదము తప్పక యుండెడిని. అట్లు కాక 'సోమేన యజేత' అను వాక్యమున నుత్పత్తివిధిగా నంగీకరించి దీనిచే విహిత మైనకర్మమునకు ఫలముతోఁగల

సంబంధముమాత్రము 'జ్యోతిష్టోమేన' ఈ మున్నగు వాక్యముచే విధింపఁబడునపు డట్టివాక్యభేదము సంభవింపదు. 'ఉద్భిదా యజేత' ఈ మొదలగు వాక్యమునం దన్ననో దానికంటె వేఱగు నుత్పత్తివాక్య మేదియు లేనందున వేఱుగతి లేకుండుటంజేసి, యావాక్య ముత్పత్తివిధిగానే యంగీకరింపఁబడినది. అట్లయినచో 'సోమేన యజేత' అను వాక్యమందుఁగూడఁ గర్మముయొక్క స్వరూపము, గుణము నను నీ రెండును విధింపఁబడునెడల వాక్యభేదము సంభవించునే యని చెప్పందగదు. ఇందలి 'యజేత' పదమందుండు 'త' ప్రత్యయముమూలముగాఁ దెలిసికొనఁబడు విధిచే సోమ మనుగుణము విధింపఁబడుట లేదు. గుణ మనువిశేషణము విధింపఁబడుట యర్థాపత్తిప్రమాణముచేఁ[1] గలుగును. గుణవిశిష్టములగు కర్మములను విధించువాక్యములయం దెల్ల, విశేషణములుగూడ విధింపఁబడుట యర్థాపత్తిప్రమాణముచే సిద్ధించును. 'జ్యోతిష్టోమేన' ఈ మున్నగువాక్యము నుత్పత్తివిధిగా నంగీకరించు పక్షమందన్ననో, యచటఁ గర్మస్వరూపము, దానికి ఫలముతోఁగల సంబంధము నను రెండును 'యజేత' పదమందలి 'త' ప్రత్యయముమూలమున బోధింపఁబడువిధిచే విధింపఁబడవలసియున్నవి గనుక నచట నన్వయక్లేశమును గలిగించు వాక్యభేదము స్పష్టముగానే కలుగును. దీనికిఁ బ్రమాణము "విధిని[2] బోధించు నొకటేశబ్దము, అనేకము లగువానిని విధించునపు డట్టి విధిశబ్దమున[3] కన్వయక్లేశము సంభవించును. ఒక విధిశబ్ద మొకదానినే విధించి విరమించువాక్యములం దన్ననో మిగిలిన గుణము మున్నగునవి యర్థాపత్తిప్రమాణముచే విధింపఁబడునట్లు తెలియుట యసంగతము కాదు" అనునది.

ఆలోచింపఁగా 'సోమేన యజేత' అను దాని నుత్పత్తివిధిగా నంగీకరించునెడ వాక్యభేదము రాదు. కాని మత్వర్థలక్షణమాత్ర మంగీకరింపవలసియే వచ్చునే

౧. ఏది లేనియెడల నేది సిద్ధింపదో యది దానిచే సిద్ధింపఁజేయఁబడుచున్నది. ఉదా. దేవదత్తుఁడు బలిసియున్నాఁడు, పగలు భుజింపఁడు అనునది వినఁబడినతోడనే దేవదత్తుఁడు, రాత్రి భుజింపనియెడలఁ దాను బలియుట సిద్ధింపదు గాన, నట్లు వాఁడు బలిసియుండుటవలన 'రాత్రి భుజించుచున్నాఁడు' అనునది గ్రహింపఁజేయఁబడుచున్నది. ఇట్లు గ్రహింపఁజేయఁబడునట్టి ప్రమాణమునకు 'అర్థాపత్తి' అని పేరు.—దీనికి 'ఆక్షేపము' అను నామాంతరముకూడఁ గలదు.

౨. "శ్రౌతవ్యాపారనానాత్వే శబ్దానా మతిగౌరవమ్, ఏకోక్త్యవసితానాంతు నార్థాక్షేపో విరుధ్యతే" తంత్రవార్తికము ౨ అ. 3 పా. 3 వార్తికము.

3. విధిని బోధించుశబ్దము.

యని చెప్పవలదు. మత్వర్థలక్షణ యంగీకరింపఁ బడుచున్నది గదా! 'అట్లు కాక, వాక్యభేదమునే యేల యంగీకరింపరా' దందురేని, లక్షణ నంగీకరించుటకంటె వాక్యభేద మంగీకరించుట యెక్కువదోషము కదా! మత్వర్థలక్షణ నంగీకరించుట పదమందలిదోషము. వాక్యభేదము నంగీకరించుట యన్ననో వాక్యమందలి దోషము. పదము వాక్యము ననునీరెండింటిలోఁ బదసమూహమగు వాక్యమునందు దోషము కల్పించుటకంటెఁ బదమునందే దోషమును గల్పించుట యుచితము. ఇందులకుఁ ప్రమాణముగా "గుణే త్వన్యాయ్యకల్పనా"[1] (మీ. దర్శ. అ. ౯. పా. ౩. సూ. ౧౫) అను న్యాయ మున్నదిగదా! లక్షణ నంగీకరించుటకంటె వాక్యభేదము నంగీకరించుటయే యెక్కువదోషము గనుక "జాతపుత్రః కృష్ణకేశోఽగ్నీ నాదధీత"[2] అను విధియందు 'ఆదధీత' అనుపదమునందలి ధాతువుచే, 'వసంతే బ్రాహ్మణోఽగ్నీ నాదధీత'[3] అనువాక్యమువలనఁ బ్రాప్తమైన యగ్న్యాధానము[4] ననువదించి దాని కంగములుగా జాతపుత్రుఁడగుట,[5] కృష్ణకేశుఁ డగుట,[6] యనునీరెండును విధింపఁబడునెడ, వాక్యభేదము సంభవించు ననుభయమువలన, 'జాతపుత్రః, కృష్ణకేశః' అనునీ రెండుపదములచేతను లక్షణమూలమున 'అగ్నిహోత్రము' మొదలగు కర్మముల నాచరించుటకుఁ దగినవయస్సు బోధింపఁబడుచున్నది యని చెప్పఁబడినది. కనుక వాక్యభేదము రావలసివచ్చినపుడు, దానిని విడిచి లక్షణనే యంగీకరింపవలయును. కాఁబట్టి 'సోమేన యజేత' అను నదియే యుత్పత్తివిధి కాఁదగినది గాని, 'జ్యోతిష్టోమేన...' ఈ మున్నగు వాక్యముమాత్రము కాదు. అట్లయినచో నన్వయక్లేశమును గలిగించు వాక్యభేదము సంభవించెడినిగదా!

౧. "౧౨ పేజీలో నెం ౨ రు గల టిప్పణములో నిది వివరింపఁబడి యున్నది."

౨. "పుట్టిన కుమారుఁడు గలవాఁడును నల్లని కేశము గలవాఁడును, నగువాఁడు 'ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని' అనెడు త్రేతాగ్నులను మంత్రసంస్కారములతో స్థాపించుట మూలముగా నిష్టము నుత్పాదించుకొనవలయును.

౩. బ్రాహ్మణుఁడు వసంతఋతువునందుఁ ద్రేతాగ్నులను స్థాపించుటమూలమున నిష్టము నుత్పాదించుకొనవలయును.

౪. అగ్నులను మూఁటిని మంత్రసంస్కారపూర్వకముగ స్థాపించుట.

౫. పుట్టియున్నకుమారుఁడు గలవాఁడు.

౬. నల్లని తలవెంట్రుకలుగలవాఁడు.

మఱియు 'సోమేన యజేత' అను వాక్యమునందు యజధాతువున కర్థమగు యాగము విధింపఁబడు నెడల, 'యజేత' యనెడు పదశ్రుతియొక్క యర్థము విధింపఁబడును. అట్లు కాక సోమ మనుగుణము విధింపఁబడు నెడల నన్ననో 'యజేత' యను పదశ్రుతికంటె వేఱగు సోమపదమున కర్థమైన సోమము విధింపఁబడును. పదశ్రుతియొక్క యర్థము విధింపఁబడుట సంభవించునపుడు వాక్యార్థమును విధించుట యయుక్తము. ఇందుకు "పదశ్రుతియొక్క[1] యర్థమును విధించుట సంభవించునపుడు వాక్యార్థమును విధించుట యనుచితము." అను ప్రమాణము గలదు. ఇచట వాక్యార్థ మనఁగాఁ బదశ్రుతికంటె వేఱగు పదముయొక్క యర్థము, 'జ్యోతిష్టోమేన' అను నీమున్నగు వాక్యమందును స్వర్గ మను ఫలము నుద్దేశించి యజధాతువున కర్థమగు యాగమే విధింపఁబడుటంజేసి, వాక్యార్థము విధింపఁబడుట లేదు. ఆ జ్యోతిష్టోమవాక్యము నుత్పత్తివిధిగా నంగీకరించువానిచేఁ గూడ, నచట వాక్యార్థము విధింపఁబడుటలే దని యంగీకరింపఁబడినదిగదా! కావున 'జ్యోతిష్టోమేన' ఈమున్నగువాక్య మధికారవిధియే యగుచున్నది. ఇదియునుంగాక; యేవాక్యమునందుఁ గర్మముయొక్క రూపము తెలియఁజేయఁబడునో యట్టివాక్యమందే కర్మముయొక్క స్వరూపము విధింపఁబడుచున్న దని యంగీకరింపవలెను. యాగమునకు ద్రవ్యము దేవతయు నను రెండురూపములు గలవు. ఆలోచింపఁగా, సోమయాగ మవ్యక్తము గనుక 'సోమేన యజేత' అను వాక్యమందు దేవత తెలిసికొనఁబడుట లేదు. అవ్యక్త మగుట యనఁగాఁ దనకొఱకు విధింపఁబడిన దేవత లేకుండుటయే కాని, తనయనుష్ఠానమందు దేవత యేదియు లేకుండుట కాదు. ఈసోమయాగమునందు "ఐంద్రవాయవం గృహ్ణాతి[2]" అనునీమొదలగు[3] వాక్యములచే విధింపఁబడిన యింద్రుఁడు వాయువు నను గ్రహాభిమానులగు[4] దేవతలు గలరు. ఇట్టిగ్రహములను గ్రహించుటను గోరుదేవతలచే నాయాసందర్భము ననుసరించి యాగమునకుపకారముకూడఁ జేయఁబడుచున్నదిగదా! అయినప్పటికిని 'సోమేన యజేత' అను

౧. ఎ. "వాక్యార్థవిధి రన్యాయః శ్రుత్యర్థవిధిసంభవే"

౨. ఇంద్రుఁడు వాయువు నను జంటదేవత లభిమానులుగాఁ గల గ్రహము. నధ్వర్యుఁడు గ్రహింపవలయును. గ్రహము = యజ్ఞపాత్రము.

౩. "మైత్రావరుణం గృహ్ణాతి, ఆశ్వినం గృహ్ణాతి" ఈ మొదలగునవి.

౪. పాత్రలను గోరువారు.

వాక్యమందు సోమ మను ద్రవ్యము తెలిసికొనఁబడుచునేయున్నది. ఆ ద్రవ్యము మూలముగా నైనను దేవతయొక్క స్వరూపము తెలిసికొనుటకు శక్య మగుచునే యున్నది. "జ్యోతిష్టోమేన" ఈ మున్నగువాక్యమునం దన్ననో ద్రవ్యము గాని దేవత గాని వినఁబడుట లేదు. కనుక నీ జ్యోతిష్టోమవాక్య ముత్పత్తివిధి యగునెడ, దానివలన యాగసామాన్యము[1] విధింపఁబడ కుండుటచేతను, యాగవిశేషమే[2] విధింపఁబడుటచేతను, మిక్కిలి క్లేశముతో యాగవిశేషమే తెలిసికొనఁబడుచున్నది. యాగముయొక్క సామాన్యస్వరూపము తెలిసికొనఁబడుట లేదు. కావున నీవాక్యము కర్మోత్పత్తివిధి కానేరదు.

"ఓయీ! ఇట్లయినచో 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యమందు హోమస్వరూపమగు[3] ద్రవ్యము గాని దేవత గాని వినఁబడకుండుటంజేసి యీవాక్యము హోమోత్పత్తివిధి[4] కాకపోవలసివచ్చును. అది[5] వినఁబడుటంజేసి 'దధ్నా జుహోతి' అను వాక్యమే హోమోత్పత్తివిధి కావలసివచ్చును. అట్లయినచో నేమి హాని కల దందురేని 'ఆఘారాగ్నిహోత్రాధికరణము' లో నిట్లు విరోధము సంభవించెడిని. ఆయధికరణమందు 'అగ్నిహోత్రం జుహోతి' అనువాక్యము ముత్పత్తివిధి యనియు, 'దధ్నా జుహోతి' 'పయసా జుహోతి' ఈ మున్నగునవి గుణవిధు లనియుఁ జెప్పంబడినది." అని శంకించినయెడల నీక్రిందిది సమాధానము. సరియే. ఆలోచింపఁగా 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యమందలి 'అగ్నిహోత్ర' శబ్దము ముందు వివరింపఁబోవు తత్ప్రఖ్యన్యాయముమూలముగా నిందు విధింపఁబడు హోమమునకు నామధేయ మగుచున్నది. కనుక నిచట హోమస్వరూపము తెలిసి కొనఁబడుట లేదు. అయినను నావాక్య ముత్పత్తివిధిగా నంగీకరింపఁబడుచున్నది. అట్లు కానిచో నది వ్యర్థము కావలసివచ్చునుగదా! 'దధ్నా జుహోతి' అను వాక్యము గుణవిధి గనుక దాని నుత్పత్తివిధిగా నంగీకరించినచో నట్టి వైయర్థ్యము రానేరదు. కావున 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యము కర్మోత్పత్తివిధి యగు

౧. యాగముయొక్క స్వరూపమాత్రము.

౨. ఒకానొక విధమగు యాగము.

3. కర్మముయొక్క సామాన్యస్వరూపమును బోధించు విధివాక్యము.

౪. హోమస్వరూపమును బోధించు విధివాక్యము.

౫. ద్రవ్యదేవతలలో నొకటి యగుద్రవ్యము.

టయే యుక్తము. 'జ్యోతిష్టోమేన' ఈమున్నగువాక్యము 'అధికారవిధి' యగుటయే తగియున్నది గనుక నదియును నుత్పత్తివిధి కానిచో వ్యర్థము కానేరదు. కాఁబట్టి, కర్మస్వరూపమగు ద్రవ్యదేవతలలో నొకదానినైనఁ దెలియఁజేయు 'సోమేన యజేత' అనునట్టి వాక్యమందుఁ గర్మమును విధించుట సంభవించుచుండఁగాఁ, గర్మస్వరూపమును బోధింపని 'జ్యోతిష్టోమేన' ఈమున్నగువాక్యమం దట్టికర్మమును విధించుట యేల యంగీకరింపవలయును?

ఇదియునుంగాక 'దధ్నా జుహోతి' అను వాక్యము కర్మోత్పత్తివిధి యగు పక్షమున దానిచేఁ బ్రాప్తించిన హోమమును 'పయసా జుహోతి' అనెడు వాక్యము నందలి 'జుహోతి' అను పదమునందుండు ధాతువుచే ననువదించి, దాని కంగముగా 'పయస్సు' (క్షీరము) అనెడిగుణ మావాక్యముచే విధింపఁబడ శక్యము కాదు. ఉత్పత్తి[1] శిష్టమగు దధి యనుగుణ మింతకుముందే హోమము నుద్దేశించి విధింపఁబడినది గదా! కర్మ మొక యుత్పత్తిశిష్టగుణముచే నియమింపఁబడి యుండఁగా, నా కర్మమునే యుద్దేశించి వేఱొకగుణము విధింపఁబడఁగూడదు. కర్మమున కేదే నొక గుణమునుగూర్చి కలుగు నాకాంక్ష యుత్పత్తిశిష్టగుణము మూలముగానే నివర్తించు చున్నదిగదా! కనుక 'పయసా జుహోతి' అను వాక్యముచే 'పయోవిశిష్ట'[2] మగు వేఱొకకర్మము విధింపఁబడవలసి యుండును. అట్లయినచో నీవాక్యములచే విధింపఁబడు కర్మములలో నొక్కొకదానికే యొక్కొకయదృష్టము కల్పింపవలసి యుండుటం జేసి, యనేకాదృష్టములను గల్పింపవలసిన క్లేశము తటస్థించును. అట్లు కాక 'అగ్నిహోత్రం జుహోతి' అనువాక్యము నుత్పత్తివిధిగా నంగీకరించుపక్షమం దన్ననో, యీ వాక్యముచే విహితమగు హోమమను కర్మమునకు ద్రవ్య మేది యని యాకాంక్ష కలుగఁగా, 'ఖలే కపోత న్యాయము'[3] ననుసరించి 'దధ్నా జుహోతి'

౧. కర్మస్వరూపము నుత్పాదించు (తెలుపునట్టి) వాక్యమునందు గుణముగా విధింపఁబడినది. ఇట్లే కర్మమున్మాత్రము వేఱొకవిధిచే విధింపఁబడఁగా దాని నుద్దేశించి వేఱొకవాక్యముచే విధింపఁబడిన గుణము 'ఉత్పన్నశిష్టగుణము.'

౨. క్షీరముతోఁ గూడినది.

3. ఖల మనఁగా 'కళ్లము'. కపోతమనఁగా 'గువ్వ.' 'ఖలే కపోత న్యాయము' అను దాని కీ క్రిందిది యర్థము. పై నెగురుచున్న యనేకములగు గువ్వలు, క్రింద కళ్లములో నచ్చటచ్చటఁ జెదరిపడియున్న ధాన్యపుగింజలను జూచి, వానిలో నవి యొండొంటి సహాయము నపేక్షింపకయే, యా గింజలను దినుటకై, యవి యన్నియు నొకచేసారి వ్రాలును. కర్మ మొదలగు కారకము లన్నియుఁ

'పయసా జుహోతి' ఈమున్నగు వాక్యములచే దధి, పయస్సు మొదలగు ననేక గుణము లొకటేసారి యుత్పన్నశిష్టగుణములై విధింపఁబడుచున్నవి. కనుక నిచట ననేకాదృష్టములను గల్పించు క్లేశము కలుగదు. కాఁబట్టి 'అగ్నిహోత్రం జుహోతి' అనువాక్య ముత్పత్తివిధియు, 'పయసా జుహోతి' ఈమున్నగువాక్యములు గుణవిధులును నగుట యుక్తము. కర్మస్వరూపమును దెలియఁజేయు 'సోమేన యజేత' అను వాక్యమందుఁ గర్మోత్పత్తి విధింపఁబడుచున్న దని యంగీకరించుపక్షమునందు దోషమేమియు లేదు. ఈ 'సోమేన యజేత' అనువాక్య ముత్పత్తివిధి యైనను గుణవిధి యైనను రెండుపక్షములందును నొకటేయదృష్టమును గల్పించుట సమానముగానే యున్నది. కాఁగా 'సోమేన యజేత' అనువాక్యమే యుత్పత్తివిధి యగుట యుక్తము. ఇంతటితో విధిని నిరూపించుసందర్భమునఁ జేయవలసివచ్చినవిచారమును జాలింతము. ప్రస్తుతము ననుసరింతము. కాఁగా; 'విధి, వేఱొకవాక్యముచేఁ బ్రాప్తింపనికర్మమును నేదే నొకప్రయోజనమును సాధింపఁగలదానినిగా విధించుచున్నది' అని సిద్ధించును.

అట్టివిధి 'ఉత్పత్తివిధి, వినియోగవిధి, ప్రయోగవిధి, అధికారవిధి' అని నాలుగు విధములు గలదు.

## ఉత్పత్తివిధి విచారము

వానిలోఁ బ్రమాణాంతరముచేఁ బ్రాప్తింపని కర్మముయొక్క స్వరూపమును మాత్రము బోధించువిధి 'ఉత్పత్తివిధి' అనఁబడును. ఉదా. 'అగ్నిహోత్రం జుహోతి[౧]' అనునిట్టిది. ఈవిధియందలి ధాతువున కర్థమగు హోమమనుకర్మము భావనయందుఁ[౨] గరణముగానే యన్వయించుచున్నది. కావున నీవిధినుండి 'అగ్నిహోత్రమను హోమము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలసినది' అన నర్థ మేర్పడుచున్నది. కాని ధాత్వర్థమగు హోమమును సాధ్యముగా నన్వయించుటచేఁ

దములో నొండొంటితో, విశేషణ విశేష్యభావమును బొందనివై, యన్నియుఁ గలసి, యొకటేసారి, యొకక్రియయం దన్వయించును. ఇట్లనేకపదార్థము లొండొంటితో విశేషణ విశేష్యభావము మున్నగు నెట్టిసంబంధమును బొందనివై, యొకటేసాగి, యొకకార్యమునుగూర్చి ప్రవర్తించి దానిని సాధించును.' అనునది 'ఖలేకపోతన్యాయ' మని చెప్పఁబడుచున్నది.—ఈ న్యాయము, అలంకారసర్వస్వము, కువలయానందము, జైమిని న్యాయసూత్రములం దుదాహరింపఁబడినది.

౧. అగ్నిహోత్ర మనుహోమము నాచరించుటచే నిష్టము నుత్పాదింపవలయును.

౨. అర్థభావన, = ఇష్టభావన, = ఫలభావన.

గలుగు 'హోమము నాచరించునది' అనునర్థ మేర్పడుటలేదు. అట్లు హోమమును సాధ్యముగా నన్వయించినచో నొకసాధ్యమునకు మఱియొక సాధ్యముతో నన్వయము కుదురకపోవుటంజేసి, 'అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః' అనునధికార విధిచేఁ దెలియఁజేయఁబడు 'కర్మమునకు ఫలముతోఁగల సంబంధము సిద్ధింపక పోయెడిని. ఆ హోమ మనుకర్మము భావనయందుఁ గరణముగా నన్వయించుపక్షమం దన్ననో, 'హోమముచే నిష్టము నుత్పాదించుకొనవలయును' అనునర్థ మేర్పడఁగా, నట్టియిష్ట మేది? యని యాకాంక్ష కలుగ, నధికారవిధిచేఁ దెలియఁజేయఁబడు 'హోమము స్వర్గమనెడు ఫలవిశేషముతో సంబంధించును అను నర్థము సిద్ధించును.

ఉత్పత్తివిధియం దిష్టమును బోధించుపద మేదియు లేకుండుటంజేసి, ధాత్వర్థ మగు కర్మము నాచరించుటచే నిష్టము నుత్పాదింపవలయు ననునర్థ మావాక్యము నుండి యెట్లేర్పడును? అని ప్రశ్నింపవలదు. విధిని బోధించునదియు 'యజేత' పదమునం దుండునదియు నగు 'త' ప్రత్యయమనెడు శ్రుతియే యర్థాపత్తిప్రమాణము మూలముగా నిష్టమును బోధించుచున్నది గదా! ఆ శ్రుతి, పురుషుని బురుషార్థము నుద్దేశించి ప్రవర్తింపఁజేయుచుఁ గర్మమునకు ఫలముతో సంబధ మున్నదనిమాత్రము బోధించుచున్నది. కావున నుత్పత్తివిధియం దుండు భావనయందుఁ గర్మము కరణముగా నన్వయించుట యుక్తము.

పయిని వివరింపఁబడినరీతిని గర్మము కరణముగా నన్వయించు నని యంగీకరించుటచేతనే 'ఉద్భిదా యజేత పశుకామః'[1] అను వాక్యమందు. 'ఉద్భిదా' (= ఉద్భిత్తుచేత) అనుశబ్దము తృతీయావిభక్తి నంతమందుఁ గలిగియుండుట తగియున్నది. ఈ వాక్యమునకు 'ఉద్భిదా యాగేన ఇష్టం భావయేత్.'[2] అను నన్వయము గుదురుచున్నదిగదా! ఎవరిమతమందు[3] లిఙ్ప్రత్యయమున కర్థ 'మిష్టమును సాధించుట' అనునది యగుచున్నదో వారిమతమందుఁగూడఁ దృతీయాప్రత్యయము లంతమందుఁ గలవియుఁ, గర్మములకు నామధేయము లైనవియు నగుపదముల కన్వయము

౧. పశువులను గోరువాఁడు ఉద్భిత్తను పేరుగల యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.

౨. ఉద్భిత్తను పేరుగల యాగముచే నిష్టము నుత్పాదింపవలయును.

3. మండనమిశ్రుఁడు మొదలగు మీమాంసకుల యొక్కయు వైయాకరణుల యొక్కయు మతము.

కుదురనేకుదురదు. ఈ వాక్యమందు ‘యాగః[1] ఇష్టసాధనం ఉద్భిదా’ అని యన్వయము కుదురదు గనుక సరియైనయర్థ మేర్పడదు. తృతీయావిభక్తి యంతమందుఁ గలదియు లింగముతోను సంఖ్యతోను నన్వయింపఁ దగనిదియు నగు (ఉద్భిదా అను) కారకము క్రియతోనే యన్వయింపనగును గదా!

“ఓయీ? నీమతమునందుఁగూడ ‘అగ్నిహోత్రం జుహోతి’ ఈ మున్నగు కర్మోత్పత్తివిధులయందు ద్వితీయాప్రత్యయ మంతమందుఁ గలవియుఁ, గర్మములకు నామధేయము లైనవియు నగుపదముల కన్వయము తగదు. ఈ వాక్యమందు ‘హోమేన భావయేత్ అగ్నిహోత్రమ్’ అని యన్వయము సంభవింపకుండుటంజేసి సరియైనయర్థ మేర్పడదుగదా! ఇట్లు కలిగినశంక కీక్రిందిది సమాధానము. సరియే. ఈ విధియందలి ‘అగ్నిహోత్రమ్’ అను పదమందు వినఁబడు ద్వితీయావిభక్తి ప్రత్యయము ‘అర్థాపత్తిప్రమాణము’చే సిద్ధించు సాధ్యత్వము[2] ననువదించుచున్నది. హోమము భావనయందుఁ గరణముగా నన్వయించును గనుకను, సాధింపఁబడనిది కరణము కానేరదు గనుకను, నా ‘అగ్నిహోత్రం’ అను పదమందలి ద్వితీయావిభక్తి ప్రత్యయ మన్వయించునపుడు, ‘సక్తూన్ జుహోతి’ అను వాక్యమందలి ‘సక్తూన్’ అను పదమునందుండు ద్వితీయావిభక్తి ప్రత్యయమువలెఁ, దృతీయావిభక్తి యర్థమును లక్షణామూలముగా బోధించుచు, ‘అగ్నిహోత్రేణ హోమేన ఇష్టం భావయేత్’=అగ్నిహోత్ర మనుపేరు గల హోమముచే నిష్టము నుత్పాదింపవలయును, అనునర్థమును సిద్ధింపఁజేయుచున్న దని పార్థసారథిమిశ్రులచేఁ జెప్పఁబడినది. కావున ద్వితీయావిభక్తి ప్రత్యయ మంతమందుఁ గలవియుఁ గర్మములకు నామధేయము లైనవియు నగుపదముల కన్వయము తగియుండకపోలేదు. కాఁగా, నుత్పత్తివిధియందు, ధాతువున కర్థమగు కర్మము భావనయందుఁ గరణముగా నన్వయించు ననునర్థము సిద్ధించుచున్నది.

## వినియోగవిధివిచారము

అంగములకును ప్రధానమునకును గల సాధ్యసాధనభావ[3] మను సంబంధమును బోధించువిధి వినియోగవిధి యనఁబడుచున్నది. ఉదా. దధ్నా జుహోతి[4]

౧. ఉద్భిత్తుచే యాగము ఇష్టమును సాధించును. ౨. సాధ్య మగుట.

౩. సాధన మగు నొకదానిచే మఱియొకటి సాధింపఁబడుట. ఇచ్చట నంగములనెడు సాధనములచే నంగి యగు ప్రధానము సాధ్య మగుచున్నది. ఈసంబంధమే ‘అంగాంగిభావము’ అనికూడ వ్యవహరింపఁబడుచున్నది. ౪. పెరుఁగుతో హోమము చేయుటచే నిష్టము నుత్పాదించుకొనునది.

ఈ విధివాక్యము ' దధ్నా ' అను పదమునందలి తృతీయావిభక్తిచే సాధనరూపమగు నంగ మని తెలియఁజేయఁబడిన దధికి, సాధ్యమగు హోమముతోఁగల సాధ్యసాధన భావమను సంబంధ ముండవలసిన దని విధించుచున్నది. ఈ విధివాక్యమునుండి ' పెరుఁగుతో హోమమును జేయునది ' అని యర్థము సిద్ధించుచున్నది గదా! గుణ విధియందలి భావనయందు ధాతువున కర్థమగు కర్మను సాధ్యముగా నన్వయించును. ఒకానొకచోట ధాత్వర్థ మాశ్రయముగాఁ గూడ నన్వయించును. ఉదా. 'దధ్నేంద్రియ కామస్య జుహుయాత్ '[౧] అను విధినుండి ' దధియం దుండు కరణత్వము మూలముగా నింద్రియము నుత్పాదించునది ' అని యర్థ మేర్పడుచున్నది. అట్టి దధియం దుండుకరణత్వము దేని నాశ్రయించి యుండవలసిన దని యాకాంక్ష కలుగఁగా, విధివాక్యమునందు ' దధ్నా ' అనుపదమునకు దగ్గఱనుండు ధాత్వర్థమగు హోమ మాశ్రయముగా నన్వయించుచున్నది. కావున నీవిధివాక్యమునుండి 'హోమము నాశ్రయించిన దధియం దుండు కరణత్వముమూలముగా నింద్రియము నుత్పాదించునది ' అనునర్థము సిద్ధించుచున్నది.

## శ్రుతి మున్నగు నాఱు ప్రమాణములు

ఈ వినియోగవిధికి సాహాయ్యము చేయుటకు ౧. శ్రుతి, ౨. లింగము, 3. వాక్యము, ౪. ప్రకరణము, ౫. స్థానము, ౬. సమాఖ్య యను నాఱుప్రమాణములు కలవు. వీని సాహాయ్యము గలిగిన యీ వినియోగవిధిచే ' వేఱొకదాని నుద్దేశించి ప్రవర్తించినవాని ప్రయత్నముచే సాధింపఁబడుట ' యనునదియు, ' పారార్థ్యము '[౨] అను నామాంతరము గలదియు నగు అంగత్వము తెలియఁజేయఁబడుచున్నది.

## శ్రుతి యను ప్రమాణము

వానిలో శ్రుతి యనఁగా, నంగత్వమును బోధించుటకొఱకు, లింగము మున్నగు వానివలెఁ గాక, యితరప్రమాణముల యపేక్ష యేమియు లేక స్వతంత్రముగాఁ బ్రవర్తించుశబ్దము. ఆ శ్రుతి ౧. విధాత్రి ౨. అభిధాత్రి 3. వినియోక్త్రి

౧. ఇంద్రియమును గోరువాఁడు దధితో హోమము చేయుటచే నిష్టము నుత్పాదించుకొనవలెను.

౨. పర ( ఇతర ) మైనదానికొఱకగునది పరార్థము. పరార్థ మగుటయే పారార్థ్యము. కావునఁ బారార్థ్య మనఁగా నితరమైన దానినిమిత్త మగుట — అని యర్థము.

అని మూఁడు విధములు గలిగియున్నది. ౧. వానిలో మొదటిదగు విధాత్రి యను శ్రుతి, 'లిఙ్, లోట్, తవ్య,' అను ప్రత్యయముల రూపముగా నుండునది. ౨. రెండవ దగు 'అభిధాత్రి' అను శ్రుతి, 'వ్రీహిభిర్యజేత' ఈ మొదలగు విధులయందలి వ్రీహులు మున్నైనవానివిధానము ౩. వినియోక్త్రి యను శ్రుతి యనఁగా; 'ఏశబ్దమును వినుటచేతనే దాని దగ్గఱనుండు శబ్దమున కర్థమగు ద్రవ్యమునకును, దానుండు వాక్యమునందలి క్రియకునుగల సంబంధము తెలియుచున్నదో, యట్టిశబ్దము. ఆ వినియోక్త్రి యనెడు శ్రుతియు (క) విభక్తిశ్రుతి (గ) ఏకాభిధానశ్రుతి. (చ) ఏకపదశ్రుతి అని మూఁడువిధములుగా నున్నది. వానిలో విభక్తిశ్రుతి యంగమును బోధించు ననుట కుదాహరణము, 'వ్రీహిభిర్యజేత'[౧] అనునది. ఇచ్చట 'వ్రీహిభిః' అను పదమునందలి తృతీయావిభక్తి యను శ్రుతిచే, వ్రీహులు యాగమున కంగములని తెలియుచున్నది. "ఓయీ! యాగమును విధించుటమూలముగా నుత్పాదించు 'యదాగ్నేయోఽష్టాకపాలోఽమావాస్యాయాం పౌర్ణమాస్యాం చాచ్యుతో భవతి'[౨] 'తాభ్యా మేత మగ్నీషోమీయ మేకాదశకపాలం పూర్ణమాసే ప్రాయచ్ఛత్'[౩] అను నిట్టి వాక్యములయందు 'ఉత్పత్తిశిష్టము' అగు 'పురోడాశము' అను ద్రవ్యముచే యాగము నియమిత మైయుండఁగా, వాజినన్యాయముచే,[౪] వేఱొకద్రవ్య మంగము కానేరదు గనుక, నాయాగమునకు వ్రీహు లంగములుగా నెట్లు విధింపనగును?" అని శంకింపవలదు. వ్రీహులు పై నుదాహరింపఁబడిన వాక్యములం దుత్పత్తిశిష్టగుణమగు పురోడాశమున కావశ్యకమగు ద్రవ్య మగుటంజేసి, యాయాగమున కంగములు కాఁదగియున్నవి. పశువు, హృదయము మొదలైన ద్రవ్యరూపమగు

౧. వ్రీహులతో యజించుట మూలముగా నిష్టము నుత్పాదించుకొనవలయును.

౨. దీని యర్థము ౨౬ పేజిలో నెం ౧ రు టిప్పణిలో వివరింపఁబడినది.

౩. స్వర్గమును గోరువాఁడు పౌర్ణమాసియందు 'అగ్నీషోము' లనెడుజంటదేవతలకొఱకుఁ బదునొకండు ప్రమిదలందు సంస్కరింపఁబడిన పురోడాశము నిచ్చి యజించుటచే, నిష్టము నుత్పాదించుకొనవలయును.

౪. 'సా వైశ్వదేవ్యామిక్షా - వాజిభ్యో వాజినమ్' ఇచట 'సా వైశ్వదేవ్యామిక్షా' అనువాక్యముచే విధింపఁబడిన వైశ్వదేవయాగము, ఉత్పత్తిశిష్టగుణమగు నామిక్షచే, నియమితమైయుండుటంజేసి, యా యాగమునకే, వాజిన మను వేఱొకద్రవ్య మంగము కాఁగూడ దని యంగీకరింపఁబడినది. ఇట్లు ఒక యాగ ముత్పత్తిశిష్టగుణముచే నియమిత మగునపుడు, వేఱొకద్రవ్య మా యాగమున కంగము కానేర దనుటకు వాజినన్యాయ మని పేరు.

హావిస్సున కావశ్యక మగు పదార్థ మగుటచే, యాగమున కంగ మగునట్లే యిచట వ్రీహులుకూడ యాగమున కంగము లగుచున్నవి. 'అట్లయినచో, యాగమునకుఁ బశువే సాక్షాత్తుగా నంగ మేల కాఁగూడదు' అని ప్రశ్నింపవలదు. పశువును ఛేదించినపిదప, దానినుండి హృదయము మున్నగునవయవములు, యాగముకొఱకు వేఱు పఱుపఁబడుచున్నవి గదా! పురోడాశము మున్నగువానివలె యాగార్థమై వేఱుపఱుపఁ బడునదియే హావిస్సు. 'పశుశరీరముయొక్క[౧] మధ్యనుండియు, ముందటిసగభాగము నుండియుఁ గొన్ని యవయవములను, హావిస్సుకొఱకు వేఱుపఱచవలెనది' అను వాక్యమువలన, యాగముకొఱకు రాశినుండి వేఱుపఱుపఁబడినది హావిస్సని తెలియుచున్నది. 'పశుశరీరమునుండి[౨] మొదట హృదయమ్మును, యాగముకొఱకు వేఱుపఱుపవలయును.' అను వాక్యముమూలమున, హృదయము మొదలగునవయవములే వేఱుపఱుపఁదగినవి కాని, పశువు కాదు. కావున హృదయము మున్నగు నవయవములు హావిస్సు లగుచున్నవి. పశు వన్ననో, వానికి ముఖ్యాధార మగు ద్రవ్య మగుచున్నది. 'త్వాష్ట్రం పాత్నీవత మాలభేత'[౩] అనువిధిచే విహితమగు పాత్నీవత యాగమం దన్ననో, పశువునకు విశసనము[౪] లేకుండుటంజేసి, యది సాక్షాత్తుగానే యంగ మగుచున్నది. 'పర్యగ్నికృతం పాత్నీవత ముత్సృజతి'[౫] అనువిధిచే, జీవించియున్నపశువునకే యుత్సర్గము[౬] విధింపఁబడుచున్నదిగదా! ఎచటఁ బశువునకు విశసనము జరుగునో, యచట నాపశువు తనశరీరమునుండి వేఱుపఱుపఁబడు నవయవములనెడు హావిస్సునకు ముఖ్యాధారమగు ద్రవ్యమే యగుచున్నదని సిద్ధించుచున్నది. ఇట్లే వ్రీహులుకూడ, 'వ్రీహిభిర్యజేత' అను విధియందలి 'వ్రీహిభిః' అను పదమునం దుండు తృతీయావిభక్తి యనెడు శ్రుతిచేఁ, బురోడాశమను హావిస్సునకు ముఖ్యా

౧. 'మధ్యా త్పూర్వార్ధా చ్చావద్యతి'

౨. హృదయస్యాగ్రేఽవద్యతి.

౩. త్వష్టృదేవతకొఱకు 'పాత్నీవత' అనుపశువు నాలంభించి (హింసించి) యజించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.

౪. ఛేదనము.

౫. పర్యగ్నికరణమను సంస్కారముచే సంస్కరింపఁబడిన, పాత్నీవతమను పశువును, 'త్వష్టృదేవత' కొఱకుఁ ద్యజింపవలయును. పర్యగ్నికరణ మనఁగా, దర్భలకొసలను గాల్చి, పశువుచుట్టును మూఁడుమార్లు త్రిప్పుట.

౬. ఒకరికే దేవతకొఱకుఁ జేయు త్యాగము.

ధారమగు ద్రవ్య మగుటమూలముగా, యాగాంగ మగుచున్నవి. దీనిమూలముగా, ద్రవ్యము యాగాంగ మగు నని నిరూపింపఁబడినది

ఇఁక విభక్తిశ్రుతిచే, గుణము యాగాంగ మగు నని నిరూపింపఁబడును. 'అరుణయా పింగాక్ష్యా ఏకహాయన్యా గవా సోమం క్రీణాతి '[1] అను విధియందలి 'అరుణయా' అను పదమునం దుండు తృతీయావిభక్తిశ్రుతిచే, 'అరుణ' అను శబ్ద మున కర్థ మగు 'ఆరుణ్యము (ఎఱుపు) అను గుణము, సోమమును గొనుట యనెడి భావన కంగ మగుచున్నది. ఎఱు పను గుణము శరీరము లేని దగుటంజేసి, సోమ మును గొనుట కెట్లు అంగ మగును? ' అని ప్రశ్నింపవలదు. ఎఱు పనునది గుణ మైనను, నొకసంవత్సరము వయసుగల గో వను ద్రవ్యముయొక్క రంగును నిర్ణయిం చుటమూలముగా సోమమును గొనుట కంగము కాఁదగియున్నది.

ఇఁక ద్వితీయావిభక్తి యనెడుశ్రుతి యుదాహరింపఁబడుచున్నది. 'వ్రీహీన్ ప్రోక్షతి' అను విధియందలి 'వ్రీహీన్' అనెడి పదమందుండు ద్వితీయావిభక్తిశ్రుతిచే, 'ప్రోక్షణము'[2] వ్రీహుల కంగ మగుచున్నది. అట్టి ప్రోక్షణము, వ్రీహులయొక్క స్వరూపమును బుట్టింపనేరదు. వ్రీహులస్వరూపమును బుట్టించుటవిషయమై ప్రోక్షణ మేమియు నుపయోగపడదు. ప్రోక్షణము లేకున్నను, వ్రీహులస్వరూపము కుదురక పోవుట సంభవింపదుగదా! మఱి యేమన ; నీ ప్రోక్షణ మొక యపూర్వమును గలిగించుట కుపయోగపడుచున్నది. వ్రీహులయందుఁ బ్రోక్షణము చేసి, వానిచే యాగ మాచరించిన పక్షమునకే, యొక యపూర్వము కలుగును. అట్లు ప్రోక్షణమును జేయక, యాగ మాచరించినచో, నట్టి యపూర్వము సిద్ధింపదు. కాఁగా; నపూర్వముతో సంబంధించుటను దెలియంజేయు ప్రకరణ ప్రమాణము లేనిదే, శ్రుతి మున్నగు ప్రమాణములు స్వతంత్రముగా నంగములను వినియోగింపఁజేయనేరవు. కనుకఁ, బ్రకరణప్రమాణముయొక్క సాహాయ్యముగల ద్వితీయావిభక్తిశ్రుతియే, తండులములను నిర్వర్తింపఁజేయుటమూలముగా, నపూర్వమును సాధించు వ్రీహులకుఁ బ్రోక్షణ మంగ మగుచున్న దని, తెలియఁజేయుచున్నది. ఇట్లు చెప్పుటచే, నాజ్య మపూర్వసాధన మైనను, 'తండులము' లను నిర్వర్తింపఁజేయునది కాకపోవుటంజేసి, దానికిఁ బ్రోక్షణ మంగము కానేర దని, యర్థ మేర్పడుచున్నది. ఇట్లు దృష్ట మగు

౧. ఈవిధి కర్థము పూర్వము ౨౩ పేజిలో నెం ౧ రు టిప్పణిలో వివరింపఁబడినది.

౨. మంత్రము నుచ్చరించుచు జలమును జిలుకరించుట.

ప్రయోజనమును గలుగఁజేయని యంగము లన్నియు, నేదే నొక యపూర్వమును గలిగించుటచే సార్థకములు[1] లగుచున్న వని తెలిసికొనవలయును.

ద్వితీయావిభక్తిశ్రుతికే యింకొక యుదాహరణము. "ఇమా మగృభ్ణన్ రశనా మృతస్యేత్యశ్వాభిధానీ మాదత్తే[2]" అను విధియందు, 'అశ్వాభిధానీం' అనుపదమునందలి ద్వితీయావిభక్తియనెడు శ్రుతిచే, 'ఇమా మగృభ్ణన్...' అను నీ మున్నగు మంత్ర మశ్వరశన కంగమగు నని తెలియఁజేయఁబడుచున్నది. ఈవినియోగ మిచట వాక్యప్రమాణముచేఁ గలుగుచున్న దని చెప్పఁదగదు. అట్లయినచో వాక్యమునకంటె లింగము బలవత్తర[3] మగుటంజేసి, యీమంత్రము వాక్యప్రమాణముచే నశ్వరశన కంగ మగుటకు ముందుగానే లింగ మను ప్రమాణముచే నశ్వరశన గర్దభరశన యను రెండు రశనలకును నంగ మగుట సంభవించెడిని. 'స్యోనం తే సదనం కృణోమి[4]' అను మంత్రము 'సదనం కృణోమి' అను పదముయందలి స్థానమును గల్పించుట యను నర్థమును బ్రకాశింపఁజేయు సామర్థ్యమనెడి లింగముచే, స్థానమును గల్పించుట కె ట్లంగ మగుచున్నదో, యట్లే లింగముచే నీ వినియోగము సంభవించెడిని. అట్లు కాక యిచట 'అశ్వాభిధానీం' అను ద్వితీయావిభక్తిశ్రుతిచే, నీమంత్రమును వినియోగించుపక్షమం దన్ననో, లింగప్రమాణముచే నీమంత్రము రెండురశనలకు నంగ మగుటకుముందే, 'ఐంద్ర్యా గార్హపత్య ముపతిష్ఠతే' అను విధియందలి 'ఐంద్ర్యా' అను పదమందుండు తృతీయాశ్రుతిచే, ఇంద్రుఁడు దేవతగాఁ గల 'కదాచన స్తరీరసి, నేంద్ర సశ్చసిదా శుషే' అను నీ

౧. దృష్టప్రయోజనమును గలుగఁజేయు నంగములుగూడ, నేదే నొక నియమాపూర్వమును సాధింపఁగల వని తెలిసికొనవలయును.

౨. సత్యమను ఫలమును గలుగఁజేయున దగుటచే, సత్య మనఁదగిన (చయన) యాగమునకు సంబంధించు నీరశనను, (అధ్వర్యుఁడు) తీసికొనెను. రశన = త్రాడు. ఈ చయనయాగసందర్భమునందు, 'అశ్వరశన' 'గర్దభరశన' అను నీ రెండురశనలు వేదిదగ్గఱ నుంపఁబడును. వానిలో నశ్వరశనను, 'ఇమాం' అను నీమున్నగు పైమంత్రముతోను గర్దభరశనను మంత్రము నుచ్చరింపకయుఁ, దీసికొనవలయును. చయనయాగమందు, ఉఖయనెడు కుండమును నిర్మించుటకుఁ గావలసినమట్టిని దీయుప్రదేశమున కొకగుఱ్ఱమును దీసికొనిపోయి, దానిచే నా ప్రదేశమును ద్రొక్కించి, పిదప నచటిమట్టి త్రవ్వి, యొకగాడిదపై వేసి తీసికొని వత్తురు.

3. ఎక్కువబలము గలది.

४. నీకొఱకు సుఖకరమగు స్థానమును గల్పించుచున్నాను.

మున్నగు బుక్కు గార్హపత్యమున కంగమగునట్లు, 'ఇమామగృభ్ణ' ఈమున్నగు మంత్ర మశ్వరశన కంగముగా వినియోగించుచున్నది. కావున, నీమంత్ర మశ్వరశన కంగ మగుటయే యుక్తము. కాబట్టి. యీ వినియోగము శ్రుతిప్రమాణముచేతనే సిద్ధించుచున్నది.

సప్తమీవిభక్తిశ్రుతి కుదాహరణము — 'యదాహవనీయే జుహోతి'[1] అను విధివాక్యమునందు 'ఆహవనీయే' అనెడి పదమునందలి సప్తమీవిభక్తి యనెడు శ్రుతిచే; 'ఆహవనీయము' హోమమున కంగ మని తెలియుచున్నది. ఇట్లే యితర స్థలములయందుఁగూడ విభక్తి యనెడు శ్రుతిచే నంగము నిరూపింపఁబడు నని తెలియుచున్నది.

ఏకాభిధానశ్రుతి కుదాహరణము:—"పశునా యజేత" అను వాక్యమందు 'పశునా' ( = పశువుచేత ) అను పదమునందలి తృతీయాశ్రుతి, పశువునందుండు నేకత్వము, పుంస్త్వము, నను నీరెండింటికిని సమానాభిధాన మగుచున్నది గాన, నిచట నేకాభిధానశ్రుతిచే, నీరెండును బశు వనుకారకమున కంగము లని తెలియుచున్నది. 'యజేత' అనుపదమునందలి 'త' ప్రత్యయమనెడు నాఖ్యాతముచేఁ దెలుపఁబడినసంఖ్య, ఆ 'త' ప్రత్యయముచేతనే, లిఙ్త్వముమూలముగా, భావన కూడఁ దెలియఁజేయఁబడును గావున, సమానాభిధాన ( = ఏకాభిధాన ) శ్రుతిచే భావనకును, నదేపదమునందలి 'యజ్' ధాతువుచే యాగము తెలుపంబడును గావున, ఏకపదశ్రుతిచే యాగమునకును నంగ మగుచున్నది. 'సంఖ్య యాకారముగల ద్రవ్యము కాదు గనుక, నది యెట్లు భావన కంగ మగును?' అని శంకింపరాదు. సంఖ్య భావనయొక్క కర్తను నిర్ణయించుటమూలముగా, నాభావన కంగము కాఁగలదుగదా! భావనకుఁ గర్త కలఁ డని యర్థాపత్తిప్రమాణముచేఁ గాని, యనుమానప్రమాణముచేఁ గాని, నిర్ణయింపఁదగును.

ఆఖ్యాతముచేత, 'కర్తృవ్యాపార' మైన యర్థభావన చెప్పఁబడుచున్నది. అట్టిభావన కర్త లేనిదే సిద్ధింపనిదై, మీఁద నుదాహరింపఁబడిన ఆక్షేప మను ప్రమాణముచేఁ, గర్త కలఁ డని తెలియఁజేయుచున్నది.

"ఓయీ! భావనచే నర్థాపత్తిప్రమాణము మూలముగాఁ గర్త లభించుచున్నాఁ డనియే యేల చెప్పవలెను? కర్త యాఖ్యాతముచే శక్తిమూలముగానే,

౧. ఆహవనీయ మను నగ్నియందు హోమము చేయవలయు ననునది.

తెలియఁజేయఁబడుచున్నాఁడని యేల చెప్పరాదు? ఆఖ్యాతము వినినతోడనే భావనవలెఁ గర్తకూడఁ దెలియఁజేయఁబడుచున్నాఁడు. కర్త భావనచేతనే యాక్షేపప్రమాణమూలముగా[౧] సిద్ధించుచుండఁగా, ఆఖ్యాతమునకుఁ గర్తయందు శక్తిని గల్పించుట యెట్లు తగియున్నది? అని ప్రశ్నింపరాదు. అట్లయినచో ఆఖ్యాతమునకు వాచ్యమయిన[౨] కర్తచేతనే, యాక్షేప ప్రమాణముమూలముగా, భావన సిద్ధించుచుండఁగా నాఖ్యాతమునకు భావనయందు శక్తిని గల్పించుట యనావశ్యక మగును. కావున నితర కారకములకంటెఁ గర్తయందు విశేష మేమియు లేకుండుటంజేసి, భావన యతిశీఘ్రముగాఁ గర్తనే యర్థాపత్తిప్రమాణముమూలముగాఁ దెలియఁజేయనేరదు. కర్త యన్ననో భావనతోనేకాని యితరకారకములతో సంబంధించియుండలేదు. 'గుణము[3] లితరము లగువాని కంగము లగుటంజేసియుఁ, దా మొండొంటితో సమానము లగుటంజేసియుఁ బరస్పరసంబంధము గలిగి యుండవు.' అను న్యాయమున్నది గదా! కావునఁ గర్త వేగముతో నర్థాపత్తి ప్రమాణముమూలముగా భావనను దెలియఁజేయఁగలఁడు. కావునఁ గర్తయే యాఖ్యాతమునకు వాచ్యుఁడగుచున్నాఁడు. భావన యన్ననో, యా కర్తచే నాక్షేపప్రమాణముమూలముగా నేల లభింపఁగూడదు? ఇంతేకాక, భావనయే యాఖ్యాతమునకు వాచ్య మని చెప్పినచో నితరకారకములుకూడఁ గర్తవలె, భావనచే నాక్షేపప్రమాణముమూలముగా సిద్ధింపఁగలవు గావునఁ దృతీయ మున్నగు విభక్తులకుఁ గరణము మున్నగునవి వాచ్యము లగుట సిద్ధింపకపోయెడిని.

'భావననుండి కర్త నియతముగా నర్థాపత్తిప్రమాణముమూలముగాఁ దెలియఁజేయఁబడుచున్నది గాని, యితర కారకములట్లు నియతముగాఁ దెలియఁజేయఁబడుట లేదు. కావునఁ గర్త యట్లు దెలియఁజేయఁబడుచుండఁగా, ఆఖ్యాతమునకుఁ గర్తయందు శక్తి నంగీకరించు నావశ్యకత లేదు' అని శంకింపఁదగదు. కర్త యాఖ్యాతమునకు వాచ్యుఁడు కానియెడల, నాఖ్యాతముచే

౧ అర్థాపత్తిప్రమాణము.

౨. వాచ్యము = శక్యము. = అభిధేయము = శక్తిమూలముగాఁ దెలియఁజేయఁబడునది.

3. "గుణానాంచ పరార్థత్వాత్, అసంబంధస్సమత్వాత్ స్యాత్" జై. సూ. 3-౧-౨౨.

౮. "నహి శాబ్దమశాబ్దేనాన్వేతి"

వాచ్యమగు నేకత్వము, వాచ్యము కాని కర్తతో నెట్లన్వయింపనగును? ఒక శబ్దమునకు[౧] వాచ్య మగునది, యేదే నొకశబ్దమున కైన వాచ్యము కానిదానితో నన్వయించుట తగదుగదా! అట్లు కాక, యొకశబ్దమునకు వాచ్య మగునది, దేనికైన వాచ్యము కానిదానితో నన్వయించెడిపక్షమందు, ఊహా,[౨] పదాధ్యాహారము[౩] మొదలగునవి చేయ నావశ్యకత యుండకపోయెడిని. వికృతియందుఁ బ్రయోగింపవలసిన మంత్రమందుండు 'నిర్వపతి' యనుపదమున కర్థమగు శాబ్దము[౪] ఆమంత్రమందు 'సౌర్య' అనెడిపదము లేకుండుటచే, దాని కర్థమగు నశాబ్దముతో,[౫] 'సౌర్యం చరుం నిర్వపతి' (సూర్యదేవతకొఱకు నుద్దిష్ట మగుచరువు (అన్నము) ను వేఱుపఱచునది.) అని యన్వయించునెడ, ఆమంత్రమందు 'సౌర్య' అనెడు పదమును జేర్చుట యనెడు నూహా, చేయకపోవలసివచ్చును. ఇట్లే మంత్రమందుండు 'ఇషే త్వా' పదముల కర్థమగు శాబ్దము, మంత్రమందు లేని 'ఆచ్ఛినద్మి' అనెడిపదమున కర్థ మగు, నశాబ్దముతో నన్వయించెడిపక్షమందు, అర్థసంపూర్తికై యామంత్రమునందు, 'ఇషే త్వా' అనెడిపదములకుఁ దరువాత 'ఆచ్ఛినద్మి' అనుపదమును జేర్చి పలుకుట యనెడి పదాధ్యాహారము, చేయకపోవలసివచ్చును. ఇంతే కాక, యాఖ్యాతమునకుఁ గర్త వాచ్యము కానియెడల, 'దేవదత్తః పచతి' (= దేవదత్తుఁడు వండుచున్నాఁడు.)

౧. ప్రకృతియందు విహితములగు మంత్రములను, వికృతియం దుపయోగింపవలసినపుడు, వికృతికి సంబంధించుపదార్థములను బ్రకాశింపఁజేయుటకొఱకు, మంత్రమందుండు ప్రకృతికి సంబంధించుపదములను గొన్నిటిని దీసివేసి, వానిస్థానమునందు, వికృతికి సంబంధించు వేఱుపదముల నుంచుట, యూహ యనఁబడుచున్నది. ఉదా. ప్రకృతియగు దర్శేష్టియందలి 'అగ్నయే జుష్టం నిర్వపామి' అను మంత్రము, నతిదేశముచే వికృతియగు సౌర్యేష్టియందు వినియోగించునపుడు, ఆ మంత్రమందుండు 'అగ్ని' అను పదమును దీసివేసి, దానిస్థానమునందు 'సౌర్య' అనుపదము నుంచి, 'సౌర్యం చరుం నిర్వపతి' అని వినియోగించుట. అతిదేశ మనఁగా 'ప్రకృతివలెనే వికృతిని నాచరించుట.'

౨. దర్శేష్టికిఁ బూర్వదినమునందు, వత్సాపాకరణముకొఱకుఁ బలాశశాఖను ఛేదించునపుడు, 'ఇషే త్వా' అను మంత్రమును వినియోగింపవలసి యుండఁగా, 'ఇషే త్వా' అను పదములకుఁ దరువాత, 'ఆచ్ఛినద్మి' (= నఱకుచున్నాను.) అనుపదమును జేర్చి, యామంత్ర ముచ్చరింపఁబడుచున్నది. ఇట్లు మంత్రమందు లేనిపదముల, నావశ్యక మగునర్థము స్పష్టపఱచుటకొఱకుఁ, జేర్చి పలుకుటయే 'అధ్యాహారము.'

౩. శాబ్దము = వాక్యమునందుండు శబ్దములనుండి తెలిసికొనఁబడునర్థము.

౪. అశాబ్దము = వాక్యమునందు లేక, యన్వయముకొఱకుఁ జేర్పఁబడు పదములనుండి తెలిసికొనఁబడునర్థము.

అనువాక్యమందు దేవదత్త పదమునకును, 'పచతి' అనుపదమునందలి 'తి' అను నాఖ్యాతమునకును, సామానాధికరణ్యము (= ఒకటే యర్థము విషయముగాఁ గల బుద్ధిని గలిగించుట కుదురకపోయెడిని. భావనమాత్రమే శక్తిమూలముగా బోధించు నాఖ్యాతమునకు, దేవదత్తపదముతో సామానాధికరణ్యము కుదుర నేరదు. అవి రెండును నొకయర్థమునే బోధించుటలేదు గదా! ఆఖ్యాతమునకుఁ గర్త వాచ్య మగు పక్షమందన్ననో, యట్టి సామానాధికరణ్యము తప్పక కుదురును. ఆఖ్యాతమునకుఁ గర్త వాచ్యము కానిచో, 'లః కర్మణి' అను నీమున్నగు వ్యాకరణ సూత్రముతో విరోధము సంభవించెడిని. ఈసూత్రమునకు, 'సకర్మక ధాతువునకంటె, లకారములు, కర్తనుగాని, కర్మనుగాని, బోధించుచువచ్చును. అకర్మకధాతువుకంటె, లకారములు, కర్తను, భావమును బోధించుచు వచ్చును' అనునది యర్థము. ఈ పాణినిసూత్రమందలి 'ధాతువుకంటె లకారములు కర్తను బోధించుచు వచ్చును' అను నంశ మావశ్యక మగుటచే నిచటఁ బ్రమాణముగా నిర్దేశింపఁబడినది. కావున లకారమగు నాఖ్యాతముచేఁ గర్త వాచ్యము కానియెడల నీ వ్యాకరణస్మృతితో విరోధము తప్పక సంభవించెడిని.

౧. ఇచట నిటు గ్రహింపవలయును: గోత్వము, ఆరుణ్యము, నను జాతిగుణములు వ్యక్తిని దప్పక యాశ్రయించి యుండి, వ్యక్తివిషయకముగ బోధను గలిగించుచుండుటంజేసి, ఆకృత్యధికరణన్యాయముచే గోశబ్దమునకు నీజాతిగుణములందు శక్తి సిద్ధించుచున్నది. ఇట్లుండఁగా, అభేదోపచారమువలన, నాశబ్దము లక్షణమూలముగ వ్యక్తిని బోధించుట సిద్ధించుచున్నది. భావన యన్ననో వ్యాపార మగుటచే నచేతనమగు దేహము నాశ్రయించి యుండుటంజేసి, దేహగేహులకు నభేదోపచారమునే, దేహియగు నాత్మ నాశ్రయించి యుండునేకాని, ఆత్మను సాక్షాత్తుగా నాశ్రయించి యుండదు. దేహ మచేతనమును, నస్వతంత్రమును నగుటచేఁ గర్త కానేరదు గనుకను, ఆత్మయే కర్త కాఁగలదు గనుకను, కావుననే, కర్త కాఁదగు, అనురక్తత్వాది ధర్మములతోఁ గూడిన యాత్మకును దేహమునకును నభేదోపచార ముండనేరదు—కనుకనే 'దండో దేవదత్తః' అను వాక్యమందు 'దండ' 'దేవదత్త' పదములకు సామానాధికరణ్యము గాని, [illegible] శబ్దము, లక్షణామూలముగ [illegible] బోధించుట గాని, సిద్ధింపవట్లు [illegible] ఖ్యాతము, కర్తను లక్షణామూలముగా [illegible] బోధించు [illegible] వనువర్థము, 'భావనమాత్రము' అను [illegible]లి 'మాత్రము' అనుపదముచే, [illegible] ముగాఁ దెలియఁజేయఁబడుచున్నది. ఆకృత్యధికరణన్యాయము = ఇది ప్రథమాధ్యాయపు తృతీయపాదమునందలి యంతిమాధికరణము. ఈయధికరణము నందు, బహుమన కర్థ మాకృతియా? వ్యక్తియా? యని విచారించి 'విశేష్యమును గ్రహింపనిచో, [illegible] శేషముతోఁ గూడిన విశేష్యము గ్రహింపఁబడనేరదు' అను న్యాయము నిర్ణయింపఁబడినది. అభేదోపచారము = రెండు వస్తువులకు వాస్తవముగా భేద మున్నను, నవి యొండొంటిని వదలకుండుటం జేసి, యారెండును నొకటియే యని యూహించుట.

౨. 'లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః' అను పాణినిసూత్రమున కర్థము.

ఇదియునుంగాక, ఆఖ్యాతమునకుఁ గర్త వాచ్యము కానియెడల, 'దేవదత్తేన పచతి' (= దేవదత్తునిచే వంటచున్నాఁడు) అను ప్రయోగము సరియగునది కావలసి వచ్చును. పాణిని వ్యాకరణమందు 'అనభిహితే' అను నధికారసూత్రమునకు సంబంధించి, 'కర్తృకరణయో స్తృతీయా' అను సూత్ర ముండుటచే, ఆఖ్యాతమునకు వాచ్యముకాని కర్తను గాని, కరణమును గాని, బోధించుటకై తృతీయావిభక్తి విధింపఁబడుచున్నది. ఈ వాక్యమందు 'పచతి' అను పదమందలి 'తి' ప్రత్యయమును నాఖ్యాతమునకుఁ గర్త వాచ్యము కాకుండుటంజేసి, దేవదత్తపదమునకుఁ గర్తను బోధించు తృతీయావిభక్తి చేర్పఁబడి 'దేవదత్తేన పచతి' అను ప్రయోగము సంభవింపఁడిని. ఆఖ్యాతమునకుఁ గర్త వాచ్య మగుపక్షమం దన్ననో, కర్త యభిహిత[1] మగుటంజేసి, తృతీయావిభక్తి 'అనభిహితే' అను నధికార సూత్రమునకు సంబంధించి విధింపఁబడుచున్నది గనుక, నిచట దేవదత్త పదమునకంటె, నది (తృతీయ) రానేరదు. దేవదత్తపదముకంటెఁ బ్రథమావిభక్తియే వచ్చి, 'దేవదత్తః పచతి' అనెడు ప్రయోగము సిద్ధించును. ప్రథమావిభక్తి, దేనిచేతనైన నభిహితము లగు కర్తృకర్మకారకములతో నభేదాన్వయమును బోధించు విభక్తియుఁ, బ్రాతిపదికముయొక్క యర్థమునుమాత్రము బోధించునదియు నగుచున్నది గదా! అర్థము ప్రాతిపదికముచేతనే తెలియంజేయఁబడుటంజేసి, దానికొఱకే ప్రథమావిభక్తిని జేర్చుట వ్యర్థమే యని శంకింపవలదు. ఈ యర్థమందుండు లింగము, సంఖ్య యను వానిని దెలియంజేయుటకుఁ, బ్రథమావిభక్తి యావశ్యక మగుచున్నది. 'ఉచ్చైః' 'నీచైః' మొదలగు నలింగములయందును, 'మిత్రమ్' మొదలగు నియతలింగముల యందును, బ్రథమావిభక్తి ప్రాతిపదికముయొక్క యర్థమునుమాత్రమే బోధించు చుండుటంజేసి, యది (ప్రథమ) యెల్లపుడును లింగసంఖ్యలను బోధించుట సంభవింపదే యని శంకింపవలదు. 'న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా నాపి ప్రత్యయః' (కేవల ప్రకృతిని గాని, కేవల ప్రత్యయమును గాని ప్రయోగింపరాదు) అను న్యాయమునుబట్టి కేవల ప్రాతిపదికమును ప్రయోగించుట సరికాదు. కనుక దానికంటెఁ బ్రథమావిభక్తి వచ్చును. కాఁబట్టి, యాఖ్యాతమునకుఁ గర్త వాచ్యము కానిచో 'దేవదత్తేన పచతి' అను ప్రయోగము తప్పక సంభవించెడిని. కాఁగా, నాఖ్యాతమునకుఁ గర్త వాచ్యము, అని సిద్ధించుచున్నది." అని యిట్లు కలిగిన పూర్వపక్షమునకీ క్రిందిది సిద్ధాంతము.

౧. అభిహితము = వాచ్యము.

ఒకశబ్దముచే ననేకములగు నర్థములు తెలియఁజేయఁబడు చుండఁగా, వానిలో నేది శక్తిద్వారమునఁ గాక, వేఱుమార్గమునఁ దెలియఁజేయఁబడదో, యదియే యా శబ్దమునకు వాచ్యార్థ[1] మగుచున్నది. అనున్యాయము[2] ననుసరించి, శక్తిమూలమునఁ గాక, వేఱొకప్రకారముగా లభింపనిదియే, శబ్దమునకు వాచ్యార్థ మగుచున్నది. కావుననే 'గంగాయాం[3] ఘోషః' అనువాక్యమునందలి 'గంగా' పదముచేఁ, దీర మనునర్థము లక్షణమూలముననే బోధింపఁబడుచుండుటంజేసి, యాయర్థము గంగాపదమునకు వాచ్యార్థము కానేరదు. కనుకనే వాక్యముచే శక్తిమూలమునఁ గాక, వేఱొకరీతిని వాక్యార్థము తెలియఁజేయఁబడు చుండుటంబట్టి, వాక్యమునకు, వాక్యార్థమునందు శక్తి[4] లేదు. కాఁగా, 'ఆఖ్యాతము' చేత, భావన, కర్త, కర్తయందలిసంఖ్య, పురుషుఁడు, కాలవిశేషము నను ననేకార్థములు తెలియఁజేయఁబడు చుండఁగా, నాఖ్యాతమునకు వాచ్యమగు భావన, కర్త లేకుండ సిద్ధింపనిదై, కర్తను 'ఆక్షేపప్రమాణము' మూలముగానే బోధించుట సంభవింపఁగా, నాఖ్యాతము శక్తిమూలముగానే కర్తను బోధించు నని యేల యంగీకరింపవలయును? ఆఖ్యాతమునకు భావనయందే శక్తిని గల్పించుటకుఁ బ్రమాణ మేమియు లేనంగన, దానికిఁ (ఆఖ్యాతమునకు) గర్తయందే శక్తి నంగీకరించు దో, గర్త భావన లేనిదే సిద్ధింపనిదగుటంజేసి, యట్టిభావన నాక్షేపప్రమాణమూలముగాఁ దెలియంజేయు నని యేల యంగీకరింపరాదు? అని ప్రశ్నింపవచ్చును. కర్త యనఁగా, 'కృతి కలవాఁడు.'[5] భావన యనఁబడు కృతియే 'అకృత్యనికరణన్యాయము' ననుసరించి, యాఖ్యాతమునకు వాచ్యమే యగుట సంభవించు చుండఁగా, నట్టి కృతిగల కర్త, యాఖ్యాతమునకు వాచ్య మని కల్పింప వీలు లేదు. అట్లయినచో, లఘువగు కృతిని, విడిచి, 'గురువు' (అధికము) అగు, కృతి గలకర్తయందు శక్తిని గల్పించుట మిగులఁ గ్లేశకరము గదా! భావన, కర్తతోనే కాక, యితరకారకములతోఁగూడ సంబంధించుటంజేసి, యది (భావన) యితరకారకముల నన్నిటిని విడిచి, శీఘ్రముగాఁ గర్తనే,

౧. శక్యార్థము = ముఖ్యార్థము = అభిధేయార్థము.

౨. "అనన్యలభ్యః శబ్దార్థః" అనున్యాయము.

3. గంగాతీరమందు గొల్లపల్లె కలదు.

४. వాచకత = అభిధ - అనునవి సమానార్థకములు.

౫. కృతి = ప్రయత్నము.

యాక్షేపప్రమాణమూలమున నైన, బోధింపనేరదు' అని చెప్పవలదు. భావన నియతముగాఁ[1] గర్తతో సంబంధించినట్లు, కరణము మున్నగు నితరకారకములతో సంబంధించి యుండలేదు. తిష్ఠతి[2] ( = నిలుచుచున్నాఁడు.) అను నిట్టి ప్రయోగము లందు భావనచేఁ గర్తయే కాని, కరణము మున్నగు నితరకారకములు బోధింపఁ బడవు గదా! కావున నది ( = భావన ) ముందుగాఁ గర్తనే యాక్షేపమూల మున నియతముగా బోధించును గాని, యితరకారకములను బోధింపదు. ఇతరకారక ములు మొదట నుపస్థితములు కానేరవు గనుక, నాఖ్యాతముచే నభిహిత మగుసంఖ్య, మొదట నుపస్థిత మగుకర్తతోనే కాని, యితరకారకములతో సంబంధింపదు. కావు ననే భావన కితరకారకములతో నియతమగు సంబంధము లేకుండుటం జేసి, దానిచే నవి నియతముగా నాక్షేపమూలముగా నైనఁ దెలియఁజేయఁబడవు గనుకను, ఆఖ్యాతమును వినుటకు ముందుగాఁగూడఁ, దృతీయ మున్నగు విభక్తులను వినిన తోడనే, కరణము మున్నైన యితరకారకములు బుద్ధికి స్ఫురించుచున్నవి గనుకను, దృతీయ మున్నైనవిభక్తులు, కరణము మున్నగాఁగల కారకాంతరములను, శక్తి మూలముగాఁ దెలియఁజేయుచున్నవి. 'ఆఖ్యాతమునకు వాచ్య మగుటచే శాబ్దమగు సంఖ్య, యట్లు వాచ్యము కానందున నశాబ్దమగు కర్తతో నె ట్లన్వయింపనగును' అని ప్రశ్నింపవలదు. ఆఖ్యాతమునకుఁ గర్తయందు లక్షణ యంగీకరింపఁబడుచున్నది గదా! 'గంగాయాం ఘోషః' అనువాక్యమునందు 'గంగా' పదమునకు లక్షిత[3] మగుటంజేసి, యశాబ్ద మగుతీరము, ఘోషపదమునకు వాచ్య మగుటచే శాబ్దమగు ఘోషముతో నె ట్లన్వయించునో యట్లే, యాఖ్యాతముచే లక్షిత మగుటంజేసి యశాబ్ద మగుకర్త, యాఖ్యాతమునకు వాచ్య మగుటంజేసి శాబ్దమగు నేకత్వ ముతో నన్వయింపఁగలదు.

౧. ఒక గృహము దహింపఁబడునపుడు, బియ్యముతో నింపిన పాత్రికలోనుండి, బియ్య మెట్లో దాని ప్రక్కనే యుండు నీటితో నింపినపాత్రములోఁబడి, కర్త లేకుండఁగనే, పాకమును బొందిన, యన్న మగును గనుక, భావనచే నియతముగా నాక్షేపమూలమునఁ గర్త తెలియఁబడనేరదని చెప్ప వలదు. ఇచట ధాత్వర్థమగు పాకము కర్త లేకుండఁగనే యెట్లో జరిగినను, నా పాకము భావన కానే రదు. భావన యనఁగాఁ బ్రయత్నము కదా!

౨. 'తిష్ఠతి' యనునిట్టి యకర్మకధాతువులు ప్రయోగింపఁబడినపుడు, 'దేనిని' అని కర్మా కాంక్ష కాని, 'దేనిచేత' అని కరణాకాంక్ష కాని, 'దేనికొఱకు' అని సంప్రదానాకాంక్ష గాని, 'దేనినుండి' అను నపాదానాకాంక్ష గాని, సంభవింపనేరదు.

3. లక్ష్యము = లక్షణమూలముగాఁ దెలియంజేయఁబడునది.

ఆఖ్యాతముచేఁ గర్త లక్షితుఁ డగుటంజేసి, 'దేవదత్తః పచతి' అను వాక్యమునందు, దేవదత్తపదమునకు 'పచతి' పదమునందలి యాఖ్యాతముతో, సామానాధికరణ్యము కుదురుచున్నది. కర్త యాఖ్యాతమునకు వాచ్యుఁ డగుటయే సంభవించునెడ, నతఁ డాఖ్యాతముచే లక్షణమూలమున బోధింపఁబడుట, యేల యంగీకరింపవలెను? అని ప్రశ్నింపవలదు. ఒకశబ్దముచే, శక్తిమూలముననే కాని, వేఱొకరీతిని బోధింపఁబడనిదియే, యాశబ్దమున కర్థ మగుచున్న దని నిర్ణయింపఁబడినదిగదా! అట్లు కానిచో, 'సింహో దేవదత్తః' (దేవదత్తుఁడు సింహము) అనువాక్యమునందుఁ గూడ, సింహపదముచే, లక్షణమూలముననుఁ గాని, గౌణవృత్తిమూలముననుఁ గాని, బోధింపంబడు 'సింహముయొక్క పరాక్రమమువంటి పరాక్రమము కలవాఁడు' అను లాక్షణికార్థ మిచట నావశ్యక మైయున్నను, సింహపదమునకు, దేవదత్తపదముతో ముఖ్యమగు సామానాధికరణ్యము సంభవింపవలసి యుండును. "సింహో దేవదత్తః" అనువాక్యమునందు దేవదత్తుఁడు సింహ మగుట ప్రత్యక్షవిరుద్ధము గనుక, నారెండు శబ్దములకును ముఖ్యమగు సామానాధికరణ్యము కుదురకుండుటంజేసి, గౌణమగు సామానాధికరణ్య మంగీకరింపఁబడినది. ఇచట నన్ననో, 'పచతి' పదమందలి యాఖ్యాతమునకుఁ గర్త వాచ్య మని యంగీకరించుటమూలముగా, దేవదత్తపదమున కా యాఖ్యాతముతో ముఖ్యమగు సామానాధికరణ్యమునే యంగీకరించినను, హాని యేమియు నుండదే? 'యనుశంక కీక్రిందిది సమాధానము:—'ఆఖ్యాతమునకుఁ గర్త వాచ్యుఁడే' అని యంగీకరించువానిమతమునందుఁ గూడ, 'దేవదత్తః పచతి' అనువాక్యమందలి సామానాధికరణ్యము ముఖ్యము కానేరదు. ఏల యన, వానిమతమం దాఖ్యాతము, తృతీయావిభక్తివలె, నిష్కృష్టమగు[1] శక్తిమాత్రరూపమగు కర్తృకారకమునే బోధించుచున్నది గాని, యాకృత్యధికరణన్యాయముచే, నట్టిశక్తిగల ద్రవ్యమును బోధించుట లేదు. దేవదత్తశబ్ద మన్ననో, యట్టిశక్తిగల ద్రవ్యమును బోధించుచున్నది. కనుక, దేవదత్తశబ్దమును, నాఖ్యాతమును వేఱువేఱర్థములను బోధించుచుండుటంజేసి, కర్త యాఖ్యాతవాచ్యుఁ డని యంగీకరించువానిమతమందుఁ గూడ, నీరెండింటికిని సామానాధికరణ్యము ముఖ్యము కానేరక, లాక్షణికమే యగును. కాఁగాఁ, బూర్వపక్షిమతమునందుఁగూడ, ముఖ్యసామానాధికరణ్యము కుదురకపోయినను, గౌణ మగు సామానాధికరణ్యము నంగీకరించియే, యెట్లో

[1]. నిశ్చయింపఁబడినది.

వాక్యార్థమును సిద్ధింపఁజేయవలయును గనుకను, నిట్లే సిద్ధాంతిపక్షమునందుఁగూడ, వాక్యార్థము సిద్ధింపవలసి యున్నది గనుకను, నొకమతముకంటె వేఱొకమతమందు విశేష మేమియుఁ గానరాదు. కావున, నీ విషయమందుఁ బూర్వపక్షి 'దేవదత్తః పచతి' అను వాక్యమునందు ముఖ్యమగు సామానాధికరణ్యము సంభవించునెడ, లాక్షణిక మగు సామానాధికరణ్య మేల యంగీకరింపవలయు నని, శంకింప నవకాశము లేదు.

ఇఁకముందు మీమాంసాన్యాయమునకును, వ్యాకరణస్మృతికిని, నుండునట్లు నిరూపింపఁబడిన విరోధము పరిహరింపఁబడుచున్నది. "లః కర్మణి," అను వ్యాకరణ స్మృతి[౧] ప్రమాణము ననుసరించి, యాఖ్యాతమునకుఁ గర్త వాచ్యుఁడే యని చెప్ప వలదు. 'ఏది వాచ్యము?' 'ఏది వాచకము?' అనునది వ్యాకరణస్మృతిచే నిర్ణ యింపఁబడదు. అది 'శక్తిమూలమున నే[౨] కాని, వేఱొకప్రకారముచే సిద్ధింపని యర్థము వాచ్యము. శక్తిమూలమునఁ గాక, వేఱొకప్రకారముచే సిద్ధించిన యర్థము గమ్యము' అను న్యాయముతోఁ గూడిన యన్వయవ్యతిరేకములమూలముగా సిద్ధిం చును గదా! కావున, న్యాయమును, వ్యాకరణస్మృతియు, వేఱువేఱు విషయములు గల వగుటచే నారెండింటికిని విరోధము లేనేలే దని గ్రహింపవలయును. లేదా; వాచ్య వాచకభావము, వ్యాకరణస్మృతిచే సిద్ధించునదియే యగుఁగాక, అయినను బూర్వపక్షిమతము సిద్ధింప నేరదు. ఏల యన; ఈ వ్యాకరణస్మృతి, కర్త యాఖ్యాత మునకు వాచ్యుఁ డని చెప్పుటకుఁ బ్రమాణము కానేరదు. మ తే మనఁ గర్తయం దేకత్వ[3] ముండునపుడు, లకార మేకవచనరూపమును, ద్విత్వ ముండునపుడు ద్వివచన రూపమును, బహుత్వ ముండునపుడు బహువచనరూపమును, నగుననుటకుమాత్రము ప్రమాణమగుచున్నది. "శాస్త్రము[౪] లన్నియును, వేఱొకచోట నుండు విషయము

౧. ఏది సుశబ్దము? ఏది యపశబ్దము? అనునదియే వ్యాకరణస్మృతిచే నిర్ణయింపఁబడును.

౨. "అనన్యలభ్యోఽర్థో వాచ్యః, అన్యలభ్యోఽర్థో గమ్యః" అనునది. ఇందులకు, "వాచ్యవాచకసంబంధో నాచార్యై రుపదిశ్యతే, అన్యథాఽనుపపత్త్యా హి వ్యవ హారా త్సగమ్యతే" అను వార్తికరూపమగు ప్రమాణము గలదు.

3. ఏకత్వము = ఒకటిగా నుండుట.

౪. "సర్వాణ్యేవ హి శాస్త్రాణి స్వప్రదేశాంతరైస్సహ, ఏకవాక్యతయా యుక్త ముపయోగం వితన్వతే."

లతో నేకవాక్యత కలుగునట్లన్వయించి, యిష్ట మగునర్థమును బోధించుచున్నవి" అను న్యాయము ననుసరించి, "లః కర్మణి" ఈ మున్నగుసూత్రము, "ప్రాతిపదికము నందుండు[౧] నేకత్వమును బోధించుటకు దానికంటె నేకవచనప్రత్యయము వచ్చును. ఇట్లే ద్విత్వమును బోధించుటకు ద్వివచనప్రత్యయమును, బహుత్వమును బోధించుటకు బహువచనప్రత్యయమును, వచ్చును" అను సూత్రములతో నేకవాక్యతను బొంది యన్వయించుచున్న దనునది, మునిత్రయసమ్మతము గదా!

ఆఖ్యాతముచేఁ గర్త యభిహితము కానిచో, "దేవదత్తేన పచతి" అని దేవదత్తశబ్దముకంటెఁ దృతీయావిభక్తి వచ్చెడి నని చెప్పినమాట సరికాదు. ఇచటి తృతీయావిభక్తి, కర్తను దెలియఁజేయుటకు వచ్చునా? లేక దానియందుండు సంఖ్యను దెలియఁజేయుటకు వచ్చునా? వానిలోఁ గర్త, భావనచే నాక్షేపమూలముగానే తెలియఁజేయఁబడుచున్నది. కనుక, దానిని దెలియఁజేయుటకై తృతీయావిభక్తి యావశ్యకము కాదు. కర్తయందుండు సంఖ్య యన్ననో, యాఖ్యాతముచేతనే తెలియఁజేయఁబడుచుండుటంజేసి, దానికొఱకుఁగూడఁ దృతీయ యావశ్యకము ఇందులకు, "విభక్తిచే[౨] సంఖ్యయుఁ, గారకమును దెలియఁజేయఁబడును. వీనిలోఁ గారకము భావనచే నాక్షేపమూలముగాను, సంఖ్య యాఖ్యాత మను తిఙ్విభక్తిచేతను, దెలియంజేయఁబడుచున్నవి." అను ప్రమాణము గలదు. ఎచట నాఖ్యాతముచేఁ గారకమం దుండు సంఖ్య దెలియంజేయఁబడదో, యట్టి ప్రదేశములయం దన్ననో, 'దేవదత్తేన[3] ఓదనః పచ్యతే' అని కర్తను బోధించుచు దేవదత్తపదముకంటెఁ దృతీయావిభక్తి రానేవచ్చును. కావున, నాఖ్యాతముచేఁ గర్త వాచ్యము కానిచో దోషమేమియు సంభవింపదు. కాఁబట్టి, యింక విస్తారముగా విమర్శింపఁ బని లేదు. ప్రస్తుతము ననుసరింతము. ఇట్లు శ్రుతి యనుప్రమాణమును మూఁడు విధములుగా వినియోగించుట సిద్ధించుచున్నది.

౧. "ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే" పా. సూ. ౧-౪-౨౨. "బహుషు బహువచనమ్" పా. సూ. ౧-౪-౨3.

౨. "సంఖ్యాయాం కారకే వా ధీ ర్విభక్త్యా హి ప్రవర్తతే, ఉభయం చాత్ర తత్సిద్ధం భావనా తిఙ్విభక్తితః."

3. = దేవదత్తునిచే నన్నము వండఁబడుచున్నది.

ఇంతవఱకును వివరముగా నిరూపింపఁబడిన శ్రుతి యను ప్రమాణము, లింగము మున్నగు ప్రమాణములకంటె బలవత్తరమైనది. అది యెట్లంటేని:—లింగాది ప్రమాణములందు వినియోగింపఁజేయు ప్రత్యక్ష మగు శబ్దము[1] లేదు. మఱే మన, నట్టి వినియోగింపఁజేయు శబ్దమును గల్పింపవలసి యున్నది, లింగాది ప్రమాణములచే వినియోగింపఁజేయు శ్రుతి కల్పింపఁబడునంతలోఁ, బ్రత్యక్ష మగు శ్రుతిచే నావశ్యక మగు వినియోగము జరుపఁబడుచున్నది. కనుక లింగాదులకుఁ గల శ్రుతిని గల్పించు శక్తి క్షీణ మగుచున్నది గదా! కావున, శ్రుతి లింగాదులకంటె బలవత్తర మగుచున్నది. కనుకనే "కదాచన స్తరీ రసి,[2] నేంద్ర సశ్చసి దాశుషే" అను నీ మున్నగు ఋక్కు తనయందలి యింద్రః పదమందుండు నింద్రుని బోధించుట యనెడి లింగముచే నింద్రోపస్థానమున నంగముగాఁ గల్పింపఁబడునంతలో, "ఐంద్ర్యా గార్హపత్య ముపతిష్ఠతే" అను విధియందలి "గార్హపత్యమ్" అనెడి పదమందుండు ద్వితీయావిభక్తియ నెడు ప్రత్యక్ష శ్రుతిచేతను, 'ఐంద్ర్యా' అను పదమందలి తృతీయావిభక్తి శ్రుతిచేతను, నీ ఋక్కు గార్హపత్యోపస్థానమున నంగముగా వినియోగింపఁజేయఁబడుచున్నది. కావున, నీయింద్రుఁడు దేవతగాఁ గల ఋక్కు, గార్హపత్యోపస్థానమునకే యంగ మగుచున్నది.

## లింగమను ప్రమాణము

లింగ మనఁగా, శబ్దమునం దుండునట్టిదియు, నర్థమును బ్రకాశింపఁజేయు నట్టిదియు నగు సామర్థ్యము. ఇదియే శక్తి యని వ్యవహరింపఁబడుచున్నది. 'శబ్దము[3] లన్నిటియందును నుండునట్టియు, నర్థమును బ్రకాశింపఁజేయునట్టియు సామర్థ్యము లింగమనఁబడును, అని పెద్దలు చెప్పుదురు గదా! లింగము శబ్దమునం దుండునదియు, నర్థమునం దుండునదియు నని రెండువిధములు. వానిలో మొదటి దగు లింగముచే,

౧. = శ్రుతివాక్యము.

౨. దీనియుత్తరార్థము. "ఉపోపేన్ను మఘవన్ భూయ ఇన్ను తే దానం దేవస్య పృచ్యతే" అనునది. (= ఓయింద్రా, నీ వెన్నఁడును హింసించువాఁడవు కావు. నీకొఱకు హవిస్సులను సమర్పించు నీయాజమానుని కెప్పుడును దోడ్పడి యుండుము. ఇత్యాదికము.

3. "సామర్థ్యం సర్వశబ్దానాం లింగ మిత్యభిధీయతే"

మంత్ర మంగముగా వినియోగింపఁబడుట కుదాహరణము:—"బర్హిర్దేవసదనం[1] దామి" అను మంత్రము తనయందలి 'దామి' (=ఛేదించుచున్నాను) అనుపదమునం దుండు (ఛేదనక్రియను ప్రకాశింపఁజేయు సామర్థ్య మనెడు) లింగప్రమాణముచే, ఛేదనక్రియ కంగ మగుచున్నది. ఆ మంత్రము, తనయం దుండు 'దామి' అనెడు పదముమూలముగా, ఛేదనక్రియను బ్రకాశింపఁజేయుటకు సమర్థమగుచున్నది గదా! ఇచటి లింగము, 'ఈమంత్రముచే బర్హిస్సును ఛేదింపవలెను' అను శ్రుతిని గల్పించుట మూలమున, నీమంత్రమును ఛేదనక్రియ కంగముగా వినియోగింపఁజేయుచున్నది. ఈ లింగము, మంత్రమునకును, యాగమునకును గల సామాన్య సంబంధమును బోధించు, వేఱొక ప్రమాణము నపేక్షింపనిదియు, దాని నపేక్షించునదియు నని రెండువిధములుగా నున్నది. వీనిలో మొదటిదానికి లక్షణము: ఏది లేనియెడల నేది సంభవింపదో, యది మొదటి దగు కేవల లింగప్రమాణముచే దాని కంగ మగుచు, సామాన్య సంబంధమును బోధించు ప్రమాణాంతరము నపేక్షింపకున్నది. ఉదా:—వేదవాక్యముల యర్థమును దెలిసికొనుట, వానిచే విధింపఁబడు కర్మముల నాచరించుట కంగ మగుచున్నది. వేదవాక్యముల యర్థమును దెలిసికొననియెడల, నా వాక్యములచే విహితము లగు కర్మముల నాచరింప వీలు లేదు[2] గదా! రెండవదానికి లక్షణము:—ఏది లేకున్నను నేది సంభవించునో యది దాని కంగ మగుచు, సామాన్య సంబంధమును బోధించు ప్రమాణాంతరము నపేక్షించుచున్నది. ఉదా:—పై నుదాహరింపఁబడిన 'బర్హిర్దేవసదనం దామి' అనుమంత్రము, ఛేదనక్రియ కంగ మగుచున్నది. ఈ మంత్రము లేకున్నను, దీనియర్థము నుపాయాంతరముచే స్మరించి, ఛేదనక్రియ చేయ శక్యమగుచున్నదిగదా! కావున నీ మంత్రము ఛేదనక్రియయొక్క స్వరూపమును నిర్వర్తింపఁజేయుట కుపకరింప నేరదు. మఱే మన, నిచటి ఛేదనక్రియ, మంత్రయుక్తముగా నాచరింపఁబడినచో, నొకయపూర్వమును సాధించు నని తెలియఁజేయుట కుపకరించుచున్నది. ఈ మంత్రముచే నపూర్వమును సాధించుట యనునది, లింగమాత్రముచేఁ దెలియఁజేయఁబడుట లేదు. ఈ మంత్రమం దుండు సామర్థ్య మనెడి లింగము,

౧. దేవతల కిష్టమగు పురోడాశమునకు స్థానము కాఁబోవు బర్హిస్సు (దర్భల)ను ఛేదించుచున్నాను.

౨. కావున నిది (లింగము), వేదవాక్యములయర్థమును దెలిసికొనుట, ఆవాక్యవిహితములగు కర్మముల నాచరించుట యను నీరెండింటికిని సామాన్యసంబంధ ముండునట్లు చేయు వేఱొకప్రమాణము నపేక్షింపదుగదా!

ఛేదనక్రియను ప్రకాశింపఁజేయుటకుమాత్రమె యుపయుక్త మగుచున్నది గదా! కావున, నీ మంత్రము ఛేదనక్రియను నిర్వర్తింపఁజేయుటమూలముగా, నపూర్వమును సాధించు నని తెలియంజేయుటకు, నీ మంత్రమునకు యాగముతోఁ గల సామాన్య సంబంధమును బోధించు ప్రకరణము మున్నగు ప్రమాణమును, దప్పక యంగీకరింప వలసి యున్నది. దర్శపూర్ణమాసేష్టుల సందర్భమునం దీ మంత్రమును బఠించుటచే "ఈ మంత్రముచే దర్శపూర్ణమాసేష్టులవలన సాధింపందగిన యపూర్వమున కుపక రించు నేదే నొకక్రియ ప్రకాశింపఁజేయఁబడుచున్నది." అని తెలియుచున్నది. అట్లు కానిచో, నీ మంత్రము నీ సందర్భమునందుఁ బఠించుట వ్యర్థ మయ్యెడిని. ఆ దర్శ పూర్ణమాసేష్టులచే సాధింపఁ దగు నపూర్వమునకు సంబంధించు నేక్రియ యీ మంత్రముచేఁ బ్రకాశింపఁజేయఁబడుచున్న దని యాకాంక్ష కలుగఁగా, నీ మంత్ర మునం దుండు సామర్థ్యముచే, నది బర్హిస్సును ఛేదించుట యనుక్రియ యని తెలియుచున్నది. ఆ ఛేదించుట యనుక్రియ, బర్హిస్సునందు సంస్కారమును బుట్టిం చుటమూలముగా, నా యపూర్వముతో సంబంధించుటంజేసి, యీ మంత్రమందలి సామర్థ్యముచే, నీ మంత్ర మా యపూర్వమునకు నుపకరించుచున్నది గనుక, దీనిని దర్శపూర్ణమాసప్రకరణమునందుఁ బఠించుట వ్యర్థము కానేరదు. కాఁగా, 'బర్హిర్దేవ సదనం దామి' అను మంత్రము, దర్శపూర్ణమాసేష్టుల సందర్భమునందుఁ బఠింపఁ బడుటంజేసి, యా యిష్టులకు సంబంధించునట్లు తెలిసికొనంబడినదై, తనయం దుండు ఛేదనక్రియను బ్రకాశింపఁజేయుట యనెడు సామర్థ్యమను లింగముచే ఛేదనక్రియ కంగ మగుచున్న దని సిద్ధించుచున్నది.

ఇట్లు సామాన్యసంబంధమును బోధించు ప్రకరణమను ప్రమాణము నపేక్షిం చెడు లింగము నిరూపింపఁబడి యిఁక సామాన్యసంబంధబోధక మగు స్థాన మనెడు ప్రమాణము నపేక్షించెడు లింగము వివరింపఁబడుచున్నది. "పూష్ణో౽హం దేవయ జ్యయా పుష్టిమాన్ పశుమాన్ భూయాసమ్"[1] (కాఠకసంహిత, ౭-౧౩) అను నీ మున్నగుపూష మొదలగు దేవతల యనుమంత్రణమందు[2] వినియోగించు మంత్రముల

౧. పైమంత్రమునకు మఱియొకపాఠము. "పూష్ణో౽హం దేవయజ్యయా ప్రజనిషీయ ప్రజయా పశుభిః" ఇతి సౌత్రో మంత్రః. (= నేను పూషదేవత నుద్దేశించి యజించుటచేఁ బుష్టి కలవాఁడను, పశువులు కలవాఁడను నగుదునుగాక.

౨. అనుమంత్రణము = పూషదేవత నుద్దేశించి చేయంబడిన త్యాగరూపమగు యాగమునకుఁ బిదప నుచ్చరింపఁబడునది.

కన్ననో,[౧] వానికి యాగానుమంత్రణ మను సమాఖ్య యుండుటంజేసి[౨] యీ మంత్రములకేదే నొకయాగముతో సంబంధ ముండునట్లు తెలిసికొనఁబడఁగా, నీ మంత్రములయందుండు పూష దేవతను బోధించు సామర్థ్య మనెడు లింగముచే, నీ మంత్రములకుఁ బూషయాగము అను యాగవిశేషముతో సంబంధ ముండునట్లు తెలియఁజేయఁబడుచున్నది. "ఓయీ, యాగానుమంత్రణ మను సమాఖ్యచే నీమంత్రములకు "పూష" యాగముతో సామాన్యసంబంధ ముండునట్లు తెలియఁజేయఁబడునంతలో, నీ మంత్రములు దర్శపూర్ణమాసేష్టుల ప్రకరణమందుఁ బఠింపఁబడుటంబట్టి ప్రకరణప్రమాణముచే వీనికి దర్శపూర్ణమాసేష్టులతో సామాన్యసంబంధ ముండునట్లు తెలియఁజేయఁబడుచున్నది. సమాఖ్య ప్రమాణముకంటె 'ప్రకరణ' ప్రమాణము బలవత్తర మైనదిగదా! కావుననే, ప్రయాజానూయాజములు,[3] పౌరోడాశిక[౪] మను సమాఖ్య గల బ్రాహ్మణమందుఁ బఠింపఁబడిన వైనను, నిచట సమాఖ్యాప్రమాణము ప్రవర్తింపక, యీ మంత్రములు దర్శపూర్ణమాసేష్టుల ప్రకరణమందుఁ బఠింపఁబడుటంజేసి, సమాఖ్యకంటె బలవత్తరమగు ప్రకరణప్రమాణముచే నీప్రయాజాదు లాయిష్టులయం దుండు సాన్నాయ్యయాగములకును, నుపాంశుయాజమునకును, నంగము లని తెలియఁజేయఁబడుచున్నవి." అనునీ విషయము వార్తికకారులచే బలాబలాధికరణమందు స్పష్టపఱుపఁబడినది. ఇట్లు సమాఖ్యచే, బోధింపఁబడు సామాన్యసంబంధము ప్రకరణముచే బాధింపఁబడునని చెప్పఁబడి యుండఁగ సమాఖ్యచే నీ మంత్రములకు 'పూష' యాగముతో సంబంధ ముండునట్లుకూడ బోధించుటకు శక్యము కాదని నిరూపింపఁబడుచున్నది.

మఱియు, నీమంత్రములకు యాగానుమంత్రణ మను సమాఖ్యచే, యాగసామాన్యముతో నేదే నొక సంబంధ ముండునట్లు తెలియఁజేయఁబడును. కాని,

౧. పూష దేవతకు సంబంధించు మంత్ర మొకటియే కలదు. అయినను, నితరదేవతలను సంబంధించు మంత్రము లనేకము లుండుటంజేసి, వానినిగూడ 'పూష' దేవతాకమంత్రముతోఁ జేర్చుటచే, బహువచనము సార్థక మగుచున్నది. ఇచట 'పూషాద్యనుమంత్రణమంత్రాణామ్' అను ననుకూలమగు పాఠ మొకచోటఁ గలదు.

౨. సమాఖ్య = పేరు.

3. ప్రధానయాగమునకుఁ బూర్వ మాచరింపఁబడు చిన్నహోమములు ప్రయాజము లనియుఁ, బ్రధానయాగమునకుఁ బిదప నాచరింపఁబడునవి 'అనూయాజము' లనియు మీమాంసకులు చెప్పుదురు.

౪. దర్శపూర్ణమాసేష్టులయందు, రెండాగ్నేయయాగములు, అగ్నీషోమీయయాగము, ఉపాంశుయాజము, రెండు సాన్నాయ్యయాగములు నను నాఱుయాగములు గలవు. ఇందు మొదటివి మూఁడును పురోడాశయాగములు.

యాగ విశేష మగు పూషయాగముతో సామాన్యసంబంధ మైన నుండునట్లు తెలియఁజేయ శక్యము కాదు. ప్రకరణప్రమాణ మన్ననో, యీ మంత్రములకు దర్శపూర్ణమాసేష్టులతోనే విశేష సంబంధ ముండునట్లు తెలియఁజేయఁగలదు. కావునఁ బ్రకరణముచే శీఘ్రముగా నీమంత్రములు దర్శపూర్ణమాసేష్టులతో సంబంధించునట్లే తెలియుటంజేసి, యీ మంత్రములా యిష్టులకే యంగము లగుట యుక్తము. ఈ యిష్టులందు 'పూష' దేవతకు సంబంధించుయాగ మేమియు లేనందున, నీపూషానుమంత్రణమంత్రములను నీ యిష్టుప్రకరణమునం దేల పఠింపవలెను? అని ప్రశ్నింపవలదు. పూష యను శబ్దమునకు 'పోషించువాఁడు' అను నవయవార్థ ముండుటంజేసి, యది యెట్లో యీ యవయవార్థముద్వారమున, దర్శపూర్ణమాసేష్టులం దుండు యాగముల కుద్దేశ్యము లగు 'అగ్ని', అగ్నీషోమములు మున్నగు దేవతలను బోధించుట సంభవించుచున్నది.

ఇట్లు కలిగిన పూర్వపక్షమునకీ క్రిందిది సమాధానము. ఇంతవఱకుఁ బూర్వపక్షి చెప్పినమాట సరికాదు. "బర్హి ర్దేవసదనం దామి" అనుమంత్రమును వినినతోడనే యీమంత్రము ఛేదనమును దెలియఁజేయుటకొఱకే యగుచున్న దని యెట్లు తెలియుచున్నదో, యట్లే పూషానుమంత్రణమంత్రమును వినినతోడనే, యీ మంత్రము 'పూష' దేవతను బోధించుటకు సమర్థ మగుటంజేసి, యీ దేవతను బ్రకాశింపఁ జేయుట మూలముగానే, సంబంధించుచున్న దని తెలియుచున్నది. ఇట్లు తెలిసికొనుటకు 'ప్రకరణము, స్థానము, సమాఖ్య' యను ప్రమాణముల యపేక్ష లేదుగదా! వాని యపేక్ష యుండినచో నవి (ప్రకరణాదులు) యుపజీవ్యము[1] లగుటచే బలవత్తరము లయ్యెడిని. ప్రకరణప్రమాణముచే నీమంత్రము దర్శపూర్ణమాసేష్టులతో సంబంధించునట్లు తెలియునెడ, నాప్రకరణము, వాక్యమును, లింగమును, శ్రుతిని గల్పించుట మూలమున, నీమంత్రము నట్లు వినియోగింపఁజేయవలసి యుండుటంజేసి, లింగ ముపజీవ్య మగుచున్నది గనుకఁ బ్రకరణాదులకంటె బలవత్తర మగుచున్నది. కావున, లింగప్రమాణముచే, నీ మంత్రము పూష దేవతను బ్రకాశింపఁజేయుటకొఱ కగు నని తెలియఁగా, నిది (ఈ మంత్రము) పూష దేవతనుమాత్రమే బ్రకాశింపఁజేసిన వ్యర్థ మయ్యెడిని గనుక, నీ మంత్ర మెట్లో యపూర్వమును సాధించు పూష దేవతను బ్రకాశింపఁజేయుటకొఱకుఁ గావలసి యున్న దని చెప్పవలయును. అట్టి యపూర్వ

౧. ఆధారము లగు ప్రమాణములు.

మేది యని యాకాంక్ష కలుగఁగా, నీ మంత్రమునకు యాగానుమంత్రణ మను సమాఖ్య యుండుటం జేసి, యట్టి సమాఖ్యచే నుపకరింపఁబడు లింగమువలన, నిది (ఈ మంత్రము) పూషయాగమందలి యపూర్వముతో సంబంధించు పూష దేవతను బ్రకాశింపఁజేయుటకొఱ కుపయోగించు నని తెలియుచున్నది. కావున నాలోచింపఁగా, సమాఖ్యకంటెఁ బ్రకరణము బలవత్తర మైనదే. అయినను, నది (ప్రకరణము) లింగప్రమాణముచే బాధింపఁబడుటవలన సమాఖ్య, తాను దుర్బల మైనను, ప్రబల మగు లింగప్రమాణము నాశ్రయించియుండుటం జేసి, బలవత్తర మగుచున్నది గనుక, సమాఖ్యయే యీ మంత్రమునకు యాగముతో సామాన్యసంబంధ ముండునట్లు తెలియఁజేయుటకుఁ బ్రమాణ మగుచున్నది. దుర్బల మైనదికూడఁ బ్రబల మగుదాని నాశ్రయించు నెడల, బలవత్తర మగుచున్నదిగదా! కావుననే, శ్రుతికంటె స్మృతి దుర్బల మైనను, వేదమును జేసినపిదప తుమ్ముతము కలిగినపుడు "క్షుతజృంభణాదినిమిత్తే[1] ఆచాంతేన కర్మ కర్తవ్యమ్" అను స్మృతి, యాచమన మను ప్రబలమైన స్వతంత్ర[2]పదార్థము నాశ్రయించియుండుటం జేసి, బలవత్తర మగుచున్నది గనుక "వేదం కృత్వా వేదిం కరోతి" అను శ్రుతిచే బోధిత మగునదియుఁ, బదార్థధర్మ మగునదియు, నగు 'వేదమును[3] జేసినపిదప వేదిని జేయునది' యను క్రమమును విడిచి, వేదమును జేసినపిదప తుమ్ముతము కలిగినచో నాచమనమే చేయవలసిన దని శిష్టాకోపాధికరణమునందుఁ జెప్పఁబడినది. ఇందులకు, "పట్టణవాసులును[4], బల్లెటూరియం దుండువారును, మిగులఁ బ్రబలు లైనను, ప్రభువు నాశ్రయించిన దుర్బలు లగు పురుషులచేఁ గూడ బాధింపఁబడుదురు" అనువార్త్తికము ప్రమాణముగాఁ గలదు.

పూషన్ శబ్ద మెట్లో దర్శపూర్ణమాసేష్టులందలి యాగములయం దుద్దేశింపఁబడు నగ్ని మున్నగు దేవతలను బోధించు నని పూర్వపక్షి చెప్పిన మాట యన్నచో

౧. ఏదే నొకకర్మము నాచరించుచున్నపుడు, తుమ్ముగాని, యావులింతగాని వచ్చినచో, ఆచమనము చేసియే కర్మము నాచరింపవలయును—అని యర్థము.

౨. పదార్థము = స్వతంత్రమగు క్రియ.

౩. వేదము = పరున్న వత్సముయొక్క మోఁకాటియాకృతివంటి యాకృతిగల దర్భలకట్ట ఇట్లు కట్టఁబడునది. ఇది వేదిని దుడుచుట కుపయోగించును.

౪. అత్యంతబలవంతోఽపి పౌరజానపదా జనాః, దుర్బలైరపి బాధ్యన్తే పురుషైః పార్థివాశ్రితైః. తంత్రవార్త్తికము, ౩-౩-౭.

యుక్తము కానేరదు. ఆశబ్దము 'పూషా ప్రపిష్టభాగః'[1] అను వాక్యమునకుఁ దరువాతి దగు 'అదంతకో హి సః' అనెడు వాక్యమువలనను, వేదమునం[2]దుండు ప్రసిద్ధివలనను, నొకానొక దేవత[3]యందు రూఢ[4]మైన దని తెలియుచున్నదే; పదమునందు నవయవముల యర్థము నపేక్షించు యోగము[5]కంటె రూఢి బలవత్తరమగునది గదా!

కావుననే, యాధానసందర్భమునందుఁ బఠింపఁబడిన "వర్షాసు రథకారో ఽగ్నీనాదధీత" అను విధియందలి 'రథకార' అను శబ్దము, రూఢి బలవత్తరమగుటంజేసి, 'సౌధన్వలు[6]' అను వేఱొక పేరుగల సంకీర్ణజాతివిశేషమునే బోధించుచున్నది గాని, 'రథమును జేయుచున్నాఁడు' అను నవయవార్థము మూలముగా, ద్విజాతులను బోధించుట లేదు. రూఢికంటె యోగము దుర్బలమగుచున్నదిగదా! ఈవిషయము షష్ఠాధ్యాయమందలి, ప్రథమపాదమం దుండు రథకారాధికరణమునందు వివరింపఁబడినది. కాఁగా; పూషానుమంత్రణమంత్రములకు యాగానుమంత్రణము లను సమాఖ్య యుండుటంజేసి, మంత్రముల కేదే నొక యాగముతో సామాన్య సంబంధ ముండునట్లు తెలియఁగా, నీమంత్రమునం దుండు 'పూష దేవత'ను బ్రకాశింపఁజేయు సామర్థ్య మనెడు లింగముచే, నీ మంత్రములకు 'పూష' యాగముతో విశేషసంబంధ ముండునట్లు తెలియుట యుక్తముగా నున్నది.

౧. తై. సం. ౨ కాండ. ౬ ప్ర. ౮ అనువాకము; పూష యనుపేరుగల దేవత పిండిరొట్టె యాహారముగాఁ గలవాఁడు. అతనికి దంతములు లేవుగదా!

౨. వేదమునందు 'పూష' యనుపదము సూర్యుని బోధించునట్లు వాడఁబడినది.

౩. సూర్యుఁ డనుదేవత.

౪. పదమునం దుండునవయవముల యర్థము నపేక్షింపక, కేవలసంకేతముచే నొకయర్థమును బోధించుశక్తికి రూఢి యనియు, నట్టిరూఢిగల పదము రూఢ మనియు గ్రహింపవలయును.

౫. యోగము = పదమునందుండు నవయవముల యర్థమును బోధించు సామర్థ్యమునకు యోగమనియు, నట్టియోగముమూలముగా నర్థమును బోధించుపదములు యౌగికము లనియుఁ దెలియునది.

౬. ఈశబ్దముచే 'మాహిష్యేణ కరణ్యాంతు రథకారః ప్రజాయతే' అను యాజ్ఞవల్క్యస్మృతిచే బోధింపఁబడు రథకారుఁ డిచట గ్రహింపఁబడరాదు. మఱియు మన, "వ్రాత్యాత్తు జాయతే శూద్రాత్ సుధన్వాచార్య ఏవచ, మారుషశ్చ విజంఘశ్చ మైత్రస్సాత్వత ఏవచ" అనువాక్యముచే బోధింపఁబడునదియుఁ, ద్వైవర్ణికులకంటెఁ గొంచెము హీనమైనదియు నగు జాతివిశేష మిచట గ్రహింపఁదగినది.

ఇందులకు "పూషానుమంత్రణ మంత్రముల కుండు 'యాగానుమంత్రణములు' అను సమాఖ్య, యీ మంత్రముల నేదే నొక క్రతువుతో సామాన్యముగా సంబంధింపఁ జేయుచున్నది. కనుక, నీ మంత్రమునందలి పూష దేవతను బోధించు సామర్థ్యమనెడు లింగముచే నీ మంత్రము లా పూష దేవత గల యాగముతో సంబంధించుచున్నవి" అను తంత్రవార్తికము[1] ప్రమాణముగాఁ గలదు. కాఁగా, నొక పదార్థమునకు నేదే నొక యాగముతో సామాన్య సంబంధ ముండునట్లు వేఱొక ప్రమాణముచేఁ దెలియఁగా, నీ పదార్థము నొకానొకయాగమున కంగముగా వినియోగింపఁజేయునది లింగ మని సిద్ధించుచున్నది.

పైని వివరింపఁబడిన రెండువిధములగు లింగములలో, రెండవదగు మంత్రమును వినియోగింపఁజేయులింగ, మా మంత్రములందలి పదములం దుండు ముఖ్యార్థమునే[2] యనుసరించి, యా మంత్రమును వినియోగింపఁజేయును గాని, గౌణార్థము[3] ననుసరించి వినియోగింపఁజేయదు. ముఖ్యార్థమే మొదట నుపస్థిత మగుటంజేసి, దానినే యాశ్రయించి యామంత్రమును వినియోగింపఁ జేయవలయు నను నిశ్చయము స్ఫురింపఁగా, నిఁక నాకాంక్ష లేకుండుటంబట్టి, మరల గౌణార్థము నవలంబించి వినియోగమును గల్పించుట, యాకాంక్ష లేకుండఁగనే విధించుట యనెడి క్లేశమును గలిగించెడినిగదా! ముఖ్యార్థమువలె, గౌణార్థముకూడ స్మరింపఁబడఁగలదు గనుక, దానినుద్దేశించి వినియోగమును గల్పింపవచ్చునే యని చెప్పవలదు. ధ్యానము మున్నగు నితరోపాయములచేఁగూడ స్మరింపఁబడుట సంభవింపఁగలదు గనుక, నచట నియతముగా మంత్రముయొక్క యావశ్యకత యుండదు. కాఁబట్టి, యట్టి గౌణార్థము మూలమున నామంత్రమును వినియోగింపరాదు. కావుననే, 'బర్హిర్దేవసదనం దామి' అను మంత్రమునందలి 'బర్హిస్సు' అనుశబ్దమునకు 'కుశలు' (దర్భలు)ముఖ్యార్థమగుటంజేసి, లింగముచే నీ మంత్రము, కుశలను ఛేదించుట యనెడిక్రియకే యంగమగుచున్నది గాని, బర్హిశ్శబ్దమునకు గౌణార్థ మగు తుంగను ఛేదించుట యనెడు

౧. తం. వా. 3. అ ౨. పా. ౧. "యాగానుమంత్రణానీతి సమాఖ్యా క్రతుయోజికా, తస్మాచ్ఛక్త్యనురోధేన ప్రాప్తి స్తద్దైవతే క్రతౌ"

౨. ఒకశబ్దముచేఁ దనయందలి శక్తిమూలమునఁ దెలియఁజేయఁబడునర్థము. ఇదియే వాచ్యార్థము.

3. = ఒకశబ్దముచేఁ దనయందలి శక్తిమూలముగాఁ గాక, మఱియొకరీతిగాఁ దెలియఁజేయఁబడునదియు, నీపదముయొక్క ముఖ్యార్థముతో సంబంధించునదియు నగు నర్థము.

క్రియ కంగ మగుటలేదు. ఈ విషయము, తృతీయాధ్యాయమునందలి, ద్వితీయపాద మునం దుండు, ప్రథమాధికరణమునందు వివరింపఁబడి యున్నది. ఇట్లు లింగప్రమాణము నిరూపింపఁబడి, యిఁక నది వాక్యము మొదలగు ప్రమాణములకంటె బలవత్తర మగుచున్న దని విశదపఱుపఁబడుచున్నది.

అట్టి యీ లింగప్రమాణము, వాక్యము మున్నగు నితరప్రమాణములకంటె బలవత్తరము. వాక్యాదిప్రమాణములు సాక్షాత్తుగా వినియోగమును గలిగింపలేవు. మఱే మన, లింగమును, శ్రుతినిగూడఁ గల్పించుటమూలముగానే యట్టి వినియోగ మును గలిగించును. అవి, సామర్థ్యమను లింగమును బురస్కరించుకొనక, సాక్షాత్తుగా శ్రుతినే కల్పించి వినియోగమును గలిగింపనేరవు. లింగముకూడఁ గల్పింపఁబడఁ దగిన దగుటంజేసి, శ్రుతిని గల్పించుట కాధార మగుచున్నదిగదా! కావున, వాక్యాది ప్రమాణములు లింగమును గల్పించి, పిదప శ్రుతిని గల్పించునంతలో, క్లృప్తమగు లింగము, శ్రుతినే కల్పించి, వినియోగమును గలిగించున దగుటంజేసి, వాక్యాదిప్రమాణములకంటె బలవత్తర మగుచున్నది. కనుకనే 'స్యోనం తే సదనం కృణోమి ఘృతస్య ధారయా, సుశేవం కల్పయామి'[1] అనుమంత్రము, తనయందున్న 'సదనం కృణోమి' అనుపదమునందలి 'స్థానమును నిర్మించుట' అనెడి యర్థమును బ్రకాశింపఁజేయు, సామర్థ్య మనెడు లింగముచే, 'స్థానమును నిర్మించుట' యనుక్రియకే యంగ మగుచున్నది గాని, యీ మంత్రమునకు 'తస్మిన్ సీద'[3] అనుమంత్రమును జేర్చి, రెండింటిని నొకటేవాక్యముగా నన్వయించుటచే, 'పురోడాశమా! నీకొఱకు; శ్రేష్ఠమైన స్థానమును గల్పించుచున్నాను గనుక, దానియందుఁ గూర్చుండుము' అను నర్థము లభించుచుండుటం జేసి, వాక్యప్రమాణముచే, నీ మంత్రము 'కూర్చుండఁబెట్టుట' యను క్రియ కంగ మగుటలేదు. వాక్యము లింగముకంటె దుర్బలముగదా!

౧. సిద్ధ మగు.

౨. తైత్తిరీయబ్రాహ్మణము. 3 అ. 2 ప్ర. ౫ అనువాకము. 'ఓపురోడాశమా! నీకొఱకు సుఖకరమగు స్థానమును గల్పించుచున్నాను. నేతిధారచే నిన్ను సుఖముగా ననుభవింపఁబడుదానినిగాఁ గల్పించుచున్నాను.

3. దీనియందుఁ గూర్చుండుము.

# వాక్యప్రమాణ నిరూపణము

ఇఁక వాక్యప్రమాణము నిరూపింపఁబడుచున్నది. సమభివ్యాహారము వాక్యము. సమభివ్యాహార మనఁగా, సాధింపఁబడుట, సాధించుట, యను నీమున్నగు ధర్మములను బోధించు, ద్వితీయా తృతీయాదివిభక్తులు వినఁబడక, వాస్తవముగా శేష[౧] శేషులను[౨] దెలియఁజేయు పదములను రెండింటిని జేర్చి పలుకుట. ఉదాహరణము: "యస్య పర్ణమయీ జుహూర్భవతి, న స పాపగ్ం శ్లోకగ్ం శృణోతి"[౩] ఇచట సాధింపఁబడుట మొదలైన ధర్మములను బోధించు ద్వితీయమొదలగు విభక్తులు వినఁబడక, పర్ణవృక్షముతోఁ జేయఁబడుట, 'జుహువు'[౪] అను నీరెండు పదముల కూడికయే వినఁబడుచున్నది. కావుననే, పర్ణవృక్షముతోఁ జేయఁబడుట యనునది, జుహువున కంగ మగుచున్నది. జుహువు మఱియొకవృక్షముచేఁగూడఁ జేయఁబడ వచ్చును గనుక, 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట' యనునది వ్యర్థ మయ్యెడి నని శంకింపరాదు. ఇచట జుహూ వనుశబ్దముచే, జుహూ వనుపాత్రముచే జనింపఁజేయఁబడు నపూర్వ మనునర్థము, లక్షణమూలముగాఁ దెలియఁజేయఁబడుచున్న దగదా! కాఁగాఁ, బై వాక్యమునుండి 'జుహూ వనుపాత్రము, పర్ణవృక్షముతోఁ జేయఁబడి, వేఱుపఱుపఁబడిన హవిస్సును ధరించును గనుక, యజమానుఁడా జుహువువలన జనింపఁదగిన యపూర్వమును సాధింపవలయును' అనునర్థము లభించుచున్నది. కావున, "'జుహువు' పర్ణవృక్షముతోఁ జేయఁబడినపుడే, యా జుహువువలన జనింపఁదగిన యపూర్వము సిద్ధించును. అట్లు కాక, మఱియొకకఱ్ఱతోఁ జేయఁబడినచో, నట్టి యపూర్వము కలుగదు" అని యర్థము సిద్ధించుచుండుటంజేసి, 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట' అనునది వ్యర్థము కానేరదు. పయిని వివరింపఁబడిన వాక్యమునందు,

౧. అంగము.

౨. అంగి = ప్రధానము.

౩. ఎవనియొక్క 'జుహువు' అనుపాత్రము పర్ణవృక్షముతోఁ జేయఁబడునో, యతఁడు పాపకరములగు వాక్యములను వినఁడు. తై. సం. ౩ కాం, ౫ ప్ర. ౭ అనువాకము.

౪. జుహువు = ఆజ్యమును హోమము చేయుటకు సాధనమైనట్టియు, ఇట్టి యాకారము గలదియు నగు పాత్రవిశేషము.

'జుహూవు అవత్త[1] మగుహవిస్సును ధరించును గనుక' అని నిశ్చితముగాఁ జెప్పవల యును. లేనిచోఁ, 'బర్ణవృక్షముతోఁ జేయఁబడుట' యనునది స్రువము[2] మున్నగు పాత్రములకుఁగూడ నావశ్యకము కావలసివచ్చును. అట్టి యీ 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట' యనునది యేయాగవిశేషమును బ్రత్యేకముగా నుద్దేశించి చెప్పఁబడని దైనను, బ్రకృతియాగములం దెల్ల నన్వయించును, కాని వికృతియాగములయం దన్వ యింపదు. 'ప్రకృతియాగమువలెనే వికృతియాగమును జేయునది' అను చోదకవాక్య ముచేత,[3] 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట అనునది' వికృతియాగములందుఁగూడ లభించును గాన, 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట' అనుదానిని విధింపఁజేయువిధి, వికృతులందుఁగూడఁ బ్రవర్తించినచో, నచట నీధర్మమునకుఁ బునరుక్తిదోషము[4] సంభ వించెడినిగదా! ఇందులకు 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట'[5] యను నీమున్నగు ననారభ్యాధీతములగు[6] ధర్మములు, ప్రకృతియందే యన్వయించును గాని, వికృతియం దన్వయింపవు. అట్లన్వయించినచో వికృతియందలి యంగములను గూర్చిన యా కాంక్షను బూరించుటకుఁ బ్రకృతియందుండు కొన్నియంగము లతిదేశము[7] మూల ముగా వికృతియందుఁ బ్రాప్తించుట యావశ్యకము కనుక, నీ యనారభ్యాధీతములగు ధర్మములను వికృతియందు మరల విధించినచోఁ, బునరుక్తిదోషము సంభవించును గదా! దీనికిఁ బాఠాంతర మగు 'ప్రకృతౌ వా, అద్విరుక్తత్వాత్' అనుదాని కీ క్రిందిది యర్థము. 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట యను నీమున్నగు ననారభ్యాధీత ములగు ధర్మములు ప్రకృతియందే యన్వయించును. అట్లన్వయించుటచే, బయిని వివ రింపఁబడిన పునరుక్తిదోషము సంభవింపనేరదు.' అనుసూత్రము ప్రమాణముగాఁ గలదు.

౧. (అవ + దా + త) వేఱుపఱుపఁబడినది.

౨. నేతిగిన్నెలోనుండి నేతిని దీసి, జుహూ వనుపాత్రములో నుంచుట కుపయోగించు చిన్న గరిఁటెవంటి యజ్ఞపాత్రము.

3. అతిదేశవాక్యము = ఒకచోట విధింపఁబడునంగములను మఱియొకచోట ననువదించి విని యోగింపఁజేయుట.

౪. ఒకటేయర్థము నొకటే శబ్దముచేఁ గాని, వేఱుశబ్దముచేఁ గాని, రెండుమాఱులు చెప్పుట.

౫. ప్రకృతౌ వా ద్విరుక్తత్వాత్, లేక, ప్రకృతౌ వా - అద్విరుక్తత్వాత్, జై. సూ. 3-౬-౨.

౬. ఏదే నొకయాగవిశేషము నారంభింపక పఠింపఁబడునవి.

౭. ఒకచోట విధింపఁబడినయంగములను మఱియొకచోట ననువదించి వినియోగింపఁజేయుట.

ఈసూత్రమునందలి ప్రకృతిశబ్దమునకు 'దేనియందుండునంగములను వికృతి యతిదేశమూలముగాఁ దీసికొనునో, యట్టిక్రతువు' అని యర్థము కాదు. అట్లయినచో, గృహమేధీయేష్టియందుండు జుహూవునకు 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట' యనునది యంగముగా నన్వయింపకపోవలసివచ్చును. ఏవికృతియు గృహమేధీయేష్టి నుండి[౧] యంగములను దీసికొనదు. అట్లు తీసికొనుటకుఁ బ్రమాణ మేమియు లేదు. ఏకర్మమునందతిదేశముచే నంగములు ప్రాప్తింపవో, యట్టి కర్మమునకే ప్రకృతి యని పేరు. ఉదా: దర్శపూర్ణమాసేష్టులు. వానియందంగములను గూర్చి కలుగు నాకాంక్ష వాని ప్రకరణమునందుఁ బఠింపఁబడిన యంగములచేతనే యుపశాంతించుచుండుటంజేసి, యచట నతిదేశముచే నంగములు ప్రాప్తింపవు. గృహమేధీయేష్టి, ఉపసత్తు, అవభృథము మొదలగు వానియందుఁగూడ, నంగములనుగూర్చి కలుగు నాకాంక్ష, యుపకరించునవిగాఁ దెలియఁబడిన ఆజ్యభాగములు, స్విష్టకృత్తు,[౨] ఇడ,[౩] మున్నగువానిచే నుపశాంతించుచుండుటంజేసి, యచట నతిదేశముచే నంగములు ప్రాప్తింపవు. కనుక, నెచట నతిదేశముచే నంగములు ప్రవర్తింపవో, యట్టి ప్రకృతులందు 'అనారభ్యాధీతము' లగు నంగములు ప్రవర్తించును. 'సప్తదశ సామిధేనీరనుబ్రూయాత్'[౪] అను వాక్యముచే, 'సామిధేనీ' యను పేరుగల ఋక్కుల కంగముగా విధింపఁబడిన 'పదునేడుమాఱులు' అనునది యన్ననో, అనారభ్యాధీత మగునదైనను, ప్రకృతియందలి యంగాకాంక్ష,[౫] యాప్రకరణమునందు విధింపఁబడుటచే శీఘ్రముగా నుపస్థిత[౬] మగు 'పదునైదుమాఱులు' అనుదానిచే, శాంతించినందున,

౧. చాతుర్మాస్యయాగమందు (౧) వైశ్వదేవము (౨) వరుణప్రఘాసము. (3) సాకమేధము. (౪) శునాసీరీయము అను నాలుగుపర్వములు గలవు. వానిలో మూఁడవదగు సాకమేధముసుపర్వమునందు 'మరుద్భ్యో గృహమేధిభ్య స్సర్వాసాం దుగ్ధే సాయ మోదనమ్' అనువాక్యముచే విహిత మగు 'గృహమేధీయేష్టి' యొకటి కలదు.

౨. 'అగ్నయే స్విష్టకృతే సమవద్యతి' (స్విష్టకృత్తనునగ్నికొఱకు హవిస్సును వేఱు పఱుచుచున్నాఁడు.) అనుదానిచేత విధింపఁబడుయాగము.

3. ఇడా ముపహ్వాయతే (ఇడ నభిమంత్రించుచున్నాఁడు.) అనువాక్యముచే విధింపఁబడు యాగము.

౪. సామిధేని యను పేరుగల ఋక్కులను బదునేడుసారులు పఠింపవలయును.

౫. అంగములను గూర్చినయాకాంక్ష.

౬. స్ఫురించునది.

'పదునేడుమాఱులు' అనునది ప్రకృతియందుఁ బ్రవర్తింపదు. మఱేమన, వికృతుః లందుఁ బ్రవర్తించును. అయినను, వికృతులం దతిదేశముచేఁ బ్రాప్తించిన 'పదునేడు మాఱులు' అనునది 'అనారభ్యాధీత' మగుటచే దుర్బల మైనను, నుపదేశింపఁబడిన దగుటచేతను, నిరవకాశ మగుటచేతను, ప్రబల మైన దగు 'పదునేడుమాఱులు' అనుదానిచే బాధింపఁబడవలసి యుండుటంజేసి, 'పదునేడుమాఱులు' అనునది యన్ని వికృతులందును బ్రవర్తింపదు. మఱే మన, నేవికృతులందుఁ బదునేడుమాఱులు అనునది ప్రత్యక్షముగా వినఁబడుచున్నదో, యట్టి మిత్రవిందేష్టి, పశువైమృధము, అధ్వరకల్పము మొదలగు వికృతులందుమాత్రమే ప్రవర్తించును. ఇందులకు "కాఁగా 'పదునైదుమాఱులు' అనునది ప్రకృతియందును, నెచటఁ బదునేడుమాఱు లనునది వినఁబడదో యట్టివికృతియందును బ్రవర్తించును" అను తంత్రవార్తికము[1] ప్రమాణముగాఁ గలదు. 'ఇచట నొకవాక్యముచేతనే యభిమత మగునర్థము సిద్ధించుచుండ, రెండువాక్యముల నవలంబించుట వ్యర్థము గదా!' అని శంకింపరాదు. 'పదునేడుమాఱులు' అనునది సామిధేనీఋక్కులస్వరూపమును నిర్వర్తింపఁ జేయుట కొఱకుఁ గానేరదు కనుక, దీని కేదే నొక క్రతువుతో సంబంధము కల్పింపవలసి యుండఁగా, నిది యనారభ్యాధీత మగుటచే, సమీపమందుఁ గ్రతు వేదియు లేనందున సామిధేనీఋక్కులద్వారమున, దీనికి (సప్తదశ్యమునకు) నొక క్రతువుతో సంబంధము 'అనారభ్య'[2] వాక్యముచేఁ గల్పింపఁబడునంతలో, మిత్రవిందేష్టి మున్నగువాని ప్రకరణమునం దుండు వాక్యముచే, ననారభ్యవాక్యమువలన నన్నివికృతులతో సంబంధింపఁదగు 'పదునేడుమాఱులు' అనునది యుపసంహారము మూలముగా నొకచో క్రతువునందుఁ బ్రవర్తింపవలె నని బోధింపఁబడుచున్నది. ఉపసంహార మనఁగా సాధారణముగా నన్నిటియందును బ్రాప్తింపఁదగినదాని నొకదానియందే నియమించుట, ఇందులకు "ప్రత్యేకముగా[3] నొకదానిని నిర్దేశించి, దానితో సంబంధింపక పోవుటచే, స్పష్టము కాని సామాన్యవిధి, స్పష్టముగా నొకదాని నుద్దేశించి దానితో

౧. తంత్రవార్తికము. 3-౬-౨ పేజి: ౧౦౭౮. "ఏవంచ ప్రకృతా వేతత్పాంచదశ్యం ప్రతిష్ఠితమ్, వికృతౌ చ న యత్రాస్తి సాప్తదశ్యపునశ్శ్రుతిః."

౨. అనారభ్యవాక్యము = "సప్తదశసామిధేనీ రనుబ్రూయాత్" అను వాక్యము.

3. తంత్రవార్తికము. 3-౮-౧౫ పేజి. ౧౧౨౦. "సామాన్యవిధి రస్పష్ట స్సంహ్రియేత విశేషతః"

సంబంధించునట్లు తెలియఁబడునపుడు, 'ఉపసంహారము' అని మీమాంసకులచే వ్యవహరింపఁబడుచున్నది." అను తంత్రవార్త్తికము ప్రమాణ మగుచున్నది. వానిలో ననారభ్యవిధి,[౧] సామాన్యవిధి యగుచున్నది. మిత్రవిందేష్టి మున్నగువాని ప్రకరణమునందుఁ బఠింపఁబడినవిధి యన్ననో, సామాన్యవిధి నేదే నొకక్రతువిశేషముతో సంబంధింపఁజేయుటంజేసి, విశేషవిధి యగుచున్నది. ఇంతటితో విరమించి, ప్రకృతము ననుసరింతము. ఇట్లు వాక్యప్రమాణముచే నంగ మగుట సిద్ధించుచున్నది.

అట్టి యీవాక్యప్రమాణము, ప్రకరణము మున్నగు నితరప్రమాణములకంటె బలవత్తర మగుచున్నది. ప్రకరణము, సాక్షాత్తుగా నంగములను బోధించి, వినియోగింపఁజేయలేదు. ప్రకరణ మనఁగా, అంగములకును, నంగికిని, బరస్పరము నుండు నాకాంక్షయే స్వరూపముగాఁ గలదిగదా! అట్టి యాకాంక్ష, వాక్యము మున్నగు వానిని గల్పింపక, స్వతంత్రముగాఁ బ్రమాణము కానేరదు. మఱే మన, ఆకాంక్ష గలవాక్యమును వినినపుడు, 'ఈవాక్య మేదే నొక యితరవాక్యముతోఁ గలిపి, యొకటేవాక్య మగుచున్నది' అని తెలియుచున్నది. కావున, నాకాంక్ష యను ప్రకరణ, 'మొకవాక్య మింకొకవాక్యముతోఁ గలసి యొకటేవాక్య మగుచున్న' దని నిశ్చయించుటకుఁ బ్రమాణ మగుచున్నది. కాఁగా, బ్రకరణము, వాక్యమును గల్పించి వినియోగమును దెలియఁజేయునంతలో, వాక్యము లింగమును, శ్రుతిని, గల్పించి వినియోగమును దెలియఁజేయఁగలదు. కనుకఁ బ్రకరణమునకంటె, వాక్యము బలవత్తర మగుచున్నది. కావుననే, "ఇంద్రాగ్నీ ఇదం హవి రజుషేతాం,[౨] అవీవృధేతాం మహోజ్యాయో అక్రాతామ్" అనుమంత్రమునందు 'ఇంద్రాగ్నీ' అనుపదము తనయం దుండు లింగముచే, దర్శేష్టి[3] కంగ మని సిద్ధింపఁగా, 'ఇదం', 'హవిః' అనుపదములుకూడ 'ఇంద్రాగ్నీ' అనుపదముతో, నేకవాక్యతను బొందుటంజేసి,

౧. ఏక్రతువును నారంభించి నిర్దేశింపక, సామాన్యముగాఁ బఠింపఁబడువిధి.

౨. ఇంద్రాగ్నులిద్దఱును నీహవిస్సును బొందిరి. అభివృద్ధిని బొందించిరి. గొప్పతేజస్సునుగూడఁ గల్పించిరి. తై. బ్రా. 3 అ ౫ ప్ర. ౧౦ అను.

3. సోమయాజి, దర్శేష్టియందుఁ, బురోడాశము హవిస్సుగాఁగల యాగ్నేయయాగమును, సాన్నాయ్యము హవిస్సుగాఁగల రెం డైంద్రయాగములను, నాచరించును. సోమయాజి కాక, ఆధానము మాత్రము చేసినదీక్షితుఁడు, దర్శేష్టియందుఁ బురోడాశమే హవిస్సుగాఁగల యాగ్నేయయాగమును, నైంద్రయాగములను నాచరించును గాని, సాన్నాయ్యయాగముల నాచరింపఁడు. దధి, పయస్సు అను రెండును సాన్నాయ్య మనఁబడును.

వాక్యప్రమాణముచే దర్శేష్టికే యంగము లగుచున్నవి కాని, దర్శపూర్ణమాసప్రకరణమునం దీమాత్రము చెప్పఁబడినదిగదా యని, ప్రకరణ ప్రమాణముచే, దర్శపూర్ణమాసేష్టుల కంగములు కానేరవు. ప్రకరణప్రమాణముకంటె, వాక్యప్రమాణము బలవత్తరముగదా!

## ప్రకరణప్రమాణవిచారము

రెండు వస్తువులు కొంచెమంటిత్సోఁగల యాకాంక్ష[1] ప్రకరణము. ఉదా: ప్రయాజాదులను విధించు 'సమిధో యజతి' అను నీయున్నగు[2] వాక్యమునందు, విధిని సార్థకముగాఁ జేయుట కిష్టసామాన్యము భావ్యముగా నున్నను, నిష్టవిశేషము భావ్యముగా నిర్దేశింపఁబడకుండుటంజేసి, 'సమిధో యజతి'[3] అను వాక్యమునుండి, 'సమిత్తను దేవత నుద్దేశించి చేయఁబడు యాగము దేని నుత్పాదింపవలయును' అను నర్థము తెలిసిన వెంటనే, 'దేని నుత్పాదింపవలయును?' అని యీసమిద్యాగముచే నుపకరింపఁబడుదానినిగూర్చి యాకాంక్ష కలుగుచున్నది. దర్శపూర్ణమాసేష్టులను విధించు "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" అనువాక్యమునుండికూడ 'స్వర్గమును గోరువాఁడు దర్శపూర్ణమాసములను నిష్టులచే స్వర్గము నుత్పాదించునది' అను నర్థము తెలిసిన వెంటనే, 'యీ యిష్టులచే స్వర్గము నుత్పాదించుట యెట్లు?' అని యీయిష్టులు కుపకరించుదానినిగూర్చి యాకాంక్ష కలుగుచున్నది. ఇట్లీ రెండింటికిని బరస్పరమును గలుగు నాకాంక్షయను నీ ప్రకరణప్రమాణముచే, ప్రయాజాదులు, దర్శపూర్ణమాసేష్టుల కంగము లగుచున్నవి.

ఓయీ! ప్రయాజాదులను విధించు 'సమిధో యజతి' అను నిట్టివాక్యమందు ఇష్టవిశేషము చెప్పఁబడినయెడల, విశ్వజిన్న్యాయముచే స్వర్గ మనుఫలము కల్పింపఁబడుఁగాక. అది యెట్లనఁగా:—విశ్వజిత్తను యాగమును వివరించునధికరణమందు, 'విశ్వజితా యజేత'[4] అనువాక్యమునందు ఫలము చెప్పఁబడకుండుటంజేసియు, ఫలము లేనిదే పని సార్థకము కాకపోవుటంజేసియు, ఫలము కల్పింపఁబడవలసి యుండఁగా,

౧. సంబంధించుకోరిక.

౨. ౧. తనూనపాతం యజతి, ౨. ఇడో యజతి, ౩. బర్హిర్యజతి, ౪. స్వాహాకారం యజతి. అనునవి.

౩. దర్శపూర్ణమాసేష్టులు, ప్రయాజాదులు నను రెండు.

౪. విశ్వజిత్తనుయాగము నాచరించుటమూలముగా, నిష్టము నుత్పాదింపవలయును.

స్వర్గ మందఱకును నిష్ట మగుటవలన, నదియే ఫల మగుచున్న దని చెప్పఁబడినది. ఇందులకు 'స్వర్గ[1] మందఱకును సమానముగా నిష్ట మగుటంజేసి, కల్పింపఁదగిన ఫల విశేషము, స్వర్గమే యగుచున్నది' అను మీమాంసాసూత్రము ప్రమాణ మగుచున్నది. లేదా, 'రాత్రిసత్రన్యాయము' చేత నైన, నర్థవాదమునందు వినఁబడు ప్రతిష్ఠ యనుఫల, మీప్రయాజాదులకుఁ గల్పింపఁబడుఁగాక. రాత్రిసత్ర మను యాగము ను వివరించునధికరణమునందు, 'ప్రతితిష్ఠన్తి హవై య ఏతా రాత్రీ రుపయన్తి'[2] అను నర్థవాదమునకు[3] సమీపమునం దుండు 'జ్యోతిర్గౌ రాయు రితి త్ర్యహా భవన్తి'[4] అను విధివాక్యమందు ఫలము వినఁబడకుండుటంజేసియు, ఫలము లేనిదే విధి వ్యర్థము కావలసి యుండుటంజేసియు, నీ విధియందు ఫల మవశ్యముగాఁ గల్పింపవలసి యుండ, 'ప్రతితిష్ఠన్తి' ఈమున్నగు నర్థవాదమునందు వినఁబడిన ప్రతిష్ఠ యనునది, ఫల మగుచున్న దని చెప్పఁబడినది. విశ్వజిదధికరణమునందు వివరింపఁబడిన న్యాయము ననుసరించి, విశ్వజిద్యాగమున కుపస్థితము కానిస్వర్గ మనుఫలమును గల్పించుటయందును, నా ఫలమును బ్రస్తుత మగు ప్రయాజాదులతో సంబంధింపఁజేయుట యందును, గల్పనాక్లేశ మధికముగా నున్నందున, 'ప్రతితిష్ఠన్తి హవై' అనునీ మున్నగు నర్థవాదమునం దుపస్థిత మగు, ప్రతిష్ఠ యనుదానిని బ్రస్తుతమైన ప్రయాజాదులకు ఫలముగాఁ గల్పించుట సులు వగుచున్నదిగదా! ఇందులకు ప్రతిష్ఠ యనునది యర్థవాదమునందు నిర్దేశింపఁబడుటంజేసి, ఫలము కాఁదగిన దని, ఆత్రేయుఁ డను నాచార్యుఁడు చెప్పుచున్నాఁడు. "అట్టిఫలము వినఁబడనపుడు, స్వర్గము మున్నగునవి ఫల మని యూహింపవలసి యున్నది" అను జైమినిసూత్రము ప్రమాణముగాఁ గలదు. కావున, విశ్వజిన్న్యాయముచేఁ గాని, రాత్రిసత్రన్యాయముచేఁ గాని, ప్రయాజాదులు స్వతంత్రఫలము గల వగుట సంభవించుచుండ, నవి దర్శపూర్ణమాసేష్టుల కంగము లని యేల యంగీకరింపవలయును: ఇట్లు 'ఓయీ' మొదలుకొని, యింతవఱకును జేయు శంక కీక్రిందిది సమాధానము.

౧. జై. సూ. ౪-3-౧౫ "స స్వర్గ స్స్యాత్ సర్వాన్ ప్రత్యవిశిష్టత్వాత్"

౨. రాత్రి యనుపేరుగల యంగముల నాచరించువారు ప్రతిష్ఠను బొందుదురు.

3. విధివాక్యములందు విధింపఁబడువానియందలి ప్రాశస్త్యమును దెల్పుటమూలముగా, నా విధి వాక్యములతో నేకవాక్యతను బొందుటమూలముగాఁ బ్రమాణము లగువాక్యములు.

౪. "ఫలమాత్రేయో నిర్దేశా దశ్రుతౌ హ్యనుమానం స్యాత్."

అట్లు శంకించుట తగదు. ప్రయాజాదు లేదే నొకస్వతంత్రఫలమునకే యుపయోగించు నని సిద్ధింపఁజేయుపక్షమున, నీరెండింటిలో నొకదానికే యుండునాకాంక్ష మూలముగానే, యీరెండింటికిని[1] సంబంధము కల్పింపవలసి వచ్చును. అది యెట్లన; ఇచట స్వతంత్రఫలమునకు, సాధన మేది? యనునాకాంక్ష లేదు. విధివాక్యమునందు వినఁబడు ఫలముమాత్రమే, సాధనము నాకాంక్షించును. ఈప్రయాజాదులను విధించువాక్యములయందు దట్టి స్వతంత్రఫలము వినఁబడుట లేదుగదా![2] కావున, నీ స్వతంత్రఫలమునకు సాధనాకాంక్ష[3] కలుగ లేదు గనుకఁ, ప్రయాజాదులకుమాత్రము ముందు 'వీనిచే నేఫలము సంపాదింపవలయును?' అను భావ్యాకాంక్షమూలముగానే,[4] వీని కేదే నొకస్వతంత్రఫలము కలుగుట సిద్ధింపవలసి వచ్చును. ఈప్రయాజాదులు దర్శపూర్ణమాసేష్టులకే యుపయోగించు నని చెప్పుట కన్ననో, యీరెండింటికిని నుండు రెండాకాంక్షలును గూడఁ బ్రమాణము లగుచున్నవి. ప్రయాజాదులకు "వీనిచే సాధింపఁబడుఫల మెద్ది"? అను భావ్యాకాంక్షయు, దర్శపూర్ణమాసేష్టులకు 'వీని నెట్లాచరింపవలయును'? అను కథంభావాకాంక్షయు[5] ననెడు రెండాకాంక్షలిచటఁ గలవుగదా! రెండింటిలో నొకదానికిమాత్రమె కలుగునాకాంక్షకంటె, నారెండింటికిని గలుగునుభయాకాంక్ష బలవత్తర మైన దని, ముందు[6] వివరింపఁబడును. కాఁగా, నీప్రయాజాదులు దర్శపూర్ణమాసేష్టుల కుపయోగించు నని చెప్పుటయే యుక్తము కాని, యేదే నొకస్వతంత్ర మగుఫలముకొఱ కుపయోగించు నని చెప్పుట తగదు. ఇందులకు, "ద్రవ్యము,[7] సంస్కారము, కర్మము ననునవి తమకంటె నితరము లగువాని

౧. దర్శపూర్ణమాసేష్టులు, ప్రయాజాదులు అనునవి.

౨ 'సమిధో యజతి' 'తనూనపాతం యజతి' అను నీయున్నగు ప్రయాజాదులను విధించువాక్యములయందెచటను ఫలము వినఁబడుట లేదు.

౩. = కరణాకాంక్ష. దీనికి సాధన మేది యనునాకాంక్ష.

౪. సాధ్యాకాంక్ష = ఫలాకాంక్ష = ఫల మేది యనునాకాంక్ష.

౫. = ఇత్థంభావాకాంక్ష = ఇతికర్తవ్యతాకాంక్ష = ఇది యెట్లు చేయవలయు ననెడి యాకాంక్ష.

౬. ప్రకరణ మనుప్రమాణము, స్థానము, సమాఖ్య యనుప్రమాణములకంటె బలవత్తర మైన దని నిరూపించుసందర్భమునందు.

౭. జై. సూ. ౪ + ౩-౧ "ద్రవ్యసంస్కారకర్మసు పరార్థత్వాత్ఫలశ్రుతి రర్థవాదస్స్యాత్."

కొఱకే యుపయోగించును గనుక, వాని నుద్దేశించి యేదే నొకఫలమును బోధించు స్తుతివాక్య మర్థవాద[1] మగుచున్నది" అను సూత్రము ప్రమాణ మగుచున్నది. వీనిలో ద్రవ్యము నుద్దేశించి ఫలమును బోధించుశ్రుతివాక్యమున కుదాహరణము:— "ఎవనియొక్క[2] జుహూవు, మోదుగుచెట్టుకఱ్ఱతోఁ జేయఁబడునో, యతఁడు పాపకరములగు వాక్యములను వినఁడు." అనునీమున్నగునవి.[3] సంస్కారము నుద్దేశించి ఫలమును బోధించు విధివాక్యమున కుదాహరణము:— "యజమానుఁడు[4] యజ్ఞదీక్షయందుఁ దనకంటికి కంజన ముంచుకొనుటమూలముగాఁ దనశత్రువుయొక్క కంటిని నశింపఁజేయుచున్నాఁడు"[5] అనునీమున్నగునవి. కర్మము నుద్దేశించి ఫలమును విధించు విధివాక్యమున కుదాహరణము:—

"ప్రయాజములను,[6] ననూయాజములను, నాచరించువాఁ డా యజ్ఞమున కొకకవచమును ధరింపఁజేయుచున్నాఁడు" ఈ మొదలైనవి.[7] "ద్రవ్యము సంస్కారము..." అను పైసూత్రమం దుండు, సంస్కార మనుపదము, ద్రవ్యమునం దేదే నొకసంస్కారమును గలిగించు కర్మమును బోధించుచున్నది గనుక, నచట నుండు

౧. వేదమునందు, మంత్రములు, బ్రాహ్మణములు నను రెండుభాగములు గలవు. వీనిలో బ్రాహ్మణములతో సంబంధించి యేకార్థ్యముగను జెంగువాక్యముల కర్థవాదము లని పేరు

౨. "యస్య పర్ణమయీ జుహూర్భవతి, న స పాపగ్ం శ్లోకగ్ం శృణోతి."

౩. "యస్య వైకంకతీ ధ్రువా భవతి, ప్రత్యేవాస్యాహుతయ స్తిష్ఠ న్త్యథాప్రైవ జాయతే. = ఎవనియొక్క ధ్రువయను పాత్రము, కాండ్రేగుకఱ్ఱతోఁ జేయఁబడునో, యతఁడు చేయు హోమము లతనికిఁ బ్రతిష్ఠను గలుగఁజేయును-అనునీమొద లైనవి.

౪. "యదాఙ్క్తే చక్షురేవ భ్రాతృవ్యస్య వృఙ్క్తే." తై. సం॥ ౬-౧-౧-౫.

౫. "యన్నవనీతే నాభ్యఙ్క్తే సర్వా ఏవ దేవతాః ప్రీణాతి" యజమానుఁడు యజ్ఞదీక్షయందు నవనీతమును దనశరీరమునందుఁ బూసికొనటచే, సమస్తదేవతలను సంతోషింపఁ జేయుచున్నాఁడు—

౬. 'వర్మ వా ఏత ద్యజ్ఞస్య క్రియతే, య త్ప్రయాజానూయజా ఇజ్యంతే' తై. సం. ౨-౬-౧-౫

౭. 'య దాజ్యభాగౌ యజతి, చక్షుషీ ఏవ, తద్యజ్ఞస్య ప్రతిదధాతి' ఈ మొదలయినవి. = ఆజ్యభాగములనెడు హోమములను జేయువాఁడు, తాను జేయు యజ్ఞమునకుఁ గన్నుల నుంచుచున్నాఁడు.

'కర్మము' అనుపదము, 'ఆరాదుపకారక'[౧] మను కర్మమునే బోధించు నని తెలియు నది. ఈవిషయ మింతటితో ముగింతము.

ఇట్లు ప్రకరణమను ప్రమాణముయొక్క స్వరూపము నిరూపింపఁబడి, యితర ప్రమాణములకంటె దానియం దుండువిశేషము తెలియఁజేయఁబడుచున్నది. ఈప్రకరణ మనుప్రమాణ మేదే నొకక్రియనే, యంగముగా వినియోగింపఁజేయును గాని, ద్రవ్యమును, గుణమును నంగములుగా వినియోగింపఁజేయఁజాలదు. ద్రవ్యగుణములు నంగములుగా వినియోగింపఁజేయవలసినపుడు, వానితో సంబంధించు నేదే నొకక్రియా మూలముగానే, యిట్లు వినియోగింపఁజేయును. అట్లెట్లు చేయవలయునో వివరించెదను, వినుము. "యజేత స్వర్గకామః" అనువాక్యమందలి 'యజేత' పదమం దుండు 'త' ప్రత్యయమం దుండెడి యాఖ్యాతత్వ మనునంశముచే, 'చేయవలెను' అనునర్థభావన తెలియఁజేయఁబడుచున్నది. ఈయర్థభావనయందు (i) దేనిని జేయవలయును? (ii) దేనిచేఁ జేయవలెను? (iii) ఎట్లు చేయవలయును? అను మూఁడంశములు గలవు. వీనిలో 'భావ్య మేది' యని యాకాంక్ష కలుగఁగా, ఫలాద్యన్యాయము[2] మూలమున, స్వర్గము భావ్యముగా నన్వయించును గావున, 'స్వర్గము నుత్పాదింపవలయును' అను నర్థ మేర్పడుచున్నది. ఇచటఁ 'గరణ మేది' యని యాకాంక్ష కలుగఁగా, 'భావార్థాధికరణన్యాయము'[3] ననుసరించి, యర్థభావనను బోధించు 'త' ప్రత్యయ మునందు 'యజేత' పదముచేతనే, తనయం దుండెడి 'యజి' ధాతువుమూలమున బోధింపఁబడుచున్నయాగము, కరణముగా నన్వయించుచున్నది. కాఁగా, 'యాగముచే స్వర్గము నుత్పాదింపవలయును' అనునర్థ మేర్పడుచున్నది. పిమ్మట యాగముచే స్వర్గము నెట్లుత్పాదింపవలయును? అని కథంభావాకాంక్ష కలుగఁగా, నీవాక్యసమీపమునఁ బఠింపఁబడినదియు, నిర్దేశింపఁబడినఫల మేమియు లేనిదియు నగు క్రియాసమూహమే తనచే నేది యుపకరింపఁబడవలయును? అను నాకాంక్షమూలమున, నితికర్తవ్యతగా నన్వయింపఁదగి యున్నది. లోకమునందు 'కథంభావాకాంక్ష' కలుగునపుడు, ఏదే నొక క్రియయే యట్టియాకాంక్షను బూరింప నన్వయించు నని తెలియుచున్నది గదా!

౧. ప్రధానయాగమున కుపకరించునంగములు, సన్నిపత్యోపకారకము లనియు, ఆరాదుపకారకము లనియు, రెండువిధములు.

౨. ఈన్యాయము 'సోమేన యజేత' అను ప్రకరణమున వివరింపఁబడినది.

3. ఇదియు సోమయాగప్రకరణముననే, వివరముగా వ్రాయఁబడినది.

'గొడ్డలిచేఁ గట్టె నెట్లు చీల్పవలెను' అని యాకాంక్ష కలిగినపుడు, 'హస్త' మనుపదముమాత్ర మట్టిసందర్భమం దుచ్చరింపఁబడుచున్న దైనను, దానిచే బోధింపఁబడు చేయి యితికర్తవ్యతగా నన్వయింపనేరదు. అ ట్లన్వయింపఁదగిన దేది యన, 'గొడ్డలిని జేతితోఁ బైకెత్తి, క్రిందఁ బడవైచి' అని చెప్పఁబడును గనుక, 'పై కెత్తుట, క్రిందఁ బడవైచుట' అను నీరెండు క్రియలే య ట్లన్వయించును. చేయికూడ నారెండు క్రియలమూలముగానే య ట్లన్వయించు నని యెల్లరకును దెలిసినవిషయమే.

ఇంతే కాక, కథంభావాకాంక్ష యనఁగాఁ, గరణమునకు సంబంధించియుండు, 'ప్రకార మేది' యనునాకాంక్ష. 'కథమ్' శబ్దమునం దుండు 'థమ్'[౧] అను ప్రత్యయము, ప్రకారమును బోధించును. ప్రకార మనఁగా, నొకానొక సామాన్య, మితరము లగు వానికంటె భిన్న మని, తెలియఁజేయుటకై, దానియం దుండువిశేషము. ఒకానొక క్రియ యనెడిసామాన్యమే, భావనరూపముగా 'యజేత' పదమందలి 'త' ప్రత్యయమం దుండు, నాఖ్యాత మనునంశముచేఁ దెలియఁజేయఁబడుచున్నది. 'యజేత స్వర్గకామః' అనువాక్యమునుండి యున్నదో, యాగముచే స్వర్గము నె ట్లుత్పాదింపనగునో, యట్లా యాగమము నాచరింపవలెను.' అనునర్థము తెలియఁ జేయఁబడుచున్నది. ఇచట స్వర్గము నుత్పాదించునట్లు యాగము నాచరించుటలో, నొకానొకవిశేష ముండవలయు నని తెలియుచున్నది. క్రియ యనెడి సామాన్యమం దుండెడి విశేషము, క్రియయే యగును. బ్రాహ్మణజాతి యనెడు సామాన్యమునం దుండువిశేష మగు పరివ్రాజకుఁడు (సన్న్యాసి) మున్నగువారు, బ్రాహ్మణులే యగుదురు గాని, వారికంటె వేఱు కానేరరు. కాఁగా, నిచటఁ గరణమగు యాగక్రియయం దుండవలసిన విశేష మేది యని, క్రియావిశేషాకాంక్ష యను మఱియొకపేరుగల కథంభావాకాంక్ష కలుగఁగా, వేఱొకక్రియయే యట్టియాకాంక్షను బూరించున ట్లన్వయించుటయే, యుచితము. ఇచటఁ గరణమగు యాగమందుండు క్రియావిశేషము,[౨] అన్వాధానము మొదలు, బ్రాహ్మణులగు ఋత్విజులను దృప్తిపఱచుటపర్యంతమును గల క్రియాసమూహమే యగుచున్నది. కావున నట్టి క్రియావిశేషము, ప్రకరణమను ప్రమాణముచేతనే గ్రహింపఁజేయఁబడుచున్నది. ఈ క్రియావిశేషము కరణమునం దుండుట యనఁగా, నిది (క్రియావిశేషము) కరణమున కుపకరించుటయే. అట్టి క్రియావిశే

౧. కథమ్ = కిం + థము = క + థము = కథమ్.

౨. ఒకానొక ప్రత్యేకమగు క్రియ.

పము లేకుండినచో, యాగసామాన్యమువలన, ఫలమును జనింపఁజేయు నపూర్వము పుట్టనేరదుగదా! గొడ్డలిని పైకెత్తుట, క్రిందకట్టెమీఁద సరిగాఁ బడవేయుట, అనెడు క్రియలు సరిగా జరుపకున్నచో, నాగొడ్డలిచేఁ గట్టె రెండుగాఁ జీల్పఁబడదు గదా. కాఁగా, కథంభావాకాంక్ష కలుగునపు, డొకానొకక్రియావిశేషమే, యట్టియాకాంక్షను బూరింప నన్వయించు నని సిద్ధించుచున్నది.

కావుననే, ద్రవ్యమును, దేవతయు సిద్ధము లైనను, నేదే నొకదేవత నుద్దేశించి చేయుద్రవ్యత్యాగరూప మగు యాగముయొక్క స్వరూపము నుత్పాదించుట యను క్రియాద్వారమున, భావనయం దన్వయించు నని, సాంప్రదాయికులచేఁ[1] జెప్పఁబడుచున్నది. వికృతియాగమునందలి[2] భావనయందుఁగూడఁ, గథంభావాకాంక్ష కలుగునపుడు, మొదటఁ బ్రకృతియాగమందలి కరణమగు యాగమునకుఁ గలిగిన యుపకారములే, యిచటను నతిదేశింపఁబడి,[3] యావెంబడినే వానిని (ఉపకారములను) జనింపఁజేయు క్రియలును నతిదేశింపఁబడు నని, శాబరభాష్యమునందుఁ[4] జెప్పఁబడినది. ఒకవేళఁ గథంభావాకాంక్ష కలుగునపుడు, సిద్ధ మగువస్తు వాయాకాంక్షను బూరింప నన్వయింపఁదగి యున్నపక్షమున, 'సిద్ధములగు ద్రవ్యమును దేవతయు, యాగస్వరూపమును సంపాదించుటద్వారముననే, భావనయం దన్వయించును' అను సాంప్రదాయికుల వాక్యము వ్యర్థ మయ్యెడిని. కావునఁ గ్రియయే యితికర్తవ్యతగా నన్వయింపఁదగినది. కథంభావాకాంక్షను బూరించున ట్లన్వయింపఁదగినదియే, యితికర్తవ్యత యగుచున్నది గదా! 'ఇతికర్తవ్యత' అనుపదమునందలి 'ఇతి' శబ్దమునకుఁ బ్రకార[5] మర్థము. 'కర్తవ్య' పదమునకు 'చేయఁదగినది' ( = క్రియాసామాన్యము = ఏదే నొక క్రియ.) అని యర్థము. కావున, 'ఇతికర్తవ్యత' యనఁగా, 'చేయఁదగిన క్రియాసామాన్యము.'[6] ప్రకార మనఁగా, నొకానొక సామాన్య

౧. సంప్రదాయ మనఁగా వేదము. వేదమును సమగ్రముగాఁ దెలిసికొనినవారు సాంప్రదాయికులు.

౨. ఇష్టులును, యాగములును ప్రకృతు లనియు, వికృతు లనియు రెండువిధములుగా నున్నవి.

3. ఒకసందర్భమునందు విధింపఁబడినవై, వేఱొకసందర్భమునందుఁ గూడ స్మరింపఁబడి యన్వయింపఁబడినవి.

౪. జైమినిరచించిన పూర్వమీమాంసాసూత్రములకు శబరస్వామిచే రచియింపఁబడిన భాష్యము.

౫. విధము = రీతి = పద్ధతి.

౬. ఏదే నొకక్రియ.

మితరము లగువానికంటె భిన్న మని తెలియఁజేయుటకై, దానియం దుండు విశేష మని, యింతకుముందే చెప్పఁబడినది. ఒకానొకక్రియయం దుండువిశేషము, క్రియయే యగుచున్నది. కావున, సిద్ధ మగువస్తు వెన్నఁడును నితికర్తవ్యత కాఁజాలదు. మఱే మన నొకక్రియావిశేషమే యితికర్తవ్యత కాఁగలదు. సిద్ధములగు ద్రవ్యము, దేవత మున్నగునవి యున్ననో, కరణ మగు యాగమున కంగములుమాత్రమే కాఁదగి యున్నవి. అట్లగుటకూడ, శ్రుతి మున్నగు నితరప్రమాణములమూలముగానే కాని, ప్రకరణప్రమాణముమూలమునఁ గాదు. ఇందులకు, "ప్రస్తుతపుఁ గ్రియలసందర్భములందు" వినఁబడు ద్రవ్యము గాని, గుణము గాని యేకవాక్యముచేఁ గల్పింపఁబడిన యేదేనొక యవాంతరవ్యాపారముతో సంబంధించినదే కాని, యాక్రియలయం దితికర్తవ్యతగా నన్వయింప నేరదు." అను ప్రమాణము గలదు. కనుకనే, 'బర్హిర్దేవసదనం దామి'[2] అను నిట్టి మంత్రములు, లింగప్రమాణముమూలముగానే, యాయాక్రియల కంగములగుచున్నవి గాని, ప్రకరణప్రమాణముమూలమునఁ గాదు. అని, రాణకమను గ్రంథమునందలి, యర్థవాదాధికరణమునం దుండు, పూర్వపక్షమును ముగించు సందర్భమునఁ జెప్పఁబడియున్నది. కొన్నిస్థలములయందు,[3] ద్రవ్య మితికర్తవ్యతగా నన్వయించు నని చెప్పినమాటకు 'అనేకగ్రంథములయం[4] దంగీకరింపఁబడుటచేతను, పైని వివరింపఁబడినయుక్తులచేతను, నాద్రవ్య మంగముగానే యన్వయించు నని యభిప్రాయము. కాఁగా, ప్రకరణ మనుప్రమాణ మొకానొకక్రియనే యంగముగా వినియోగింపఁజేయు నని సిద్ధించుచున్నది.

ఈప్రకరణము, మహాప్రకరణము, అవాంతరప్రకరణము నని రెండువిధములుగా నున్నది.

౧. "నావాంతరక్రియాయోగాదృతే వాక్యోపకల్పితాత్, గుణద్రవ్యే కథం భావైర్ గృహ్ణన్తి ప్రకృతాః క్రియాః."

౨. దేవతలకు స్థానముగా నుద్దేశింపఁబడిన బర్హిస్సును గోయుచున్నాను.

3. పార్థసారథిమిశ్రులచే రచియింపఁబడిన న్యాయరత్నమాల యను మీమాంసాగ్రంథము.

౪. శాబరభాష్యము, తంత్రవార్తికము, న్యాయసుధ మున్నగుగ్రంథములు.

# మహాప్రకరణము

వానిలో, స్వర్గాదిఫలముల నుత్పాదించుట యను ఫలభావనకు సంబంధించు ప్రకరణము మహాప్రకరణము. దర్శపూర్ణమాసేష్టులచే స్వర్గము నుత్పాదించుట యనునది ఫలభావన గనుక, మహాప్రకరణముచేఁ బ్రయాజాదులు, దర్శపూర్ణమాసేష్టుల కంగము లగుచున్నవి. ఉభయాకాంక్ష ప్రకృతులయందే యుండును గాన, నీమహాప్రకరణము ప్రకృతులందే ప్రవర్తించును గాని, వికృతులందుఁ బ్రవర్తింపనేరదు. ఏ యాగమునందు, భావన కావశ్యకము లగునంగము లన్నియుఁ గర్తవ్యములుగా నుపదేశింపఁబడునో, యట్టియాగము ప్రకృతి. ఉదా:—ఇష్టులలో దర్శపూర్ణమాసేష్టులు ప్రకృతులు[1], ఆ యిష్టులందుఁ, బ్రయాజాదులసంబంధము లేనిదే, ప్రధానముల కుండు కథంభావాకాంక్ష యుపశమింప కుండుటంజేసియుఁ, బ్రధానములతో సంబంధము లేనిదే, ప్రయాజాదుల కుండు నుపకార్యాకాంక్ష యుపశమింప కుండుటంజేసియు, నాయుభయాకాంక్ష యనెడు ప్రకరణము ప్రవర్తించి, ప్రధానములకుఁ బ్రయాజాదు లంగము లని తెలియఁజేయుచున్నది. వికృతులం దన్ననో, యట్టిప్రకరణము సంభవింపనేరదు. ఏ యాగమునందు భావన కావశ్యకము లగునంగము లన్నియుఁ గర్తవ్యములుగా నుపదేశింపఁబడవో, యది వికృతి. ఉదా:—సౌర్యేష్టి మొదలగునిష్టులు.[2] అట్టివికృతియందుఁ బ్రోక్తగాఁ బఠింపఁబడు నుపహోమములు మున్నగు పూర్వాంగములు, ప్రకరణప్రమాణముచే నంగములుగా వినియోగింపఁబడనేరవు. ఆలోచింపఁగా, నీవికృతియం దుపదేశింపఁబడిన యపూర్వాంగములకు 'వీనిచే దేని నుత్పాదింపవలయును ? అను నుపకార్యాకాంక్ష కలదు. కాని, యిచట ప్రధానమున కావశ్యకమగు కథంభావాకాంక్ష, ప్రకృతినుండి యతిదేశముచేఁ బ్రాప్తించునంగముల మూలముననే యుపశమించును గాన, నట్టికథంభావాకాంక్ష ప్రధానమున కుండదు. కావున, నుభయాకాంక్ష యనెడు ప్రకరణప్రమాణముచే, నిచ్చటి యపూర్వాంగములకు వినియోగము సంభవింపనేరదు. 'ప్రకృతియందలి యంగములు వికృతియందుఁ బఠింపఁబడ కుండుటంజేసి, యప్రత్యక్షము లగుటవలనను, వికృతియందలి యపూర్వాంగము లన్ననో, వికృతియందే పఠింపఁబడుటచేఁ బ్రత్యక్షము లగుటవల

౧. యాగములందు జ్యోతిష్టోమము ప్రకృతి.

౨. యాగములందు బృహస్పతిసవనము మొదల అశ్వమేధమువఱకునుగల వన్నియును వికృతులు.

నను, వికృతియందలి ప్రధానములకుండు కథంభావాకాంక్ష యీయపూర్వాంగముల వలననే యేల యుపశమింపఁగూడదు ?' అని శంకింపవలదు. ఆయపూర్వాంగములు వికృతియందుఁ బఠింపఁబడుటచేఁ బ్రత్యక్షము లయినను, వానిచే నిట్టి యుపకారము సిద్ధింపఁగల దని, యింతకుముందు దెలియలేదు గనుక, నీయపూర్వాంగములు వేగముగాఁ బ్రధానమున కుండు కథంభావాకాంక్ష నుపశమింపఁజేయ సమర్థములు కానేరవు. ప్రకృతియందలి యంగము లన్ననో, దానియందలి ప్రధానముల కింతకుముందుపకరించినట్లు తెలియుటవలన, నవి వికృతియం దుపదేశింపఁబడ కుండుటచే నప్రత్యక్షము లయినను, నిచట నతిదేశింపఁబడుటచేతనే—యిందలి ప్రధానముల కుండు కథంభావాకాంక్ష నుపశమింపఁజేయ సమర్థము లగుచున్నవి. ప్రకృతియందలి యంగములను, వికృతియందు స్మరింపఁజేయుటకు సమర్థమగు ప్రమాణము లేకపోలేదు. ఉపమాన మను ప్రమాణముమూలముగా, నవి వికృతియందు స్మరింపఁజేయఁబడఁగలవు. గవయ మను మృగమును జూచినపుడు, గోవుయొక్క పోలిక దానియందుఁ గనుపట్టుటచే, గవయమృగము గోవువంటిదే యని, యుపమానప్రమాణముమూలముగాఁ దెలియుచున్నది. అట్లే, వికృతియగు సౌర్యేష్టిని విధించు 'సౌర్యం చరుం నిర్వపేత్'[1] అనువాక్యమును జూచినపుడు, దీనియందు నోషధివలనఁ బుట్టిన చరు వను ద్రవ్యమును, సూర్యుఁ డను నొకదేవతయు, వినఁబడుటచే నీవాక్యము, అగ్ని యను నొకటే దేవతను, నోషధివలనఁ బుట్టిన పురోడాశ మనుద్రవ్యమును బోధించునదియుఁ, బ్రకృతి యగు దర్శేష్టియందలి ప్రధానమైన యాగ్నేయయాగమును విధించునదియు నగు 'యదాగ్నేయోఽష్టాకపాలోఽమావాస్యాయాం......'[3] ఈ మున్నగు వాక్యమును సరిగాఁ బోలియున్న దని తెలియుచున్నది. అట్లు తెలియుటచే, నాగ్నేయవాక్యమునుండి[3] తెలిసికొనఁబడు భావనారూప మగునర్థమును, భావన కావశ్యకము లగు నంగములును, నీ సౌర్యవాక్యమునుండి[4] కూడఁ దెలిసికొనఁబడవలసియున్న దని స్పష్టపడుచున్నది.

౧. సూర్యునికొఱకు చరువును నిర్వపించి యజించుటచే నిష్టము నుత్పాదింపవలయును.

౨. చరువు = హోమమునిమిత్త మగు నన్నము.

3. దర్శేష్టియందుఁ బ్రధానమగు నాగ్నేయయాగమును విధించు 'యదాగ్నేయ' ఇత్యాది వాక్యము.

౪. వికృతి యగు సౌర్యేష్టిని విధించు 'సౌర్యం చరుం నిర్వపేత్' అనువాక్యము.

ఆభావనయందు సాధ్యము, కరణము, ఇతికర్తవ్యత అను మూఁడంశములు గలవు. వానిలో బ్రహ్మవర్చస[౧]మను భావ్యమును, 'చరువు' అను ద్రవ్యమునకును సూర్యుఁడను దేవతకును గల సంబంధముచే నూహింపఁబడు యాగ మనెడి కరణమును, సౌర్యవాక్యమునం దున్నవి గనుక, నిఁక నితికర్తవ్యతాకాంక్ష కలుగఁగా, నాగ్నేయయాగమునందలి యంగములచేఁ గలిగిన యుపకారమే, యీసౌర్యయాగమం దతిదేశింపఁబడి, యాయుపకారము వెంబడినే, దానిని జనింపఁజేయు నంగములు నితికర్తవ్యతకూడ, నీవికృతియాగమునం దతిదేశింపఁబడును. అట్లు చేయుటచే, బ్రహ్మవర్చసమును గోరువాఁడు, ఆగ్నేయయాగమునందలి యంగములచే జనించినయుపకారమునే వినియోగించి, సౌర్యయాగము నాచరించుటమూలముగా, నట్టి బ్రహ్మవర్చసము నుత్పాదించుకొనవలయును. ఆగ్నేయయాగమునుండి యతిదేశింపఁబడిన యితికర్తవ్యతమూలముగానే, సౌర్యయాగమందలి యితికర్తవ్యత శాంతింపఁగలదు గనుక, వికృతియాగమునందు ఉభయాకాంక్ష యనెడి ప్రకరణప్రమాణముచే వినియోగము సంభవింపనేరదు. వికృతియాగమునం దుపదేశింపఁబడిన యపూర్వాంగములకన్ననో, వీనిచే నుపకరింపఁబడున దేది? యను నుపకార్యాకాంక్ష యొక్కటి మాత్రమే యుండుటంజేసి, యొకటేయాకాంక్ష యనెడి స్థానప్రమాణము మూలముగా, నీయపూర్వాంగములు అందలి ప్రధానముతో సంబంధించును. 'ప్రకృతినుండి వికృతిలోనికిఁ దీసికొని రాఁబడు నంగములే ప్రకరణప్రమాణము మూలముగా నందలి ప్రధానముతో నేల సంబంధింపఁజేయఁబడఁగూడదు.'? అని చెప్పరాదు. ఆయంగములు ప్రకృతియందలి ప్రధానమున కింతకుముందే యుపకరించిన వగుటంజేసి, వానికిఁ గలిగిన యుపకార్యాకాంక్ష యుపశమించినది గదా! కావున నుభయాకాంక్ష యనెడి ప్రకరణ మిచటఁ బ్రవర్తింపనేరదు.

"ఓయీ! ప్రకృతినుండి యతిదేశింపఁబడిన యంగముల కిఁక నుపకార్యాకాంక్ష లేకుండుటంజేసి, యవి స్థానప్రమాణము మూలముగానే వికృతియందలి ప్రధానముతో సంబంధింపవలసి యున్నది. వికృతియం దుపదేశింపఁబడిన యపూర్వాంగ

౧. 'సౌర్యం చరుం నిర్వపేత్ బ్రహ్మవర్చసకామః' = బ్రహ్మవర్చసమును గోరువాఁడు, సూర్యునికొఱకు 'చరువు'ను సమర్పించి యజించుట మూలముగా, నిష్టము నుత్పాదించుకొనవలయును. బ్రహ్మవర్చసము = బ్రహ్మతేజము.

౨. స్థాన మనఁగా సన్నిధి. సన్నిధియం దుండు నంగములకు నుపకార్యాకాంక్ష యొకటే యుండును.

ముల కన్ననో, యుపకార్యాకాంక్ష యుండుటవలనను, నందలి ప్రధానమునకుఁగూడ నుపకారకాకాంక్ష యుండుటవలనను, నా యపూర్వాంగములు ప్రకరణ ప్రమాణము మూలముగానే యాప్రధానముతో సంబంధింపఁగలవు. స్థానప్రమాణముకంటెఁ బ్రకరణప్రమాణమే యెక్కువ శీఘ్రముగాఁ బ్రవర్తించి, యంగములను వినియోగింపఁ జేయును. కాఁగా నపూర్వాంగములే మొదట వికృతియందలి ప్రధానముతో సంబంధింపవలసి యున్నవి గాని, ప్రకృతినుండి యతిదేశింపఁబడిన యంగములు కాదు" అను శంక క్రిందిది సమాధానము: ప్రకరణ ప్రమాణము స్థానప్రమాణముకంటె శీఘ్రముగా వినియోగింపఁజేయు ననుమాట సత్యమే. కాని ప్రమాణముల బలాబలతారతమ్యముకంటెఁ బ్రమేయములందలి బలాబల తారతమ్యమే ముఖ్యముగా గ్రహింపఁదగి యున్నది. స్థానప్రమాణముకంటెఁ బ్రకరణప్రమాణము బలవత్తర మైనను, ప్రమేయములలోఁ బ్రాకృతాంగము[౧] లింతకుముం దుపకరించిన వగుటచే, నికముం దుపకరింపఁబోవు వైకృతాంగములకంటెను[౨] బ్రబలము లగుచున్నవి. కనుక నతిదేశముమూలముగా స్మరింపఁబడు ప్రాకృతాంగములే, మొదట వికృతియందలి ప్రధానములతో సంబంధించుట యుక్తము. కాని, యిఁకముందు కల్పింపఁబడవలసిన యుపకారము కల వగుటంజేసి, వైకృతాంగములు మొదట నందలి ప్రధానముతో సంబంధించుట యుక్తము కాదు. వికృతియందలి ప్రధానమున కుపకరింపఁ గలిగిన యంగములనుగూర్చి, యాకాంక్ష యుండును గాని, కేవల మేమైన నంగమాత్రములనుగూర్చి కాదు. అట్టి యుపకరించు సామర్థ్యము ప్రాకృతాంగములకే సిద్ధమైయున్నది గనుక, నవియే మొదట వికృతియందలి ప్రధానముతో సంబంధించుట యుచితము. కాఁగా, వికృతియందుఁ బ్రకరణప్రమాణము ప్రవర్తించి వినియోగింపఁజేయనేరదు.

వికృతియందుఁ బ్రాకృతాంగము ననువదించి, దాని కంగముగా నేదైన విధింపఁబడును. ఉదా: 'ఔదుంబరో[3] యూపో[౪] భవతి' = యూపస్తంభము మేడి కఱ్ఱతోఁ జేయఁబడవలసినది. (తై. సం. ౨-౧-౧-౬) అనువాక్యమువలనఁ, బ్రకృతి

౧. ప్రకృతియందలి యంగములు.

౨. వికృతులయందలి యంగములు.

3. 'సోమా పౌష్ణం త్రైరిత మాలభేత పశుకామః' అనువాక్యమువలన విహితమగు కామ్యపశుయాగముయొక్క సన్నిధియం దీవిధి వినఁబడుచున్నది.

౪. యాగములయందుఁ బశువులను గట్టుట కుపయోగించు స్తంభము.

యందలి యూపము ననువదించి, దాని కంగముగా 'మేడికఱ్ఱతోఁ జేయఁబడుట', వికృతియందు విధింపఁబడుచున్నది. ఇట్లు విధింపఁబడిన 'మేడికఱ్ఱతోఁ జేయఁబడుట' అనునది యన్ననో, ప్రకరణప్రమాణము మూలమున, నందలి ప్రధానమున కంగ ముగా గ్రహింపఁబడుచున్నది.

అయ్యా! మేడికఱ్ఱతోఁ జేయఁబడుట యనునది క్రియకాదు గనుకఁ బ్రకరణ ప్రమాణముమూలమున నంగముగా గ్రహింపఁబడదు. క్రియయే ప్రకరణప్రమాణము మూలమున నంగముగా గ్రహింపఁబడఁగలదు గదా!" అనుశంక క్రిందిది సమాధాన మగును. ప్రకరణప్రమాణముచేఁ గ్రియయే గ్రహింపఁబడఁగల దనునది సత్యమే, కాని యిచట విధింపఁబడు మేడికఱ్ఱతోఁ జేయఁబడుట యనుదానికి 'దీనిచే దేని నుత్పాదింపవలయును' అనునాకాంక్ష యుండనేయున్నది. "ప్రకృతియందలి యూపము ననువదించి దానినిగూర్చి వికృతియందు 'ఔదుంబరత్వము'[౧] విధింపఁబడుటచేతను, నాయూప మదృష్టమే స్వరూపముగాఁగల దగుటచేతను, 'ఔదుంబరత్వము' ఆయదృష్టముతో సంబంధించుటచేతనే,—యాహవనీయాగ్ని[౨] యదృష్టమే స్వరూపముగాఁగల దగుటం బట్టి, 'అగ్న్యాధానము'[3] ఆయదృష్టమును జనింపఁజేయున దైనను, నట్లు (ఆయదృష్టముతో) సంబంధించుటచేతనే యాధానమువ కుండునాకాంక్ష యుపశమించు నట్లు,—దాని (ఔదుంబరత్వముయొక్క) యాకాంక్షకూడ నుపశమించుచున్నది." అని శంకింపవలదు. యూపము కేవల మదృష్టమే స్వరూపముగాఁ గలది కాదు. అట్టిదే యైనయెడల, దానినిగూర్చి ప్రకృతియందు విధింపఁబడు ఖాదిరత్వము, బైల్వత్వము, పాలాశత్వము ననునవి. కేవల మదృష్టమే ఫలముగాఁగలవి కావలసివచ్చును. అవి యటువంటివి కావు. అట్లయినచో, ఖదిరము (చండ్రకఱ్ఱ) దొరకని పక్షమందు దానికిఁ బ్రతినిధిగా 'కదరము' (తెల్లచండ్రకఱ్ఱ)వాడుటకు వీలు లేకపోవలసి వచ్చును. అదృష్టమే ఫలముగాఁగలదానికి, మాఱుగా నేదైన వాడఁబడఁగూడదు గదా! ఖది

౧. ఉదుంబర మనఁగా మేడిచెట్టు. ఔదుంబరత్వమన, మేడికఱ్ఱతోఁ జేయఁబడుట.

౨. ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అను మూఁడగ్నులకును త్రేతాగ్ను లని పేరు. యాగములయందలి హోమము లనేకములు ఆహవనీయాగ్నియందే జరుపఁబడును.

3. ఆధానము = త్రేతాగ్నులను మంత్రసంస్కారయుక్తముగా స్థాపించుకర్మము. ఖాదిరత్వము= చండ్రకఱ్ఱతోఁ జేయఁబడుట. బైల్వత్వము = మారేడుకఱ్ఱతోఁ జేయఁబడుట. పాలాశత్వము = మోదుగు కఱ్ఱతోఁ జేయఁబడుట.

రమువలన జనించునదృష్టము, కదరమువలన జనింపఁజేయఁబడగల దని చెప్పుటకుఁ ప్రమాణము లేదు. కావుననే యదృష్టమే ఫలముగాఁ గలవానికిఁ బ్రతినిధి[1] యుండ దని నిశ్చయించుటకు "ఇంద్రుఁడు[2] మున్నగు దేవతలు, ఆహవనీయము మొదలగు నగ్నులు, మంత్రములు, ప్రయాజములు, ప్రోక్షణము మున్నగు క్రియలును, నదృష్టమే ఫలముగాఁగల వగుటచే వీనికిఁ బ్రతినిధు లుండఁగూడదు." అనుసూత్రము ప్రమాణముగాఁ గలదు. ఖదిరము మొదలయినవానికి బదులుగా కదరము మున్నగువానిని వాడవచ్చు నని, ప్రమాణములగు గ్రంథములయందుఁ జెప్పఁబడినది. యూపము కేవలాదృష్టమే స్వరూపముగాఁ గల దగునెడల, ఖాదిరత్వము మున్నైనవికూడ నట్టివే కాఁగలవు గనుకఁ, బ్రమాణగ్రంథములయందుఁ జెప్పఁబడిన కదరము మున్నగునవి ప్రతినిధులు కావచ్చు ననుదానికి, విరోధము సంభవించెడిని. కనుక యూపము కేవలమదృష్టము స్వరూపముగాఁగలది కాదు. మఱి మనఁ, గఱ్ఱను నఱకుట, చెక్కుట, మొదలయిన క్రియలచే; జనించు ప్రత్యక్షములగు సంస్కారముల యొక్కయుఁ, బ్రోక్షణము,[3] అంజనము[4] మున్నగు క్రియలచే జనించు నప్రత్యక్షములగు సంస్కారములయొక్కయు సమూహమే, యూపశబ్దమునకు నర్థ మని పార్థసారథిమిశ్రులు[5] మున్నయిన సాంప్రదాయికుల గ్రంథములయం దున్నది.

కాఁగా, యూపమం దుండెడి ప్రత్యక్షమగు చెక్కుట మున్నగుసంస్కారములు, 'ఉదుంబరము' (మేడి) కాక మఱియే కఱ్ఱ నుపయోగించినను సంభవింపఁ గలవు కనుక, నుదుంబరత్వము యూపస్వరూపమును మాత్రము సంపాదించుటచేత దానియాకాంక్ష యుపశమించు నని చెప్పుటకు వీలు లేదు. కావున, నౌదుంబరత్వ మనుదాని కాకాంక్ష యుండనేయున్నది. వికృతియందలి ప్రధానములకుఁగూడఁ, గథంభావాకాంక్ష కలదు. అప్రధానముల కావశ్యకములగు నుపకారకములును, వాని వెంబడినే వానిని జనింపఁజేయు నంగములును, నాప్రధానముతో సంబంధింప నన్వయించినపుడే, యాకథంభావాకాంక్ష యుపశమించును గాని, యాయుపకారములు

౧. ఒకదానికి మాఱుగా వాడఁబడునది.

౨. 'న దేవతాగ్నిశబ్దక్రియ మన్యార్థత్వాత్.' జై. సూ. ౬-3-౧౮.

3. మంత్రముల నుచ్చరించుచు నీటిని జిలుకరించుట.

౪. నేయి పూయుట.

౫. వీరిచే రచింపఁబడినగ్రంథములు, ౧. శాస్త్రదీపిక, ౨. న్యాయరత్నమాల మొదలయినవి.

మాత్రమే యాగప్రధానముతో నన్వయించినపు డది (ఆయాకాంక్ష) యుపశమింపదు. కాఁబట్టి, యిట్లు చెప్పుట కీ క్రిందిదికూడఁ గారణ మగుచున్నది. ‘దధ్నేంద్రియ కామస్య జుహుయాత్’[1] అను విధియందలి ‘ఇంద్రియభావనయందుఁ[2] గరణాకాంక్ష కలుగునపుడు, దధి (పెరుఁగు) కరణముగా నన్వయించినను, సిద్ధ మగునది కరణము కానేరకుండుటంజేసి, హోమమూ పెరుఁగున కాశ్రయముగా నన్వయించు వఱకు, నా కరణాకాంక్ష యుండును గాని, పెరుఁగు కరణముగా నన్వయించినంత మాత్రముచే నాయాకాంక్ష నివర్తింపదు. ఆశ్రయముగా గ్రహింపఁబడుహోమము, కరణాకాంక్ష నుపశమింపఁజేయుటకొఱకే జరుపఁబడు నని చెప్పఁబడుచున్నది. కాని, హోమమునుగూర్చి యాశ్రయాకాంక్ష (హోమము నాశ్రయముగా నపేక్షించునాకాంక్ష) యను నాలుగవ[3] యాకాంక్ష లేదు. ఇట్లే వికృతియందలి ప్రధానముల కుండు కథంభావాకాంక్ష, ప్రధానములు కావశ్యక మగునుపకారము లన్వయించినంతమాత్రమున నివర్తింపక, యాయుపకారములు వెంబడినే, వానిని జనింపఁజేయు నంగములన్వయించువఱకు నుండనేయుండును. కాఁగా, నుపకారములువెంబడినే వినియోగింపఁజేయఁబడునంగములు, కథంభావాకాంక్ష నుపశమింపఁజేయుటకే యాచరింపఁబడును. ఇట్లు ప్రకృతినుండి వికృతియం దతిదేశింపఁబడినయంగములు, ఆవికృతియందలి కథంభావాకాంక్ష నుపశమింపఁజేయుటకొఱ కాచరింపఁబడున వైనను, నింతకు ముందు ప్రకృతియందలి ప్రధానమున కుపకరించిన వగుటచే, వీనిచే నుపకరింపఁబడ వలసిన దేది? యనునుపకార్యాకాంక్ష లేదుగనుకఁ, బ్రకరణప్రమాణమూలముగా, వికృతియందలి ప్రధానముతో సంబంధించునట్లు వినియోగింపఁబడనేరవు. ఔదుంబరత్వము మున్నగునవి యన్ననో, యితరములగు వేనికిని నుపకరింపని వగుటచే, నుపకార్యాకాంక్ష కలవై, ప్రకృతినుండి యతిదేశింపఁబడిన ‘పశువును గట్టుట’ ‘యూపము’ అనువానివెంబడినే ఖాదిరత్వము జ్ఞప్తికి రాఁగా, దానిని బాధించి[4] తామే విధింపఁబడుచున్నవి. కనుక, నిచట నుభయాకాంక్ష యుండుటంజేసి, యివి

౧. ఇంద్రియమును గోరువాఁడు, పెరుఁగుతో హోమము చేయుటమూలముగా, నిష్టము నుత్పాదించుకొనవలయును.

౨. ఇంద్రియముల నుత్పాదించుకొనుట యనుక్రియయనెడి భావన.

3. భావ్యాకాంక్ష, కరణాకాంక్ష, ఇతికర్తవ్యతాకాంక్ష యనువానికంటె నితర మగునది.

౪. నివర్తింపఁజేసి.

ప్రకరణప్రమాణమూలమున వినియోగింపఁజేయఁబడుటయే యుక్తము. ఒకవేళ, యూపము వెంబడిసి ఖాదిరత్వము వికృతియందు విధింపఁబడునెడ, దానితో నన్వయింఁచుటచేత నీక వికృతియందలి ప్రధానములకుఁ గథంభావాకాంక్ష యుండదు గనుక, ఔదుంబరత్వ మనునది ప్రకరణప్రమాణమూలముగా వినియోగింపఁజేయఁబడ నేరదు. ఖాదిరత్వ మట్లు విధింపఁబడుట లేదు. 'ప్రకృతివలెనే వికృతిని నాచరించునది' అను విధివాక్యమునుండి, ఖాదిరత్వము వినియోగింపఁజేయఁబడవలసినదిగాఁ దెలియుట లేదు.

"అయ్యా! ఖాదిరత్వము ప్రకృతినుండి యతిదేశింపఁబడి, వికృతియందుఁ బ్రవర్తించునంతలోనే, దానికి మాఱుగా నౌదుంబరత్వము విధింపఁబడునెడ దీనిచే ఖాదిరత్వమునకుఁ గలుగుబాధ, మీమాంసాదర్శనమునందలి మూఁడవయధ్యాయమునందు వివరింపఁబడురీతి నప్రాప్తబాధ యయ్యెడిని. అది యెట్లంటేని:—బాధ, అప్రాప్తబాధ యనియుఁ, బ్రాప్తబాధ యనియు రెండువిధములు. వానిలో నప్రాప్తబాధ యనునది, తృతీయాధ్యాయమునం దిట్లు వివరింపఁబడినది. దుర్బలమగు ప్రమాణము, తనకుఁ బూర్వమునం దుండు ప్రబలప్రమాణములను గల్పించుటద్వారమునఁ బ్రవర్తింప నారంభించునంతలోనే, యొకప్రబలప్రమాణముచే వినియోగము జరుపఁబడినపుడు, దుర్బలప్రమాణ మింతవఱకుఁ బ్రవర్తింపలేదు, గనుక, నీప్రబలప్రమాణముమూలమున బోధింపఁబడునంగముచే, దుర్బలప్రమాణముమూలముగా బోధింపఁబడునంగములకుఁ గలుగుబాధ, యప్రాప్తబాధ యనఁబడుచున్నది. చోదక (అతిదేశ) వాక్యముమూలమున, వికృతియందుఁ బ్రాప్తించు ప్రాకృతాంగమునకుఁ (i) దనకు విరుద్ధ మగునంగ ముపదేశింపఁబడుటచేతను గాని (ii) తననుండి ప్రకృతియందు జనించుప్రయోజనము వికృతియందు సంభవింపకపోవుటచేతను గాని (iii) తనకు స్పష్ట మగునిషేధ ముండుటచేతను గాని, కలుగుబాధ ప్రాప్తబాధ యనఁబడుచున్నది. ఉదా:—(i) ప్రకృతియందలికుశలకు[1] విరుద్ధమగు శరము[2]

౧. ప్రకృతియందు 'కౌశం బర్హిః' (= కుశలను బర్హిస్సుగా వాడవలయును.) అనువాక్యముచేఁ గుశలు విధింపఁబడుచున్నవి.

౨. 'రౌద్రీం రోహిణీ మాలభేతాభిచరన్' (= శత్రువధము గోరువాఁడు, రుద్రదేవతకొఱకు రోహిణి యనుపశువు నాలంభించి యజించుటచే, నిష్టము నుత్పాదించుకొనవలయును.) అనువాక్యముచే విధింపఁబడు నభిచారేష్టి యనెడువికృతియందు, 'శరమయం బర్హిః' (= తెల్లును బర్హిస్సుగా వాడవలయును.) అను వాక్యముమూలమున శరము విధింపఁబడుచున్నది.

(తెల్లు), వికృతియందు విధింపఁబడుచున్నది. (ii) ఉదా:—ప్రకృతియందలియవఘాతముచే, వ్రీహులయందు జనించు 'వైతుష్యము' (పొట్టువోవుట) అను ప్రయోజనము వికృతియందలి గురివెందగింజలయందు[1] సరిపడకపోవుటచేత, నచట (వికృతియందు,) నిషేధింపఁబడుచున్నది. (iii) ఉదా:—దర్శపూర్ణమాసేష్టు లనెడు ప్రకృతులనుండి యతిదేశింపఁబడి, మహాపితృయజ్ఞ మనెడి పితేష్టియందుఁ[2] బ్రాప్తించు, హోతృవరణ[3] మనునది, 'న హోతారం వృణీతే'[4] అనువాక్యముచే నిషేధింపఁబడుచున్నది. ఔదుంబరత్వముచే ఖాదిరత్వమునకుఁ గలుగు బాధ, శరకుశన్యాయముమూలమునఁ[5] బ్రాప్తబాధ యనియే చెప్పవలసియున్నది. చోదకవాక్యముచే ఖాదిరత్వము గ్రహింపఁజేయఁబడ కుండుటంజేసి, దానికి వికృతియందుఁ బ్రాప్తియే లేదు గనుక, దానికి 'ఔదుంబరత్వము'చేఁ గలుగు బాధ ప్రాప్తబాధ యని చెప్పుట యుచితముగా లేదు."

ఈశంక కీక్రిందిది సమాధానము: తృతీయాధ్యాయమునందలి ప్రమాణము మూలముగా వినియోగింపఁజేయఁబడు నంగముచే, నితరమునకుఁ గలుగు బాధ యప్రాప్తబాధ యగుచున్నది. తృతీయాధ్యాయమునందు వివరింపఁబడినది ప్రకరణప్రమాణము. కావున దానిమూలముగా వినియోగింపఁజేయఁబడు నౌదుంబరత్వముచే, నితరమునకుఁ గలుగుబాధ యప్రాప్తబాధయే. వికృతియందుపదేశింపఁబడు దానిచేఁ బ్రకృతినుండి యతిదేశింపఁబడుదానికిఁ గలుగు బాధ, ప్రాప్తబాధయే యని

౧. 'ప్రాజాపత్యం ఘృతే చరుం నిర్వపేత్ శతకృష్ణల మాయుష్కామః' (=ఆయుస్సును గోరువాఁడు, ప్రజాపతిదేవత నుద్దేశించి, నూఱుగురివెందగింజలరూపమున నన్నమును నేతియందుంచి, యర్పించుటమూలముగా నిష్టము నుత్పాదించుకొనవలయును.) అను వాక్యముచే విహితమగు నాయుష్కామేష్టి యనెడి వికృతి కంగమగు, గురివెందగింజలయందుఁ, బ్రకృతినుండి యతిదేశింపఁబడిన యవఘాతమువలన జనింపఁగలుగు, వైతుష్య మను ప్రయోజనము సంభవింపనేరదు. గురివెందగింజలు బంగారువంటి ఛాయగల వగుటచే, వానియందు వైతుష్య మను ప్రయోజనము సంభవింపదు.

౨. మహాపితృయజ్ఞము.

3. హోత యను ఋత్విక్కు నెన్నుకొనుట.

౪. హోత యను ఋత్విక్కు నెన్నుకొనఁగూడదు. (మై. సం. ౧-౧౦-౧౫.)

౫. శరకుశన్యాయము:— ప్రకృతినుండి యతిదేశము మూలముగా వికృతియందుఁ బ్రాప్తించు కుశలకు, విశేషవిధివలన విహిత మగునవియుఁ, గుశలకంటె విరుద్ధము లగునవియు నగు శరములచేఁ గలుగుబాధ, ప్రాప్తబాధ యనఁబడును. ఈరీతిని గలుగుబాధ, ప్రాప్తబాధయే యగును.

చెప్పుట మీమాంసకులసంప్రదాయము కాదుగదా! కనుక నిది యప్రాప్తబాధ యెట్లగు నని శంకింప వీలులేదు.

యథార్థముగా నిది ప్రాప్తబాధయే, "ఖాదిరత్వము చోదక వాక్యముచే గ్రహింపఁజేయఁబడ కుండుటంజేసి, ప్రాప్తింపలేదు గనుక, దానికి ఔదుంబరత్వముచేఁ గలుగుబాధ, ప్రాప్తబాధ యెట్లగును? ఖాదిరత్వము చోదకవాక్యముచే గ్రహింపఁ జేయఁబడునపుడైనను, దాని (ఖాదిరత్వము) వలననే, యూపమున కుండు నాకాంక్ష యుపశమించును గనుక, నౌదుంబరత్వమును గూర్చి యిఁక నాకాంక్ష యుండదు గావున, దాని నిచట యూపమున కంగముగా వినియోగింపఁజేయు ప్రమాణము ప్రకరణము కానేరదు." అని శంకింపవలదు. ప్రాప్తబాధ కలుగునపుడు, చోదకవాక్యముచే నంగములు ప్రాప్తింపఁజేయఁబడవుగదా! అట్లయినచో ఖాదిరత్వము 'ప్రకృతి వలెనే, వికృతినిగూడ నాచరింపవలెను' అనుశాస్త్రముచేఁ, బ్రాప్తించును గనుక, దానికి బాధ కలుగనేరదు. మఱి మన, 'చోదకవాక్యము' యథార్థముగా వికృతి యందు బాధింపఁబడనియంగములనే ప్రాప్తింపఁజేయును. అట్టి యంగములు చోదక వాక్యమునందుండు 'ప్రకృతివలెనే' అను శబ్దమూలముగాఁ, బ్రాప్తింపఁజేయఁ బడుటంజేసి, పురుషునకు, 'ప్రకృతియం దాచరించినరీతిగానే వికృతియం దాచరింప వలెను. వికృతియందలి యంగము లన్నియుఁ బ్రకృతియందువలెనే యాచరింపఁబడ వలెను' అను భ్రాంతి కలుగుచున్నది. కాఁబట్టి, యిట్టి భ్రాంతిమూలముగాఁ[1] బ్రాప్తించు ఖాదిరత్వము మున్నగునవి, 'ఔదుంబరో యూపః' అను ప్రత్యేక శాస్త్రమువలన విధింపఁబడు నౌదుంబరత్వము మున్నగువానిచే బాధింపఁబడుచున్నవి గనుక, నిట్టిబాధ ప్రాప్తబాధ[2] యగుచున్నది. భ్రాంతిమూలముగాఁ బ్రాప్తించిన యంగముచే, విధివలన బోధింపఁబడు నాకాంక్ష నివర్తింపఁజేయు శక్యము కాకుండు టంజేసి, వికృతియందలి యాకాంక్ష ప్రకృతినుండి భ్రాంతిమూలమునఁ బ్రాప్తించిన ఖాదిరత్వముచే నుపశమింపనేరదు. కావున నుభయాకాంక్ష యనెడి ప్రకరణప్రమాణ మిచట సంభవించుటంజేసి, ప్రాకృతాంగముల ననువదించి, వానినిగూర్చి వికృతి

౧. = భ్రమము = ఒకవస్తువును జూచి, మఱియొకవస్తువుగా భ్రమపడుట.

౨. ఇట్లు చెప్పుటచే నప్రాప్తబాధ కలుగుస్థలములయం దంగములు భ్రాంతిమూలముగానైనను బ్రాప్తించుట యుండదని, సూచింపఁబడుచున్నది.

యందు విధింపఁబడు ఔదుంబరత్వము మున్నగువానిని వినియోగింపఁజేయు ప్రమాణము, ప్రకరణ మని చెప్పుట యుచితము.

ఇట్లే[1] ప్రకృతియం[2]దంగము లగు ననూయాజముల ననువదించి, వానిని గూర్చి వికృతియగు పశుయాగము, చాతుర్మాస్యయాగము, మున్నగువానియందు "పృషదాజ్యే నానూయాజాన్ యజతి"[3] అను విధివలన విధింపఁబడిన పృషదాజ్యముకూడఁ, ప్రకరణమూలముగా వికృతి కంగ మగుచున్నదని, న్యాయసుధాకారునిచే 'సంవర్గనాధికరణము' నందుఁ జెప్పఁబడినది. ఆ చేవ్రుని తండ్రిగా రగు నసంతదేవు లన్ననో, యిఁక ముందు వివరింపఁబోవురీతిని జెప్పిరి "పృషదాజ్యము" అనూయాజములు కావశ్యక మగు ద్రవ్యముగా విధింపఁబడుచున్నది. పృషదాజ్యము లేకున్నను మఱి యేద్రవ్యముచేతనైన, ననూయాజముల నాచరించుటకు శక్య మగును గాన, నీపృషదాజ్యము, అనూయాజములు స్వరూపము నుత్పాదించుట కావశ్యకము కాకపోవుటంజేసి, యీపృషదాజ్యమునకుఁ బ్రయోజన మేమి? యని యాకాంక్ష కలుగఁగా, ననూయాజములు, గుణమూలమున వికృతియందలి ప్రధానమునుండి జనించుపూర్వమును బోధించు నపేక్ష వ్యవధాన మెక్కువ యగును గనుక, నట్లు బోధించుట యుక్తము కాదు. మఱే మన, జ్యోతిష్టోమయాగమున కంగమగు దీక్షణీయేష్టి నుద్దేశించి, విధింపఁబడు[4] స్వరనియమమునకుఁ బ్రయోజన మేమి యని యాకాంక్ష కలుగఁగా, సన్నిహిత[5] మగుటంజేసి, దీక్షణీయేష్టినుండి జనించు పూర్వమే, దీక్షణీయాపదముచే గుణమూలమునఁ బ్రయోజనముగా బోధింపఁబడుచున్నది కాని, యెక్కువ వ్యవహిత[6] మగుటంజేసి, జ్యోతిష్టోమమునుండి జనించు

౧. ప్రాకృతాంగము ననువదించి దానినిగూర్చి, విధింపఁబడు నౌదుంబరత్వము, ప్రకరణప్రమాణముచే, వినియోగింపఁజేయఁబడునట్లే.

౨. జ్యోతిష్టోమ మను ప్రకృతి.

3. పెరుఁగుబిందువులతోఁ గూడిన నేయి, పృషదాజ్య మనఁబడును. అట్టి పృషదాజ్యముతో, ననూయాజముల నాచరించుటచే, నిష్టము నుత్పాదించుకొనవలయును.

౪. 'యావత్యా వాచా కామయతే తావత్యా దీక్షణీయాయా మనుబ్రూయాత్' అనువాక్యముచే స్వరనియమము దీక్షణీయేష్టి నుద్దేశించి విధింపఁబడుచున్నది. మీ. దర్శ. ౯ అధ్యాయము.

౫. శీఘ్రముగా స్ఫురించునది.

౬. మిక్కిలి యాలస్యముగా స్ఫురించునది.

పరమాపూర్వము ప్రోక్షణీయాపదముచే నెట్లు బోధింపఁబడుట లేదో యట్లే, యచట ననూయాజపదముచే సన్నిహితమగు తననుండి జనించునపూర్వమే లక్షణామూలమునఁ దెలియఁజేయఁబడి, పృషదాజ్యమునకుఁ బ్రయోజనముగాఁ గల్పింపఁబడుచున్నది. కావుననే, (అనూయాజములు లక్షణామూలమునఁ దమనుండి జనించునపూర్వమునే బోధించును గనుక) ప్రోక్షణమునకు[1] నుపయోగించుజలమందుఁ జేయంబడు నుత్పవనము[2] మున్నగు సంస్కారము, లాప్రోక్షణముయొక్క స్వరూపము నుత్పాదించుట కత్యావశ్యకములు కాకపోవుటంజేసి, యీసంస్కారములకుఁ బ్రయోజనమే మని యాకాంక్ష కలుగఁగా; 'ప్రోక్షణము' నుండి జనించునపూర్వమే సన్నిహిత మగుటంజేసి, యట్టి ప్రయోజనముగాఁ గల్పింపఁబడుచున్నది గాని, వ్యవహిత మగు దర్శపూర్ణమాసలవలన జనించుపరమాపూర్వ మట్లు కల్పింపఁబడుట లేదని, (మీ. దర్శ. ౯ అ. ౧ పా. ౨ అధి) చెప్పఁబడినది. కాఁబట్టి, యిచట విధింపఁబడు పృషదాజ్యమునకుఁ బ్రయోజనాకాంక్ష కలుగఁగా, నీయాకాంక్ష 'పృషదాజ్యే నానూయాజాన్ యజతి' అనువాక్యముచేఁ దెలియంజేయఁబడునదియు, ననూయాజములనుండి జనించునదియు, నగునపూర్వముచే నుపశమించును గాన, నీపృషదాజ్యము ప్రకరణప్రమాణముమూలమున వికృతియందలి ప్రధానమునుండి జనించునపూర్వమే ప్రయోజనము గాఁగల దని చెప్పవలదు.

ఆపదేవుఁడు 'పృషదాజ్యము వికృతియందలి ప్రధానమునుండి జనించునపూర్వమే ప్రయోజనము గాఁగలది' యని యంగీకరించినపక్షమందుఁగూడ, నీపృషదాజ్యమునకుఁ బ్రకరణప్రమాణముమూలమున వినియోగ ముండ' దని యిట్లుపపాదించుచున్నాఁడు:—పృషదాజ్యమునకు వికృతియందలి ప్రధానమునుండి జనించునపూర్వమే ప్రయోజన మగునుగాక. అట్లయినను, దానిని (పృషదాజ్యమును) వినియోగింపఁజేయు ప్రమాణము ప్రకరణప్రమాణము కానేరదు. ప్రకృతినుండి వికృతి

౧. 'శుంధధ్వం దైవ్యాయ కర్మణే' ఇతి త్రిః ప్రోక్షతి. ఆప. శ్రౌ. సూ. ౧-౧౧-౧౦. అనుసూత్రముచేఁ బ్రోక్షణము విధింపఁబడుచున్నది.

౨. 'ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం ప్రోక్షణీ రుత్పునాతి' ఆప. శ్రౌ. సూ. ౧-౧౧-౯. అనుసూత్రముచే నుత్పవనము విధింపఁబడుచున్నది. ఉత్పవనము = రెండుచేతులతో దర్భల నుత్తరమున కగ్రము లుండునట్లు పట్టుకొని, ప్రోక్షణమున కుద్దేశింపఁబడిన జలపాత్రమునం దుంచి, దానిజలము నిటు నటుఁ గదల్చుట.

లోనికి యూపము నతిదేశించిన వెంబడినే, దానికి సాధనముగా, ఖాదిరత్వ ముపస్థిత మగునంతలో, ‘ ఔదుంబరో యూపో భవతి ’ అనువాక్యముచే నౌదుంబరత్వము విధింపఁబడుచున్నది కాన, నచట నుభయాకాంక్ష సంభవించుటంజేసి, యౌదుంబరత్వమును ప్రకరణప్రమాణముమూలముగా వినియోగింపఁజేయుట యుచిత మగుచున్నది. అనూయాజములను ప్రకృతినుండి వికృతిలోని కతిదేశించిన వెంటనే, వానికి సాధనముగా నాజ్యసామాన్య ముపస్థిత మగునంతలోనే, ‘ పృషదాజ్యేనానూయాజాన్ యజతి ’ అనువాక్యముచేఁ బృషదాజ్యము విధింపఁబడునెడ, నుభయాకాంక్ష సంభవించుటంజేసి, యీపృషదాజ్యమునకుఁ బ్రకరణ ప్రమాణము మూలముగా వినియోగము కలిగెడిని. పృషదాజ్యమున కౌదుంబరత్వముతో సామ్యము[1] లేదుగదా! పృషదాజ్య మనునది, యాజ్యమునకంటె వేఱగు ద్రవ్య మేదియును గాదు. అట్లు వేఱగు ద్రవ్యమేనైన నయెడల, ఖాదిరత్వమునకంటె భిన్నమగు నౌదుంబరత్వము దానికి (ఖాదిరత్వమునకు) మాఱుగా విధింపఁబడురీతిని, బృషదాజ్య మనునది యాజ్యమునకు మాఱుగా విధింపఁబడి యుండును. పృషన్మణి మొదలగు శబ్దములయందుండు ‘ పృషత్ ’ అనుపదమునకు ‘ పలురంగులుగల ’ అనునది యర్థమని తెలియుచున్నది గనుకఁ, బృషదాజ్య మనుశబ్దమునకు ‘ పలురంగులు గలనేయి ’ యర్థ మగుచున్నదిగదా! కావుననే, “ ప్రకృతినుండి యతిదేశింపఁబడి వికృతియందుచ్చరింపఁబడు ఆవాహనము[2] సూక్తవాకము,[3] మున్నగు మంత్రములయందు, వికృతియందుఁ బృషదాజ్యముచే యజింపఁబడఁబోవు దేవతలనుగూర్చి, ప్రకృతియందువలె ‘ ఆజ్యపాన్ ’ (నేతిని ద్రాగునట్టి) అనియే చెప్పవలయును గాని, యిచటఁ బృషదాజ్యమును ద్రాగువారుగదా యని ‘ పృషదాజ్యపాన్ ’ అని యూహించి చెప్పవలదు ” అని భాష్యమునం దున్నది. కాఁగాఁ, బృషదాజ్య మనునది ప్రకృతియందలి యాజ్యమునకంటె వేఱు కానేరదు.

౧. సామ్యము = పోలిక.

౨. ప్రకృతియం దాజ్యముచే యజింపఁబడఁబోవు దేవతలను బిలుచుమంత్రము. ‘ దేవా నాజ్యపానావహ ’ అనునది.

3. యజింపఁబడిన దేవతలకు, ఆమోదముమూలముగా సంస్కారమును గలిగించుమంత్రము. ఉదా:—‘ దేవా ఆజ్యపా ఆజ్య మజుషన్త ’ ( నేతిని ద్రాగుదేవత లీయాగమునందు సమర్పింపఁబడిన యాజ్యమును భుజించిరి )

ప్రకృతినుండి యతిదేశమూలముగా నాజ్య ముపస్థిత మగునంతలోనే, దానికి మాఱుగా 'చిత్రాజ్యము' ( = పృషదాజ్యము) వికృతియందు విధింపఁబడుటంజేసి, యాచిత్రాజ్యమునకుఁ బ్రకరణప్రమాణమూలమున వినియోగము సంభవింపఁగల దని చెప్పవలదు. పృషదాజ్య మనుశబ్దమూలముగా, 'పలురంగులు' అను గుణముతోఁ గూడిన యాజ్యము (నేయి) విధింపఁబడుట లేదుగదా! ఒకగుణముతోఁ గూడినదానిని విధించునెడ, నారెండింటినిగూర్చియు[1], విధివ్యాపారమును గల్పించుట మిగులఁ గష్టమును గలిగించును. మఱి మన 'లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరన్తి'[2] అనువాక్యమునందుఁ బ్రకృతినుండి ప్రాప్తించిన యుష్ణీషము ( = పాగా) ననుగూర్చి, వికృతియందు లోహితత్వము ( = ఎఱ్ఱనిరంగు గలిగియుండుట) అనెడు గుణముమాత్ర మన్వయభేదము రాకుండునట్లు విధింపఁబడుగీతిని, ప్రకృతియందలి యాజ్యము ననువదించి, దానినిగూర్చి 'పలురంగులు గలుగుట' యనుగుణముమాత్ర మన్వయభేదము కలుగకుండఁగనే విధింపఁబడఁగలదు. ఈవిషయము పార్థసారథిమిశ్రులచే రచింపఁబడిన శాస్త్రదీపికయం దిట్లు వివరింపఁబడినది. 'పృషదాజ్యే నానూయాజాన్ యజతి'[3] అనువిధిచేఁ బ్రకృతినుండి యతిదేశింపఁబడిన యాజ్యమును గూర్చి, 'పలురంగులు గలుగుట' యను గుణముమాత్రము[4] విధింపఁబడుచున్నది గనుక, ఆవాహనము, సూక్తవాకము మున్నగు మంత్రములయందు 'నేతిని ద్రాగు దేవతలను' అనియే యుచ్చరింపవలయును గాని, 'పలురంగులు గలనేతిని ద్రాగు దేవతలను' అని యుచ్చరింపరాదు. ప్రకృతినుండి వికృతిలోని కతిదేశింపఁబడిన యాజ్యము నుద్దేశించి, 'పలురంగులు గలుగుట' యను గుణముమాత్రము వికృతియందు విధింపఁబడుచున్నది.

కాఁగా; వికృతియందలి ప్రధానము, ప్రకృతినుండి యతిదేశింపఁబడిన యాజ్యముతోను, నింతకుముందు ప్రకృతియం దుపకరించిన యనూయాజములతోను

౧. రెండింటిని = గుణమును విశేషణమును, దానితోఁ గూడిన విశేష్యము ననునవి.

౨. ఎఱ్ఱనిరంగుగల పాగాలను ధరించిన ఋత్విక్కులు సంచరించుచున్నారు.

౩. "న వా గుణశాస్త్రత్వాత్" జై. సూ. ౧౦-౪-౨౮.

౪. పృషదాజ్యమును విధించుపైవిధికి శేషము 'ద్వయం వా ఇదం సర్పిశ్చ దధిచ." (శ. బ్రా. ౩-౯-౪-౪.) అనువాక్యమునుండి, ఆజ్యమునందుఁ బెరుఁగును గలుపుట యనుగుణముమాత్రము విధింపఁబడుచున్న దని స్పష్టపడుచున్నది.

సంబంధించుటచే, దన కుండిన యుపకారకాకాంక్ష యుపశమింపఁగా; నటుపిమ్మట 'పృషదాజ్యేనానూయాజాన్ యజతి' అనువాక్యముచే విధింపఁబడిన 'చిత్రత్వము'[1] అను గుణమునకు, నక్షత్రేష్టి యను వికృతియొక్క సన్నిధియందు విధింపఁబడిన ఉపహోమము[2] మున్నగు నపూర్వాంగములకువలె, వినియోజక మగు[3] ప్రమాణము ప్రకరణము కానేరదు.

ఒకవేళఁ బ్రకృతియం దుండు నొకానొకగుణమునకు మాఱుగాఁ, జిత్రత్వ మనుగుణము విధింపఁబడునెడ, నా ప్రకృతియందలి గుణ మతిదేశముమూలముగా వికృతిలోనికి వచ్చుటకు ముందు, వికృతియం దుండు ప్రధానమునకుఁ గల యాకాంక్ష యుపశమింపదు గాన, నంతలో 'చిత్రత్వము' అను గుణము విధింపఁబడుటంజేసి, దీనికిని వికృతియందలి ప్రధానమునకును, నుభయాకాంక్ష యుండును గావున, నీ చిత్రత్వ మనెడుగుణమున, కీ వికృతియందుఁ బ్రకరణప్రమాణముమూలముగా వినియోగము సంభవించెడిని. ప్రకృతియం దట్టిగుణ మేదియును లేదు. చిత్రత్వ మనుగుణము విధింపఁబడుటకు ముందుగానే, యాజ్యము, ననూయాజములును బ్రకృతి నుండి యతిదేశింపఁబడి, యీవికృతియందు విధింపఁబడుటంజేసి, 'చిత్రత్వము' వానికి మాఱుగా వానిస్థానము నాక్రమించినది కాలేదుర గదా! ప్రకృతినుండి యతిదేశము మూలముగా నాజ్యము వికృతిలోనికి వచ్చినవెంబడినే, ప్రకృతియందలి నిర్గుణత్వము ( = గుణ మేదియు లేకుండుట) అతిదేశముమూలముగా వికృతిలోనికి వచ్చునం

౧. పలురంగులు గలిగియుండుట.

౨. నక్షత్రేష్టి యనువికృతియొక్క సన్నిధియందు "అగ్నయే స్వాహా, కృత్తికాభ్య స్స్వాహా" అను నీమున్నగు నుపహోమములు విధింపఁబడుచున్నవి. ఈవికృతియం దుండుభావన, ప్రకృతియం దుపకరించి, యిం దతిదేశింపఁబడిన యంగములతో సంబంధించుటచే, వికృతియం దుండు నుపకారకాకాంక్ష యుపశమించు చుండుటంజేసి, యీ యుపహోమము మున్నగునవి, ప్రకరణప్రమాణముచే వినియోగింపఁజేయఁబడనేరవు. ఇట్లే పృషత్త్వము (పలురంగులు గలిగియుండుట) కూడఁ బ్రకరణప్రమాణముచే వినియోగింపఁజేయఁబడనేర దని తెలిసికొనవలయును.

3. వినియోగింపఁజేయునది.

౪. 'పృషత్త్వము' అనుగుణము 'అనూయాజములు' 'ఆజ్యము' నను నీరెండింటిని నుద్దేశించి విధింపఁబడుటంజేసి, యీపృషత్త్వము విధింపఁబడుటకు ముందే, యివి రెండును బ్రకృతినుండి యతిదేశముమూలముగా వికృతిలోనికి వచ్చియుండుట యావశ్యకము గనుక, నీపృషత్త్వ మనుగుణము, వాని స్థానము నెన్నఁడును నాక్రమింపనేరదు- అని తెలియునది.

తలోఁ జిత్రత్వ మనుగుణము, తాను విధింపఁబడుటమూలమున, నా నిర్గుణత్వము యొక్క స్థానము నాక్రమింపఁగలుగును గనుక, నీ చిత్రత్వమునకుఁ బ్రకరణప్రమాణముచే వినియోగము సంభవింపవచ్చునే? యని శంకింపరాదు. నిర్గుణత్వ మనునది ప్రకృతియందు విధింపఁబడ కుండుటంబట్టి, పాణికండూయనమువలె నంగము కానేరదు. కనుక, దానినిగూర్చి వికృతియందలి ప్రధానమున కుపకారకాకాంక్ష యుండదు గదా! అది యెట్లంటేని:—జ్యోతిష్టోమ మను ప్రకృతియాగమందలి సుత్యాదివసమునం దుండు, మాధ్యందినసవనమున విహితమగు దక్షిణాదానము[2] జరిగిన వెంటనే, యావశ్యక మగునప్పుడు గోఁకుకొనుటకు యజమానునిచే స్వీకరింపఁబడిన కృష్ణవిషాణమును,[3] 'చాత్వాలము[4] అను ప్రదేశమునందుఁ బాఱవేయుట' విధింపఁబడి యున్నది. ఇది చోదకవాక్యముచే[5] నతిదేశముమూలముగా, ద్విరాత్రము మున్నగు వికృతులయందుఁ బ్రాప్తించి సుత్యా[6] జరుగు మొదటిదినమున జరుపఁబడవలసి యుండియు, నట్లు జరుపఁబడుటలేదు. ఆమఱుసటిదినమున, దక్షిణాదానమునకు ముందు జరుపఁబడఁదగినయంగముల నాచరించునపుడు, కృష్ణవిషాణముతో[7] గోఁకికొనుట యనునది శాస్త్రవిహిత మగుటచే, నావశ్యక మగుచున్నదిగదా! జ్యోతిష్టోమమునందు, దక్షిణాదానమునకుఁ బిదప, గోఁకికొనుట యావశ్యకము కాఁగాఁ, గృష్ణవిషాణము పాఱవేయఁబడుటచే, దగ్గఱ సిద్ధముగానుండు చేతితో[1] గోఁకికొనుట జరుగుచున్నది. అయినను, నిది యతిదేశముమూలముగా, ద్విరాత్రము మున్నగు వికృతులయందలి మొదటిరోజున, దక్షిణాదానమునకుఁ దరువాతియంగముల నాచరించునపుడు, అపేక్షింపఁబడుట లేదు. ఇది (చేతితో గోఁకికొనుట) వేఱుగతి లేకుండుటచేతను, సాకర్యముచేతను, బ్రకృతియం దాచరింపఁబడుటంజేసి, శాస్త్రవిహిత మగునది కాలేదు.

౧. చేతితో గోఁకికొనుట.

౨. దక్షిణ లిచ్చుట.

3. లేడికొమ్ము.

౪. మహావేది కీశాన్యపుమూలనుండి, యజ్ఞమునం దుపయోగింపఁబడిన వస్తుశేషములను బాఱవేయుట కుపయోగించుప్రదేశము.

౫. విధివాక్యము.

౬. సోమలతనుండి రసమును బిండుట.

౭. "నీతాసు దక్షిణాసు చాత్వాలే కృష్ణవిషాణాం ప్రాస్యతి" తై. సం. ౬-౧-3.

కాఁగా; శాస్త్రవిహితము కాకపోవుటచే నంగము కానేరదు గనుక, దీనినిగూర్చి వికృతియగు ద్విరాత్రయాగమునం దాకాంక్ష లేకపోవుచున్నది. కావుననే, ద్విరాత్రమునందలి దక్షిణాదానమునకుఁ బిదప, 'చేతితో గోఁకికొనుట' ఆచరింపఁబడక పోవుటయుఁ, గనుకనే మొదటిదినమునఁ గృష్ణవిషాణమును బాఱవేయకపోవుటయును సిద్ధించుచున్నవి.

ఇట్లే నిర్గుణత్వము విధింపఁబడకపోవుటవలన, దానింగూర్చి వికృతియందలి ప్రధానమున కాకాంక్ష యుండదు. కావునఁ బృషదాజ్యమునకు ముందటి దేశము మూలముగాఁ బ్రాప్తించిన యాజ్యము, ననూయాజములు, నను నీరెండింటిచే, వికృతియందలి యుపకారకాకాంక్ష యుపశమింపఁగలుగుటం జేసి, యుభయాకాంక్ష లేదు. గనుకఁ, బృషదాజ్యమునకు వికృతియందుఁ బ్రకరణప్రమాణముమూలమున వినియోగము సంభవింపనేరదు. కావున, నీవిషయమునుగూర్చి యింక నధికముగాఁ జర్చింపఁబని లేదు. కాఁగా; మహాప్రకరణ మను ప్రమాణము, ప్రకృతియందు విధింపఁబడు వానినే దాని కంగములనుగా వినియోగింపఁజేయు ననియు, వికృతియందన్ననో, ప్రకృతియందుపకరించినవియుఁ, బ్రత్యక్ష మగు ప్రయోజనము గలవియు, నగునంగముల ననువదించి, విధింపఁబడుదానిని వినియోగింపఁజేయు ననియు, వికృతియందు విధింపఁబడు నపూర్వాంగముల నట్లు వినియోగింపఁజేయనేర దనియును, సిద్ధించుచున్నది.

వికృతియందుఁగూడఁ, బ్రకృతియందలి ధర్మములనుద్దేశించి విధింపఁబడు గుణధర్మముల నడుమఁ బఠింపఁబడెడు నపూర్వాంగ మన్ననో, ప్రకరణప్రమాణము మూలముగానే, యావికృతి కంగముగా వినియోగింపఁజేయఁబడుచున్నది. ఆలోచింపఁగా, వికృతి కుండెడు కథంభావాకాంక్ష, ప్రకృతినుండి యతిదేశముమూలముగాఁ బ్రాప్తించినయంగములతోనే యుపశమింపఁగలదు. కాని యెచటఁ బ్రకృతియందలి యంగముల ననువదించి ధర్మ మేదైన వికృతియందు విధింపఁబడునో, యచట వికృతి

౧. ప్రకృతియందుపకరించు ప్రత్యక్షప్రయోజనముగల యంగముల ననువదించి, వికృతియందు విధింపఁబడునది యా యుద్దేశ్య మగు నంగముయొక్క స్వరూపము నుత్పాదించుటవిషయమై నిష్ఫలము కాకపోవుటంజేసి, యట్టి ప్రయోజనమును సిద్ధింపఁజేయుటమూలముగానే, దీని కుండు నాకాంక్ష యుపశమింపఁగా, నిది వికృతియందలి యపూర్వమున కుపకరించు ననుప్రయోజనము సిద్ధింపదు కావున, నుభయాకాంక్ష లేక యిది ప్రకరణప్రమాణముమూలమున వినియోగింపఁజేయఁబడనేర దని తాత్పర్యము.

దానితో (ఆవిధింపఁబడుధర్మముతో) సంబంధించువఱకును, దానికి[౧] కుండెడు కథంభావాకాంక్ష యుపశమింపదు. కావున, వికృతికిఁ గథంభావాకాంక్ష యుండుటంజేసియు, నీయపూర్వాంగమునకుఁగూడ[౨] భావ్యాకాంక్ష[3] యుండుటంజేసియు, నీయపూర్వాంగము ప్రకరణప్రమాణముమూలమున వికృతి కంగ మగుట యుక్తముగా నున్నది. ఉదా:—ఆమనహోమములు.[౪] అవి ప్రకృతియందలియంగముల ననువదించి విధింపఁబడు రెండు ధర్మములమధ్యను,[౫] విధింపఁబడుచున్న వని తంత్రరత్నము మున్నగు గ్రంథములం దున్నది. ఇది యిట్లుండుఁగాక.[౨]

౧. వికృతికి.

౨. ప్రకృతినుండి యతిదేశింపఁబడిన ధర్మముల ననువదించి, వికృతియందు విధింపఁబడు రెండు ధర్మములనడుమ విహితమగు నపూర్వాంగము.

3. దీనికి భావ్యము ( = సాధ్యము) ఏది యనునాకాంక్ష

౪. 'వైశ్వదేవీం సాంగ్రహణీం నిర్వపేత్ గ్రామకామః' (తై. సం. ౨-3-౯-౨) అను వాక్యముచే, సాంగ్రహణేష్టి యను వికృతిని విధించి, దానిసందర్భమునందు 'ఆమన మస్యామనస్య దేవా ఇతి తిస్ర ఆహుతీ ర్జుహోతి' (తై. సం. ౨-3-౯-౪) అను వాక్యముచే విధింపఁబడు మూఁడుహోమములకు 'ఆమనహోమములు' అని పేరు.

౫. ఇచట నీయామనహోమములు, ప్రకృతినుండి వికృతిలోని కతిదేశింపఁబడు 'ప్రయాజములు,' 'అనూయాజములు', అనునీరెండింటినడుమను విధింపఁబడుచున్న వని 'యత్ప్రయాజానాం పురస్తాత్ జుహుయాత్, బహిరాత్మానం స జాతానాం దధ్యాత్, య దనూయాజానాం పరస్తాత్ జుహుయాత్, స్వర్గం లోక మప్రకామేత్, మధ్యే జుహోతి' (మై. సం. ౨-3-౨) అనువాక్యమువలనఁ దెలియుచున్నది. ఇందుల కితరప్రమాణములు:—పార్థసారథిమిశ్రుఁడు (i) "ప్రకృతినుండి యతిదేశముమూలముగా వికృతియందుఁ బ్రాప్తించిన రెండంగములయొక్క మధ్యను బఠింపఁబడినది. ఉదా. "ఆమనహోమములు" అని న్యాయరత్నమాలయందును, (ii) "ఆమనహోమములు ప్రకృతినుండి యతిదేశముమూలముగా, వికృతియందుఁ బ్రాప్తించిన రెండంగములమధ్య విధింపఁబడుటంజేసి," అని శాస్త్రదీపికయందును, వ్రాసియుండెను. తంత్రరత్నమునందుఁగూడ "ప్రకృతినుండి వికృతియం దతిదేశింపఁబడిన యంగము లుపకార్యాకాంక్ష కల వగుటచే, వికృతి కంగము లగుచున్నవి. వానిలో రెండింటికిని నడుమఁ బఠింపఁబడిన యపూర్వాంగముసూడ, వికృతి కుండునాకాంక్ష యుపశమింపకముందే విధింపఁబడుటంజేసి, యుభయాకాంక్ష యనుప్రకరణముమూలముగానే, యావికృతి కంగ మగుచున్నది. ఉదా. "యత్ప్రయాజానాం పురస్తాత్ జుహుయాత్, బహిరాత్మానం స జాతానాం దధ్యాత్, యదనూయాజానాం పరస్తా జ్జుహుయాత్, స్వర్గం లోక మప్రకామేత్, మధ్యే జుహోతి మధ్యత ఏవ స జాతానా మాత్మానం ధత్తే" అనువాక్యమువలనఁ బ్రకృతి

# అవాంతర ప్రకరణము

ఇట్లు మహాప్రకరణము నిరూపింపఁబడి, యిఁకముం దవాంతర ప్రకరణము నిరూపింపఁబడుచున్నది.[1] స్వర్గము మున్నగు ఫలముల నుత్పాదించు ఫలభావనయం, దితికర్తవ్యతారూపమగు నంగభావనయం, దుపకరించు నంగములను వినియోగింపఁజేయు ప్రకరణము 'అవాంతర ప్రకరణము.' దానిచే నభిక్రమణము[2] మున్నగు క్రియలు, దర్శపూర్ణమాసేష్టులయందలి ఫలభావనయం[3] దితికర్తవ్యత యగు, ప్రయాజములు మున్నగువాని కంగములుగా, వినియోగింపఁజేయఁబడుచున్నవి. ఈ యవాంతరప్రకరణ మనునది సందంశ[4]న్యాయముచేఁ దెలియఁజేయఁబడుచున్నది.

నుండి వికృతిలోని కతిదేశింపఁబడు ప్రయాజములకును, అనూయాజములకును, మధ్యను ఆమనహోమములు విధింపఁబడినట్లు తెలియుచున్నది." అని యున్నది.

౧. తంత్రరత్నమునందు, ఈయపూర్వాంగము ప్రకరణప్రమాణమూలమున వికృతి కంగముగా వినియోగింపఁజేయఁబడు నని చెప్పఁబడినను, శాస్త్రదీపికయందు 'ఈయపూర్వాంగము, సన్నిధి యనుస్థానప్రమాణమూలముననే, వినియోగింపఁజేయఁబడవలె'న' దని చెప్పి యిది ప్రకరణప్రమాణమూలమునఁగూడ, వినియోగింపఁజేయఁబడవచ్చు నని చెప్పుటచేఁ, బ్రకరణప్రమాణముచే వినియోగింపఁజేయుట యనునది స్వారస్యముగా లే దని సూచింపఁజేయఁబడుచున్నది. కావుననే, న్యాయసుధయందలి బలాబలాధికరణమునందు, 'ఆమనహోమములు సన్నిధి యను స్థానప్రమాణముచేతనే వినియోగింపఁజేయఁబడవలసినవి.' అని చెప్పఁబడినది. ఇట్లుండ, నిట్టియపూర్వాంగములకుఁ, బ్రకరణప్రమాణమూలమున నెట్లు వినియోగము సంభవింపగలను? అని శంక కలుగఁగా, నిట్లు సమాధానము చెప్పఁబడుచున్నది. ఆలోచింపఁగా ఆమనహోమములకు, సన్నిధి యనుస్థానప్రమాణమూలమున వినియోగమే యుచితమైయున్నది. అది యాపదేవునికిని నిష్టమే. కాని, తంత్రరత్నము మున్నగు గ్రంథములయందుఁ జెప్పఁబడినరీతినిమాత్ర మవలంబించి, ప్రస్తుతోదాహరణమునకొఱకుఁ బ్రకరణప్రమాణమూలముగానే, యిట్టి యపూర్వాంగమునకు వినియోగము కావలసిన దని కొందఱు మీమాంసకులచేఁ జెప్పఁబడినది.

౨. ఒక్కొక్క ప్రయాజమే యాచరించునపు, డధ్వర్యుఁడు కొన్ని యడుగులు నడిచి యాహవనీయముదగ్గఱకుఁ బోవుట.

౩. స్వర్గము మున్నగు ఫలములు భావ్యముగాఁ గల భావన; ఇది 'స్వర్గమును గోరువాఁడు దర్శపూర్ణమాసేష్టుల నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును' అను విధిమూలమునఁ దెలియుచున్నది.

౪. సందంశము = పట్టుకారు. దీనిచేఁ బట్టఁబడువస్తువు, తన కిరుపార్శ్వములయందు నుండు నినుపయాచలు రెండిటికి నధీనమైయుండునట్లు, సమానజాతిగల రెండువస్తువులనడుమ నుండు మఱియొక వస్తువుకూడ, నదేజాతిలోఁ జేరు నని నిర్ణయించుట, సందంశన్యాయ మనఁబడుచున్నది.

ఆ సందంశన్యాయమే ప్రవర్తింపనిమొదల విశేష (భేద) మేమియు లేకుండుటం జేసి (ప్రధానముల సందర్భమునందుఁ బ్రయాజాదులవలె, నీ యభిక్రమణాదులు కూడ విధింపఁబడుటవలన), ప్రయాజములు,[౧] అభిక్రమణాదులు,[౨] మొదలగు నివి యన్నియు ఫలభావనయందలి కథంభావాకాంక్షను బూరించుటకు సమానముగా నావశ్యక మగుటచేఁ బ్రధానములకే యంగములు కావలసివచ్చును గదా!

ప్రధానమున కుపకరించు నంగములలో నేదే నొకదాని ననువదించి (దాని నుద్దేశించి) విధింపఁబడు రెం డంగములనడుమను, మఱియొక క్రియ విధింపఁబడుట, సందంశ మనఁబడుచున్నది. ఉదా:— అభిక్రమణ మనుక్రియను విధించుట అది యెట్లంటేని—ప్రయాజాదుల ననువదించి, దానికొఱకు "సమానయతే జుహ్వాం, ఉపభృత స్తేజో వా, ఆజ్యం ప్రజా బర్హిః ప జాస్వేవ తేజో దధాతి" అను మంత్రముచే, నుపభృత్తను పాత్రమునుండి సగము ఘృతమును దీసికొని వచ్చి, జుహూ వను పాత్రమునం దుంచుట యను నంగమును విధించి, తరువాత 'యస్యైవం విదుషః ప్రయాజా ఇజ్యన్తే ప్రైభ్యో లోకేభ్యో భ్రాతృవ్యా న్నుదతే. అభిక్రామం జుహోత్యభిజిత్యై'[౪] అను వాక్యముచే నభిక్రమణ మనుక్రియ విధింపఁబడుచున్నది. దీనియనంతరమే, 'యో వై ప్రయాజానాం మిథునం వేద, స ప్రజయా పశుభిర్మిథునై ర్జాయతే'[౫] అను వాక్య

౧. సమిధో యజతి, తనూనపాతం యజతి, ఇడో యజతి, బర్హిర్యజతి, స్వాహాకారం యజతి, అనునైదువాక్యములచే విధింపఁబడు నంగయాగములకుఁ బ్రయాజము లని పేరు. ఇవి ప్రధానయాగమునకు ముం దాచరింపఁబడును.

౨. 'అభిక్రామం జుహోత్యభిజిత్యై' (= శత్రువును జయింపఁగోరువాఁడు 'అభిక్రమణ' మను క్రియ నాచరించుచుఁ బ్రయాజము లనెడి హోమముల నాచరింపవలయును.) అను విధిచే విధింపఁబడు క్రియల కభిక్రమణము లని పేరు.

౩. ఉపభృత్తనుపాత్రనుండి సగము ఆజ్యము తీసికొని వచ్చి, జుహూవను పాత్రయం దుంపవలసినది. ఈ బర్హిర్యాగ మనునాలుగవ ప్రయాజము, సంతతిస్వరూప మైనది గనుకను, ఆజ్యము తేజస్సు గనుకను, నిట్లాచరించుటచే యజమానుని సంతతియందుఁ దేజస్సు స్థాపింపఁబడును. (తై. సం. ౨-౬-౧-౨)

౪. = ఇట్లు తెలిసికొని ప్రయాజాదుల నాచరించువాఁ, డీలోకమునుండి వెడలి శత్రువులను బాధించి, జయము నొందును. ఇట్టి జయముకొఱకు, అభిక్రమణ మను క్రియను జేసి, హోమముల నాచ ధ్యా రింపవలయును.

మధ్యే ౫. ఎవఁడు ప్రయాజాదుల సంఘమును దెలిసికొనుచున్నాఁడో, యతఁడు సంతతి, పశువులు, భార్యలు కలవాఁ డగును. (తై. సం. ౨-౬-౧-౪.)

ముచే నొకయంగము విధింపఁబడుచున్నది. కాఁగా, నిచట మొదటిదియు, మూఁడవదియు నగు ప్రయాజాంగములనడుమ, విధింపఁబడిన యభిక్రమణ మనునది, సందంశన్యాయముచేఁ బ్రయాజాదుల కంగ మగుచున్నది. ఈప్రయాజాదుల కుండు కథంభావాకాంక్ష, యీ రెండంగములనడుమను బఠింపఁబడు నభిక్రమణ మనునదికూడ నంగముగా నన్వయించువఱకు నుపశమింపదుగదా! ఇందులకు,[౧] 'ఏవేని రెండుక్రియలొక ప్రధానయాగప్రకరణమునం దుండునంగమున కుపకారకము లగునంగము లని, శ్రుతి, లింగము, వాక్యము, అను మూఁడుప్రమాణములమూలమునను దెలియఁజేయఁబడఁగా, నీరెండుక్రియలనడుమను బఠింపఁబడు వేఱొకక్రియకూడ, సందంశన్యాయముచే వానికే (ప్రధానయాగప్రకరణమం దుండునంగములకే) యుపకారక మగు నంగ మగుచున్నది'[౨] అను ప్రమాణము కలదు. 'ప్రధానభావనయందు ఫల ముండుటచేఁ గథంభావాకాంక్ష యుండును గాని, యంగభావనయందు ఫలము లేకుండుటచే, నట్టి కథంభావాకాంక్ష యుండదు. ఇట్లుండ నభిక్రమణము, ప్రయాజముల కుండు కథంభావాకాంక్ష నుపశమింపఁజేయుటమూలముగా, వాని కంగము కాఁగల దని యెట్లు చెప్పవచ్చును? అని శంకింపవలదు. ఆ యంగభావన ఫలభావనతో సమానమగు భావనయే కనుక, దానియందుఁగూడఁ గథంభావాకాంక్ష కలుగునుగదా! అ దెట్లంటేని; ప్రయాజములచే నపూర్వము నుత్పాదించి, ప్రధానయాగమున కుపకారము చేయవలసిన దని చెప్పఁబడఁగా, నాప్రయాజములచే నపూర్వము నుత్పాదించు ప్రకారమును దెలియనివానికి, 'ఈప్రయాజములచే నపూర్వము నెట్లుత్పాదింపవలయును?' అను కథంభావాకాంక్ష యుండనేయుండును. అట్టి యాకాంక్ష సందంశపతితము లగు[౩] నంగములచేతఁ గాని యట్టియంగములు లేనపుడు, ప్రత్యేకవిధివాక్యములవలన[౪] విధింపఁబడు నంగములచేఁ గాని, యట్టియంగములును లేనపుడు,

౧. "పరప్రకరణస్థానా మంగే శ్రుత్యాదిభి స్త్రిభిః, జ్ఞాతే పునశ్చ తైరేవ సందంశేన తదిష్యతే" (తం. వా. 3-౧-౧౪) (పృష్ఠము. ౭౫౫)

౨. ఇది ప్రభాకరు ననుసరించు మీమాంసకుల మతము.

3. ఏదే నొక యంగమున కుపకారకములుగా విధింపఁబడు, రెండు క్రియలనడుమఁ బఠింపఁబడునవి. ఉదా:— అభిక్రమణము మున్నగు క్రియలు.

౪. 'ఇంద్ర ఊర్ధ్వో అధ్వర ఇత్యాఘార మాఘారయతి' అను ప్రత్యేక విధివాక్యముచే విధింపఁబడు 'ఆఘారము' మున్నగు క్రియలు.

స్మృతివాక్యముల మూలమున[1] విధింపఁబడు నాచమనము మున్నగు నంగములచేఁ గాని యుపశమింపఁగలదు. ఈ మూఁడువిధము లగు క్రియలలో, నేవియు లేనపుడును, నీ యాకాంక్ష ముందు వివరింపఁబోవు దర్విహోమన్యాయమూలముగా,[2] నీ ప్రయాజముల స్వరూపమునుమాత్ర మాచరించుటచే నుపశమింపఁగలదు. దర్విహోమములను విధించు సందర్భమునందు, వాని స్వరూపమును నిష్పాదించుటకంటె, వేఱువ్యాపార మేదియు వినఁబడుటలేదు. అట్టి వ్యాపారము, మఱి దేనినుండియు నతిదేశమూలముగా నైనఁ బ్రాప్తించుటయైనను[3] లేదు. ఏదే నొకయాగమునందలి ధర్మము లతిదేశమూలముగాఁ బ్రాప్తింప నేరవు. యాగము హోమముకంటె విలక్షణ[4]మైనదిగదా! ఏదే నొక హోమమునందలి ధర్మము లైన, నతిదేశమూలముగా నిచటఁ (దర్విహోమమునందు) బ్రాప్తింపనేరవు. ఏ హోమమునందలి ధర్మ, మతిదేశమూలమున, నే హోమమునందుఁ బ్రవర్తించునో, యా నియమమును స్పష్టపఱచు ప్రమాణ మేమియు లేదుగదా! కావున, నేవిధముగానైన ధర్మ మేదియుఁ బ్రాప్తింప కుండుటంజేసి, 'దర్విహోమముల నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును' అను భావనయందు, 'అది యెట్లు' అని యాకాంక్ష కలిగినను, నట్టి యాకాంక్ష వాని (దర్విహోమముల) స్వరూపమునుమాత్ర ముత్పాదించున ట్లాచరించుటచేతనే యుపశమించును. కాఁగా నీయంగములసందర్భమునందు, సందంశపతితములు మున్నగు

౧. 'ఆచాంతేన కర్మ కర్తవ్యమ్' (= ఆచమనము చేసియే, కర్మ మాచరింపవలయును.) "దక్షిణాచారేణ కర్తవ్యమ్" (= కుడిచేతితోఁ గర్మము నాచరింపవలయును.) అను నీమున్నగు స్మృతులచే విధింపఁబడు క్రియలు.

౨. దర్విహోమములు విధింపఁబడునపు, డితికర్తవ్యత యేదియు వినఁబడ కుండుటంజేసి, వాని విషయమై కథంభావాకాంక్ష కలిగినను, నాయాకాంక్ష, వానిస్వరూపము నాచరించుటచేతనే యెట్లుపశమించుచున్నదో యట్లే.

౩. ప్రాప్తించుట = స్ఫురించుట = తోఁచుట.

౪. భిన్న మయినది = వేఱైనది. యాగ మనఁగా హవిస్సు నగ్నియం దుంచుట యనునది యంగముగాఁగల 'ఏదే నొక దేవత నుద్దేశించుట,' 'ఈహవి స్సాదేవతకొఱకే కాని, నాకొఱకుఁ గాదు' అని మనస్సునందుఁ జేయుత్యాగము, అను నీ రెండుక్రియలసమూహము. హోమ మనఁగా, (i) ఏదే నొక దేవత నుద్దేశించుట. (ii) దానికొఱకే హవిస్సును మనస్సునందుఁ ద్యాగము చేయుట (iii) ఆ హవిస్సు నగ్నియం దుంచుట, అను నీమూఁడు క్రియలసమూహము.

క్రియ లేవియు నుండవో, యా యంగములనుగూర్చి కథంభావాకాంక్ష గలిగినను, నట్టి యాకాంక్ష, యా యంగముల స్వరూపమునుమాత్ర ముత్పాదించున ట్లాచరించుటచేతనే యుపశమించును, గాని, సాధారణముగా సందంశపతితములు మున్నగు వానిలో, నేవియు నుండకుండుట సంభవించదు. కాఁబట్టి, అభిక్రమణ మను క్రియ, ప్రయాజాదుల కంగ మగు నని చెప్పుట యుక్తముగానే యున్నది.

ఇట్లు వివరింపఁబడిన యవాంతరప్రకరణము, మహాప్రకరణముకంటె బలవత్తరమైనది. 'సందంశపతితము లగు ధర్మములు దేని కుపకరింపవలయును?' అను నాకాంక్ష కలుగఁగాఁ, బ్రధానయాగమునుండి జనించు నపూర్వముకంటె, దగ్గఱనుండు ప్రయాజములచే జనించు నపూర్వమే, యతి శీఘ్రముగా నుపస్థిత మగుచున్నది కాన నీధర్మములు ప్రయాజములనుండి జనించు నపూర్వమునకే యుపకరించు నని, సిద్ధించుచున్నదిగదా! ఇఁకఁ బ్రస్తుతము ననుసరింతము. ఇట్లు వివరింపఁబడినరీతిని, రెండు విధము లగు[2] ప్రకరణ మాయా యంగములను వినియోగింపఁజేయు నని సిద్ధించుచున్నది.

ఈప్రకరణ మనుప్రమాణము, స్థానము మొదలగు[3] ప్రమాణములకంటె బలవత్తర మైనది. స్థానప్రమాణముచే నంగ మగుట బోధింపఁబడు సందర్భములయందు 'అంగప్రధానము'లలో నేదే నొకదాని కుండు నాకాంక్ష, వేఱువిధముగా నుపశమించియే యుండును. ఆకాంక్ష కలది, (అంగము) యుపశమించిన యాకాంక్ష కలదానికిఁ దనతో నేదే నొకయాకాంక్షను గల్పింప కుండఁగ, దానితో (నిరాకాంక్షముతో) సంబంధింప నేరదు. కావున, నంగప్రధానములలో నేదే నొకదానికిఁ గలుగు నాకాంక్ష యుభయాకాంక్ష యనెడి ప్రకరణమును గల్పించుటమూలముగా, వాక్యము మున్నగు[4] ప్రమాణములను గల్పించుట కారంభించునంతలోఁ, బ్రకరణము, శీఘ్రముగా వాక్యము మున్నగుప్రమాణములను గల్పించి, యచటియంగములను వినియోగింపఁజేయఁగలదు గనుక, స్థానముకంటెఁ బ్రకరణము బలవత్తర మగుచున్నది.

౧. అగ్నిహోత్రహోమము, నారిష్టహోమములు, పిష్టలేపహోమము, ఫలీకరణహోమము, నను వానిలో నేదైన నీదర్విహోమమునకుఁ, బ్రకృతి యని, నిర్ణయించుటకుఁ బ్రమాణ మేమియు లేదు.

౨. మహాప్రకరణము, అవాంతరప్రకరణము అనునవి

3. స్థానము, సమాఖ్య యనునవి.

౪. వాక్యము, లింగము, శ్రుతి యను ప్రమాణములు.

కావుననే 'అక్షైర్దీవ్యతి రాజన్యం జినాతి; శౌనశ్శేఫ మాఖ్యాపయతే' అనువాక్యములచే విధింపఁబడు, జూద మాడుట మొదలగు ధర్మ[1]ములు, అనేకయాగముల సంఘరూపమగు రాజసూయయాగమునం[2] దంతర్గత మైనదియు, 'అభిషేచనీయము' అను పేరుగలదియునగు సోమయాగముయొక్క విశేషమందుఁ బఠింపఁబడినవైనను, నవి స్థాన మను ప్రమాణముచే నభిషేచనీయయాగమున కంగ మగు నని చెప్పుటకు వీలు లేదు. అవి యభిషేచనీయమునకే యంగములు కావలె నన్న, స్థానప్రమాణముచేతనే యట్లు కాఁగలవు గాని, ప్రకరణప్రమాణముచేఁ గాదు. అభిషేచనీయ యాగము, యాగస్వరూప మగు ద్రవ్యము దేవతయు, నను నీరెండింటిని బోధింపని[3] విధిచే విధింపఁబడుటం జేసి సోమయాగమునకు వికృతి యగుచున్నది గనుక, నీయభిషేచనీయమున కుండు నంగాకాంక్ష, ప్రకృతియగు సోమయాగమునందలి యంగములతో సంబంధించుటమూలముననే యుపశమించుచున్నదిగదా! కాఁగా, నీవి దేవనము (= జూదము) మొదలయిన ధర్మములు, ప్రకరణప్రమాణముమూలమున రాజసూయయాగమునకే యంగము లగుచున్నవి.

అయ్యా! "రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత" అనువాక్యమందలి రాజసూయ మనుశబ్దము, నామధేయ మగుటం జేసి, యీవాక్యమందలి 'యజేత' పదమునందుండు నాఖ్యాతమునకు లోఁబడినదై,[4] యది తెలియఁజేయునర్థమునే బోధిం

౧. ధర్మములు = అంగము లగు కృత్యములు.

౨. 'రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత' (= స్వర్గరాజ్యమును గోరుకొనినయొఁడు రాజసూయ మను యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.) అను విధిచే రాజసూయ మను యాగము విధింపఁబడుచున్నది. దీనియందు 'అనుమతి' మున్నగు నిష్టులు, 'పంచావత్తీయ' మున్నయిన దర్వీహోమములు, "ఆదిత్యాం మల్హాం గర్భిణీ మాలభతే" ఈ మొదలయిన వాక్యములచే విధింపఁబడు పశుయాగములు, పవిత్ర, అభిషేచనీయ, దశపేయ, కేశవపనీయ, వ్యుష్టి, ద్విరాత్ర, క్షత్రధృతి అను నాలు సోమయాగములును, నాచరింపఁబడవలసినవిగా విధింపఁబడుచున్నవి. వానిలో 'అభిషేచనీయము' అను సోమయాగము యొక్క సన్నిధియందు, 'అక్షైర్దీవ్యతి' మున్నగు పయిని వ్రాయఁబడిన మూఁడువాక్యములచే, జూద మాడుట, రాజులను జయించుట, శునశ్శేఫుని చరిత్రమును జెప్పించుట యనునవి విధింపఁబడుచున్నవి.

3. ఈ విషయము, 'అవ్యక్తాసు తు సోమస్య' (జై. సూ. ౮-౧-౧౬) అను మీమాంసాసూత్రమందు వివరింపఁబడియున్నది.

౪. రాజసూయశబ్దము, తనకు నియమితమైన ప్రసిద్ధ మగునర్థము లేకుండుటంజేసి, యాఖ్యాతము ననుసరించి, దానిచేఁ దెలియఁజేయఁబడు నర్థమునే బోధించు నని భావము.

చును. ఇచట నొకఁ డిట్లు శంకించుచున్నాఁడు. 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' అను విధివాక్యమునందలి 'దర్శపూర్ణమాస' పదము, నామధేయ మయినను, నచటి యాఖ్యాతమునకు లోఁబడి యుండలేదు. అది యెట్లనఁ; ఈవాక్యమందలి 'యజేత' యను నాఖ్యాతము, సమానముగా దర్శపూర్ణమాసేష్టులందలి ప్రధానము లయిన ప్రకృతియాగముల నైదింటిని, ప్రయాజములు, అనూయాజములు, ఆఘారములు ననుసంగయాగములను దెలియంజేయుచున్నది.[1] 'దర్శపూర్ణమాసపద మన్ననో, యీయష్టులందుఁ బ్రధానములగు 'ఆగ్నేయము' మున్నగు నైదుయాగములనుమాత్రమే తెలియఁజేయఁగలదు గాని, ప్రయాజములు మున్నగు నంగయాగములనుగూడఁ దెలియఁజేయనేరదు. కనుక, నీ 'దర్శపూర్ణమాస'పదము, 'యజేత' అను నాఖ్యాతమునకు లోఁబడి యుండలేదు. ఇట్లే రాజసూయపదముకూడ, నామధేయ మైనను, దన్ను విధించువాక్యమునం దుండు నాఖ్యాతమున కేల లోఁబడక యుండఁగూడదు? ఇట్లు చేయఁబడినశంక సరికాదు. ప్రసిద్ధమగు నర్థము లేనిపదముచే బోధింపఁబడవలసిన యర్థము, దగ్గఱ నుండునదియుఁ, బ్రసిద్ధముగా నిర్ణీతమయినయర్థము గలదియు, నగుపదముచే నిర్ణయింపఁబడును. ఇందులకు "దీని కిది నిర్ణీత మైనయర్థ మని తెలియనిదియు, దీని కీయర్థ ముండునా, లేదా యను సందేహము గలదియు, నగుపదముచేఁ దెలియఁజేయఁబడవలసిన యర్థము, దానిదగ్గఱ నుండునవియుఁ, బ్రసిద్ధముగా నిర్ణీతమగునర్థము గలవియు, నగుపదములమూలముగా నిర్ణయింపఁబడును. ప్రసిద్ధముగా నిర్ణీతమైన యర్థముగల పద మున్ననో, యట్టిపదములు దగ్గఱగా నున్నను, దన యర్థమును విడిచి వేఱొకయర్థమును బోధింపదు" అను ప్రమాణము[2] గలదు.

దర్శపూర్ణమాసపదము, 'అమావాస్య, పూర్ణిమ' అను కాలవిశేషములను, శక్తిమూలమున బోధించుచున్నది. ఆగ్నేయయాగము మున్నగు నైదు[3] ప్రధాన

౧. ఈవిధముగా 'అనుమత్యై పురోడాశ మష్టాకపాలం నిర్వపతి' (తై.సం. ౧-౮-౧-౧.) అనునీమున్నగు వాక్యములచే విహితమగు ఇష్టులు, పశుయాగములు, సోమయాగములును, రాజసూయపదముచే గ్రహింపఁ జేయఁబడవలయు నని తాత్పర్యము—

౨. "పద మజ్ఞాతసంబద్ధం ప్రసిద్ధై రపృథక్ఛ్రుతి, నిర్ణీయతే నిరూఢంతు న స్వార్థా దపనీయతే." (తం. వా. ౧-౪-౨ పృష్ఠము. ౨౮౬)

3. ఆగ్నేయము, అగ్నీషోమీయము, ఉపాంశుయాజము. ఐంద్రయాగములు రెండు,

యాగములకును, నీ కాలవిశేషములతో సంబంధము కల దని, యీ యాగములను విధించు నుత్పత్తివాక్యములమూలమునఁ[౧] దెలియుచున్నది. కావున, నీ దర్శపూర్ణమాసపదమున కీ యైదుయాగములు నర్థ మని ప్రసిద్ధముగాఁ దెలియుచున్నది. ఆగ్నేయము మొదలగుయాగము లనేకము లున్నవి గనుక, వీని నన్నిటిని దెలియఁజేయఁదగు దర్శపూర్ణమాసపదము, 'దర్శపూర్ణమాసాభ్యాం...' ఇత్యాదివాక్యమునందు, 'దర్శపూర్ణమాసాభ్యాం' అని ద్వివచనాంతముగా నుండుట తగ దని చెప్పవలదు. 'య ఏవం విద్వాన్ పౌర్ణమాసీం యజతే', 'య ఏవం విద్వా నమావాస్యాం యజతే' అను విద్వద్వాక్యములయం దుండు[౨] పౌర్ణమాసీపదము 'ఆగ్నేయము, అగ్నీషోమీయము, ఉపాంశుయాజము' అను మూఁడుయాగముల సముదాయమును, అమావాస్యాపదము 'ఆగ్నేయము, ఐంద్రదధియాగము, ఐంద్రపయోయాగము నను మూఁడుయాగముల సముదాయమును, దెలియఁజేయుచున్నవి కనుక, 'దర్శ' 'పూర్ణమాస', అనుపదములచే, రెండుసముదాయములే బోధింపఁబడుటంజేసి 'దర్శపూర్ణమాసాభ్యాం' అను ద్వివచన మంతముగాఁ గల ప్రయోగము సరిగానే యున్నది. కాఁగా, : దర్శపూర్ణమాసపదము ఆగ్నేయము మొదలైన యైదు యాగములను బోధించు నని నిర్ణయింపఁబడఁగా, నీపదమునే యనుసరించి, 'యజేత' అను నాఖ్యాతముకూడ, నాయైదుయాగములనే బోధించుచున్నది. అట్లు బోధించుటచే నీ యాఖ్యాతము, తన యర్థము నెంతమాత్రము విడువలేదు. రాజసూయపద మన్ననో యిట్టియర్థమునే రూఢముగా బోధించు నని నిర్ణయింపఁబడలేదు. కావున, నాపద మాఖ్యాతమునకు లోఁబడియే[3] యుండును. ఆయాఖ్యాతము, సమానముగాఁ బైని వివరముగాఁ దెలుపఁబడిన యిష్టులను, సోమయాగములను, బశుయాగములను దెలియఁజేయుచున్నది. అట్టి యాఖ్యాతమునకు లోఁబడి యుండుటంజేసి, రాజసూయపదముకూడ వాని నన్నింటిని బోధించుచున్నది.

౧. "య దాగ్నేయోఽష్టాకపాలోఽమావాస్యాయాం పౌర్ణమాస్యాం చాచ్యుతో భవతి", "తాభ్యా మేత మగ్నీషోమీయ మేకాదశకపాలం పూర్ణమాసే ప్రాయచ్ఛత్" "ఉపాంశుయాజ మంతరా యజతి", "ఐంద్రం దధ్యమావాస్యాయామ్", "ఐంద్రం పయోఽమావాస్యాయామ్" అనునవి.

౨. విద్వద్వాక్యము = కర్మములను దెలిసికొనుటవలనఁ గలుగు మహిమను దెలియంజేయువాక్యము.

3. 'లోఁబడి' దీనియర్థము ౯౬ పేజి ర టిప్పణిలో వివరముగాఁ దెలుపఁబడినది.

"రాజసూయపదమునందలి[1] 'రాజ-సూయ' అను నవయవములనుండి, సోమరసమును బిండుట యనుక్రియ యర్థము అని తెలిసికొనఁబడుటంజేసియు, 'సోమమభిషుణోతి'[2] అనువాక్యమువలన, నీక్రియ సోమయాగమునం దుండునట్లు తెలియుటంజేసియు, నీ రాజసూయపదము సోమయాగమునే బోధించును గాని, పైని వివరింపఁబడిన యిష్టులు, పశుయాగములు, మున్నగువాని నన్నిటినిమాత్రము బోధింపదు." అని శంకింపరాదు. అభిషేచనీయము మొదలయిన సోమయాగములయందు, సోమమును బిండుట యనుక్రియ, ప్రత్యక్షమగు వాక్యముచే విధింపఁబడుట లేదు. ఆ క్రియను బోధించు 'సోమ మభిషుణోతి' అనువాక్యము, ప్రకృతియగు జ్యోతిష్టోమయాగముయొక్క సందర్భమునందు వినఁబడుచున్నదిగదా![3] జ్యోతిష్టోమయాగమునందలి యీవాక్యము నతిదేశముచే నీసోమయాగమునందుఁ బ్రవర్తింపఁజేయుట మూలముగా, నీ క్రియ సోమయాగముతో సంబంధించునట్లు తెలిసికొనవచ్చునని చెప్పవలదు. భావనయందు మొదట ఫలాకాంక్ష, పిమ్మటఁ గరణాకాంక్ష, తరువాతఁ గథంభావాకాంక్ష, యను క్రమమునసే యాకాంక్షలు కలుగును గాన, భావన కేదేనొకఫలముతో సంబంధ ముండునట్లు తెలిసినతరువాతనే, కథంభావాకాంక్ష నుపశమింపఁజేయు నతిదేశ మావశ్యక మగుచున్నది గనుక, నట్టి ఫలసంబంధమును బోధించు 'రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత' అనువాక్యముయొక్క యర్థము సంపూర్ణముగాఁ దెలిసినపిమ్మటఁగదా! యీ యతిదేశము చేయవలసివచ్చును! ఈ "రాజసూయేన..." ఇత్యాదివాక్యముచే రాజసూయయాగమునకు ఫలముతోఁగల సంబంధము తెలిసికొనఁబడఁగాఁ, బిమ్మటఁ[4] గథంభావాకాంక్ష కలుగఁగా, నట్టి యతిదేశమును గల్పింపవలసి యున్నది. కావున, నా యతిదేశమును

౧. రాజు చేయుయజ్ఞము గనుక రాజసూయము. లేదా, దీనియందు సోమలతనుండి రసము పిండఁబడును. అని వ్యుత్పత్త్యర్థము గలదు. రాజు=సోమరసము. సూయ=పిండఁబడుట.

౨. సోమరసమును సోమలతనుండి పిండుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.

3. కావున నీసోమయాగమునందలి సోమమును బిండుట యనుక్రియ, యుపస్థితము కానేరదు.

౪. 'రాజా రాజసూయేన' అను నీమున్నగువాక్యముయొక్క యర్థము పూర్తిగాఁ దెలిసిన పిమ్మటఁ గలుగవలసిన కథంభావాకాంక్ష, యీవాక్యార్థమును విమర్శించుదశయం దుపస్థితము కానేరదు. కనుక, నట్టియాకాంక్ష నుపశమింపజేయు నంగములయుపస్థితియు, నట్టియుపస్థితిని గలిగించునతిదేశమును, నిపుడు సంభవింపనేర కుండుటంజేసి, యీయతిదేశము నాధారముగాఁ గైకొని, దానిమూలమున, రాజసూయపదము యాగనామధేయ మని చెప్పుట యుక్తము కా దని తాత్పర్యము.

జేయుటకు ముందుగానే, యీరాజసూయవాక్యముయొక్క యర్థమును వివరింపవలసి యున్నది. కాఁగా, నీవాక్యార్థమును విమర్శించు దశయందు, సోమమును బిందుట యనుక్రియ, యీ యాగముతో సంబంధించునట్లు తెలియ[1] కుండుటంజేసి, యిందలి రాజసూయపదము, ప్రసిద్ధ మగునర్థమును బోధించెడిది యెంతమాత్రమును గానేరదు. కావుననే, యీ రాజసూయపదము, 'అశ్వకర్ణ' శబ్దమువలె నవయవార్థ మేదియు బోధింపక, సముదాయముచేతనే, సంకేతముచే రూఢ మగునర్థమును బోధించు నని, సాంప్రదాయికులచేఁ జెప్పఁబడినది.

కాఁగా; రాజసూయపదము, ప్రసిద్ధ మగునర్థ మేదియు లేని దగుటంజేసి, 'యజేత' అను నాఖ్యాతమునకు లోఁబడి యుండును గనుక, నా పదముచేఁ బైని వివరింపఁబడిన యిష్టులు, పశుయాగములు, సోమయాగములును దెలియంజేయఁబడు చున్నవి. ఆ యిష్టులు మున్నగునవి, వానివాని ప్రకృతులనుండి[2] యతిదేశింపఁబడు ధర్మములచే, నిరాకాంక్షము[3] లగును గనుక, విదేవనము[4] మొదలయినధర్మములను రాజసూయమున కంగములుగా వినియోగింపఁజేయు ప్రమాణము, ప్రకరణము కానేరదు. విదేవనము మొదలగు ధర్మములకుమాత్రమే యుపకార్యాకాంక్ష యున్నది కాని, రాజసూయమునందలి యిష్టులు మున్నగువాని యాకాంక్ష, వానివాని ప్రకృతులనుండి యతిదేశింపఁబడు ధర్మములచే నిరాకాంక్షము లగును గనుక, విదేవనము మొదలయిన ధర్మములను రాజసూయమున కంగములుగా వినియోగింపఁజేయు ప్రమాణము ప్రకరణము కానేరదు. విదేవనము మొదలయిన ధర్మములకుమాత్రమే యుపకార్యాకాంక్ష యున్నది గాని, రాజసూయమునందలి యిష్టులు మున్నగువాని యాకాంక్ష, వానివాని ప్రకృతులనుండి యతిదేశింపఁబడు ధర్మములచే నుపశమించు టంజేసి, రాజసూయమున కుపకారకాకాంక్ష లేదు. కనుక, నీ విదేవనము మున్నగు ధర్మములవిషయమై, యుభయాకాంక్ష లేదుగదా! ఇచట నొకఁ డిట్లు శంకించు

౧. ఈక్రియ యతిదేశమువలనను తెలియుందగుటంజేసియు, నట్టియతిదేశము ఈదశయం దావశ్యకము కాకపోవుటంజేసియు, నీక్రియ, యిప్పు డీరాజసూయయాగముతో సంబంధించునట్లు తెలిసి కొనఁబడదు.

౨. అనుమతి మున్నగునిష్టులకుఁ బ్రకృతులు, దర్శపూర్ణమాసేష్టులు; పశుయాగములకుఁ బ్రకృతి, యగ్నీషోమీయయాగము. పవిత్ర మున్నయిన సోమయాగములకుఁ బ్రకృతి, జ్యోతిష్టోమయాగము.

౩. ఉపశమించినయాకాంక్ష కలవి.

౪. = జూద మాడుట.

చున్నాఁడు, "యాగ, మేస్వరూపముతో ఫలము నుత్పాదింపఁగలదో, యట్టి స్వరూపము గలవానికే కరణాకాంక్షయుఁ, గథంభావాకాంక్షయును గలుగును. కావున, నిష్టులు, పశుయాగములు, మున్నగు ప్రత్యేకస్వరూపములుగల యాగముల కుండెడి యాకాంక్ష, వానివాని ప్రకృతులనుండి యతిదేశింపఁబడు ధర్మములచే నుపశమించినను, నా యిష్టులు మొదలైనవి, రాజసూయత్వ మనెడుధర్మమును బురస్కరించుటమూలముననే, స్వారాజ్య మను ఫలము నుత్పాదింపఁగలుగుటంజేసి, యట్టిధర్మముగల యా యిష్టులు మొదలుగాఁగలవానికిఁ, గథంభావాకాంక్ష యుండును గనుకను, నా యాకాంక్ష, యే యంగములచేతను నుపశమింపదు గనుకను, నీ విదేవనము మొదలయిన ధర్మములవిషయమై, యుభయాకాంక్ష యుండ నేయున్నది." అని యిట్లు చేయఁబడిన శంక తగదు. ఏల యన? ఇష్టులు, పశుయాగములు మొదలగువానిని విధించు వాక్యములయందలి భావన లన్నియు, రాజసూయయాగమును విధించు 'రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత' అనువాక్యముమూలముననే ఫలసంబంధమును[1] బోధించుచుండుటంజేసి, యాభావనలకంటె, రాజసూయవాక్యమునం[2]దుండుభావన వేఱు కానేరదు గనుక, నీభావన లన్నింటియందును గథంభావాకాంక్ష యొకటియే యున్న దని, యంగీకరించుట యుచిత మగుచున్నది. కాఁగా నిచట రెండాకాంక్ష లున్న వని యూహించుటకుఁ బ్రమాణ మేమియు లేదు.

ఇంతేకాక, ఇష్టులు, పశుయాగములు, మున్నగు ప్రత్యేకయాగములకుఁ గథంభావాకాంక్ష కలుగఁగా, వానివాని ప్రకృతులనుండి యతిదేశింపఁబడు ధర్మము, లాయాకాంక్ష నుపశమింపఁజేయున ట్లన్వయించుకొను ముందే, విదేవనము మున్నయిన ధర్మములు విధింపఁబడుటంజేసి, వీనికిఁ బ్రకరణప్రమాణముచే వినియోగ మేల యుండఁగూడ దని శంకింపరాదు. ఇష్టులు మున్నగు ప్రత్యేకయాగములకు ఫలసంబంధము తెలిసినపిమ్మటనే, వానికిఁ గథంభావాకాంక్ష కలుగును. అట్టిసంబంధము రాజసూయ మనుయాగమునకే యుండునట్లు, రాజసూయవాక్యమునుండి తెలియుచున్నది. కాని యిష్టులు, పశుయాగములు, మొదలయిన యాగములకుమాత్ర మట్టిసంబంధ ముండునట్లు తెలియుట లేదు. రాజసూయయాగమునకు ఫలసంబంధముమూలముగాఁ గలుగు కథంభావాకాంక్ష, విదేవనము మున్నయిన ధర్మములచే నుపశమించునెడ,

౧. యాగము ఫలము నుత్పాదించుట యనుసంబంధము.

౨. రాజసూయయాగమును విధించువాక్యము.

నాయా ప్రకృతులనుండి ధర్మముల నతిదేశించుట యనావశ్యక మయ్యెడిని. సామాన్య స్వరూపముగల రాజసూయయాగమునకును, విశేషస్వరూపముగల యిష్టులు, పశు యాగములు, మున్నగువానికిని, వేఱువేఱుగా ఫలసంబంధమును బోధించు రెండు వాక్యము లున్నపక్షమున, రెండు వేఱగు నాకాంక్ష లుండుటంజేసి, యొకయాకాంక్ష, విదేవనము మొదలుగాఁగల ధర్మములచేతను, రెండవయాకాంక్ష, యాయాప్రకృతుల నుండి యతిదేశింపఁబడు నంగములచేతను, నుపశమించుట సంభవించెడిని. కాని, యట్టి రెండువాక్యములు వేఱువేఱుగా నిచట లేవు. కావున[౧] నిచట నుండు నొకటే యాకాంక్ష, యాయాప్రకృతులనుండి యతిదేశింపఁబడు ధర్మములచే నుపశమించును గనుక, విదేవనము మొదలగు ధర్మములను వినియోగింపఁజేయుప్రమాణము, ప్రకరణము, కానేరదు.

అయ్యా! "రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత" అనువాక్యము మొదలుకొని, యింతవఱకును జేయఁబడిన పూర్వపక్షమునకే క్రిందిది సిద్ధాన్త మగుచున్నది. పూర్వపక్షి యింతవఱకును జెప్పినది సరియే. కావుననే, యీ విదేవనము మొదలగుధర్మములు సందంశపతితము లగుచున్న వని, సాంప్రదాయికులచే నిరూపింపఁబడినది. ఇష్టులు పశుయాగములు మున్నగు యాగములకుండు రాజసూయత్వ మనెడు ధర్మమును బురస్కరించుకొని, విధింపఁబడిన 'రాజసూయాయ హ్యేనా ఉత్పునాతి'[౨] అను నీమున్నుగాఁగల యంగములనడుమను, విదేవనము మొదలగునవి పఠింపఁబడుచున్నవి. కావునఁ బ్రయాజములు నుద్దేశించి విధింపఁబడు ధర్మములమధ్యను బఠింపఁబడిన యభిక్రమణ మనుక్రియ, సందంశన్యాయముచే నా ప్రయాజముల కంగ మెట్లగుచున్నదో యట్లే, విదేవనము మొదలుకొని యభిషేకమువఱకు నుండు ధర్మము లన్నియు, నా సందంశన్యాయముమూలమున, రాజసూయ యాగమున కంగము లగుచున్నవి. కాఁగా; విదేవనము మున్నగుధర్మములు, ప్రకరణప్రమాణముమూలముగా, రాజసూయయాగమున కంగము లగు నని చెప్పినది,

౧. విదేవనము మున్నగువానికంటె ముందుగానే, ప్రకృతులనుండి యతిదేశింపఁబడుధర్మము లంగములుగా నన్వయించి, యిచటియాకాంక్ష నుపశమింపఁజేయఁగల వని, తప్పక యంగీకరింపవలసియున్నది గనుక

౨. అధ్వర్యుఁడు, రాజాభిషేకముకొఱకుఁ దీసికొని రాఁబడినయుదకములను, రాజసూయయాగమున కంగములుగా వినియోగించుటకై, వానికి 'ఉత్పవనము' అనుసంస్కారము నాచరింపవలయును. (తై. బ్రా. ౧-౭-౬.)

యుక్తముగా నున్నది. ఇట్లు ప్రకరణప్రమాణము, స్థానప్రమాణముకంటె బలవత్తర మగుచున్న దని సిద్ధించుచున్నది.

## స్థాన ప్రమాణము

స్థాన మనఁగా సమానమైన దేశమును గలిగియుండుట. ( = ఒకచోటనే విధింపఁబడుటచే దగ్గఱగా నుండుట). అది, 'పాఠమునందు దగ్గఱగా నుండుట, అనుష్ఠానమునందు దగ్గఱగా నుండుట' అని రెండువిధములుగా నున్నది. ఇందులకు, "ఒకచోటనే[౧] విధింపఁబడుట యను స్వరూపముగల క్రమము, 'పాఠమునందు దగ్గఱగా నుండుట, అనుష్ఠానమునందు దగ్గఱగా నుండుట' యని రెండువిధములుగా నున్నది. ఇట్టి క్రమము, కొన్నిచోట్ల నంగములను వినియోగింపఁజేయుటకై, ప్రమాణ మగుచున్నది." అను (తం. వా. 3-3-౫ పేజి ౮3౨) నది ప్రమాణము గాఁగలదు. స్థానము, క్రమము, అనునవి, సమానమైన యర్థముగల పదములు. పాఠమునందు దగ్గఱగా నుండుట యనునదికూడ, (i) యథాసంఖ్యముగాఁ బఠింపఁబడుట (ii) సన్నిధియందుఁ బఠింపఁబడుట, అని రెండువిధములు గలదు. కామ్యేష్టి కాండ మను పేరుగల ఫలవిశేషముకొఱ, కిష్టివిశేషములను విధించునదియుఁ, గనుకనే కామ్యేష్టికాండ మను పేరుగలదియు, నగు బ్రాహ్మణభాగమునందు "ఐంద్రాగ్న మేకాదశకపాలం నిర్వపేత్"[౨] "వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేత్"[3] అను నీమున్నగు నిష్టులు వరుసగా విధింపఁబడుచున్నవి. ఇట్లే 'కామ్యేష్టి యాజ్యానువాక్యాకాండము' అను మంత్రభాగమునందు, "ఇంద్రాగ్నీ రోచనా దివః"[౪] అనునీమున్నగు యాజ్యానువాక్య లనెడు మంత్రములు, వరుసగాఁ బఠింపఁ

౧. తత్ర క్రమో ద్విధా చేష్టో దేశసామాన్యలక్షణః, పాఠానుష్ఠానసాదేశ్యా ద్వినియోగస్య కారణమ్.

౨. ఇంద్రాగ్నులనెడు వ్యాసక్తదేవతలకొఱకుఁ, బదునొకండు కపాలములయందు సంస్కరింపఁబడిన పురోడాశమును నిర్వపించి, యజించుటచే నిష్టము నుత్పాదించునది. (మై. సం. ౨-౧-౧). వ్యాసక్త = జంటగా నుండు.

3. వైశ్వానరుఁ డను నగ్నికొఱకుఁ, బన్నిండు కపాలములయందు సంస్కరింపఁబడిన పురోడాశమును నిర్వపించి యజించుటచే, నిష్టము నుత్పాదించుకొనవలెను. ( మై. సం. ౨-౧-౨ ) కపాలము= ప్రమిద.

౪. "ఇంద్రాగ్నులను వ్యాసక్తదేవతలు, స్వర్గమును బ్రకాశింపఁజేయుచుందురు. ( మై. సం. ౪-౧౧-౧ )

బడుచున్నవి. ఇట్లుండ, నీ యిష్టులలో మొదటియిష్టికి యాజ్యానువాక్యామంత్రము లలో మొదటిమంత్రము, రెండవయిష్టికి రెండవమంత్రము, ననునీక్రమమున నంగము లుగా వినియోగించుట యనునది, 'వరుసగాఁ బఠింపఁబడుట' అను ప్రమాణము మూలముగానే, కలుగుచున్నది. వీనిలో మొదటఁ బఠింపఁబడిన మంత్రమువిషయమై, 'యిది దేని నిమిత్తము' అని యాకాంక్ష కలుగఁగాఁ, బై నుదాహరింపఁబడిన కర్మములలో మొదట విధింపఁబడిన 'ఐంద్రాగ్నయాగ' మనుకర్మమే, యథాసంఖ్యము (=వరుస)గాఁ బఠింపఁబడిన దగుటచే, మొదటనే యాయాకాంక్షను బూరించున ట్లన్వయించుటకు సిద్ధపడుచున్నది. ఇట్లే రెండవమంత్రమువిషయమైకూడఁ గలుగు నాకాంక్షను, రెండవదగు వైశ్వానరయాగము పూరించుచున్నది. ఇట్లు యథాసంఖ్య పాఠము నిరూపింపఁబడి, (క్రమప్రాప్తమగు) సన్నిధిపాఠ మిక్రింద నిరూపింపఁబడు చున్నది.

ప్రాకృతాంగముల ననువదించి, వికృతులయందు విధింపఁబడినవియు, సందంశ పతితములు కానివియు, నగు నంగము లన్ననో, వికృతులసన్నిధియందుఁ బఠింపఁ బడుటవలన, సన్నిధిపాఠ మను ప్రమాణముమూలమున, నావికృతులతోనే, యన్వ యించుచున్నవి. ఉదా:—ఆమనహోమములు. ఈయామనహోమములవిషయమై, 'ఇవి దేనికొఱకగుచున్నవి?' లేదా, 'వీనికి భావ్య మేమి'? అను నాకాంక్ష కలు గఁగా, ఫలము గలదియు, వికృతులవలన జనించునదియు, నగు నపూర్వమే వెంటనే 'స్మరింపఁబడుటచే, భావ్యముగా నన్వయించుచున్నది. కావుననే, యాయంగములకు ఫలమును గల్పించుటవిషయమై, విశ్వజిన్న్యాయమును[1] బ్రవర్తింపఁజేయుట లేదు. ఈహోమములకు స్వతంత్రమగు ఫలము కలదని చెప్పినచో, వీనిని వికృతులసన్నిధిని బఠించుట వ్యర్థము కావలసివచ్చునుగదా!

ఇట్లు రెండువిధములగు 'పాఠమునందు దగ్గఱగా నుండుట' అనుప్రమాణము నిరూపింపఁబడి, యిఁక 'అనుష్ఠానమునందు దగ్గఱగా నుండుట' అనునది నిరూపింపఁ బడుచున్నది. ఉపాకరణము,[2] పర్యగ్నికరణము,[3] నియోజనము,[4] మున్నగు పశు

౧. ఇది యింతకుముందు వివరింపఁబడినది.

౨. 'ప్రజాపతేర్జాయమానాః', 'ఇదం పశుమ్', అనునీరెండు ఋక్కులచేఁ బశువును స్పృశించుట.

3. దర్భను గాల్చి పశువుచుట్టును ముమ్మాఱు త్రిప్పుట.

౪. పశువును ద్రాటిలో యూపమునకుఁ గట్టుట.

ధర్మములు[1] 'అనుష్ఠానసాదేశ్య'[2] మను ప్రమాణముమూలమున, నగ్నీషోమీయమను పశువున కంగము లగుచున్నవి. అది యెట్లనిన,? ఔపవసథ్య[3] మనుదినమున, 'అగ్నీషోమీయము'[4] అను పశువు వినియోగింపఁబడును. ఆ దినముననే యాచరింపఁబడవలసినవిగాఁ బఠింపఁబడు ధర్మములనడుమను, 'ఉపాకరణము' మున్నగు పశుధర్మములుకూడఁ బఠింపఁబడుచున్నవి. కావున, నీ ధర్మములవిషయమై, 'ఇవి వేనికొఱకు?' అను నాకాంక్ష కలుగఁగా, నుత్తరక్షణముననే వినియోగింపఁబడఁబోవునదిగా స్మరింపఁబడు, పశువునుండి జనించు నపూర్వమే, భావ్యముగా సంబంధించును. కావున నీ ధర్మములు, 'అనుష్ఠానసాదేశ్యము' అను ప్రమాణముమూలమున, నగ్నీషోమీయ మను పశువునకే యంగము లగుట యుక్త మగుచున్నది. ఔపవసథ్య మనుదినమునం దగ్నీషోమీయ మనుపశువును వినియోగించుటంజేసి, యది యాదినమందే పఠింపఁబడును[5] గనుక, నీ పశుధర్మము లన్నియు, 'అనుష్ఠానసాదేశ్యము' మూలమునఁ గాక, దానికంటె బలవత్తర మగు స్థాన ప్రమాణమూలముననే, యగ్నీషోమీయపశువున కంగము లేల కాఁగూడ దన్నను శంకింపవలదు. అగ్నీషోమీయపశువు, సోమక్రయములసన్నిధియందుఁ[6] బఠింపఁబడుచున్నది కాని, యౌపవసథ్య మనుదినమునందుఁ, బఠింపఁబడుట లేదుగదా! 'ఏది

౧. పశువునకుఁ జేయుసంస్కారములు.

౨. అనుష్ఠానమునందు దగ్గఱగా నుండుట.

౩. జ్యోతిష్టోమమునందు సోమరసమును సిద్ధపఱచుదినమునకుఁ బూర్వపుదినము. అనఁగా, దీక్షాదినమునుండి నాలుగవరోజు.

౪. జ్యోతిష్టోమయాగమునం 'దగ్నీషోమీయము, సవనీయము, అనూబంధ్యము' అను మూఁడు పశువులు వినియోగింపఁబడును.

౫. ఔపవసథ్యదినమునందు "ఆగ్నేయ మగ్నిష్టోమ ఆలభతే" ( = అగ్నిష్టోమయాగమునం దగ్నిదేవతకొఱకు, సవనీయ మనుపశువు నాలంభించి యజించుటచే, నిష్టము నుత్పాదించుకొనవలయును.) అను వాక్యముమూలమున, సవనీయ మనుపశువు పఠింపఁబడుచున్నది గాని, యగ్నీషోమీయపశువు పఠింపఁబడుట లేదు. అయినను, నిచటఁ బఠింపఁబడిన సవనీయపశువును, అగ్నీషోమీయపశువునుగా భ్రమించుటచే, నీశంక కలుగుచున్నది.

౬. సోమలతను గొనుట. జ్యోతిష్టోమయాగమునందు, దీక్షణీయేష్టి నాచరించుదినమునకు మఱుసటిదినమున, (అనఁగా రెండవదినమున) "అరుణయా పింగాక్ష్యా ఏకహాయన్యా గవా సోమం క్రీణాతి" (అర్థము చూ. ౨౩ పేజి.) అనువాక్యముచే, సోమక్రయములు విధింపఁబడుచున్నవి.

యెచ్చటఁ బఠింపఁబడునో, యది యచ్చటనే వినియోగింపఁబడుట యుచితము.' కనుక, అగ్నీషోమీయపశువును, సోమక్రయసన్నిధియందుఁ బఠించుటంజేసి, యా పశువు నచటనే వినియోగింపవలసియుండఁగా, నీపశువునకు, ఉపాకరణము మున్నగు పశుధర్మములంతో, ననుష్ఠానసాదేశ్యముకూడ నుండదు గాన, నీపశుధర్మములు, అగ్నీషోమీయపశువున కై ట్లంగములు కాఁగల వని చెప్పవలదు. "అగ్ని,[1] సోముఁడు, నను జంటదేవతల నుద్దేశించి, వినియోగింపఁజేయఁబడు, నీ యగ్నీషోమీయ మను పశువును, ఔపవసథ్య మను నాల్గవదినమున నాలంభించి,[2] వినియోగింపవలయును" అని శ్రౌతవినియోగవాక్య ముండుటవలన, నీ పశువు ఔపవసథ్య మనెడుదినమునందే వినియోగింపఁబడవలసి యున్నది గనుక, నీ పశువును రెండవ దినమునందు జరుగు సోమక్రయముయొక్క సన్నిధియందు వినియోగించుట, కుదుర నేరదుగదా! స్థానప్రమాణముకంటెఁ బ్రకరణప్రమాణము బలవత్తర మగుటంజేసి, యీ పశుధర్మములు, జ్యోతిష్టోమయాగముయొక్క మహాప్రకరణమునందుఁ బఠింపఁబడుచున్నవి కనుక, నివి (పశుధర్మములు) జ్యోతిష్టోమయాగమునకే యంగములుగా నేల కాఁగూడదు? అని పలుకవలదు. ఉపాకరణము మున్నగు నీ (పశుధర్మములు,) పశువునకు సంబంధించి యుండుటంజేసి, సోమలత ముఖ్యద్రవ్యముగాఁగల సోమయాగమునకు, సాక్షాత్తుగా నుపకరింపనేరవుగదా! కావున 'వ్యర్థము[3] లగుటచే నివర్తింపవలసిన ప్రమాణముల కుండు బలాబలములు, విపరీతము[4] లగును.' అను న్యాయ

౧. "స ఏష ద్వైదైవత్యః పశుః ఔపవసథ్యేఽహన్యాలబ్ధవ్యః" అను వాక్యము.

౨. ఉపాకరణము, నియోజనము, పర్యగ్నికరణము, సంజ్ఞపనము, అను నీమున్నగు పశువులకుఁ జేయు, సంస్కారములసముదాయమునకు 'ఆలంభము' లేక 'ఆలంభనము' అని పేరు.

3. "ఆనర్థక్యప్రతిహతానాం విపరీతం బలాబలమ్" ఇచటఁ బ్రకరణప్రమాణమూలమున, నీయుపాకరణము మున్నగు ధర్మములు, జ్యోతిష్టోమయాగమున కంగము లగునెడ, అనన్యథాసిద్ధ మగు (= ఎచటను స్వతంత్రముగాఁ బ్రవర్తింపఁజాలని) స్థానప్రమాణము, వ్యర్థము కావలసి వచ్చుటంజేసి, యది స్వయముగా దుర్బల మైనను, వ్యర్థత్వముమూలమున బాధింపఁబడుటవలనఁ, బ్రబలమై, వేఱుచోట్లఁ బ్రవర్తించుటచే దుర్బలమగు ప్రకరణమును దప్పక బాధించి, యీపశుధర్మములను బశుయాగమునకే యంగములనుగా వినియోగింపఁజేయును.

౪. స్వయముగాఁ బ్రబలమైనది దుర్బలమును, స్వయముగా దుర్బలమైనది ప్రబలమును నగు నని భావము.

మునుబట్టి, యీ ధర్మములు, స్థానప్రమాణమూలమున, సోమయాగమునందలి యగ్నీషోమీయపశుయాగమునకే యంగము లగుట యుక్తము.

ఇచటఁ బశుయాగమునకు, ఉపాకరణాదిధర్మములనుగూర్చి, కథంభావాకాంక్షయు, నీధర్మములకుఁ బ్రయోజన మేమి యని యొకయాకాంక్షయు, నను నీరెండాకాంక్షలు నుండుటంజేసి, యీధర్మములు, ప్రకరణప్రమాణమూలముననే, యీ పశుయాగమున కంగము లేల కాఁగూడ దని చెప్పవలదు. అగ్నీషోమీయపశుయాగమున కుండు కథంభావాకాంక్ష, ప్రకృతియం దుపకరించినవియుఁ, గావుననే యతిదేశమూలముగా నుపస్థిత మగునవియు, నగు ప్రాకృతధర్మములచే, నుపశమించినదిగదా! [1]ఆలోచింపఁగా, అగ్నీషోమీయయాగము, ఇతరపశుయాగము లన్నిటికిని బ్రకృతియే; అయినను, దీనియందుఁ గొన్ని యంగములుమాత్రమే పఠింపఁబడుటంజేసి, దేవతలను బిలుచుట మొదలగు సన్నిపత్యోపకారకములనుగూర్చి, యాకాంక్ష యుండనేయున్నది. మఱియు, సోమక్రయమునొక్క సన్నిధియం దీయగ్నీషోమీయ పశువు పఠింపఁబడుచున్నది. ఈధర్మము లన్ననో, యచటఁ బఠింపఁబడక, ఔపవసథ్య మనుదినమునందు విధింపఁబడుచున్నవి. పశువును విధించుచోటఁ గలుగు, నితికర్తవ్యతాకాంక్ష, వేఱొకచోట నుండు ధర్మములచే నుపశమింప లేదు గనుక, నీపశువు, వేఱొకచోట నుండుధర్మముల నతిదేశమూలముగా, గ్రహింపవలసి యుండఁగా, దర్శపూర్ణమాసేష్టులయం దంతర్గతమగు సాన్నాయ్యయాగమగు ప్రకృతినుండి, కొన్నిధర్మము, లతిదేశము మూలముగా నీ పశువునొద్దకుఁ దీనికొని రాఁబడవలసి యున్నవి. సాన్నాయ్యయాగము, పశుయాగము, నను నీరెండింటియందును, బశువు నుండి జనించు ద్రవ్యమును[2] వినియోగించుట యనునది సమానముగా నున్నది గదా! ఇందులకు, "పశుయాగమునందును,[3] బశువునుండి జనించు ద్రవ్యములే

౧. కనుక, నాభియాకాంక్ష యుండదు. కాఁగా, నీధర్మములు వికృతిసన్నిధియందుఁ బఠింపఁబడుట వ్యర్థము కావలసి యుండుటంజేసి, వీని కుండునుపకార్యాకాంక్షయంతలి బలముచేతనే, వికృతికిఁ గూడ వీనినిగూర్చి యాకాంక్షను గల్పించి, యాధర్మములను వికృతితో సంబంధింపఁజేయవలసి యున్నది. కావున, నొకటేయాకాంక్ష యనుస్థానప్రమాణమూలముననే, యీ ధర్మములు ఇచటి వికృతి యగుపశుయాగమున కంగములుగా వినియోగింపవలె నని సిద్ధించుచున్నది.

౨. సాన్నాయ్యయాగమునందుఁ బశువునుండి జనించు ద్రవ్యము, పెరుఁగు, పాలు ననెడి సాన్నాయ్య మగుచున్నది. పశుయాగమునందుఁ, బశుశరీరమునుండి జనించుద్రవ్యము, హోమమునకు వినియోగింపఁజేయఁబడుదాని యవయవములసమూహమే యగుచున్నది.

3. "సాన్నాయ్యం వా తత్ప్రభవత్వాత్" (జై. సూ. ౮-౨-౧3).

సమానముగా వినియోగింపఁబడుటంజేసి, పశుయాగమునకు సాన్నాయ్యయాగమే ప్రకృతి యగుచున్నది." అను మీమాంసాసూత్రము ప్రమాణముగాఁ గలదు. "సాన్నాయ్యం దధిపయసీ" (= సాన్నాయ్య మనఁగాఁ, బెరుఁగు పాలు నను నీ రెండువస్తువులే.) పాలు సాక్షాత్తుగాఁ బశువునుండి జనించుద్రవ్య మగుటచేతను, బెరుఁగన్ననో, పాలమూలమునఁ గొంచె మూలస్యముగా జనించుద్రవ్య మగుటచేతను, నిచటఁ బశుయాగమునకుఁ, బయోయాగమే[1] ప్రకృతి కాఁగలదు. కావున, నతిదేశవాక్యముచేఁ బ్రాప్తించిన సాన్నాయ్యయాగము (= పయోయాగము) నందలి ధర్మములమూలముననే, యీ పశుయాగమున కుండు నాకాంక్ష యుపశమించును గనుక, నిచటి ధర్మములను (ఉపాకరణాదులను), బశుయాగమున కంగములుగా వినియోగింపఁజేయు ప్రమాణము, ప్రకరణము కానేరదు. మ ఱేమన, నట్టిప్రమాణము స్థానమే యగుచున్నది. కాఁగా, నిట్లు స్థానప్రమాణముచే నంగములను వినియోగించుట సంగ్రహముగాఁ[2] దెలుపఁబడినది.

అట్టి స్థానప్రమాణము, సమాఖ్య యను ప్రమాణముకంటె బలవత్తరమైనది. స్థానప్రమాణముచేఁ, బదార్థము లంగములుగా వినియోగించునపు, డీ పదార్థముల కంగి యగు పదార్థముతోఁగల, దేశసామాన్య[3] మను సంబంధము ప్రత్యక్షమే. సమాఖ్య యను ప్రమాణముచేఁ, బదార్థముల నంగములుగా వినియోగించునపు డన్ననో, యట్టి సంబంధము ప్రత్యక్షము కానేరదు. ఇచట 'అంగములు,' 'అంగి' యనెడు పదార్థములు, వేఱువేఱు[4] స్థలములయం దుండునుగదా! ఆసమాఖ్యయే[5] పదార్థముల కుండు సంబంధమును దెలియఁజేయఁగల దని చెప్పవలదు. యాగి

౧. పాలతోఁ జేయుయాగము.

౨. ఉభయాకాంక్ష, అన్యతరాకాంక్ష యను రెండువిధములను స్థానసాదేశ్య మింకను నిరూపింపఁబడవలసి యున్నను, గ్రంథము విస్తార మగునను భీతిచే వానివివరణము మానివేసి, ప్రసిద్ధము లగుటంజేసి యావశ్యకము లైనవిమాత్రమే, యిచట వివరింపఁబడిన వని భావము.

3. దేశసామాన్యము = ఒకచోటునం దుండుట. అనఁగా, నొకస్థలమునందుఁ బఠింపఁబడుట, ఒకస్థలమునందు వినియోగింపఁబడుట.

౪. వీనిలో నొకటి మంత్రకాండమునందును, రెండవది బ్రాహ్మణములయందును, నుండు నని తాత్పర్యము.

౫. సమాఖ్య - పేరు.

కము[౧] లగు శబ్దములు ద్రవ్యమును[౨] బోధించున వగుటంజేసి, సంబంధమును దెలుప నేరవుగదా! అది యెట్లంటేని:—

సమాఖ్య (= పేరు), సామాన్యసంబంధమును బోధింపఁగలదా? లేక, సంయోగ సంబంధము సమవాయసంబంధము, నను విశేషసంబంధములను దెలియఁజేయఁ గలదా? అది సామాన్యసంబంధమును బోధించునది కానేరదు. అట్లు బోధించుటచేఁ బ్రవృత్తి కలుగకుండుటంజేసి, ప్రయోజన మేమియు లేకుండుటయు, సమవాయము మున్నగు విశేషసంబంధము లన్నిటియందును, సంబంధత్వము సమానముగా నుండు టవలన, నావిశేషసంబంధములను బోధించు యౌగికశబ్దము లన్నియుఁ, బర్యాయ శబ్దములు కావలసివచ్చుటయును, సంభవించెడినిగదా! ఈసమాఖ్య విశేషసంబంధ మును బోధించునెడ, నీ సంబంధముగల పదార్థములు రెండును, బోధింపఁబడవలసి యుండును. ఈ విశేషసంబంధముగల పదార్థములు రెండును లేనిదే, యా పదార్థము నందు విశేష మేమియు లేకుండుటయు, నా సంబంధముగల పదార్థములు రెండును దెలియనిదే, యా విశేషసంబంధము తెలియకపోవుటయును, సంభవించెడినిగదా! కావున, సమాఖ్య, సంబంధముగల పదార్థములను రెండింటిని దెలియఁజేయఁగల దని చెప్పవలసి యున్నది. కనుక సమాఖ్య, సంబంధమును శక్తిమూలముగఁ దెలియఁ జేయనేరదు. సమాఖ్య, శక్తిమూలముగ, సంబంధు లగు రెండింటిని బోధించి, యట్లు బోధించుటమూలముగానే, వాక్యమునందలి పదార్థములకుఁ బరస్పరసంబంధ, మాయా పదములకూడికద్వారమున భాసిల్లురీతిని, నా రెండుపదార్థములకుండు సంబంధమునుగూడఁ దెలియఁజేయఁగలుగు చుండఁగా, నీ సమాఖ్య కట్టి సంబంధము నందు వేఱుశక్తిని గల్పించుట మిగులఁ గ్లేశకరముకదా! ఇందులకు, "అంతటను[3] యౌగికములగు శబ్దములచే, ద్రవ్యమే శక్తిమూలముగఁ దెలియఁజేయఁబడుచున్నది. ఆశబ్దములకు, సంబంధమునందుఁగూడ శక్తిని గల్పించినచోఁ, గ్లేశ మధిక మగును గనుక, నా శబ్దములచే నట్టి సంబంధము శక్తిమూలముగఁ దెలియఁజేయఁబడనేరదు."

౧ యౌగికములు = తమయవయవములనుండి వచ్చునర్థమునే బోధించునవి.

౨. ద్రవ్యము = యౌగికశబ్దముల యవయవములచేఁ దెలియంజేయఁబడునది.

3. సర్వత్ర యౌగికైశ్శబ్దైర్ ద్రవ్యమేవాభిధీయతే, నహి సంబంధవాచిత్వం సంభవ త్యతిగౌరవాత్ ॥ (తం. వా).

అనియు, "పాచక[1] అను పదమునందలి 'పచ్' అను ధాతువు మెత్తగా నుడికించుటను, 'అక'[2] అను ప్రత్యయము కర్తను, దెలియఁజేయును. మెత్తగా నుడికించుట యను క్రియతో సంబంధించుకర్త (మెత్తగా నుడికించువాఁడు) యన్ననో, ధాతువు, ప్రత్యయము, నను నీ రెండింటిలో దేనిచేతనుగూడఁ బ్రత్యేకముగా బోధింపఁబడఁడు. మఱి మన, నిచటి ధాతువగు ప్రకృతికిఁ బ్రత్యయముతోఁగల సంబంధముమూలముగా, 'మెత్తగా నుడికించుట యను క్రియను జేయుకర్త' అనునర్థ మేర్పడు చున్నది." అనియును, ప్రమాణములు గలవు. కావున, సమాఖ్య, పదార్థములకుండు సంబంధమును శక్తిమూలముగాఁ దెలియఁజేయనేరదు. 'హోతృచమసము'[3] అను నీమున్నగు వైదికసమాఖ్య[4] యన్ననో, 'నిషాదస్థపతి'[5] అను శబ్దమువలె, షష్ఠీవిభక్తి కర్థమగు సంబంధమును శక్తిమూలమున బోధింపలేదు. "వాక్యార్థము (తాత్పర్యము) అనునది, యా వాక్యమునందలి ప్రత్యేకపదములచే బోధింపఁబడకున్నను, నాయాపదముల కూడికచే నెట్లు తెలియంజేయఁబడు చున్నదో, యట్లే యిచట షష్ఠి కర్థ మగు సంబంధ మనునది, హోతృచమస మను పదముచే, శక్తిమూలమున బోధింపఁబడ కున్నను, నా పదముచేతనే తాత్పర్యముగాఁ దెలియంజేయఁబడఁగలదు." అని చెప్పవలదు. పదార్థములసిద్ధి, ప్రమాణముల ననుసరించియే యుండును. ఈ హోతృచమస మను సమాఖ్య, పద మగుటవలనఁ, బ్రమాణము[6] కానేరదుగదా! 'పౌరోడాశికము'[7] అను నీమున్నగు సమాఖ్య లన్ననో, లౌకికము లగుటమూలమునఁ బురుషునిజ్ఞానము నపేక్షించుటవలనను, నేదే నొక కాండవిశేష

౧. "పాకం తు పచిరేవాహ కర్తారం ప్రత్యయోఽప్యకః, పాకయుక్తః పునః కర్తా వాచ్యో నైకస్య కస్యచిత్" (తంత్రవార్తికము).

౨. 'ణ్వుల్' అను ప్రత్యయమునకు, 'అక' అనురూప మాదేశముగా వచ్చును.

౩. యజ్ఞమునందు వాడఁబడు చమసము లను పాత్రవిశేషములలో నొకటి.

౪. వేదమునందుఁ బఠింపఁబడుసమాఖ్య.

౫. 'నిషాదస్థపతి' అను శబ్దము, షష్ఠి కర్థమగు సంబంధమును బోధించుటయందు, లక్షణను గల్పింపవలసి యుండుటంజేసి, యీ శబ్ద మట్టి సంబంధమును బోధింపనేరదు.

౬. మీమాంసకులకు వాక్యమే ప్రమాణము గాని, పదము ప్రమాణము కాదు.

౭. పురోడాశమునకు సంబంధించెడి విషయములను బోధించు కాండమునకు, 'పౌరోడాశికము' అను పేరు వాడఁబడుచున్నది.

ముతో సంబంధించుటం జేసి, యా కాండమునందలి పదార్థములను[1] దెలియఁజేయ లేకపోవుటవలనను, నతిదుర్బలము లగుచున్నవి. ఈ పౌరోడాశిక మను సమాఖ్య, కాండత్వ మనెడి సామాన్యధర్మమును బురస్కరించుకొని, కాండమును దెలియఁ జేయుట లేదు. మఱే మనఁ, బౌరోడాశికత్వ మను విశేషధర్మమును బురస్కరించుకొనియే, కాండమును దెలియఁజేయుచున్నది. 'ఏకహాయని'[2] యను శబ్దము, బహువ్రీహిసమాసము (= ఒకసంవత్సరము వయసుగలది) అగుటచేఁ, దనయందలి పదములు కుండు నర్థములకంటె వేఱగు ద్రవ్యమును బోధించున దైనను, ఆ ద్రవ్యమును, గోత్వ మను సామాన్యధర్మముమాత్రము గలదానినిగానే బోధించుట లేదు. మఱే మన, నా ద్రవ్యమును 'ఏకహాయనీత్వము' (ఒక సంవత్సరము వయస్సు గలిగి యుండుట) అను విశేషధర్మము గలదానినిగానే బోధించుచున్నది.

స్థాన మను ప్రమాణముచే నంగములను వినియోగించునపు డన్ననో, యచటి పదార్థముల విశేషధర్మములను బురస్కరించియే, వాని కుండు సంబంధము ప్రత్యక్షప్రమాణముమూలముగాఁ దెలియఁగలదు. కావున, సమాఖ్యను దెలిసికొని, యచటి పదార్థములకు సంబంధము గలదని కల్పించునంతలోఁ, బ్రత్యక్షముగాఁ దెలిసినసంబంధముచే, నీ రెండు పదార్థములకును, బరస్పర మాకాంక్ష యుండునట్లు తెలియును. అట్టి యాకాంక్ష లేనిచో, వానికి సంబంధ ముండుట కుదురదుగదా! సమాఖ్యమూలమున సంబంధమును గల్పించి, దానిమూలముగా నాకాంక్షను గల్పించునంతలో, స్థానముమూలమునఁ బ్రత్యక్షముగాఁ దెలిసినసంబంధముచే నేర్పడిన యాకాంక్షద్వారమున, వాక్యము[3] మున్నగు ప్రమాణములను గల్పించి, యిచటి పదార్థముల నంగములుగా వినియోగించుట జరుగుచున్నది. కావున, స్థానప్రమాణము, సమాఖ్య యను ప్రమాణముకంటె బలవత్తర మని సిద్ధించుచున్నది. కాఁగా' "శుంధధ్వం దైవ్యాయ కర్మణే" ఈమున్నగు మంత్రము పాఠ 'సాదేశ్యము' అను ప్రమాణముచే, సాన్నాయ్యపాత్రమునకే[4] యంగ

౧. పదార్థములు = విషయములు.

౨. ఒకసంవత్సరము వయస్సుగల గోవు.

3. శ్రుతి, లింగము, వాక్యము అనునవి.

౪. పెరుఁగును పాలును వినియోగించునపు డుపయోగించు పాత్రములు. అవి, కుంభి, శాఖా పవిత్రము, అభిధాని, దోహనపాత్రము మున్నగునవి.

మగుచున్నది గాని, తనకు 'పౌరోడాశిక' మను సమాఖ్య కలదుగదా యని, పురోడాశపాత్రమున[1] కంగము కాదు. ఇట్లు స్థానము సమాఖ్యకంటె బలవత్తర మనునంశము నిరూపింపఁబడి, యిఁక సమాఖ్య యను ప్రమాణముయొక్క స్వరూప మును, వినియోగమును వివరింపఁబడుచున్నవి.

## సమాఖ్యాప్రమాణము

సమాఖ్య యనఁగా, యౌగిక మగుశబ్దము. అది వైదికసమాఖ్య[2], లౌకిక సమాఖ్య,[3] యని రెండు విధములుగా నున్నది. వీని కుదాహరణములు: (i) చమ సము లనెడి పాత్రములలో నొకదానికి 'హోతృచమసము'[4] అనుపే రుండుటవలన, నా చమసమునందు హోమము చేయఁగా మిగిలిన హవిస్సును భక్షించుట యను క్రియకు, హోత యను ఋత్విజుఁ డంగ మగుచున్నాఁ డని తెలియుచున్నది. ఇట్టి పేరు, వేదమునందు వినఁబడుటంజేసి, వైదికసమాఖ్య యగుచున్నది. (ii) యజ్ఞము నం దాచరింపఁబడు కొన్నిక్రియలకు, 'ఆధ్వర్యవములు'[5] అనుపే రుండుటవలన, నా క్రియల కధ్వర్యుఁ డంగ మగుచున్నాఁ డని తెలియుచున్నది. ఇట్టిపేరు, యాజ్ఞికులచే వాడఁబడుటంజేసి, లౌకికసమాఖ్య యగుచున్నది. ఇట్లు శ్రుతి మున్నగు నాఱు ప్రమాణములును సంక్షేపముగా నిరూపింపఁబడినవి.

"ఈ యాఱుప్రమాణములచే నుపకరింపఁబడిన 'సమిధో యజతి' మొద లగు వాక్యములచే విధింపఁబడిన, ప్రయాజములు, అనూయాజములు మున్నయిన వానినుండి జనించు నుపకారమును బొందిన, దర్శపూర్ణమాసేష్టుల నాచరించుట మూలమున, స్వర్గ మనెడి ఫలము నుత్పాదించుకొనవలయును." అను నిట్టి వినియోగ

౧. పురోడాశము నుత్పాదించి వినియోగించునపు డుపయోగించు పాత్రములు. అవి, ఱోలు, రోఁకలి, కృష్ణాజినము, తిరుగలి, పాత్ర మొదలగునవి.

౨. వేదమందు వినఁబడినది.

3. యాజ్ఞికులసంప్రదాయముచేఁ బ్రసిద్ధమగు, లేదా, యజ్ఞమును జేయించు ఋత్విక్కులచే వాడఁబడు పేరు.

౪. హోతకు సంబంధించు చమసము.

౫. అధ్వర్యునిచే నాచరింపఁబడు క్రియల సముదాయము,

విధివలన, నేవి ప్రధానముల కుపకరించునవిగా వినియోగింపఁబడు చున్నవో, యవియే యంగములు. అవి సిద్ధరూపములు, క్రియారూపములు నని రెండువిధములు గలవి.

వానిలో సిద్ధరూపము లగు నంగముల కుదాహరణము:—బ్రాహ్మణత్వము మున్నగు జాతులు, వ్రీహులు మున్నయిన ద్రవ్యములు, ఏకత్వము మొదలుగాఁగల సంఖ్యలు, మున్నగునవి.[1] ఈ యంగములు, యాగస్వరూపము నుత్పాదించుటచేఁ బ్రత్యక్ష మగు ప్రయోజనముగలవి యగుచున్నవి. క్రియారూపములు కూడ, గుణ కర్మములు,[2] ప్రధానకర్మములు[3] నని రెండు విధములుగా నున్నవి. ఈ యుభయ విధములగు క్రియారూపములే, సన్నిపత్యోపకారకములు, ఆరాదుపకారకములు నని కూడ రెండు విధములుగా నున్నవి.

## సన్నిపత్యోపకారకములు

కర్మమున కంగములగు ద్రవ్యము మున్నగువాని నుద్దేశించి విధింపఁబడు కర్మములు, సన్నిపత్యోపకారకములు[4] అనఁబడుచున్నవి. ఉదా:—అవఘాతము,[5] ప్రోక్ష

౧. ఎఱుపు మొదలగు గుణములు, పుంస్త్వము మొదలుగాఁగల లింగములును.

౨. గుణకర్మములు = కర్మాంగము లగు ద్రవ్యాదులయందు సంస్కారమును జనింపఁజేయుటచే గుణ (అప్రధాన)ము లయిన క్రియావిశేషములు. ఉదా:— అవఘాతము మున్నగునవి.

3. ప్రధానకర్మములు = ప్రధాన మైన ఫలాపూర్వమున కుపకరించు క్రియావిశేషములు. ఉదా:— ప్రయాజాదులు. గుణకర్మమునందు, ద్రవ్యము ప్రధానము, కర్మము గుణము (అప్రధానము) నగుచున్నవి. ఉదా:— 'వ్రీహీ నవహన్తి' యనుచోట, వ్రీహులు ప్రధానము, అవహనన మను కర్మము దాని కంగము. (= గుణము). ఇట్లే, ప్రధానకర్మమునందుఁ, గర్మము ప్రధానము, ద్రవ్యము గుణము నగుచున్నవి. ఉదా:— ప్రయాజాదులయందు, హోమము మున్నగుకర్మము ప్రధానము. ఆజ్యము మున్నగు ద్రవ్యము, దాని కంగము. (= గుణము = అప్రధానము) నగుచున్నవి. ఈ విషయము 'తాని ద్వైధం, గుణప్రధానభూతాని. యైః ద్రవ్యం న చికీర్ష్యతే, తాని ప్రధానభూతాని, ద్రవ్యస్య గుణభూతత్వాత్. యైస్తు ద్రవ్యం చికీర్ష్యతే, గుణస్తత్ర ప్రతీయేత; తస్య ద్రవ్యప్రధానత్వాత్' అను (జై. సూ. ౨-౧-౬, ౭, ౮) సూత్రములవలన బోధింపఁబడుచున్నది.

౪. సాక్షాత్తుగాఁగాని, పరంపరగాఁగాని, ఫలసాధనమైన యాగముయొక్క శరీరమగు ద్రవ్య దేవతల నుత్పాదించుటవలమున, వానితో సంబంధించి, యా యాగముచే జనింపఁజేయఁబడు ఫలాపూర్వమున కుపకరించు క్రియావిశేషములు. (సన్నిపత్య = సంబంధించి, ఉపకారకాణి = ఉపకరించునవి).

౫. అవఘాతము = అవహననము = దంపుట.

ణము,[౧] మొదలయినవి.[౨] అవి (i) దృష్టార్థములు, (ii) అదృష్టార్థములు, (iii) దృష్టాదృష్టార్థములు నని మూఁడు విధములుగా నున్నవి. ఉదా:—(i) అవఘాతము మున్నగునవి,[3] వ్రీహులను బియ్యముగా మార్చుట మొదలగు దృష్టప్రయోజనములను జనింపఁజేయుటమూలముగా, యాగస్వరూపమునకును, యాగోత్పత్త్యపూర్వమునకును హేతు వగుచున్నవి గాన, దృష్టార్థము[౪] లనఁబడుచున్నవి. (ii) ప్రోక్షణము మొదలయినవి,[౫] సంస్కారములు మొదలగు ప్రత్యక్షములు కాని ప్రయోజనములను జనింపఁజేయుటద్వారమునఁ, ప్రధానయాగోత్పత్త్యపూర్వమున కుపకరించును గాన, 'అదృష్టార్థము'[౬] లనఁబడుచున్నవి. (iii) పశుయాగమున కంగమయిన పురోడాశయాగము మున్నయినవి,[౭] దృష్టాదృష్టార్థము లనఁబడుచున్నవి. అవి యజమానునిచేఁ జేయఁబడు ద్రవ్యత్యాగముమూలముగా, నదృష్టప్రయోజనములను, దేవతల నుద్దేశించి స్మరించుట యను దృష్టప్రయోజనమును, జనింపఁ జేయుచున్నవి. ఇట్టి యుభయప్రయోజనములుగల సన్నిపత్యోపకారకమే 'ఆశ్రయి

౧. మంత్రముతో జలమును జిలుకరించుట.

౨. మొదలైనవి యనుటచే, స్విష్టకృద్యాగము, పశుయాగమునందలి పురోడాశయాగము, ఇడ యను పాత్రమునందు హోమము చేసినపిదప మిగిలిన హవిస్సును ఋత్విజులు భక్షించుట మొదలయినవి.

3. దీనిచే 'పేషణము' (= పిండిగా విసరుట), సంయవనము (కలుపుట) మొదలగునవి గ్రహింపఁబడును.

౪. ప్రత్యక్షమగు ప్రయోజనము గలవి.

౫. మొదలయిన వనుటచే, సమ్మార్జనము (= తోముట), పర్యగ్నికరణము మున్నయినవి గ్రహింపఁబడుచున్నవి.

౬. అపూర్వము ప్రయోజనముగాఁగలవి.

౭. స్విష్టకృద్యాగము, వాజినయాగము మొదలయినవి యాగమునందు యజమానుఁ డేదే నొక దేవత నుద్దేశించుట, దానికొఱ కొక ద్రవ్యమును మనసుచేఁ ద్యాగముచేయుటఁ, పిదప నా ద్రవ్యము నగ్నియం దుంచుట యను మూఁడంశము లుండును. పశుయాగమునందలి పురోడాశయాగమునందు, 'త్యాగ' మను నంశముచే నపూర్వ మను ప్రయోజనమే కలుగును గాని, దృష్టమగు ప్రయోజనమేమియును గలుగదు. ఉద్దేశించుట యనునంశముచే, నింతకుముందు జరిగిన వపాయాగమునం దుపయుక్తమై, యిఁకముందు జరుగఁబోవు హృదయాద్యంగయాగమునం దుపయోగింపఁబడఁబోవు, దేవతను స్మరించుట యనెడు దృష్టప్రయోజనము జనించుచున్నది. ఇచట స్మరింపఁబడుటచేత నే, యీ దేవత, ముందు జరుగఁబోవు హృదయాద్యంగయాగమునందు శీఘ్రముగా నుపస్థితము కాఁగలదుగదా కావున, నీ పశుపురోడాశయాగము, దృష్టప్రయోజనము గలదియు, నదృష్టప్రయోజనము గలదియు నగుచున్నది.

కర్మ' మనికూడఁ జెప్పఁబడుచున్నది. పార్థసారథిమిశ్రుఁడు శాస్త్రదీపికయం దిట్లే చెప్పెను.

ఆ సన్నిపత్యోపకారకము (i) ఉపయోక్ష్యమాణార్థము[1] (ii) ఉపయుక్తార్థము[2] నని రెండువిధములుగా నున్నది. వానిలో, అవఘాతము, ప్రోక్షణము మున్నగునవి, యాగమునందు ముం దుపయోగింపఁబడఁబోవు వ్రీహుల నుద్దేశించి యాచరింపఁబడుటంజేసి, యుపయోక్ష్యమాణార్థము లగుచున్నవి. ఇడాభక్షణము వంటి ప్రతిపత్తికర్మము, యాగమునం దంతకుముం దుపయుక్త మగు పురోడాశమునకుఁ జేయంబడు సంస్కార మగుటంజేసి, యుపయుక్తార్థ మగుచున్నది. యాగమునం దుపయుక్త మయి, యచ్చటచ్చటఁ జిమ్మఁబడియుండు ద్రవ్యమును, విధింపఁబడిన స్థలమునందుఁ బడవైచుట యనెడి కర్మము, ప్రతిపత్తికర్మ మనఁబడునుగదా! ఉపయుక్తసంస్కారమునిమిత్తమగు కర్మము, ఉపయోక్ష్యమాణసంస్కారమునిమిత్త మగు కర్మముకంటె, దుర్బల మగుచున్నది. ఉపయుక్తము లగువానికంటె, నుపయోక్ష్యమాణ మగువానియందు, ఆదర మధికముగ నుండునుగదా! కావుననే,[3] "ప్రాయణీయేష్టియందలి[4] చరువును[5] వండిన పాత్రిని[6] గడుగుట కుపయోగింపఁబడి, దానియందే యుంపఁబడిన జలమునందుఁ దరువాత జరుపఁబడు ఉదయనీయేష్టియందలి చరువును నిర్వపించుటచే, నిష్టము నుత్పాదించుకొనునది" అనుచోట, ప్రాయణీయేష్టికి సంబంధించు జలము, ముం దుపయోగింపఁబడఁబోవు, 'ఉదయనీయేష్టి'కి సంబంధించు చరువును నిర్వపించుట

౧. ముందు యాగమునం దుపయోగింపఁబడఁబోవు ద్రవ్యము నుద్దేశించి, యాచరింపఁబడునది.

౨. ఇంతకుముందు యాగమునం దుపయుక్త మయిన ద్రవ్యము నుద్దేశించి, సంస్కారరూపముగా నాచరింపఁబడునది.

3. ఉపయోక్ష్యమాణ మగుదానియందు, సంస్కారమును గలిగించుటకంటె నుపయుక్త మగుదానియందు సంస్కారమును గలిగించుట దుర్బలము గనుకనే.

౪. జ్యోతిష్టోమమునందు, 'ప్రాయణీయము, ఉదయనీయము' నను పేళ్లుగల రెం డిష్టివిశేషములు గలవు. వానిలో 'ప్రాయణీయము, ఉదయనీయము,' అనునది, రెండవరోజున నాచరింపఁబడును. పీనియందలి చరువును వండినపాత్రను గడుగుజలమును దానియందే యుంచి, యాజలమునందే యవభృథ మైనపిమ్మట నాచరింపఁదగిన యుదయనీయేష్టియందలి 'చరువు' అధ్వర్యునిచే నిర్వపింపఁబడుచున్నది.

౫. చరువు = హోమము చేయుటకై వండఁబడినయన్నము.

౬. ఆ చరువును వండెడుగిన్నెకు, పాత్రి యని పేరు.

కొఱకే యగుచున్నది గాని, ప్రాయణీయేష్టియందలి పాత్రియం దుంపఁబడిన జలముపయుక్త మయినది గనుక, నుదయనీయేష్టియందలి చరువును నిర్వాపించుట, దానిని సంస్కరించుటకొఱకుఁ గానేరదు. అని మీమాంసాదర్శనమునందు వివరింపఁబడినది.

ఇట్లు నిరూపింపఁబడిన సన్నిపత్యోపకారకము, ఆరాదుపకారకముకంటె బలీయ మగుచున్నది. "ఓయీ! అవఘాతము మొదలగునవి[1] దృష్టార్థము లగుటచేతను, దృష్టమగు ప్రయోజనము సంభవించునపుడు, 'అదృష్ట' మగు ప్రయోజనమును గల్పించుట యన్యాయ్యము గనుకను, అవఘాతము మున్నగునవి, 'ఆరాదుపకారకము'లకంటె బలవత్తరములు కావచ్చును. ప్రోక్షణము మున్నగు సన్నిపత్యోపకారకము లన్ననో, ఆరాదుపకారకములవలె, నదృష్టార్థములే యగుచుండఁగా, నవి (ప్రోక్షణము మున్నగునవి) యారాదుపకారకములకంటె నెట్లు బలవత్తరములు కాఁగలవు? ఇంతే కాక, ఆరాదుపకారకము, ప్రధానముకంటె వేఱగు దేని నుద్దేశించియు నాచరింపఁబడ కుండుటం జేసి, సాక్షాత్తుగాఁ బ్రధానమునకే యంగ మగుచున్నది. అవఘాత మను సన్నిపత్యోపకారము, ప్రధానమున కంగముగా నుండు వ్రీహుల నుద్దేశించి యాచరింపఁబడుచున్నది గదా! ప్రధానమునకు సంబంధించునంగమున కంగ మగుదానికంటె, సాక్షాత్తుగాఁ బ్రధానమునకే యంగ మగునది, బలవత్తర మగుచున్నది. "ప్రధానమునకు కంగ మగుదానికిఁ బ్రధానమున కంగ మగుదాని యంగముతో, విరోధము సంభవించునపుడు, ప్రధానమున కంగ మగునదియే ప్రధానమునకు సాక్షాత్తుగా నుపకరించున దగుటం జేసి, బలవత్తర మగుచున్నది." అను న్యాయము కలదుగదా! కావుననే, 'య ఇష్ట్వా పశునా సోమేన యజేత'[3] అను విధి

౧. ఇట్లనుటచేఁ దృష్టార్థములగు పేషణము (విసరుట), శ్రపణము, (ఉడికించుట) మొదలయిన సన్నిపత్యోపకారకములు గ్రహింపఁదగి యున్నవి.

౨. అంగగుణవిరోధే చ తాదర్థ్యాత్ జై. సూ. ౧౨-౨-౨౫.

3. దీక్షణీయేష్టిని గాని, అగ్నీషోమీయ పశుయాగమును గాని, సోమయాగమును గాని, యాచరించి యజింపఁ గోరువాఁడు, ఆ కర్మములను అమావాస్యయందుఁ గాని, పూర్ణిమయందుఁ గాని, యాచరించి యిష్టము నుత్పాదించుకొనవలయును. (కాఠకసంహిత, ౬-౧)

४. సోమయాగమునందు మొదటిరోజున దీక్షణీయేష్టియు, నాలుగవ రోజున నగ్నీషోమీయ పశుయాగమును, నైదవరోజునఁ బ్రధానమగు సోమయాగమును, నాచరింపఁబడును. "య ఇష్ట్వా" అను విధినిబట్టి, దీక్షణీయేష్టిని గాని, పశుయాగమును గాని, పర్వకాలమునం దాచరించిన యెడలఁ బ్రధానమగు సోమయాగమును బంచమియందుఁ గాని, పాడ్యమియందుఁ గాని, యాచరింపవలసి యుండుటం జేసి, యీవిధిచే విధింపఁబడిన పర్వకాలమునకు బాధ సంభవించెడిది. లేదా, ప్రధానమగు సోమయాగ

యందు, "దీక్షణీయేష్టి,[1] పశుయాగము[2] సోమయాగము[3] ననుమూఁడును సమానముగా, నమావాస్య, పూర్ణిమ యనెడు పర్వదినములందే కర్తవ్యములుగా విధింపఁబడినను, బర్వమునందుఁ బ్రధానమగు సోమయాగమే యాచరింపఁబడవలసినది గాని, దీక్షణీయేష్టి గాని, పశుయాగము గాని యాచరింపఁబడఁగూడదు." అని మీమాంసా దర్శనమునందలి యైదవయధ్యాయమునందు వివరింపఁబడినది. ఇట్లుండ, 'ప్రధానమున కంగ మైనదాని కంగమగు సన్నిపత్యోపకారకము, ప్రధానమునకే యంగ మై యుండు 'ఆరాదుపకారకముకంటె, నెట్లు బలవత్తరము కాఁగలదు?' ఇ శ్లోకఁడు శంకించుచున్నాఁడు.

'ఓయీ! అనునది మొదలుకొని యింతవఱకును జేయఁబడిన శంక క్రిందిది సమాధానము సన్నిపత్యోపకారకము, ఆరాదుపకారకమునను నీరెండును, సదృష్టార్థములే యైనను, సన్నిపత్యోపకారక, మారాదుపకారకముకంటె బలవత్తరమే. అది యె ట్లంటేని:—సన్నిపత్యోపకారకమను కర్మము దుపకార్యములగు వ్రీహులకును, ఉపకారకమగు ప్రోక్షణమునకును గల సంబంధము, 'వ్రీహులను బ్రోక్షించునది' అనువాక్యమునం దేకవాక్యతను బొందు వ్రీహులు, ప్రోక్షణము నను నీరెండింటి[4] సమభివ్యాహారమూలమున, సిద్ధ మయియే యున్నది. వ్రీహులకును, బ్రోక్షణమునకును, బరస్పర ముపకార్యోపకారకభావము లేక, యా రెండింటికి నేకవాక్యత కుదురదు గనుక, వ్రీహులకుఁ బ్రోక్షణమువలన నుపకార మవశ్యముగా నుండవలసినదని, యుక్తిమూలముగా, వ్రీహులకుఁ బ్రోక్షణమువలన నుపకారముమాత్రము కల్పింపవలసియున్నది. ఆరాదుపకారములను విధించుసందర్భమునం దన్ననో, దర్శపూర్ణమాసేష్టులు, ప్రయాజములు నను నీ రెండును, వేఱువేఱు స్థలములయందుఁ బఠింపఁబడుటచే, వానికి సమభివ్యాహారము లేకుండుటం జేసి, వానికి, బరస్పరసంబంధము లేని

మును బర్వకాలమునం దాచరించినచో, దీక్షణీయేష్టి నా పర్వమునకు ముందటి యేకాదశియందును, బశుయాగమును జతుర్దశియందును, నాచరింపవలసి యుండును గనుక, దీక్షణీయేష్టి, పశుయాగము నను నీ రెండింటి విషయమై, విధ్యుక్తమగు పర్వకాలము బాధింపఁబడెను. ఇచట నె ట్లాచరింపవలయు నని సందేహించి, పర్వకాలమునందుఁ బ్రధానము నాచరించుటయే యుక్తముగాని, యంగముల నాచరించుట యుక్తము కాదు, అని మీమాంసకులచే నిర్ణయింపఁబడినది.

౨. పశుయాగము నాల్గవదినమునఁ జేయఁడగు నగ్నీషోమీయ పశుయాగము.

౩. జ్యోతిష్టోమమునం దైదవరోజున నాచరింపఁబడు, ప్రధానమగు సోమయాగము.

౪. కూడిక.

దే, ప్రయాజములు దర్శపూర్ణమాసేష్టుల ప్రకరణమునందుఁ బఠింపఁబడుట కుదురదు గదా! యని, వానికిఁ బరస్పరసంబంధమును, దర్శపూర్ణమాసేష్టులకుఁ బ్రయాజాదుల వలన నుపకారమును గూడఁ గల్పింపవలసియున్నది. సంబంధము, నుపకారము నను నీరెండింటిని గల్పించుటకంటె, నుపకార మొకటినిమాత్రమే కల్పించుట సులువు గనుక, నారాదుపకారకముకంటె, సన్నిపత్యోపకారకమే ప్రబలము కాఁగలదు. మఱియు, ఆరాదుపకారకమును విధించుసందర్భమునందు, దాని నంగముగా వినియోగింపఁ జేయు ప్రమాణము ప్రకరణము. సన్నిపత్యోపకారకస్థలములం దన్ననో, ప్రోక్షణమును,సన్నిపత్యోపకారకముగా వినియోగింపఁజేయు ప్రమాణము, 'వ్రీహులను బ్రోక్షించుట మూలముగా నిష్టము నుత్పాదించునది' యనువాక్యమే. ఇది, 'వ్రీహి'పదముచే లక్షణమూలమున, 'అపూర్వమును సాధించునుపాయము' అనునర్థమును బోధింపఁజేసి, ప్రోక్షణమును గ్రతువున కంగముగా వినియోగింపఁజేయును. కావున సన్నిపత్యోపకారకమే బలవత్తర మగుచున్నది. "ప్రధానమున కంగ మగుదానికి" ఈమున్నగున్యాయముచే సన్నిపత్యోపకారకము, ఆరాదుపకారకముకంటె దుర్బల మగుచున్న దని పూర్వపక్షి చెప్పినమాట సరికాదు. వ్రీహి మున్నగువాని నుద్దేశించి విధింపఁబడు ప్రోక్షణము మొదలగునవి, వ్రీహులస్వరూపము నుత్పాదించుట[1]కి సమర్థము లగుటంజేసి, వ్రీహులకొఱకుఁ గానేరవు. మఱి మన, నా వ్రీహులను సంస్కరించుట మూలముగా, నవి (ప్రోక్షణాదులు) క్రతువున కుపకరించునంగములే యగుచున్నవి. సన్నిపత్యోపకారకము,లుత్పత్త్యపూర్వమును జనింపఁజేయుటమూలముగాఁ [2]గ్రతువునకే యుపయోగించునంగము లగు నని ముందు చెప్పఁబడఁగలదుగదా! కాఁగా నీరెండువిధము లగునంగములును, సమానముగాఁ గ్రతువున కుపకరించునవియే యగును గానఁ, బూర్వపక్షిచేఁ బ్రస్తావింపఁబడిన "ప్రధానమునకే యంగ మగుదానికి..." ఈ మున్నగు న్యాయ మిచటఁ బ్రవర్తింపనేరదు. దీక్షణీయేష్టి, అగ్నీషోమీయపశుయాగము, ననునవి రెండును, బర్వదినమునందు ఆచరింపఁబడుట, వానిస్వరూపముల నుత్పాదించుటయం దసమర్థము కావలసియుండఁగా, నిది (పర్వదినమునం దాచరించుట),

౧. ప్రోక్షణము లేకున్నను, వ్రీహులస్వరూప ముత్పాదింపఁబడఁగలదు గనుకఁ, బ్రోక్షణము వానిస్వరూపము నుత్పాదింప సమర్థము కానేర దని తాత్పర్యము.

౨. ఆలోచింపఁగా, సన్నిపత్యోపకారకము లుత్పత్త్యపూర్వమును, ఆరాదుపకారకములు పరమాపూర్వమును జనింపఁజేయుటంచేసి, యీ రెండింటికిని గొంచెము భేద ముండును. అయినను గ్రతువునకే యుపకరించుట యనునది, యీ రెండింటికిని సమానమే యని తాత్పర్యము.

వానినుండి జనించునుత్పత్త్యపూర్వమున కుపకరించున దగుటంజేసి, యీ దీక్షణీయేష్టి, పశుయాగములు ననువానికొఱకే యగు నని స్థిరపఱుపఁబడినది. కాఁగాఁ, ప్రధాన మైన సోమయాగమును బర్వమునం దాచరించుట యనుదానిచేత, నంగములగు దీక్షణీయేష్టి, పశుయాగము ననువానిని, బర్వమునం దాచరించుట యనునది బాధింపఁ బడుచున్నది. కనుక, సన్నిపత్యోపకారక, మారాదుపకారకముకంటె బలవత్తర మని సిద్ధించుచున్నది.

కావుననే, లోకమునందు 'దేవదత్తునిచే నేదే నొకకార్యముకొఱకు ధరింపఁబడిన మాలికను, ఆ కార్య మైనపిదప పవిత్రమైన యొక ప్రదేశమునందు సత్కారముతో నుంచుట, ఆ మాలికద్వారమున, దానితో సంబంధము గలిగిన దేవదత్తునే సంస్కరించునది యగుచున్నదో యట్లే, "'స్థాణౌ స్థాణ్వాహుతిం జుహోతి' అను విధిచే విధింపఁబడిన, స్థాణ్వాహుతి యనుపేరుగల హోమము, యూపమును నఱుకఁగా మిగిలిన స్థాణువుద్వారమున నా యూపమునందే యొకసంస్కారము నుత్పాదించుట యను ప్రయోజనము గల దగుచున్నదే కాని యారాదుపకారక మగుటలేదు. అని మీమాంసాదర్శనమునందలి పదియవయధ్యాయమందుఁ బ్రథమపాదమునం దుండు నాఱవయధికరణమునందు వివరింపఁబడినది. ఇట్లే యిట్టి స్థలములయం దంతటను గ్రహించునది.

## ఆరాదుపకారకము

ప్రధానమున కంగములగు ద్రవ్యము మొదలగువాని నుద్దేశింపక, దాని (ప్రధానముయొక్క) సందర్భమునందుమాత్రము విధింపఁబడు కర్మ మారాదుపకారకము. ఉదా:—. ప్రయాజములు, అనూయాజములు మున్నగునవి.

ఇట్లు రెండువిధములగు నంగములసమూహము నిరూపింపఁబడినది. ఆయంగ సముదాయము లేకున్నను,[3] యాగములు మున్నగువాని స్వరూపము సిద్ధింపఁగలు

౧. మారేడుచెట్టునుండి, యజ్ఞమునకుఁ గావలసిన పరిమాణముగల యూప స్తంభమును గత్తితోఁ గొట్టినపిదప మిగిలిన స్థాణువునందు, స్థాణ్వాహుతి యను పేరుగల హోమము నాచరించుటచే నిష్టము నుత్పాదించునది. స్థాణువు=చెట్టునుండి యూపమున కుపయోగించు కఱ్ఱను నఱుకఁగా మిగిలినమోడు. ఆ మోడునం దధ్వర్యునిచేఁ జేయఁబడు నాజ్యహోమము, స్థాణ్వాహుతి యనఁబడును.

౨. సన్నిపత్యోపకారకములు, ఆరాదుపకారకములు ననునవి.

3. ఆలోచింపఁగా, అవఘాతము, పేషణము మున్నయిన దృష్టార్థములైన సన్నిపత్యోపకారకములు, యాగములు మున్నగువాని స్వరూపము నుత్పాదింపఁగలవు. అయినను వానివలనఁ గలుగు ప్రయో

గుటంజేసి, యది (అంగసమూహము), యాగములు మున్నగువానిస్వరూపము నుత్పాదించుట కసమర్థ మగుచున్నది, గనుక, వాని స్వరూపమును సిద్ధింపఁజేయుట కావశ్యకము కానేరదు. మ తే మన, నీయంగముల సముదాయము, యాగములు మున్నగువానినుండి జనింపఁబోవు పరమాపూర్వమున, కుపకరించు నుత్పత్త్యపూర్వము నుత్పాదించుటకే, యుపయోగించును. ఈ యంగము లాచరింపనిదే, యట్టియుత్పత్త్యపూర్వము సిద్ధింపఁగల దని తెలియఁజేయు లౌకికప్రమాణ మేమియు లేదు. అట్టి యుత్పత్త్యపూర్వము, లౌకికప్రమాణముచేఁ దెలిసికొనఁబడనేరదుగదా!

ఈయంగము లన్నియుఁ బ్రధానములగు ఫలముతో నన్వయింప నర్హములగుటంజేసియు, లౌకికప్రమాణములచేఁ దెలియంబడ కుండుటంజేసియు, సాక్షాత్తుగాఁ బ్రధానమగు స్వర్గము మున్నయిన ఫలముతోనే, యేల సంబంధింపఁగూడదు? అని చెప్పనలదు. స్వర్గము మున్నగు ఫలభావనయందుఁ గరణాకాంక్ష కలుగఁగా, భావార్థాధికరణన్యాయముచే, సమానపదశ్రుతిమూలమున, 'యజేత' అనుపదమునందలి ధాత్వర్థమగు యాగము, కరణముగా నన్వయింపఁగా, దాని (యాగమున) కుపకరించున ట్లంగీకరింపఁబడిన యీయంగములు, ఆ యాగస్వరూపము నుత్పాదించుట కసమర్థము లగుటంజేసి, వీనిలో సన్నిపత్యోపకారకములు, శీఘ్రముగా నుపస్థితమగు నుత్పత్త్యపూర్వమును, ఆరాదుపకారకములును నట్లే యుపస్థితమగు పరమాపూర్వమును, సిద్ధింపఁజేయుటకై యుపకరించును. ప్రధానమగు సోమయాగమున కంగములగు నీ దీక్షణీయేష్టి మున్నయిన యిష్టు లన్నియుఁ బ్రధానయాగస్వరూపము నుత్పాదించుట కసమర్థములై, ఫలాపూర్వమున కుపకరించు నానా యుత్పత్త్యపూర్వముల నుత్పాదించుటకు వినియోగించుచున్నవని, యీదీక్షణీయేష్టి మున్నగుశబ్దములనుండి యెట్లు తెలియుచున్నదో యట్లే, యీయంగము లన్నియు నానా యపూర్వము నుత్పాదించుటకే యుపకరించును గాని, స్వర్గము మున్నగు 'ప్రధానఫలము' ఎక్కువ యాలస్యముగా నుపస్థిత మగుటంజేసి, దాని నుత్పాదించుటకొఱకు కుపకరింపనేరవని తెలియునది. కాఁగా, నీ యంగములు ప్రధానమగు ఫలముకొఱకుఁ గర్తవ్యములు

జనము వేఱువిధముగా సిద్ధింపఁగలదు గాన, వీనిని విధించునియమవిధి వ్యర్థ మగును. అదృష్టార్థములగు సన్నిపత్యోపకారకములు, ఆరాదుపకారకములును, యాగస్వరూపము నుత్పాదింప లేకుండుటంజేసి, వానిని విధించుటకూడ వ్యర్థ మగుచున్నది. కావున వీని యన్నిటికిని, బరమాపూర్వమున కుపకరించు నుత్పత్త్యపూర్వము నుత్పాదించుటయే, ప్రయోజన మని తాత్పర్యము.

కాఁజాలవు. కావుననే, దర్శపూర్ణమాసప్రకరణమందలి, యజమానకాండమునందు[1] యజమానునిచేఁ బఠింపఁబడవలసినదిగా వినింపఁబడు [2]"అగన్మసువః సువరగన్మ" అనుమంత్రము, స్వర్గఫలముకొఱ కావశ్యకము కాదుగనుకనే, వికృతియగు సౌర్యేష్టియం దతిదేశమూలముగా నూహింపఁదగి యున్న దని, మీమాంసాదర్శనమునం దలి, తొమ్మిదవ యధ్యాయపుఁ బ్రథమపాదమం దుండెడి, నాలుగవసూత్రమగు "[3]ఫలదేవతయోశ్చ" అనుదానియందుఁ జెప్పఁబడి యున్నది. ఈ మంత్రము, సాక్షాత్తుగా ఫలమును సాధించుటకే యుపయోగించుపక్షమున, సౌర్యేష్టి మున్నగు వికృతులందు స్వర్గ మనెడి ఫలము లేకుండుటంజేసి, యిది (ఈమంత్రము) వీనియందుఁ బ్రవర్తింప కుండుటయు, నెంతమాత్రము నూహింపఁబడ కుండుటయును, సంభవించెడిని. కాఁగా, సంగములు మఱిదేనిని సాక్షాత్తుగా సాధించుట కుపయోగింపనేరవు గనుక, నపూర్వమును సాధించుటకే కర్తవ్యము లగుచున్న వని సిద్ధించుచున్నది.

వానిలో, సన్నిపత్యోపకారకములు, ద్రవ్యము,[4] దేవత[5] మున్నగువానిని సంస్కరించుటద్వారమున, యాగస్వరూపము నుత్పాదించుట కుపయోగించును గాన నివి (సన్నిపత్యోపకారకములు), ఉత్పత్త్యపూర్వమే ప్రయోజనముగాఁ గల వగుచున్నవి. కావుననే, యోషధులవలన జనించు వ్రీహులు మున్నగువానికిఁ జేయఁదగు 'అవఘాతము' మొదలగు సంగములు, ఆగ్నేయపురోడాశయాగమునుండి జనించు నపూర్వమున కుపకరించుటచేతను, ఆజ్య మాయాగమందలి పురోడాశమున కుపకరింపకపోవుటచేతను, నివి (ఈ సంస్కారములు) 'ఆజ్యమునం దాచరింపఁబడవు'[6] అని,

౧. యజమానునిచేఁ బఠింపఁబడఁదగు మంత్రములుగల భాగము.

౨. మేము స్వర్గమును బొందితిమి. స్వర్గమును మేము పొందితిమి. (తై. సం. ౧-౫-౬-౧.)

౩. స్వర్గము మున్నగు ఫలములు, నగ్ని మున్నగు దేవతలును సంగముల నాచరింపఁ జేయుటకుఁ బ్రయోజకము లగు హేతువు లగును.

౪. అవఘాతము, ప్రోక్షణము మున్నయినవి, వ్రీహులు మొదలగు ద్రవ్యములను సంస్కరించును.

౫. ఆవాహన చేయుట, పశుయాగమునందలి పురోడాశయాగమునం దుద్దేశించుట, మొదలగు సంగములు, దేవతలను సంస్కరించును.

౬. ఆజ్యము, పురోడాశము నభిఘరించుట కుపయోగించినను, యాగమునందు దేవతకు సమర్పింపఁబడునది గాని, పురోడాశము నుత్పాదించు మూలద్రవ్యము కాని కానేరదు. అవఘాతము మున్నగునవి యన్ననో, యాగమునందు సమర్పింపఁబడు పురోడాశమునకు మూలద్రవ్యమైన, వ్రీహులయం దాచరింపఁబడుచున్నవి. కావున నవఘాతాదు లాజ్యమునం దుపయోగింపఁబడవు.

మీమాంసాదర్శనమునందలి మూఁడవయధ్యాయమునందుఁ జెప్పఁబడినది. ఆరాదుప కారకము లన్ననో, ద్రవ్యముతోఁ గాని, దేవతతోఁ గాని, సంబంధించునట్లు కాక, సాక్షాత్తుగా విధింపఁబడుటంజేసి, యాగస్వరూపము నుత్పాదించుట కనుపయుక్తము లగుటవలన, ఫలమును జనింపఁ జేయు పరమాపూర్వమే ప్రయోజనముగాఁగల వగు చున్నవి.

యాగమునకు సంబంధించునుత్పత్త్యపూర్వము, ఆ యాగస్వరూపము నాచరిం చినపిమ్మటనే పుట్టుచున్నది గనుకఁ బ్రధానయాగమునకుముం దాచరింపఁబడు సన్ని పత్యోపకారకము, లా యుత్పత్త్యపూర్వము నుత్పాదించుట కుపయోగించును. ప్రధానయాగమునకుఁ దరువాత నాచరింపఁబడు నంగము లన్ననో, యా యుత్పత్త్య పూర్వము నుత్పాదించుట కుపకరింపక, యంతకుముందే పుట్టినదానిని (అయుత్పత్త్య పూర్వమును) నిలుపుట కుపయోగించును. ఫలమును జనింపఁజేయు పరమాపూర్వ మన్ననో, ప్రధానయాగమును, నంగములను బూర్తిగా నాచరించినపిదపనే పుట్టును గనుకఁ బ్రధానయాగమునకు ముందును, దరువాతను నాచరించు నారాదుపకార కము లన్నియు, నా పరమాపూర్వము నుత్పాదించుట కుపకరించును. అంగము లన్ని టితోఁగూడఁ బ్రధానయాగము నాచరించి,[1] ప్రయోగమును సమాప్తిని బొందించిన పిదప, నాచరించు నంగము లన్ననో; పరమాపూర్వ మంతకుముందే పుట్టియుండు టంజేసి, యా పరమాపూర్వము నుత్పాదించుట కుపకరింపక, దానిని నిలుపుటకు మాత్ర ముపయోగించును. ఉదా:—[2]"వాజపేయేనేష్ట్వా బృహస్పతిసవేన యజేత" అనువిధిచే, వాజపేయయాగమును సాంగముగా నాచరించినపిదప, దాని కంగముగా విధింపఁబడిన బృహస్పతిసవ మనుయాగము, తనకంటె ముందే పుట్టిన [3]వాజపేయా పూర్వమును, నిలుపుట కుపయోగించు నని, మీమాంసాదర్శనమునందలి, నాల్గవ యధ్యాయపు మూఁడవపాదమునం దుండు పదుమూఁడవసూత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. కాఁగా, నంగము లన్నియు [4]సర్వథా యపూర్వమే ప్రయోజనముగాఁగల

౧. యాగము మున్నగు కర్మముల నాచరించుట.

౨. వాజపేయయాగమును సాంగముగా నాచరించినపిదప, బృహస్పతిసవ మను యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలెను.

3. వాజపేయయాగమునుండి జనించు పరమాపూర్వము.

४. అన్ని విధములచేతను.

వని సిద్ధించుచున్నది. ప్రస్తుతము ననుసరింతము. ఇట్లు వినియోగవిధి సంగ్రహముగాఁ దెలుపఁబడినది.

# ప్రయోగవిధి

ఇఁకఁ గ్రమప్రాప్తమగు ప్రయోగవిధి వివరింపఁబడును. ప్రయోగము నాలస్యము లేకుండ, వేగముగా జరుపురీతిని బోధించువిధి ప్రయోగవిధి యనఁబడుచున్నది. అది యావశ్యకమగు నంగములను విధించువాక్యములతో,[1] నేకవాక్యతను బొందు, ప్రధానవిధియే యగుచున్నది. ప్రయోగవిధి యావశ్యకమగునంగములతోఁ గూడిన ప్రధానయాగము నాచరింపఁజేయుచు, వీనిలో నడుమనడుమ నాలస్య ముండుటకుఁ బ్రమాణ మేమియు లేకుండుటంజేసి, 'ఆలస్య మేమియు లేకుండఁజేయుట' అను ప్రయోగవేగమును విధించును. ఆలస్యముతో నాచరించుటకువలె, నాలస్యము లేకుండ నాచరించుటకుఁగూడఁ బ్రమాణ మేమియు లేదే యని చెప్పవలదు. నడుమనడుమ నాలస్యముతో నాచరించునెడ, నంగములను బోధించు విధులకును, ప్రధానమును బోధించు విధికిని, నేకవాక్యత యుండుటచేఁ గలుగు 'అంగములను, ప్రధానమును నొకటేసారి యాచరించుట.' యనెడి[3] సహానుష్ఠానము, కుదురకపోవుట సంభవించెడిని. నడుమ నాలస్యముతో నాచరింపఁబడు రెండుక్రియలకు, 'కలసి యాచరింపఁబడుట' యనెడి [4]సాహిత్యమున్న దని చెప్పెడువాడుక లేదు..

'ఇట్లు ఆలస్యముతో నాచరింపఁబడు రెండుపదార్థములకు సాహిత్యము కుదురకుండుటంజేసి, యివి యొకటేకాలమునం దాచరింపఁబడుటయే సంభవించును గాని యాలస్య మేమియు లేకుండ నాచరింపఁబడుట సంభవింపదు. నడుమ వ్యవధానములేక, ముందువెనుకలుగా నాచరింపఁబడు రెండుక్రియలనుగూర్చి, 'ఆలస్యము లేకుండ నాచరింపఁబడునవి' అను వాడుక కలదుగదా!' యని చెప్పవలదు. అనేకక్రియ లొకటేకాలమునం దాచరింపఁబడుట కుదురదుగదా! 'క్రియ లెన్ని యుండునో యందఱు

౧. ఏకాన్వయము.

౨. ప్రధానయాగమునకు ఫలసంబంధమును బోధించువిధి. దీనినే యధికారవిధి యనియు నందురు.

౩. అన్నిటిని జేర్చి యొకటేసారి వరుసగా నాచరించుట.

౪. సాహిత్యము = సహానుష్ఠానము = కలసి యాచరింపఁబడుట = ఆలస్య మేమియు లేక వరుసగా నాచరింపఁబడుట.

కర్తలను సంపాదించుటచే నవి యన్నియు నొకటే కాలమునం దేల యాచరింపఁబడ నేరవు?' అని శంకింపరాదు. ౧"తస్యై తస్య యజ్ఞక్రతోశ్చత్వార ఋత్విజః" అనునీ మున్నగు వాక్యమునుండి యజ్ఞక్రతువునకు అధ్వర్యుఁడు హోత, ఆగ్నీధ్రుఁడు, బ్రహ్మ యను నలుగురు ప్రధాను లగు ఋత్విజులుమాత్రమే యుందు రని తెలియుచున్నది గదా!

కావున, నంగములను బోధించువాక్యములతో, నేకవాక్యతను బొందుప్రధాన నవిధి, యట్టి యేకవాక్యతచేఁ దెలియఁజేయంబడు సాహిత్యమును విధించుచుఁ, బైని వివరింపఁబడినరీతిని, నంగములును, బ్రధానములును నొకటేకాలమునం దాచరింపఁ బడుట కుదురకుండుటం జేసి, వానిని నడుమ నాలస్య మేమియు లేకుండ నాచరింపఁ బడవలసినవానినిగా విధించుచున్నది. కావునఁ బ్రయోగము నాలస్యము లేకుండ, వేగ ముగా జరుపురీతిని బోధించువిధి, ప్రయోగవిధి యని సిద్ధించుచున్నది.

అట్లాలస్య మేమియు లేకుండ వాని నాచరించుట, వాని నొక ౨నియతమగు వరుసతో నాచరించునపుడే సిద్ధించును. అట్టి నియతమగు వరుస నవలంబింపనియెడ ల, నీ కర్మము దీనియనంతర మాచరింపవలయునా? దానియనంతర మాచరింపవల యునా? యని ప్రయోగమునం దెల్ల సంశయము కలుగుచునేయుండెడిని. కావునఁ బ్రయోగవిధియే, తనచేత విధింపఁబడుక్రియలకు, వేగముతో నాచరింపఁబడుట సిద్ధిం చుటకొఱకు, నా క్రియలను నియతమగు క్రమముతో నాచరింపఁబడవలసినవానినిగా విధించుచున్నది.

# క్రమము

ఒక్కొకక్రియ, ముందు గాని, తరువాతఁ గాని, వేఱొక క్రియతో నెడ తెగక కలసియుండుట, లేదా, అనేకక్రియలు, శాస్త్రమునందు నిర్ణయింపఁబడినరీతిని, ముందు వెనుకలుగా నుండుట క్రమ మనఁబడును. అట్టిక్రమమును బోధించుటకు, శ్రుతి, అర్థము, పఠనము (=పాఠము) స్థానము, ముఖ్యము, ప్రవృత్తి యను నాఱుప్రమాణ ములు కలవు.

౧. తై. బ్రా. ౨-౩-౬ యజ్ఞక్రతువునకు నలుగురు ప్రధానులగు ఋత్విజులుమాత్రమే కలరు.

౨. శాస్త్రముచే నిర్ణయింపఁబడిన.

# క్రమమును బోధించు శ్రుతిప్రమాణము

అందుఁ గ్రమమును బోధించు వేదవాక్యము, శ్రుతి యనఁబడుచున్నది. అది, (i) కేవలము క్రమమునుమాత్రము బోధించునదియు (ii) క్రమముతోఁ గూడిన క్రియలను బోధించునదియు నని రెండువిధములుగా నున్నది. వానిలో "వేదం కృత్వా వేదిం కరోతి"[౧] అను శ్రుతి, కేవలక్రమమును బోధించునది. వేదిని నిర్మించుట మున్నగు క్రియలు, వేరువాక్యములచే బోధింపఁబడినవి గదా! "వషట్కర్తుః ప్రథమభక్షః"[౨] అను శ్రుతి యన్ననో, క్రమముతోఁ గూడిన క్రియలను బోధించుచున్నది. ఈవాక్యము సంపూర్ణమగు నొకటేయర్థమును బోధించుట కుదుర[3] దను భయ ముండుటంజేసి, వేరువిధియందు విధింపఁబడినభక్షణము ననువదించి, దాని కంగమునుగాఁ గ్రమమునుమాత్రము విధించుట శక్యము కాదుగదా!

ఈశ్రుతి, అర్థము మున్నగు నితరప్రమాణములకంటె, బలవత్తరమైనది. అవి శ్రుతిని గల్పించుట[౪] ద్వారముననే క్రమమును బోధించుప్రమాణము లగుచున్నవి గదా! కావుననే "ఐంద్రవాయవం గృహ్ణాతి,"[౫] "మైత్రావరుణం గృహ్ణాతి,"[౬] ఆశ్వినం

౧. వేద మను పేరుగల దర్భలకట్టను గట్టినపిదప, వేదిని నిర్మింపవలయును. వేది యనఁగా, త్రేతాగ్నులనడుమ నుండు చోటు.

౨. యాజ్యావాక్యమును జదివినపిదపఁ, బఠింపఁబడవలసినదిగా విధింపఁబడిన, 'వషట్' అను శబ్దమును బఠించుహోత, హోమమును జేయఁగా మిగిలినహవిస్సును, మొదటఁ దినవలయును. ఇది ప్రధానులగు నలుగురు ఋత్విక్కులును దినవలసి యుండఁగా, వానిలో, 'వషట్' అనుశబ్దమును బఠించుహోత, తనభాగమును దినవలయు నని తాత్పర్యము.

3. ఇచట భక్షణము ననువదించి, ప్రాథమ్యమును విధించునెడ, నుద్దేశ్యమగు భక్షణము, విధేయమగు ప్రాథమ్యముతో నన్వయించుటకుముందు, క్రియతో నన్వయించు నని యంగీకరింపవలసి యున్నది గనుక, నట్లు క్రియతో నన్వయించుటకంటె ముందుగా, భక్షణమునకును ప్రాథమ్యమునకును, విశేషణవిశేష్యభావ ముండునట్లు తెలియమి, నేకార్థీభావ మనెడు సామర్థ్య ముండకపోవుటచే "ప్రథమభక్షః" అను సమాసము కుదురనేర దని తాత్పర్యము.

౪. అర్థము మున్నగు నితరప్రమాణము లుండుచోటఁ, బ్రత్యక్షమగు శ్రుతి లేకుండుటంజేసి, యవి క్రమమును బోధించుశ్రుతిని గల్పించుట కారంభించునంతలోఁ, బ్రత్యక్షమై సిద్ధమగు శ్రుతిచేఁ, గ్రమము బోధింపఁబడఁగలుగు గాన, నచట నవి యేమియుఁ బ్రవర్తింపఁజాలవు. కావున, నవి యన్నియు శ్రుతికంటె దుర్బలము లగుచున్నవి.

౫. ఇంద్రుఁడు, వాయువు నను జంటదేవతలకొఱ కుద్దేశింపఁబడు హవిస్సును ధరించుగ్రహమును (యజ్ఞపాత్రము) దీసికొనునది.

౬. మిత్రుఁడు, వరుణుఁడు నను జంటదేవతలకొఱ కుద్దేశింపఁబడు హవిస్సును ధరించు గ్రహమును దీసికొనునది.

గృహ్ణాతి”[౧] అనునీ మున్నగు గ్రహములను బఠించినవరుసలో, ఆశ్వినగ్రహము 'ఆశ్వినం గృహ్ణాతి' యనువాక్యముచే, మూఁడవదిగా గ్రహింపఁదగి యుండఁగా, 'ఆశ్వినో దశమో గృహ్యతే'[౨] అను ప్రత్యేకవచనము (శ్రుతి) ఉండుటంజేసి, యిచటిపాఠక్రమమును వదలి, యీవచనమునే ప్రమాణముగా ననుసరించి, యాశ్విన గ్రహము పదియవదిగానే గ్రహింపఁబడవలసిన దని, మీమాంసాదర్శనమునందలి, పంచమాధ్యాయపుఁ జతుర్థపాదమం దుండెడి ప్రథమసూత్రమునందుఁ జెప్పఁబడినది.

# అర్థక్రమము

ప్రయోజనము ననుసరించి నిర్ణయింపఁబడు క్రమము 'అర్థక్రమము' అనఁబడును. ఉదా:—"అగ్నిహోత్రం జుహోతి,[౩] యవాగూం పచతి '[౪] అని క్రమముగాఁ బఠింపఁబడువాక్యములచే విధింపఁబడెడి 'అగ్నిహోత్ర' మను హోమము, యవాగువును (గంజిని) వండుట, అనునీ రెండింటిలో, నగ్నిహోత్ర మను హోమము నుద్దేశించి యవాగువును ద్రవ్యముగా విధించు 'యవాగ్వా అగ్నిహోత్రం జుహోతి' అనువాక్యమునుండి, యవాగువును వండుటకు, అగ్నిహోత్ర మను హోమము నాచరించుట యను ప్రయోజన మున్న దని, తెలియుటంజేసి, యవాగువును వండుట ముందును, దానితో అగ్నిహోత్ర మనుహోమము నాచరించుట తరువాతను జరుపఁబడుచున్నది.

ఆ యర్థక్రమము, [౫]పాఠక్రమముకంటె బలవత్తర మైనది. ఇచటనే 'అగ్నిహోత్రం జుహోతి, యవాగూం పచతి' అనువాక్యములను బఠించినవరుస ననుసరించి, ముం దగ్నిహోత్రహోమమును, దరువాత యవాగువును వండుటను జరిపిన

౧. అశ్విదేవతలకొఱ కుద్దేశింపఁబడు హవిస్సును ధరించుగ్రహమును దీసికొనునది.

౨. ఆశ్వినగ్రహమును బదియవదానినిగా గ్రహింపవలయును.

౩. అగ్నిహోత్ర మను హోమము నాచరించుటమూలముగా, నిష్టము నుత్పాదింపవలయును.

౪. గంజిని వండవలయును.

౫. యవాగువుతో నగ్నిహోత్ర మను హోమము నాచరించుటమూలముగా, నిష్టము నుత్పాదించుకొనవలయును.

౬. పాఠము ననుసరించి నిర్ణయింపఁబడు క్రమము = విధివాక్యముల పాఠమునందలి వరుస ననుసరించి, వానిచే విధింపఁబడు క్రియల నాచరించుటకై, నిర్ణయింపఁబడుక్రమము.

మొదల, వండినయవాగువుచే నగ్నిహోత్రహోమము నాచరించుట యను ప్రయోజనమునకు[1] బాధయు,[2] యవాగువును వండుట కదృష్టమగు ప్రయోజనమును గల్పింపవలసి యుండుటయును సంభవించెడిని. అగ్నిహోత్రహోమము నాచరించినపిదప, జరుపఁబడిన యవాగువును వండుట యనుదానికి దృష్ట (ప్రత్యక్ష) మగు ప్రయోజనమేమియు లేదుగదా!

# పాఠక్రమము

క్రియలను బోధించు విధివాక్యములను బఠించుక్రమము, పాఠక్రమము. దానిననుసరించియే, యాక్రియల నాచరించుక్రమము నిర్ణయింపఁబడును. వాక్యము లే క్రమమునఁ బఠింపఁబడునో, యాక్రమముతోనే చదువఁబడి, తమయందలియర్థమును దెలియఁజేయును. వాక్యములయర్థమును దెలిసినవరుసనే, వానిచే విధింపఁబడు క్రియలనుష్ఠింపఁబడునుగదా!

అట్టిపాఠము (౧) మంత్రపాఠము[3] (౨) బ్రాహ్మణపాఠము,[4] నని రెండువిధములు. దర్శపూర్ణమాసేష్టుల ప్రకరణమునందలి[5] మంత్రకాండమునందుఁ, ప్రయాజములు, ఆజ్యభాగములు, మున్నగు మంత్రములను బఠించినపిదప, నాగ్నేయయాగమునకు సంబంధించు "[6]అగ్నిర్మూర్ధా, భువోయజ్ఞస్య" అను యాజ్యావాక్యలు రెండును, దరువాత ఉపాంశుయాజమునకు సంబంధించెడి మంత్రములను బఠించిన పిదప, నగ్నీషోమీయయాగమునకు సంబంధించెడు 'అగ్నీషోమానసవేదసా,' 'యువమేతాని' అను యాజ్యావాక్యలు రెండును వినఁబడుచున్నవి. ఈయాజ్యావాక్యలను బఠించినక్రమమునే యనుసరించి, ఆగ్నేయయాగము ముందును, అగ్నీషోమీయయాగము తరువాతను జరుపఁబడుచున్నవి. ఇట్లీ రెండు యాగములను నాచరించుటకు నిర్ణయింపఁబడినక్రమము వానివాని యాజ్యావాక్యలనెడి మంత్రములపాఠమునే యనుసరించియున్నది.

౧. అగ్నిహోత్ర మనుపేరుగల హోమము.

౨. బాధ = లోపము = జరుగకపోవుట = నివర్తించుట.

౩. మంత్రములను వరుసగాఁ బఠించుట.

౪. విధించు బ్రాహ్మణవాక్యములను వరుసగాఁ బఠించుట.

౫. మంత్రములసమూహము.

౬. తై. బ్రా. ౩-౫-౭.

అట్టి మంత్రపాఠము, బ్రాహ్మణపాఠముకంటె బలవత్తర మైనది. మంత్రవాక్య మనుష్ఠానమునకు మిక్కిలి సంబంధించి యుండుటంజేసి, బ్రాహ్మణవాక్యమునకంటెఁ దానే యనుష్ఠానమున కెక్కువ యావశ్యక మగుచున్నదిగదా! అది యెట్లంటేని, బ్రాహ్మణవాక్యము ప్రయోగమునకుఁ బూర్వమే 'దీని నిట్లు చేయవలయును.' అని విధిమూలమున బోధించి సార్థక[1] మగుచున్నది గాన, మరలఁ బ్రయోగమును జరుపుకాలమునందుఁ బ్రవర్తింపనేరదు. మంత్రవాక్యము లన్ననో యితరప్రయోజనమేమియు లేనివై, ప్రయోజనమునం దావశ్యకము లగు క్రియలను స్మరింపఁజేయు నని, ముందు చెప్పెదము. కావునఁ గర్మములు నాచరించుక్రమము, వానిని స్మరించుక్రమము ననుసరించి యుండుటచేతను, వానిని స్మరించుక్రమము, వానిని స్మరింపఁజేయు మంత్రములను బఠించినక్రమము ననుసరించి యుండుటచేతను, మంత్రపాఠము, బ్రాహ్మణపాఠమునకంటె ననుష్ఠానమున కెక్కువ యావశ్యకమై, యితరమైన దానికంటె బలవత్తర మగుచున్నది. కావుననే, తైత్తిరీయసంహితయందలి, రెండవకాండయందుండు నైదవ ప్రపాఠకమం దుండెడి, రెండవయనువాకమునం దుండు "తాభ్యా మేత మగ్నీషోమీయ మేకాదశకపాలం పూర్ణమాసే ప్రాయచ్ఛత్" అను బ్రాహ్మణవాక్యముచే, నగ్నీషోమీయయాగమును, నాకాండమునందే యాఱవప్రపాఠకపుమూఁడవ యనువాకమునం దుండెడు "యదాగ్నేయోఽష్టాకపాలోఽమావాస్యాయాంపౌర్ణమాస్యాం చాచ్యుతో భవతి" అను బ్రాహ్మణవాక్యముచే నాగ్నేయయాగమును, విధింపఁబడుటంజేసి, ఆ బ్రాహ్మణవాక్యములను బఠించినక్రమము ననుసరించి మొదట నగ్నీషోమీయయాగమును, దరువాత నాగ్నేయయాగమును నాచరింపవలసి యుండఁగా, నీ బ్రాహ్మణవాక్యముల క్రమమును బాధించి, ఆమంత్రపాఠము ననుసరించుటచే, మొదట నాగ్నేయయాగమును, బిదప నగ్నీషోమీయయాగమును ననుక్రమముతో నీ రెండును నాచరింపఁబడుచున్నవి.

ప్రయాజములను విధించు 'సమిధో యజతి'[3] 'తనూనపాతం యజతి' 'ఇడో యజతి' 'బర్హిర్యజతి' 'స్వాహాకారం యజతి' అను బ్రాహ్మణవాక్యములను బఠిం

౧. = సఫలము. బ్రాహ్మణవాక్యము విధించువాక్య మగుటచే 'నిది యిట్లు చేయవలయును.' అని విధించుటచేతనే, దాని కుండునాకాంక్ష యుపశమించుటంజేసి యది సార్థక మైన దని తాత్పర్యము.

౨. యాజ్యానువాక్యామంత్రములపాఠము.

3. (తై. సం. ౨-౧-౧-౧) సమిత్తను దేవతగల యాగము నాచరించుటమూలముగాఁ, గ్రతువున కుపకారము నుత్పాదించుకొనవలెను. ఇట్లే యితరవాక్యములకును నర్థము తెలిసికొనవలయును.

చినక్రమము ననుసరించి, వానిచే విధింపఁబడిన యాగముల నాచరించుట కవలంబింపఁ బడు క్రమము, బ్రాహ్మణపాఠమువలన నిర్ణయింపఁబడు క్రమ మగుచున్నది. ఇచట నాలోచింపఁగా, బ్రాహ్మణవాక్యములు, తమయందు వినఁబడు క్రియలను విధించుట చేతనే చరితార్థములు కాఁగలవు. అయినను, నీ ప్రయాజములను స్మరింపఁజేయునవి మ తేమియు ¹లేకుండుటంజేసి, యీ బ్రాహ్మణవాక్యములే యీ ప్రయాజములను స్మరింపఁజేయునవిగా నంగీకరింపఁబడుచున్నవి. కాఁగా, నీ బ్రాహ్మణవాక్యములు తామే క్రమమునఁ బఠింపఁబడినవో, యా క్రమముననే, తమచే విధింపఁబడు క్రియలను స్మరింపఁజేయును గాన, వానిక్రమముననే యా క్రియల నాచరించుట యుచిత మగుచున్నది. కావున, బ్రాహ్మణవాక్యములను బఠించినక్రమము ననుసరించి, వానిచే విధింపఁబడిన ప్రయాజముల నాచరించుక్రమము నిర్ణయింపఁబడు నని సిద్ధించుచున్నది.

ఓయీ! ప్రయాజములను విధించుటచేఁ జరితార్థములగు బ్రాహ్మణవాక్యములు, ఆ ప్రయాజముల ప్రయోగమునందావశ్యకము లగు క్రియలను స్మరింపఁజేయునవిగా నేల యంగీకరింపవలయును? ఆగ్నేయాగ్నీషోమీయయాగములందువలె, నిచటఁగూడ నీ ప్రయాజముల ప్రయోగమునందలి క్రియలను స్మరింపఁజేయు, ²"సమిధో అగ్న ఆజ్యస్య వియన్తు, 'తనూనపాదగ్న ఆజ్యస్య వేతు' అను నీమున్నగు యాజ్యామంత్రము లున్నవిగదా! ఈ యాజ్యామంత్రములు, అందందలి దేవతలను స్మరింపఁజేయుటంజేసి, యీ బ్రాహ్మణవాక్యమే ప్రయోగమునందావశ్యకములగు క్రియలను స్మరింపఁజేయున ట్లంగీకరింపఁబడుచున్న దని చెప్పవలదు. అట్లయినచో, నాగ్నేయాగ్నీషోమీయయాగములందుఁగూడ, యాజ్యావాక్యామంత్రములు దేవతలను స్మరింపఁ జేయున వగుటంజేసి, బ్రాహ్మణవాక్యములే యాగములను స్మరింపఁజేయునవిగాను (కనుకనే వాని నాచరించుక్రమమును బోధించునవిగాను) నంగీకరింపఁబడవలసి వచ్చును. 'అట్లయినఁ గానిమ్ము' అనికూడఁ జెప్పవలదు. అట్లయినచో బ్రాహ్మణ

౧. ఎచటఁ గర్మములను స్మరింపఁజేయుటచే, వాని కంగమగు మంత్రము లుండునో, యచట నా మంత్రపాఠక్రమమునే యనుసరించి, యా కర్మముల నాచరించుక్రమము నిర్ణయింపఁబడుననియు, నెచట నట్టిమంత్రములు లేవో, యచట, వేఱుగతి లేకుండుటంజేసి, యా కర్మములను విధించు బ్రాహ్మణవాక్యములపాఠక్రమమే, యా కర్మముల నాచరించుక్రమమును నిర్ణయించునదిగా నంగీకరింపఁబడవలయుననియుఁ, దాత్పర్యము.

౨. (తై. బ్రా. ౩-౫-౮)

పాఠముకంటె, మంత్రపాఠము బలవత్తరము కాకపోయెడిని. మంత్రపాఠము బ్రాహ్మణపాఠముకంటె బలవత్తర మగుటకు, మంత్రములు ప్రయోగమునందలి క్రియలను స్మరింపఁజేయుటయు, నితరములగు బ్రాహ్మణము లట్లు స్మరింపఁజేయకపోవుటయును, హేతువు లగుచున్నవి. బ్రాహ్మణవాక్యము, కర్మమును స్మరింపఁజేయునదిగా నంగీకరింపఁబడునెడ, బ్రాహ్మణవాక్యము [1]ప్రధానమగు కర్మమును స్మరింపఁజేయుటమూలమున, ననుష్ఠానముతో నెక్కువ సంబంధించి యుండుటచేతను, మంత్రము లా కర్మమున కంగములగు దేవతలను స్మరింపఁజేయుటమూలమున, ననుష్ఠానముతోఁ గొంచెము సంబంధించి యుండుటచేతను, మంత్రపాఠముకంటె బ్రాహ్మణపాఠమే బలవత్తర మయ్యెడిని. కాఁగా; [2]“మంత్రతస్తు విరోధే స్యాత్, ప్రయోగరూప సామర్థ్యాత్. తస్మా దుత్పత్తిదేశః సః” (జై. సూ. ౫-౧-౧౬)అనునధికరణముతో విరోధము సంభవించెడిని. ఆ యధికరణమునందు, బ్రాహ్మణపాఠముకంటె మంత్రపాఠము బలవత్తర మగుటంజేసి, మొదట నాగ్నేయయాగమును, దరువాత నగ్నీషోమీయయాగమును నాచరింపఁబడు నని చెప్పఁబడినది.

ఇచట నొకఁ డిట్లు శంకించుచున్నాఁడు:—దేవత యనునది, యజమానునిచే సమర్పింపఁబడు ద్రవ్యమున కుద్దేశ్యమే కనుక, నాగ్నేయాగ్నీషోమీయయాగములకు సంబంధించు యాజ్యామంత్రములే, దేవతను ప్రకాశింపఁజేయుటద్వారమున, నా కర్మమునే ప్రకాశింపఁజేయఁగల వని చెప్పినపక్షమున, నిది యంతయుఁ బ్రయాజములయందుఁగూడ సమానముగానే యున్నది. వానియందుఁగూడ, దేవత మంత్రముచేఁ బ్రకాశింపఁజేయఁదగిన దగుటంజేసి, యాజ్యామంత్రములందలి దేవతలను ప్రకాశింపఁజేయును. కాఁగాఁ బ్రయాజములకు సంబంధించు యాజ్యామంత్రములు, దేవతలను ప్రకాశింపఁజేయుటమార్గమునఁ గర్మమును బ్రకాశింపఁజేయఁగలుగుటంజేసి, యీ ప్రయాజముల నాచరించుక్రమము, మంత్రపాఠక్రమమునుబట్టియే యేర్పడును గాని, బ్రాహ్మణపాఠక్రమమునుబట్టి కాదు. మంత్రపాఠము విపరీత మగు క్రమము నాశ్రయించి

౧. యాగమునందుఁ గర్మము ప్రధానము. ద్రవ్యమును దేవతయు దాని కంగములు.

౨. మంత్రపాఠమువలని క్రమమునకును బ్రాహ్మణపాఠమువలని క్రమమునకును, విరోధము కలుగునపుడు, మంత్రపాఠక్రమమును బట్టియే, కర్మముల నాచరించు క్రమము నిర్ణయింపఁబడును. మంత్రములు, ప్రయోగమునందలి క్రియలను స్మరింపఁజేయుటకు, సమర్థము లగుచున్నవిగదా. కావున, బ్రాహ్మణపాఠము కర్మమును విధించుటమూలమున దాని యుత్పత్తిని మాత్రమే బోధించును గాని, ప్రయోగకాలమువఱకును వ్యాపించి యుండనేరదు.

యుండుటంజేసి, ప్రయాజముల నాచరించుక్రమము, బ్రాహ్మణపాఠమునం దుండు క్రమమునుబట్టియే, పూర్వమువలె నని చెప్పవలదు. మంత్రపాఠము విపరీత మగు క్రమము నాశ్రయించి యుండునపుడు, మంత్రక్రమము బ్రాహ్మణక్రమముకంటె బలీయము గనుక, మంత్రపాఠముచే బోధిత మగు క్రమమే, ప్రయాజముల నాచరించునపు డవలంబింపవలసివచ్చును. అభ్యాసాధికరణమునందు,[1] వార్త్తికకారునిచే,[2] యథాసంఖ్యపాఠ[3]మను స్థానప్రమాణముచే వినియోగింపఁబడిన 'సమిత్తు మున్నగు లింగములు గల మంత్రవర్ణములు' అను నీ మున్నగు వాక్యము మూలమునఁ, ప్రయాజములకు సంబంధించు యాజ్యామంత్రములు, యథాసంఖ్యపాఠ మనెడి ప్రమాణముచేఁ బ్రయాజముల కంగముగా వినియోగింపఁ జేయఁబడుచున్న వని చెప్పఁబడినది. తంత్రరత్నమునం దుండు, తొమ్మిదవ యధ్యాయమునందుఁగూడ "సమిధోఽగ్న ఆజ్యస్య వియన్తు" ఈ మున్నగు వాక్యములచే, మంత్రక్రమమువలనఁ బ్రాప్త మగు మంత్రదేవత లంగములుగా వినియోగింపఁజేయఁబడుచున్న వని చెప్పఁబడినది. మంత్రములు విపరీతమగు క్రమము నాశ్రయించి యుండునెడ, దానినిబట్టియే కర్మములయనుష్ఠానము జరుగవలసి యుండఁగా, నా క్రమముననే దేవతలు ప్రాప్తించుటంజేసి, వీనికి విరుద్ధక్రమముగల బ్రాహ్మణపాఠము ననుసరించి, దేవతలు ప్రాప్తించుట సంభవింపదు గనుక, నా దేవతలను బట్టి తత్ప్రఖ్యన్యాయముమూలమున, సమిత్తు మున్నగుశబ్దములు, యాగనామధేయము లని వార్త్తికకారునిచేఁ జెప్పఁబడుటయు, నీ దేవతలు క్రమమునన నంగములుగా వినియోగించు నని తంత్రరత్నకారుఁడు చెప్పినమాటయుఁ, గుదురకపోవుడిని. ఇట్లుండఁ, బ్రయాజాదుల నాచరించుక్రమము, బ్రాహ్మణపాఠమునందలి క్రమమునుబట్టి యెట్లు నిర్ణయింపఁబడఁగలదు? ఇట్లు చేసినశంక కీ క్రిందిది సమాధానము.

పూర్వపక్షి చెప్పినమాట యథార్థమే అయినను, [4]నారభ్య (మంత్రములు లేకుండ) విధింపఁబడు కర్మములవలె, నెచటఁ గర్మములను స్మరింపఁజేయు మంత్ర

౧. మీమాంసాదర్శనము. ౨-౨-౨ 'సమిధో యజతి' 'తనూనపాతం యజతి' మున్నగు వాక్యములయందు, యాగవిధిని బోధించు 'యజతి'పదము మరల మరల వినఁబడుటంజేసి, యీ యైదు వాక్యములచే విధింపఁబడునవి వేఱువేఱు కర్మము లని యీ యధికరణమునందుఁ దెలియఁజేయఁబడినది.

౨. తంత్రవార్త్తికమును రచించిన కుమారిలభట్టుచేత. ౪౫౭ పేజీ.

3. ఇది తంత్రవార్త్తికము ౪౫౭ పేజీలో నున్నది.

౪. ప్రయాజాది వాక్యాన్యర్థం సమర్ప్య చరితార్థాని, స్వరూపసంస్పర్శే సత్యపి ప్రయోజ్యతాం న ప్రతిపద్యన్తే. (తం. వా. ౫౧ పేజీ.)

ము లుండవో, యచటికర్మముల నాచరించుక్రమము, వానిని విధించు బ్రాహ్మణ వాక్యముల పాఠమునందలి క్రమమునుబట్టియే యుండును. అచ్చట నా బ్రాహ్మణ వాక్యములే, ప్రయోగమునందలి కర్మములను స్మరింపఁజేయునవై యున్నవిగదా! ప్రయా జములకు సంబంధించు బ్రాహ్మణవాక్యము, లచటి ప్రయోగమునందలి కర్మములను స్మరింపఁజేయ నేరకుండుటంజేసి, యట్లు స్మరింపఁజేయు మంత్రములు లేవని యూహిం చి ప్రయాజము లుదాహరణముగాఁ జెప్పఁబడినవి. ఇందులకు "ప్రయాజములు, అనూ యాజములు, మున్నగువానిని విధించు విధివాక్యములు, ప్రయాజములు మున్నగు నాచరింపఁదగిన కర్మములను విధించుటచేతనే చరితార్థములై, స్థానము ప్రకరణము నను రెండుప్రమాణములచే నా కర్మములతోఁ గొంచెము సంబంధించి యున్నను, వానిని బ్రయోగించుకాలమునందు, మంత్రములవలె నుచ్చరింపఁదగినవి కానేరవు గనుక, నా ప్రయోగమునందలి కర్మముల నెంతమాత్రమును స్మరింపఁ జేయనేరవు" అని తంత్రవార్త్తికమునందు, అర్థవాదపాదమునందు, మంత్రాధికరణపూర్వపక్షసంద ర్భమునఁ, గుమారిలభట్టుచే, నుడువఁబడిన వార్త్తికము ప్రమాణము కాఁగలదు. కాఁ గా, నే కర్మములకుఁ దమ్ము స్మరింపఁజేయు మంత్రము లుండునో, యా కర్మముల నా చరించుక్రమ, మా మంత్రపాఠక్రమము ననుసరించి యుండును. అట్టి మంత్రములు లేని కర్మముల నాచరించుక్రమ మన్ననో, వానిని విధించు బ్రాహ్మణవాక్యములపాఠ మునందలి క్రమము ననుసరించియే యుండును. ఇట్లే యాయా స్థలములయందుఁ గ్రమమును నిర్ణయింపవలయును.

## స్థానక్రమము

ప్రకృతియందు వేఱువేఱు ప్రదేశములయం దున్న కర్మములను నతిదేశవాక్య ములచే వికృతియందలి యొకచోట నాచరింపవలసియుండఁగా, వానిలో దేనిచోట వివి యాచరింపవలయునో యది ముందును, మిగిలినవి తరువాతను జరుపఁబడును. ఇట్లు నిర్ణయింపఁబడిన క్రమము, స్థానక్రమ మనఁబడును. స్థాన మనఁగా నుపస్థితి; లేదా, స్మరింపఁబడుట. వీనిలో దేనిచోట నీ కర్మము లాచరింపఁబడవలయునో, దానికి ముందటిక్రియ లాచరించినవెంటనే, యదియే మొదట నుపస్థిత[౧] మగును, గనుక, మొదట దానినే యాచరించుట యుక్తము. కావుననే, జ్యోతిష్టోమయాగ మునకు వికృతియై, యొకటేదినమున నాచరింపఁబడు సాద్యస్క్ర మను పేరు

౧. స్మరింపఁబడును.

గల యాగమునందుఁ బ్రకృతినుండి యతిదేశవాక్యమూలముగా గ్రహింపఁబడు అగ్నిషోమీయము, సవనీయము, ఆనుబంధ్యము,[౧] అను మూఁడు పశువులు, నొకటేసారి సవనీయపశువును జేయు సమయమునందు వినియోగింపఁబడవలసి యుండఁగా, నా సమయమునకుఁ బూర్వ మాశ్వినగ్రహమును గ్రహించిన వెంటనే, సవనీయపశువే మొదట నుపస్థిత మగును గనుక, నీ సమయమున మొదట సవనీయపశువును, పిదప మిగిలిన రెండు పశువులును వినియోగింపఁబడును.

అది యెట్లంటేని:—జ్యోతిష్టోమ మను ప్రకృతియాగమునందు, అగ్నీషోమీయము, సవనీయము, ఆనుబంధ్యము అను మూఁడు పశుయాగములు వేఱు వేఱు కాలములం దాచరింపఁబడును. ఇం దగ్నీషోమీయపశుయాగము ఔపవసథ్య మనెడి నాల్గవదినమునందును, సవనీయపశుయాగ మైదవదినమునందలి సుత్య[౨] చేయు కాలమందును, ఆనుబంధ్యపశుయాగ మవభృథ మైనపిదపను నాచరింపఁబడును. సాద్యస్క్రి యనునది సోమయాగములలో నొక యాగవిశేషము. అది యవ్యక్త[౩] మగుటంజేసి, జ్యోతిష్టోమ మను ప్రకృతియాగమునకు, వికృతి యగుచున్నది. కావున, నా మూఁడుపశుయాగములును 'చోదకవాక్యము'[౪]చే సాద్యస్క్రియందుఁ గర్తవ్యములుగాఁ బ్రాప్తించుచున్నవి. "సహ పశూ నాలభేత[౫]" అను విధివలన, నీ మూఁడుపశుయాగములకును సాహిత్య[౬] మున్నట్లాచరింపవలె నని తెలియుచున్నది. వీని కట్టిసాహిత్యము, సవనీయపశువును జేయు సమయమునందే యుండవలయును. అట్లుండినను, బ్రధాన మగు సోమయాగము,[౭] ఈ సవనీయపశుయాగము జరిగిన వెంటనే యాచరింపఁబడుటంజేసి

౧. వేదమునం దనూబంధ్య మని వాడఁబడినది.

౨. సోమలతనుండి రసమును దీయుట.

౩. ఇంతకుముందు వివరింపఁబడినది.

౪. అతిదేశవాక్యము.

౫. పశువు లన్నిటికిని సాహిత్య ముండునట్లు వాని నాలంభింపవలయు ననుటచే నిష్టము నుత్పాదింపవలయును. ఆలంభించుట యనఁగ బశువున కుపాకరణము మొదలుకొని సంజ్ఞపనము వఱకు నుండు సంస్కారములను జేయుట.

౬. కూడిక.

౭. సోమరసముతోఁ జేయుయాగము.

దీని కతిసమీపమున నుండుటయు, నగ్నీషోమీయపశుయాగమునకును, నానుబంధ్యపశుయాగమునకును, సమానముగా నొక్కొక్కస్థానమే యతిక్రమించి యుండుటయును, గలుగునుగదా! ఈ మూఁడుపశుయాగములును గలసి, సవనీయపశుయాగము చేయుసమయమున నాచరించు నెడ, అగ్నీషోమీయపశుయాగమునకును, ఆనుబంధ్యపశుయాగమునకును, వానివానిస్థానము నొకదానినిమాత్రమే యతిక్రమించుట, యా రెంటికిని సమానముగాఁ గలుగును. ఈ మూఁడుపశుయాగములను నగ్నీషోమీయపశుయాగము చేయుసమయమున నాచరించుపక్షమున, సవనీయపశుయాగమునకుఁ దనస్థాన మొక్కటిమాత్రమే యతిక్రమించుట సంభవించును. ఆనుబంధ్యపశుయాగమున కన్ననో, తనస్థానము నతిక్రమించుటయే కాక, సవనీయపశుయాగముయొక్క స్థానమునుగూడ నతిక్రమించుట సంభవించెడిని. ఇట్లే యీ మూఁడుయాగముల నానుబంధ్యపశుయాగము చేయుకాలమునం దాచరించుపక్షమున, సవనీయపశుయాగమునకుఁ దనస్థాన మొకటిమాత్రమే యతిక్రమించుటయు, నగ్నీషోమీయపశుయాగమునకుఁ, దనస్థానమునే కాక సవనీయపశుయాగముయొక్క స్థానమునుగూడ నతిక్రమించుటయును సంభవించెడిని. ఇట్లీ మూఁడుయాగములను నగ్నీషోమీయయాగకాలమునందుఁ గాని, యానుబంధ్యపశుయాగకాలమునందుఁ గాని, యాచరించుపక్షమున, నాయా స్థానమునందలి యాగములు తప్ప, మిగిలిన రెండుయాగములకును, స్థానముల నతిక్రమించుటలో వైషమ్యము (హెచ్చుతగ్గులు) కలుగును గాన, నట్టివైషమ్యము కలుగకుండుటకై, యీ మూఁడుయాగములను సవనీయపశుయాగకాలమునం దాచరింపవలసి యుండఁగా, నీ సమయమునందు సవనీయపశుయాగ ముపస్థిత మగుటం జేసి, మొదట దానినే యాచరింపవలెను. ఆశ్విన మనెడి గ్రహమును గ్రహించినవెంటనే, సవనీయపశుయాగము చేయుకాలము తటస్థించును. ప్రకృతి యగు జ్యోతిష్టోమమునందు, "ఆశ్వినం గ్రహం గృహీత్వా, త్రివృతా యూపం పరివీయ, ఆగ్నేయం సవనీయం పశు ముపాకరోతి" అను విధివాక్యముచే, నాశ్విన మనెడు గ్రహమును గ్రహించినవెంటనే, సవనీయపశుయాగము విధింపఁబడుచున్నది గదా! అటులే, వికృతి యగు సాద్యస్క్రి యను పేరు గల యాగమునందును, నాశ్వినగ్రహమును గ్రహించినవెంటనే, సవనీయపశు వుప

౧. శ. బ్రా. ౪-౨-౪-౧౨. ఆప. శ్రౌ. సూ. ౧౨-౧౮-౧౨ ఆశ్విన మనెడు గ్రహమును గ్రహించి, యూపమును మూఁడు పిరులుగల త్రాటితోఁ జుట్టి, యగ్నిదేవతకొఱకు నుద్దేశింపఁబడు సవనీయపశువున కుపాకరణ మనెడి సంస్కారము నాచరింపవలయును.

స్థిత మగును గనుక, మొదట సవనీయపశుయాగమును, దరువాతఁ బ్రకృతియందలి క్రమము నతిక్రమించుటకుఁ బ్రమాణ మేమియు లేమిం జేసి, యాక్రమముననే యగ్నీషోమీయయాగమును, నానుబంధ్యయాగమును వరుసగా నాచరించుటయును, యుక్తముగా నున్న దని మీమాంసాదర్శనమునందలి, నైదవ యధ్యాయమునందు నిరూపింపఁబడినది.

## ముఖ్యక్రమము

ఇట్లు స్థానక్రమము నిరూపింపఁబడి, యిఁక ముఖ్యక్రమము[1] నిరూపింపఁబడు చున్నది. అనేకము లగు ప్రధానయాగములను జేయుక్రమము ననుసరించి, వాని యంగముల నాచరించుటకై యవలంబింపఁబడుక్రమము, ముఖ్యక్రమ మనఁబడుచు న్నది. ప్రధానములను జేయుక్రమముననే, యంగములనుగూడ నాచరించినచో, నంగము లన్నిటికిని, వానివానిప్రధానములకును, సమానమైన వ్యవధాన ముండును. అట్లు కాక, ప్రధానములను జేయుక్రమము ననుసరింపక, యంగములు, వేఱుక్రమమున నాచరింపఁబడినయెడలఁ, గొన్నియంగములకు వానివాని ప్రధానములతో మిక్కిలి సామీప్యమును, మఱికొన్నియంగములకును, వానివానిప్రధానములకును మిక్కిలి వ్యవధానమును సంభవించును. 'ప్రయోగవిధినుండి తెలియుప్రధానము లన్నియు, వానివానియంగములతోఁ గూడి యుండవలెను' అను సాహిత్యమునకు భంగము గలుగును గావునఁ, బ్రధానములక్రమమునకంటె భిన్నక్రమమున, నంగముల నాచరించుట యుక్తము కాదు. కావునఁ, బ్రధానక్రమ మంగక్రమమును నిర్ణయించుటకు హేతు వగుచున్నది.

అందువలననే 'ఆగ్నేయయాగము', 'ఐంద్రయాగము' ముందు వెనుకలుగా నాచరింపఁబడును గావునఁ, బ్రధానమునకంటెఁ బూర్వము నాచరింపఁదగు ప్రయాజ[2]ములను నాచరింపఁగా, మిగిలిన నేతితో, ముం దాగ్నేయయాగమునకు సంబంధించు పురోడాశమగు హవిస్సునకును, బిదప నైంద్రయాగమునకు సంబంధించుదానికిని, నభి

౧. ముఖ్యములు = ప్రధానయాగములు. వానిక్రమము ననుసరించి యంగముల కుండు క్రమము ముఖ్యక్రమము.

౨. దర్శపూర్ణమాసప్రకరణమునందుఁ, బ్రయాజహోమములకుఁ బిదప వినఁబడు "ప్రయాజశేషేణ హవీం ష్యభిఘారయతి" అనువిధివలన నిది తెలియుచున్నది. ప్రయాజముల నాచరింపఁగా మిగిలిన నేతితో, హవిస్సుల కభిఘారణము చేయవలయును—అని యీవాక్యమున కర్థము.

ఘారణము చేయవలసియున్నది. ఇచ్చట నొక్కొక యభిఘారణమునకును, వాని వానికి సంబంధించుయాగమునకును మధ్య, నొకక్రియమాత్రమే యుండుటం జేసి, ప్రతియభిఘారణమునకును, దానికి సంబంధించు యాగమునకును, సమాన మగు వ్యవధి యుండును. ఆగ్నేయయాగమునకు సంబంధించు పురోడాశ మను హవిస్సునకుం జేయు నభిఘారణమునకును, నాగ్నేయయాగమునకును నడుమ, నైంద్రయాగమునకు సంబంధించు హవిస్సునకుం జేయునభిఘారణ మను నొకయేక్రియయు, నిట్లే యైంద్రయాగమునకు సంబంధించు హవిస్సునకుం జేయునభిఘారణమునకును, నైంద్ర యాగమునకును నడుమ, నాగ్నేయయాగ మను నొకయే క్రియయునుమాత్రమే, వ్యవధానముగాం గలవుగదా! కావున మొదట నాగ్నేయయాగమునకు సంబంధించు హవిస్సు నభిఘరించుటయును, పిమ్మట నైంద్రయాగమునకు సంబంధించు దధియను హవిస్సు నభిఘరించుటయును, పిదప నాగ్నేయయాగము నాచరించుటయును, ననునీ క్రమ, మిచటిప్రధానములు నాచరించుక్రమమునుబట్టి సిద్ధించుచున్నది. ఇట్లాచరించినచోం, బ్రయోగవిధినుండి తెలిసికొనంబడు 'సంగములకూటిక'యనెడి సాహిత్యము సిద్ధింపంగలదు.

అట్లు కాక, ఆగ్నేయైంద్రయాగములక్రమము ననుసరింపక, వేఱుక్రమము నవలంబించి, మొదట నైంద్రయాగమునకు సంబంధించుదధికిని, పిదప నాగ్నేయయాగమునకు సంబంధించు పురోడాశమునకును, నభిఘారణము చేసినయెడల, యాజ్యావాక్యామంత్రముల క్రమమునుబట్టి, మొదట నాగ్నేయయాగమే యాచరింపంబడుటం జేసి,[1] యాగ్నేయహవిస్సునకుం జేయునభిఘారణమునకును, నాగ్నేయయాగమునకును, వ్యవధాన మేమియు లేకుండుటయు, నైంద్రహవిస్సునకుం జేయునభిఘారణమునకు, నైంద్రయాగమునకును, రెండు క్రియలు నడుమ నుండుటచే నెక్కువ వ్యవధానమును దప్పక సంభవించెడిని.

౧. తై. బ్రా (౩-౫-౭) బ్రాహ్మణమునందు 'అగ్నిర్మూర్ధా దివః, భువో యజ్ఞస్య.' అనునాగ్నేయ యాగమునకు సంబంధించు యాజ్యావాక్యామంత్రములు రెండును, పిమ్మటం బ్రాజాపత్య, అగ్నీషోమీయ-ఐంద్రాగ్న యాగములకు సంబంధించు యాజ్యావాక్యా మంత్రములును, పిదప "ఐంద్రసానసిగ్ం రయిం, ప్రససాహిషే." అను నైంద్రయాగమునకు సంబంధించు యాజ్యావాక్యామంత్రములు రెండును బఠింపంబడుచున్నవి. ఇచట మొదట నాగ్నేయ యాజ్యావాక్యలును, పిమ్మట నైంద్రయాజ్యావాక్యలును బఠింపంబడుటం జేసి, యీ క్రమమునే యనుసరించి, మొదట నాగ్నేయయాగమును, పిదప నైంద్రయాగమును, నాచరింపంబడవలసియున్నది.

అట్లు సంభవించుట యుక్తము కాదు. కాఁగాఁ, ప్రయాజముల నాచరింపఁగా మిగిలిన యాజ్యముతోఁ, బ్రధానయాగముల హవిస్సుల నభిఘరించుక్రమము (ఆముఖ్య) ప్రధానయాగముల నాచరించుక్రమమునుబట్టియే యుండుట యుచితముగా నున్నది.

అట్టి ముఖ్యక్రమము,-పాఠక్రమముకంటె బలహీన మైనది. ముఖ్యక్రమము,-బ్రాహ్మణపాఠక్రమము, యాజ్యావాక్యామంత్రక్రమము ననువానిలో నొకటి యగు ప్రమాణాంతరము నపేక్షించిన, ప్రధానక్రమము దెలిసినపిదపనే నిర్ణయింపఁబడుటం జేసి, యాలస్యముగాఁ దెలిసికొనఁబడుచున్నది. పాఠక్రమ మన్ననో, ప్రమాణాంతరము నపేక్షింపక, స్వతంత్ర మగు స్వాధ్యాయమునందలి పాఠక్రమమునుమాత్రమే యపేక్షించున దగుటచే, నా క్రమమును దెలిసికొనుట కాలస్య ముండదు కావునఁ, బాఠక్రమము ముఖ్యక్రమముకంటె బలవత్తర మగుచున్నది.

ముఖ్యక్రమము పాఠక్రమముకంటె దుర్బలము. కనుకనే, ఆగ్నేయయాగము, ఉపాంశుయాజము,[౧] అగ్నీషోమీయయాగము ననునీ క్రమముగా నాచరింపఁబడు నీమూఁడింటిలో, నుపాంశుయాజమునకు హవిస్సగు నాజ్యమును నిర్వపించుట, ముఖ్యక్రమము దుర్బల మగుటంజేసి, దానినిబట్టి యగ్నీషోమీయయాగమునకుఁ బూర్వము జరుపఁబడుట లేదు. మ రేమనఁ, బాఠక్రమము బలవత్తర మగుటంజేసి, యా క్రమమునే యనుసరించి, యగ్నీషోమీయయాగమునకుఁ బిదప జరుపఁబడుచున్నది.

౧. పూర్ణమాసేష్టియందుఁ బురోడాశము హవిస్సుగాఁగల యాగ్నేయ యాగము, ఆజ్యము హవిస్సుగాఁగల యుపాంశుయాజము, పురోడాశము హవిస్సుగాఁగల యగ్నీషోమీయ యాగము ననుమూఁడు ప్రధానయాగములు గలవు. ఆగ్నేయ యాగమునకు సంబంధించు యాజ్యావాక్యామంత్రము, ఉపాంశుయాజమును విధించు 'ఉపాంశుయాజ మంతరా యజతి' (తై. సం. ౨-౬-౬-౪) అను వాక్యమును, అగ్నీషోమీయయాగమునకు సంబంధించు యాజ్యావాక్యామంత్రమును, వరుసగాఁ బఠింపఁబడుటం జేసి, యిదేక్రమమున నీ మూఁడు యాగములును నాచరింపఁబడుచున్నవి. వీని కంగములగు హవిస్సులను నిర్వపించుట యనెడు మూఁడుక్రియలును, "అగ్నయే జుష్టం నిర్వపా మ్యగ్నీషోమాభ్యాం" (తై. సం. ౧-౧-౪-౧) అను నీ మున్నగుమంత్రముచే విధింపఁబడుచున్నవి. ఇచట ముఖ్యక్రమము ననుసరించి యుపాంశుయాజమునకు హవిస్సగు నాజ్యమును నిర్వపించుట, యాగ్నేయయాగ మైనపిదప నగ్నీషోమీయయాగమునకు ముందే జరుపవలసినదా? లేక, వానిని విధించు విధివాక్యముల పాఠక్రమమునుబట్టి, యగ్నీషోమీయయాగమునకుఁ బిదపనే జరుపఁబడవలసినదా? యని సందేహము కలుగఁగా; ముఖ్యక్రమముకంటెఁ బాఠక్రమము ప్రబల మైన దగుటంజేసి, దాని ననుసరించి యగ్నీషోమీయయాగమునకుఁ బిమ్మటనే యీ యాజ్యము నిర్వపింపఁబడవలసిన దని మీమాంసకుల సిద్ధాంతము.

ఈ ముఖ్యక్రమము, ప్రవృత్తిక్రమముకంటె బలవత్తర మైనది. ప్రవృత్తిక్రమము నవలంబించునపు, డనేకపదార్థము (సంస్కారరూపమైన క్రియ)లు చేయఁబడవలసి యుండఁగా, మొదటిపదార్థము నాచరించినక్రమము ననుసరించియే, రెండవది మున్నగు పదార్థముల నాచరించుక్రమము నిర్ణయింపఁబడుచున్నది. అట్లు చేసిన యెడల, ననేకములగు నంగములకును, వానివాని ప్రధానములకును నెక్కువ వ్యవధానముండునుగదా! ముఖ్యక్రమము నవలంబించినపు డన్ననో, యంగము లన్నియు వానివాని ప్రధానములకు సన్నిహితములుగానే యుండునుగదా! ఉదాహరణము:— దర్శపూర్ణమాసేష్టులయందు, మొదట నాగ్నేయయాగమును, బిదప సాన్నాయ్యయాగములును, నాచరింపఁబడును. సాన్నాయ్యధర్మములలో,[1] శాఖను ఛేదించుట, వత్సలను గోవులనుండి వేఱుపఱుచుట, మున్నగు కొన్ని యీయాగములకుఁ బూర్వము పఠింపఁబడుటంజేసి, యట్టిపాఠక్రమము ననుసరించి, యీ యాగములకు ముందే యాచరింపఁబడుచున్నవి. ఇచటఁ బ్రవృత్తిక్రమము నవలంబించి, సాన్నాయ్యధర్మము లన్నియు మొదటను, బిదప నాగ్నేయధర్మములును, పిమ్మట నాగ్నేయయాగమును, దరువాత సాన్నాయ్యయాగములును నాచరింపఁబడు నెడ, సాన్నాయ్యధర్మములకును, వాని ప్రధానయాగములకును నడుమ, నాగ్నేయధర్మముల[2] నాచరించుట, యాగ్నేయయాగము నాచరించుట యనెడు రెండుక్రియలు వ్యవధానముగా నుండవలసివచ్చును.

సాన్నాయ్యధర్మములలోఁ గొన్ని యాగ్నేయధర్మములకుఁ బూర్వ మాచరింపఁబడినను, మిగిలిన వన్నియు ముఖ్యక్రమమునుబట్టి, యాగ్నేయధర్మముల యనుష్ఠానమునకుఁ బిదప నాచరింపఁబడుపక్షమున నన్ననో, ఆగ్నేయసాన్నాయ్యధర్మము లన్నిటికిని, వానివాని ప్రధానములకును, నడుమ నొక్కొక్కక్రియయే వ్యవధానముగా నుండును. అనఁగా, నాగ్నేయధర్మములకును, వాని ప్రధానమునకును మధ్యను సాన్నాయ్యధర్మముల నాచరించుట యను నొకటేక్రియయు, సాన్నాయ్యధర్మములకును వాని ప్రధానములకును మధ్యను, ఆగ్నేయయాగము నాచరించుటయను నొకటే క్రియయును, వ్యవధానముగాఁ గలవుగదా! ఇట్లుండుటచేఁ బైని వివరింపఁబడిన సాన్నాయ్యధర్మములకును, వాని ప్రధానములకును మధ్య నుండెడియెక్కువ వ్యవధానము సంభవింపనేరదు. కావున ముఖ్యక్రమము ప్రవృత్తిక్రమముకంటె బలవత్తరమగుచున్నది.

౧. సాన్నాయ్యయాగమునందుఁ జేయఁబడు క్రియలు.
౨. ఆగ్నేయయాగమునం దాచరింపఁబడు క్రియలు.

# ప్రవృత్తిక్రమము

ఇట్లు ముఖ్యక్రమము నిరూపింపఁబడి, యింకఁ బ్రవృత్తిక్రమము నిరూపింపఁబడుచున్నది. అనేకప్రధానము లొకటేసారి ప్రయోగింపఁబడవలసి యుండునపుడు, వాని కావశ్యకము లగు సన్నిపత్యోపకారకము లగు నంగములుకూడ, నొకటేసారి కలసి యాచరింపఁబడవలసి యుండఁగా, నంగముల నట్లాచరించుట యశక్య మగుటంజేసి, యీ యంగములలో నొక్కొకటి యావృత్తిచే నొక్కొకప్రధానమునందే యాచరింపఁబడవలసి యుండును. కనుక, మొదటియంగమే ప్రధానమునం దారంభింపఁబడి, యే క్రమమున జరుపఁబడినదో, రెండవది మున్నగునంగములుకూడ నా ప్రధానమందే యారంభింపఁబడి, యదేక్రమమున జరుపఁబడును. ఇట్లు మొదటియంగము ప్రవర్తించినక్రమమునుబట్టి, రెండవది మొదలగునంగములను బ్రవర్తింపఁజేయుటకై నిర్ణయింపఁబడుక్రమము, ప్రవృత్తిక్రమ మనఁబడుచున్నది. ఉదా:—ప్రజాపతిదేవతకొఱకుద్దిష్టము లగు పశువులకుఁ జేయు సంస్కారము లనెడి యంగముల నాచరించుక్రమము. "వైశ్వదేవీం కృత్వా ప్రాజాపత్యై శ్చరన్తి" అనువాక్యమునందలి "ప్రాజాపత్యైః" అను తృతీయాంతముచేఁ, బ్రాజాపత్యపశువు లితికర్తవ్యతతోఁ[3] గూడినవై యొకటేకాలమున వినియోగింపఁబడవలసినవిగా విధింపఁబడుచున్నవి.

౧. మొదటియంగముయొక్క ప్రవృత్తి ( = ప్రవర్తించుట) నిబట్టి, మిగిలిన యంగములపిమ్మట యేర్పడినక్రమ మగుటంజేసి, యిది ప్రవృత్తిక్రమ మనఁబడుచున్నది.

౨. వాజపేయ మను పేరుగల వికృతియాగమునందు, "సప్తదశ ప్రాజాపత్యా న్పశూ నాలభతే" (తై. బ్రా. ౧–3–౪–3) అను వాక్యమువలనఁ బదునేడు పశువులు ప్రజాపతిదేవతకొఱకు వినియోగింపఁబడవలసినవిగా విధింపఁబడుచున్నవి.

3. ఇతికర్తవ్యతా = ఇత్థంభావః = కథంభావః = అంగములు. 'వైశ్వదేవీం కృత్వా ప్రాజాపత్యై శ్చరన్తి' అను వాక్యమునందలి 'ప్రాజాపత్యైః' అను పదమునం దుండు తృతీయావిభక్తిచే, దానికిఁ బ్రకృతియగు ప్రాజాపత్యశబ్దమున కర్థమైన ప్రాజాపత్యపశువు, లింపలిభావనయందుఁ గరణ మగుటంజేసి, ఫలమును జనింపఁజేయునవి కావలసియున్నవి. అట్టి ఫలమును జనింపఁజేయు సామర్థ్యము, ఆవశ్యకము లగు నంగములతోఁగూడిన ప్రధానములకే యుండును గాని, కేవలము ప్రధానములకు మాత్ర ముండదు. ఇట్లంగములతోఁ గూడిన ప్రధానమే, కరణము కాఁగలుగుటంజేసి, యిందలి ప్రధానము లగు ప్రాజాపత్యపశువులకు, సహానుష్ఠాన మనెడిసాహిత్య మెట్లావశ్యక మైయున్నదో యట్లే, వీని కంగము లగు నుపాకరణము మున్నగు క్రియలకుఁగూడ, నట్టి సాహిత్య మావశ్యక మైయున్నది.

కావున, నా పశువు లన్నిటికిని, దమతమయంగములగు నుపాకరణము,[౧] నియోజనము[౨] మున్నగువానితో సహానుష్ఠానము సంపాదింపవలయును. అట్టి సహానుష్ఠానము, ప్రాజాపత్యపశువు లన్నియు, నా దేవత కుద్దిష్టము లగున ట్లొకటేపర్యాయము వినియోగింపఁబడునపుడే, కుదురుచున్నది. వానియంగములగు నుపాకరణాదు లన్నియు, నొకటేసారి యాచరించుట యశక్యము. అనేకములగు పశువుల కుపాకరణ మొకటేకాలమునఁ జేయుట యశక్యముగదా! కనుక, నుపాకరణాదు లగు నంగముల సహానుష్ఠానము, వానివానినడుమ విశేషవ్యవధానము లేకుండ నాచరించుట చేతనే సంపాదింపఁదగియున్నది. కావున, మొదట నేదే నొకపశువున కుపాకరణము చేసి, పిదప వరుసగా రెండవది, మూఁడవది మున్నగు పశువు లన్నిటికిని నుపాకరణమే చేయవలయును. ఈ వరుసగానే, నియోజనము మున్నగు సంస్కారము లన్నియు నాచరింపవలయును. కాఁగా, నొకసంస్కారమును ప్రాజాపత్యపశువులలో నేదే నొకపశువునుండి యారంభించి, యేదే నొకక్రమమున నన్నిటికిని నాచరించి, రెండవది మున్నగు సంస్కారము లన్నిటిలో నొక్కొకటియు, నదేక్రమమునఁ బశువు లన్నిటికిని జేయవలయును. ఇట్లు చేసినయెడలఁ, బ్రయోగవిధివలనఁ దెలిసికొనఁబడు నంగముల సహానుష్ఠాన మనునది కుదురఁగలదు. మొదటి సంస్కారము నాచరించుట యను ప్రవృత్తి ననుసరించి, రెండవది మున్నగు సంస్కారముల క్రమ మేర్పడుచున్నది గనుక, నిట్లేర్పడిన క్రమము ప్రవృత్తిక్రమ మనఁబడుచున్నది.

ప్రయోగవిధిచే, దైక్షయాగమునందలి[౩] యుపాకరణము, నియోజనము, మున్నగునంగములకు నడుమ వ్యవధానము లేకుండ నాచరింపఁబడుట యనెడి సాహిత్యము విధింపఁబడినది. సవనీయపశుయాగము ప్రాణముతోఁగూడిన ద్రవ్యముగలదగుటంజేసి, దైక్షయాగమునకు వికృతి యగుచున్నది. కనుక, నీ సవనీయపశుయాగమునందు, అట్టి సాహిత్యము చోదక (అతిదేశ) వాక్యముచేఁ బ్రాప్తించుచు

౧. "ప్రజాపతే ర్జాయమానాః," "ఇమం పశుం పశుపతే", (తై. సం. ౩..౧-౪-౧) అను మంత్రములను రెండింటి నుచ్చరించుచు, బర్హిస్సుతోను, జువ్విరెమ్మతోను, బశువును స్పృశించుటమూలముగా, నీ పశువును బ్రజాపతిదేవతకొఱ కుద్దేశింప సంకల్పించుట.

౨. పశువును ద్రాటితో యూపమునకుఁ గట్టుట.

౩. అగ్నీషోమీయపశుయాగము.

న్నది. సవనీయపశుయాగమునకును, 'ఐకాదశినము'లనెడి[1] పదునొకండు పశుయాగములకును, ప్రాణిద్రవ్యములను[2] గలిగియుండుటయే కాక, సుత్యాకాలమున వినియోగింపఁబడుటకూడ, సమానముగా నున్నది. కనుక, సవనీయపశుయాగమునందుఁ బ్రాప్తించిన యంగసాహిత్యము, చోదకవాక్యముచే, 'ఐకాదశినము' లను పదునొకండు పశువులయందుఁగూడఁ బ్రాప్తించుచున్నది. ఈ యైకాదశినము లనెడి పశువులును, ప్రాజాపత్యపశువులును, పశువుల సముదాయ మగుటంజేసి యీ రెండిటికిని, 'గణ[3] మగుట' సమానముగా నున్నది. కనుక, నీ యైకాదశినము లనెడి పశువులయందుండెడు నంగసాహిత్యము, చోదకవాక్యము మూలముగాఁ బ్రాజాపత్యపశువులయందుఁ బ్రాప్తించుచున్నది.[4]

ప్రాజాపత్య పశువులయందుఁగూడ, నొక్కొక్కపశువు[5] నాచరించు యాగము వేఱగుచుండుటంజేసి యీ పదునేడు పశుయాగములకును, జోదకవాక్యములు వేఱువేఱుగానే నుండును. కావునఁ, బ్రతిపశుయాగమునందును, జోదకవాక్యముచేఁ బ్రాప్తించు నంగములైన యుపాకరణము, నియోజనము మున్నగు ధర్మములు కాలాంతర్య మనెడు సాహిత్య ముండునటు లాచరింపఁబడుట యావశ్యక మైయున్నది. కావున, నొక్కొక్కపశువునకుఁ, జోదకవాక్యబలముచే నుపాకరణము చేసిన వెంటనే, నియోజనము చేయవలసియున్నది. అట్లు చేయఁబడుట లేదు. అట్లు చేయఁబడి

౧. i ఆగ్నేయః కృష్ణగ్రీవః, ii సారస్వతీ మేషీ. iii బభ్రుస్సౌమ్యః. iv పౌష్ణః శ్యామః. v శితిపృష్ఠో బార్హస్పత్యః. vi శిల్పో వైశ్వదేవః. vii ఐన్ద్రోఽరుణః. viii మారుతః కల్మాషః. ix ఐన్ద్రాగ్నస్సంహితః. x అధోరామస్సావిత్రః. xi వారుణః పేత్వః. (తై, సం. ౫-౫-౨౨) అనువాక్యములచే విధింపఁబడు పదునొకండు పశువులు, ఐకాదశినము లని చెప్పంబడుచున్నవి.

౨. ప్రాణముగల ద్రవ్యము.

3. గణము = సముదాయము.

౪. ఈవిషయ మంతయు పూ. మీ. అష్టమాధ్యాయమందు వివరింపఁబడియున్నది.

౫. ఈ ప్రాజాపత్యపశువు లొకగణముగా నున్నను, పశు వనెడి ద్రవ్యమునకును, ప్రజాపతి దేవతకును గలసంబంధము, వేఱువేఱుగా నుండుటంబట్టి, మీ. ద. ౨ అధ్యాయమునందు వివరింపఁబడురీతిని నీ పదునేడు పశుయాగములును, ప్రత్యేకయాగము లగుచుండఁగా, వానిలో నొక్కొక్కపశుయాగ మావశ్యకము లగుధర్మముల నపేక్షించుచుండుటంజేసి, యొక్కొక్కయాగమునందు వేఱువేఱు నతిదేశవాక్యములచే ధర్మములు ప్రాప్తించుచున్నవి.

నచో, "సప్తదశ ప్రాజాపత్యాన్ పశూ నాలభతే" అను ప్రత్యక్షవచనమునుండి తెలిసికొనఁబడు, 'పశువు లన్నిటికిని వానివాని యంగములతోఁ గూడిక యను సాహిత్యము' కుదురదుగదా! కావున నొకపశువున కుపాకరణము చేసినతరువాత, నియోజనము చోదకవాక్యముచేఁ గర్తవ్యముగాఁ బ్రాప్తించిన దైనను, జేయఁబడుట లేదు. మఱే మనఁగ, బై నుదాహరింపఁబడిన ప్రత్యక్షవచనముయొక్క సామర్థ్యముచే, మిగిలిన పదునాఱు పశువులకును, నుపాకరణమే చేయఁబడుచున్నది. ఆ పశువు లన్నిటికిని, నుపాకరణము చేయఁగా, మొదటిపశువునకుఁ జేయందగు నియోజనమునకును, దానికిఁ జేయఁబడిన యుపాకరణమునకును, (పదునాఱు క్షణములకంటె) నెక్కుడు వ్యవధాన ముండుటకుఁ బ్రమాణ మేమియు లేదు గనుక, మొదటిపశువునకే నియోజన మాచరింపవలెను.

ఇట్లు చేసినయెడల, నొక్కొకపశువునకే చేయఁబడు నుపాకరణమునకును, నియోజనమునకును, బదునాఱు క్షణములు వ్యవధానము సమానముగా నుండును. అట్లు కాక,-అనఁగా,- ఉపాకరణ మన్నిపశువులకును నాచరించిన క్రమమునే యవలంబింపక, నియోజనము మొదలగు నితరములైన యంగములు మఱియొక పశువునం దారంభింపఁబడి, వేఱువేఱు క్రమముగా నితరములగు పశువులయం దాచరింపఁబడిన యెడలఁ, గొన్ని యంగములకు నడుమ నెక్కువ వ్యవధానమును, గొన్ని యంగములకు నడుమఁ గొంచెము వ్యవధానమును, గొన్నిటికి నడుమ వ్యవధాన మేమియు లేకుండుటయును సంభవించెడిని. అట్లు సంభవించుట యుక్తము కాదు. కావున, మొదటి పదార్థ[1] మే పశువునం దారంభింపఁబడి, యే క్రమమున నితరపశువులయం దాచరింపఁబడినదో, రెండవ పదార్థముకూడ నట్లే యాచరింపఁబడవలయును. కాఁగాఁ బ్రథమపదార్థము నాచరించిన క్రమమునుబట్టి, రెండవపదార్థము నాచరించుటకై యేర్పడుక్రమము ప్రవృత్తిక్రమ మనఁబడుచున్నది. ఇట్లాఱువిధములగు క్రమములను వివరించుటమూలమునఁ, బ్రయోగవిధి యనెడు విధించు వ్యాపారము సంగ్రహముగా నిరూపింపఁబడినది.

# అధికారవిధి[2]

కర్మజన్యఫలస్వామ్యమును బోధించువిధి, యధికారవిధి. అనఁగాఁ, గర్మమునుండి జనించుఫలము ననుభవింపఁదగి యుండుటను దెలియఁజేయు విధి యని యర్థము.

౧. పదార్థము = అంగము = ధర్మము = క్రియ.

౨. అధికారము = కర్మమువలన జనించుఫలము ననుభవించుట. ఇట్టి యధికారము గలవాఁడే యధికారి. ఇట్టి యధికారమును దెలియఁజేయువిధి, యధికారవిధి.

అది, "యజేత స్వర్గకామః"[౧] అనురీతిగా నుండువిధి. స్వర్గము నుద్దేశించి, యాగమును విధించు నీవిధిచే,[౨] "స్వర్గమును గోరువానికి, యాగమువలన జనించు ఫలానుభవ ముండును" అని తెలియఁజేయఁబడుచున్నది. తన గృహము[3] దహింపఁబడుట యను నిమిత్తము కలుగునపుడు, ఏకకర్మమును విధించు "యస్యాహితాగ్నే[౪] రగ్నిర్గృహాన్ దహేత్ సోఽగ్నయే క్షామవతే పురోడాశ మష్టాకపాలం నిర్వపేత్" అను నిట్టి వాక్యములచే నన్ననో, యట్టినిమిత్తము ఘటిల్లినవాఁ డాకర్మను నాచరించుటమూలముగా, దానినుండి జనించు పాపక్షయ మనెడు ఫలము నొందఁగలఁ డని తెలియు చున్నది.

అధికారి[౫] కుండవలసినదిగాఁ జెప్పఁబడిన విశేషములు గలవానికే, యట్టి ఫలానుభవము కలుగును. కర్మము నాచరించు పురుషునికిఁ జెప్పఁబడిన విశేషణమే

౧. స్వర్గమును గోరువాఁడు, యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.

౨. షష్ఠాద్యాధికరణన్యాయముచే, స్వర్గము భావ్యముగా నన్వయింపఁగా, భావార్థాధికరణ న్యాయమువలన, ధాత్వర్థమగు యాగము కరణముగా నన్వయించుట, యుక్త మగుచున్నది. కావున, నీ వాక్యము, యాగమును గరణముగా విధించుచున్నది

3 నిత్యకర్మములవలనను, నైమిత్తికకర్మములవలనను, ఫల మేమియు జనింపకుండుటంజేసి, వాని విషయమై, ఫలము ననుభవించుట యనెడి యధికార ముండదు. ఐనను, విశ్వజిన్న్యాయముచే, స్వర్గ మనుఫలము గాని, రాత్రిసత్రన్యాయముచే, "ధర్మేణ పాప మపనుదతి" ( = ధర్మము నాచరించుటచేఁ బాపమును నశింపఁజేయవలయును.) అను వాక్యశేషమువలనఁ దెలిసికొనఁబడు పాపక్షయ మను ఫలము గాని, కల్పింపఁబడనేరదు. నిమిత్తము, ఫలము, నను నీ రెండును నొకటేవాక్యమున నుద్దేశ్య ముగా నంగీకరింపఁబడినయెడల, నపుడు, "నిమిత్తఫలసంబంధ ఏకవాక్యేన యుజ్యతే, ఉద్దేశ్య ద్వయసంబంధే వాక్యభేదః ప్రసజ్యతే" అను వార్తికముచేఁ జెప్పఁబడుటవలన, వాక్యభేదము సంభవించెడినిగదా! అనుశంక రావచ్చు నని యూహించి, దాని కిది సమాధానముగాఁ జెప్పఁబడు చున్నది.

౪. (తై. సం. ౨-౨-౨) ఏ యాహితాగ్నియొక్క గృహముల నగ్ని దహించునో యతఁడు, కృశించిన యగ్నికొఱకు, ఎనిమిది కపాలములయందు సంస్కరింపఁబడిన పురోడాశమును నిర్వపించుటచే నిష్టము నుత్పాదింపవలయును - అని పై వాక్యమున కర్థము.

౫. కర్మమునుండి జనించుఫలము ననుభవించుటయే, యధికార మనుచున్నది గనుకను, బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులు నాలుగుజాతులవారును, నట్టి ఫలము ననుభవింపఁగలరు గనుకను, బృహస్పతి సవ మాచరించుటకు క్షత్రియవైశ్యులకును, రాజసూయ మాచరించుటకు బ్రాహ్మణవైశ్యులకును, వైశ్య స్తోమము నాచరించుటకు బ్రాహ్మణక్షత్రియులకును, నధికారము సిద్ధింపవలసివచ్చును - అనుశంక మనసున నూహించి యిట్లు నివారింపఁబడుచున్నది.

యధికారివిశేషణ[1] మగుచున్నది. కావుననే, స్వారాజ్య మనెడిఫలము నుద్దేశించి, రాజసూయ మనెడి యాగమును విధించు "రాజా[2] రాజసూయేన స్వారాజ్యకామో యజేత" అను వాక్యముచేఁగూడ, స్వారాజ్య మనుఫలమును గోరువానికి మాత్రమే, యట్టి ఫలానుభవము కలుగు నని తెలియఁజేయఁబడుటలేదు. మ త్తే మన, క్షత్రియజాతియందు జన్మించినవాఁడుగా నుండి, యా ఫలమును గోరువానికే యా ఫలానుభవ ముండు నని, తెలియఁజేయఁబడుచున్నది. కావున నీ రాజసూయము నాచరించుటకు బ్రాహ్మణవైశ్యులకును, నిట్లే బృహస్పతిసవము నాచరించుటకు క్షత్రియవైశ్యులకును, వైశ్యస్తోమ మనుయాగము నాచరించుటకు బ్రాహ్మణ క్షత్రియులకును, నధికారము సిద్ధింపనేర దని స్పష్టపడుచున్నది.

కర్మమును బోధించు విధివాక్యమునందుఁ, బురుషవిశేషణముగా వినఁబడనిది కూడ నధికారివిశేషణము కాఁగలదు. ఉదా:— (i) 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను నధ్యయనమును విధించు వాక్యముచేఁ దెలిసికొనఁబడిన 'వేదార్థమును లెస్సగాఁ దెలిసికొనుట', (ii) త్రేతాగ్నులచే నాచరింపఁబడు నిష్టులు, యాగములు, మున్నగు కర్మములను జేయుటకై, మొదట నగ్న్యాధానమును జేయుటమూలముగాఁ ద్రేతాగ్నులను గలిగియుండుట, (iii) కర్మముల నాచరించుటకుఁ దగిన దేహదార్ఢ్యము కలిగియుండుట. ఈమూఁడును గర్మమును బోధించు విధివాక్యమునందు వినఁబడకున్నను, నధికారివిశేషణము లగుచునేయున్నవి. ఆధానమునకుఁ[3] బిదప నాచరింపఁబడు, నిష్టులు యాగములు మున్నగు క్రతువులను విధించువాక్యములు, తమచే విధింపఁబడుకర్మముల నాచరింప నధికారి యగువాని, కా కర్మములను బోధించు వేదవాక్యముల యర్థమును దెలిసికొనుట యుండియుండు నని, యాక్షేపప్రమాణము మూలఁ

౧. అధికారి కుండవలసినదిగా విధింపఁబడిన విశేషణము.

౨. క్షత్రియుఁడై యుండి, స్వారాజ్య మనుఫలమును గోరువాఁడు, రాజసూయ మను యాగము నాచరించుటమూలమున, నిష్టము నుత్పాదించుకొనవలయును, - అని యర్థము.

3. కర్మమును విధించువాక్యమునందుఁ, బురుషవిశేషణములుగా వినఁబడు గుణము, లాపురుషున కా కర్మము నాచరించుట కధికారము సిద్ధింపఁజేయఁగలుగుటంజేసి, 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అను వాక్యమునందుఁ బురుషవిశేషణముగా వినఁబడు 'స్వర్గమును గోరుట' యనునది, యితర వర్ణములకువలె, శూద్రునకుఁగూడ నుండవచ్చును గనుక, శూద్రునకుఁగూడ నా యాగము నాచరించుట కధికారము సిద్ధింపవలసివచ్చును - అను శంక మనసున నూహింపఁబడి, యిట్లు నివారింపఁబడుచున్నది.

మున సూచింప సమర్థములు కాకుండుటచేతను, నట్టిసామర్థ్యము నా విధులకుఁ గల్పించుట మిగులఁ గ్లేశకర మగుటవలనను, నధ్యయనవిధివలన సిద్ధించిన వేదార్థజ్ఞానము కలవాఁడే, యా కర్మముల నాచరింపఁదగు నని యవి (క్రతువులను విధించువాక్యములు) తెలియఁజేయు చున్నవిగదా! ఇట్లే త్రేతాగ్నులచే నాచరింపఁబడు కర్మములకు నా యగ్ను లావశ్యకము గనుక, నా కర్మములను విధించువాక్యములు, అగ్న్యాధానము నాచరించుటమూలమున సిద్ధించిన త్రేతాగ్నులు గలవాఁడే, యా కర్మముల నాచరించు నధికారి కాఁగలఁ డని, తెలియఁ జేయుచున్నవిగదా! కావుననే, శూద్రున, కధ్యయన విధిచే సిద్ధించు వేదార్థజ్ఞానమును,ఆధానముచే సిద్ధించు త్రేతాగ్నులును, లేకుండుటం జేసి, యతనికి యాగము నాచరించుట కధికారము సిద్ధింపనేరదు. 'అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత, త మధ్యాపయీత' ఈ మున్నగువాక్యముల వలన,[౧] 'ఉపనీతు'నకే[౨] యధ్యయనము చేయునధికార ముండు ననియు, నట్టియుపనయనము త్రైవర్ణికులకు[౩] మాత్రమే చేయందగు ననియును, దెలియుచున్నదిగదా! ఇట్లే "వసంతే బ్రాహ్మణోఽగ్నీ నాదధీత" అను నీ మున్నగు[౪] వాక్యములవలన, నాధానమును జేయునధికారము త్రైవర్ణికులకుమాత్రమే యుండనగు నని తెలియుచున్నదిగదా! ఆలోచింపఁగా, 'వర్షాసు రథకారోఽగ్నీ నాదధీత'[౫] అను విధి వాక్యముచే, యోగముకంటెఁ[౬] రూఢి బలవత్తర మగుటంజేసి, 'సౌధన్వాఁ' డను

౧. "ఏకాదశవర్షం రాజన్య ముపనయీత, ద్వాదశవర్షం వైశ్యం" అను వాక్యములు.

౨. ఉపనయనము చేయఁబడినవాఁడు.

౩. త్రైవర్ణికులు = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యు లను మూఁడు జాతులవారు.

౪. 'గ్రీష్మే రాజన్యః, శరది వైశ్యః' అనునవి. (తై. బ్రా. ౧-౧-౨)

౫. రథకారుఁడు వర్షాకాలమునం దగ్న్యాధానము చేయవలసినది.

౬. "యే త్రయాణాం వర్ణానా మేతత్కర్మ కుర్వన్తి, తేషా మేష కాలః" (ఆప. శ్రౌ. సూ. ౫-౩ ౨౧౯) అనుసూత్రమునందుఁ, దైవర్ణికులలో రథమును జేయువాఁ డాధానమును జేయుటకై, వర్షాకాలము యుక్తకాల మని చెప్పఁబడుచున్నది గనుక, నీ విధివాక్యమందలి రథకారపదమునకు, 'రథమును జేయువాఁడు' అను యౌగికార్థ మంగీకరింపఁబడినట్లు తెలియుచున్నది. ఇట్లయినను, యౌగికార్థముకంటెఁ, 'రథకారు లనుపేరుగల యొకశూద్రజాతి' అను రూఢ్యర్థమే బలవత్తర మైన దని, శంకకుని తాత్పర్యము. "క్షత్రియునకు వైశ్యస్త్రీయందు జన్మించినవాఁడు, మాహిష్యుఁడు. వైశ్యునకు శూద్రస్త్రీయందు జన్మించినయామె, 'కరణి'. మాహిష్యునకుఁ గరణియందు జన్మించినవాఁడు, రథకారుఁ డనఁబడును." "రథకారస్తు మాహిష్యాత్కరణ్యాం యస్య సంభవః." అని అమరకోశము.

నామాంతరముగల, రథకారు లనెడుశూద్రకులమునందుఁ బుట్టినవానిచే, నాధానము వర్షాకాలమునం దాచరింపఁబడవలసినదిగా విధింపఁబడుచున్నది. అయినను[౧] నీ శూద్రున కధ్యయనవిధిచే సిద్ధించు వేదార్థజ్ఞానము లేకుండుటంజేసి, యితనికి, నాధానమునకుఁ బిదప నాచరింపందగు క్రతువులను జేయు నధికారము సిద్ధింపనేరదు.

“అధ్యయనవిధిచే సిద్ధించు జ్ఞానముమూలముగానే, యాధాన మాచరింపఁబడ వలసి యుండఁగా, నీ రథకారున కట్టిజ్ఞానము లేనపు, డాధానమును జేయునధికార మెట్లు సిద్ధింపఁగలదు”? అని శంకింపవలదు. వాని కట్టి జ్ఞానము లేకున్నను, ‘వర్షాసు రథకారోఽగ్నీ నాదధీత’ అను విధివలననే, ఆధానమునకుమాత్ర మావశ్యక మగుజ్ఞానము రథకారున కుండు నని యాక్షేప ప్రమాణముమూలముగాఁ దెలియఁజేయఁబడుచున్నదిగదా! అట్లు కానియెడల,—అట్లు తెలియంజేయఁబడని పక్షమున—నీ విధియే కుదరకపోవలసివచ్చును.[3] కావున, రథకారున కిట్లు ఆధానమునుమాత్రము చేయునధికారము సిద్ధించినను, నధ్యయనవిధిచే సిద్ధించు వేదార్థజ్ఞానమంతయు లేకుండుటంజేసి, దీని కనంతర మాచరింపందగు దర్శపూర్ణమాసేష్టులు, జ్యోతిష్టోమము, మున్నగు క్రతువుల నాచరించు నధికారము సిద్ధింపనేరదు.

కావున,[౪] నీ రథకారునిచేఁ జేయఁబడు నాధానమువలన, సంస్కరింపఁదగిన యగ్నులు, ముం దేక్రతువునందును వినియోగింప నేరకుండుటంచేసి, వీనిచేఁ జేయఁబడునాధానము, అగ్నులను సంస్కరించుటకొఱకుఁ గానేరదు. మఱేమన, నిది, లౌకికాగ్ని[౫] గుణముగాఁగలదియు, విశ్వజిన్న్యాయముచే స్వర్గ మనెడు ఫలమును జనింపఁజేయునదియు, స్వతంత్ర మగునదియు, నగునొక ప్రధానకర్మముగా విధింపఁ

౧. “రథకారపదమునకు రూఢ్యర్థ మంగీకరించుటచే, శూద్రునకొకవేళ నాధానమును జేయు నధికారము సిద్ధించినను”, అని భావము.

౨. ఆక్షేపప్రమాణము = అర్థాపత్తిప్రమాణము. ఇది పూర్వము విచారింపఁబడినది.

3. = సార్థకము కాకపోవలసివచ్చును = వ్యర్థము కావలసివచ్చు నని తాత్పర్యము.

౪. “రథకారునకు ఆధాన మైనపిదప నాచరింపందగు క్రతువుల నాచరించు నధికారము లేని పక్షమున, నితనిచేఁ జేయఁబడిన యాధానమువలన సంస్కరింపఁబడు త్రేతాగ్నులకుఁ, బ్రయోజన మేమియు నుండదు గనుక, నితనిచేఁ జేయఁబడినయాధానము వ్యర్థ మయ్యెడిని” అను శంక మనమున నూహింపఁబడి, యిట్లు నివారింపఁబడుచున్నది.

౫. లౌకికాగ్ని = వైదికాగ్నివలెఁ గాక, లోకములయందుఁ దెలిసికొనఁబడిన సాధనములచే జనింపఁజేయఁబడు నగ్ని.

బడుచున్నది. "సక్తూన్ జుహోతి" అను విధివాక్యమందలి 'సక్తు' పదమున కర్థమగు పిండి, యందలి హోమమునకు సాధన మగుటంజేసి, 'సక్తూన్' అను పదమందలి ద్వితీయావిభక్తికిఁ, దృతీయావిభక్తి కర్థమగు కరణమే యర్థ మని యంగీకరించి, యీ వాక్యమునకు, 'పిండితో హోమము నాచరించుటచే, నిష్టము నుత్పాదించుకొనవలయును' అనునర్థ మెట్లు వర్ణింపఁబడినదో, యట్లే, యిచటఁగూడ, "రథకారోఽగ్నీ నాదధీత" అను విధియందలి 'అగ్నీన్' అనుపదమునందుండు ద్వితీయావిభక్తికిఁ, దృతీయావిభక్తి కర్థమగు కరణమే యర్థ మగు నని, యంగీకరించుటమూలముగా, నీవిధి, అగ్నులు గుణముగాఁగల యొకప్రధానకర్మమును విధించుచున్న దని, తెలియుచున్నది.

ప్రస్తుతము ననుసరింతము. ఇట్లు శూద్రున కధ్యయనవిధివలన సిద్ధించు వేదార్థజ్ఞానమును, ఆధానముచే సిద్ధించు నగ్నులును, లేకుండుటంజేసి, వీని కాధార మైన పిదప నాచరింపఁదగు క్రతువుల నాచరించునధికారము కలుగనేర దని యేర్పడుచున్నది.

ఓయీ! ఇట్లయినచో, స్త్రీకిఁ గ్రతువుల నాచరించునధికారము లేకపోవలసివచ్చును. ఆమెకు, "న స్త్రీశూద్రౌ వేద మధీయీయాతామ్"[౧] అను శ్రుతిచేతను, "స్త్రీశూద్ర ద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా" అను స్మృతిచేతను, అధ్యయనము నిషేధింపంబడుటంజేసి, యధ్యయనముచే సిద్ధించు వేదార్థజ్ఞానము కలుగనేరదుగదా! స్త్రీకి యాగముల నాచరించునధికారము లేనేలేదే యని చెప్పవలదు. "యజేత స్వర్గకామః" ఈమున్నగు వాక్యములందలి 'స్వర్గకామః' అనుపదము, యాగ మెవనిచేఁ జేయఁబడఁదగినదిగా విధింపఁబడుచున్నదో, యట్టి యుద్దేశ్య మగువానిని బోధించుటంజేసియు, నా పదమునందలి పుంలింగ ముద్దేశ్యమునకు విశేషణమగుటచే, "గ్రహం సమ్మార్ష్టి"[3] అను విధియందు విధింపఁబడు సమ్మార్జనమున

౧. స్త్రీలును, శూద్రులును వేదమును జదువరాదు.

౨. స్త్రీలచేతను, శూద్రులచేతను, బ్రహ్మబంధువులచేతను, వేదములు మూఁడును వినఁబడరాదు. బ్రహ్మబంధు వనఁగా, బ్రాహ్మణులకు విధింపఁబడిన కర్మముల నాచరింపనివాఁడై, శిష్టులగు బ్రాహ్మణులకు బంధు వగుటమాత్రముచే బ్రాహ్మణుఁ డని వాడఁబడువాఁడు.

3. గ్రహము లన్నిటికిని సమ్మార్జన మాచరింపవలయును, అని యర్థము. ఇచట నుద్దేశ్యమగు గ్రహమునకు విశేషణమైన యేకత్వము వివక్షింపఁబడకపోవుటచే, నీవాక్యమువలన 'అన్నిగ్రహములకును సమ్మార్జన మాచరింపవలయు' నను నర్థ మేర్పడుచున్నది.

కుద్దేశ్యమగు, గ్రహామునకు విశేషణమైన యేకత్వమువలె, వివక్షింపఁబడకపోవుటం జేసియు, స్త్రీకిఁగూడ యాగముల నాచరించునధికారము కలుగవచ్చు నని (మీ. ద. ౬ అధ్యాయమందు) సాధింపఁబడినదిగదా! ఇట్లు 'ఓయీ' అనునది మొదలుకొని చేయఁబడినశంక కీ క్రిందిది సమాధానము: శంకకుఁడు చెప్పినమాట నిజమే. స్త్రీలకుఁ గ్రతువుల నాచరించు నధికారముమాత్రము సాధింపఁబడినది. కాని స్వతంత్రముగా నట్టి యధికారము కలుగనేరదు. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అను నీమున్నగు[1] వాక్యములచే, స్త్రీల కట్టి స్వాతంత్ర్యము నిషేధింపఁబడుచున్నదిగదా! మఱియు, స్త్రీలకు స్వతంత్రముగానే కర్తృత్వ ముండినపక్షమునఁ, బురుషుఁడు చేయు ప్రయోగమునందును, స్త్రీ చేయుప్రయోగమునందునుగూడ, లోపము సంభవించెడినిగదా! అది యెట్లంటేని, యజమానుఁడుమాత్రమే చేయుప్రయోగమునందుఁ బత్ని లేకుండును[2] గనుకఁ, బత్నియే చేయందగిన "పత్న్యవేక్షిత మాజ్యం భవతి"[3] అను నీమున్నగువాక్యములచే విధింపఁబడినయాజ్యావేక్షణము మొదలయిన[4] క్రియలు లోపించుటయును, బత్నిమాత్రమేస్వతంత్రముగాఁ జేయుప్రయోగమునందుయజమానుఁడు లేకుండును గనుక, యజమానుఁడే చేయందగు నాజ్యావేక్షణము మున్నగుక్రియలు లోపించుటయును గలిగెడిని. కావున, దంపతుల కుభయులకును, గలసియే యాగముల నాచరిం

౧. (i) "పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే, పుత్రస్తు స్థావిరే భావే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి (మను. ౯-3) (ii) రక్షేత్కన్యాం పితా, విన్నాం పతిః, పుత్రాశ్చ వార్ధకే, అభావే జ్ఞాతయస్తేషాం న స్వాతంత్ర్యం క్వచిత్ స్త్రియః. (యాజ్ఞ ౧-౮౫) విన్నాం = వివాహమాడఁబడిన స్త్రీ. (iii) బాలయా వా యువత్యా వా వృద్ధయా వాపి యోషితా, న స్వాతంత్ర్యేణ కర్తవ్యం కార్యం కించిత్ గృహేష్వపి" iv "బాల్యే పితుర్వశే తిష్ఠేత్ పాణిగ్రాహస్య యౌవనే, పుత్రాణాం భర్తరి ప్రేతే న భజేత స్వతంత్రతామ్".

౨. ధనముచేఁ గొని తీసికొనిరాఁబడిన పత్నిచేఁ గాని, యజమానునిచేఁ గాని, యీ క్రియలను జేయింపరాదు. ధనముచేఁ గొనఁబడినస్త్రీకిఁ బత్నీత్వము కాని, యట్టి పురుషునికి యజమానత్వముగాని, సిద్ధింపనేరదుగదా! ధనముచేఁ గొనఁబడిన పురుషునకుఁ, గర్మమువలన జనించు ఫలము ననుభవించు యోగ్యత యుండ దని యాఱవయధ్యాయమునందు నిరూపింపఁబడినదిగదా! "క్రయక్రీతా తు యా నారీ న సా పత్న్యభిధీయతే, న సా దైవే న సా పిత్ర్యే దాసీం తాం కవయో విదుః" ఈ మున్నగు వాక్యములచే, ధనముచేఁ గొనఁబడినస్త్రీకిఁ బత్నీత్వము నిషేధింపఁబడుచున్నదిగదా!

3. హోమమున కుద్దిష్టమగు నాజ్యము, పత్నిచేఁ జూడఁబడవలసినది.

౪. అన్వారంభణము మొదలగు క్రియలు.

చుట కధికారము గలదు. అట్టియధికార ముండుటచే, యజమానుని కున్న వేదార్థ జ్ఞానమువలననే, పత్నికిఁగూడ నా కర్మమునుండి జనించుఫలము లభింపఁగలదు గనుక, నామె కధ్యయనవిధిచేఁ గలుగు వేదార్థజ్ఞానము లేనిదే, యాగముల నాచరించు నధికారము సిద్ధింపనేర దని, చెప్పుట సరికాదు, ఇంతేకాక, నిషాదస్థపతి, కధ్యయన విధిచే సిద్ధించు వేదార్థజ్ఞానము లేకున్నను, "రౌద్రం వాస్తుమయం చరుం నిర్వపేత్" అనువాక్యముచే[3] నొకయిష్టిని విధించినతరువాత విన఼బడు "ఏతయా[4] నిషాదస్థపతిం యాజయేత్" అను వాక్యముయొక్క సామర్థ్యమువలన, నతని కాయిష్టిని జేయునధికారము గల దని యె ట్లంగీకరింపఁబడుచున్నదో యట్లే, "పాణిగ్రహణాత్తు" సహ

౧. స్త్రీల కధ్యయనము నిషేధింపఁబడుటచే, దానిచే సిద్ధించు వేదార్థజ్ఞానము కలుగనేరదు గనుక, "న హ్యవిద్వాన్ విహితోఽస్తి" (జై. సూ. 3-౮-౧౫, వేదమును జదువుటవలనను ముగా, దానియర్థమును దెలిసికొనినవాఁడు, యాగము నాచరించుట కధికారి యగు యజమానుఁడు కానేరఁడు) అను న్యాయమువలన, వేదార్థజ్ఞానము లేని స్త్రీ కట్టి యధికారము నిషేధింపఁబడుటంజేసి, యట్టి యధికారము లేకుండుట యట్లే యున్న దని, శంక మనసున నూహింపఁబడి, యిట్లు నివారింపఁబడుచున్నది.

౨. స్త్రీల కధికారము లేనిపక్షమున, వారే చేయవలసిన యాజ్యావేక్షణము మున్నగు క్రియలు, జరుగకపోవుటయు, దానిమూలముగా, యజమానుఁడు చేయు ప్రయోగమునందు లోపము కలుగుటయును సంభవించుటంజేసి, స్త్రీల కట్టి యాజ్యావేక్షణము మున్నగు క్రియలనుమాత్ర మాచరించు నధికారము కల్పింప శక్యమైనను గర్మము లన్నిటియందును నట్టి యధికారము కల్పించుటకుఁ బ్రమాణము లేదే యని శంక మనసున నుంచుకొని యిట్లు నివారింపఁబడుచున్నది.

3. = మై. సం. ౨-౨-౪ వాస్తుశాకముచే వండఁబడు నన్నమును రుద్రదేవతకొఱకు వేలుపఁజేయుటమూలముగా, నిష్టము నుత్పాదించుకొనవలయును. ఇచట "వాస్తుమధ్యే రౌద్రం చరుం నిర్వపేత్ యత్ర రుద్రః ప్రజాశ్శమయేత్" అనుపాఠము భాష్యమునం దంగీకరింపఁబడినది. వాస్తుమధ్యే = గృహముయొక్క మధ్యను— అని యర్థము.

౪. నిషాదస్థపతిచే నీయిష్టి నాచరింపఁజేయవలయు నని యర్థము.

౫. (ఆప. ధ. సూ. ౨-౧౪-౧౬-౧౫) వివాహ మయినది మొదలు, స్త్రీల, కాజ్యావేక్షణము మున్నగు క్రియలయందుమాత్రమే కాక, పుణ్యము ఫలముగాఁగల యన్ని ప్రధానకర్మములందును నన్నియంగములందునుగూడ, సహాధికారము గలదు. ఇట్లే స్త్రీలకు శ్రౌతకర్మములందును, నుపనయనాదిస్మార్తకర్మములందును, సహాధికారము గలదు గాని, సంధ్యావందనము, జపము మున్నగు పురుషుని చేతనే చేయఁబడఁదగు కర్మములం దట్టియధికారము లేదు. ఇట్లే స్త్రీలుమాత్రము చేయు, సావిత్రీ వ్రతము మొదలగు కర్మములందుఁ, బురుషుని కధికారము లేదు. ఇష్టాపూర్తములు మున్నగు కర్మములం దన్నిటను, దంపతులకు సహాధికారము కలదు. ఇష్టాపూర్తములు = ఇష్టములు పూర్తములు అనునవి. ఇష్టములు :— స్నానము, సంధ్య, జపము, హోమము, వేదాధ్యయనము, పితృతర్పణము, అతిథిసత్కారము, వైశ్వదేవము అనునవి. పూర్తములు :— దిగుడుబావులు, నూతులు, తటాకములు మున్నగు వానిని త్రవ్వించుట, దేవాలయములను గట్టించుట, అన్నదానము చేయుట, తోఁటలు వేయుట అనునవి.

త్వం కర్మసు తథా పుణ్యఫలేషు." అను వచనముయొక్క సామర్థ్యమువలన, స్త్రీకి యాగములను జేయునధికారము కల దని నిర్ణయింపఁబడినదిగదా!

'నిషాద[౧] స్థపతి'[౨] అనుశబ్దము, 'నిషాదుఁ డైనస్థపతి' అను సామానాధికరణ్యముతోఁ గూడిన కర్మధారయసమాస మని యంగీకరించుటచే, దీనికి నిషాదు లనెడి జాతివారిలోఁ బుట్టి, వారి కధికారి యైయున్నవాఁడు - అనునర్థ మేర్పడుచున్నది. కాని, 'నిషాదులకు స్థపతి' అని షష్ఠీతత్పురుషసమాస మంగీకరింపవలదు. అట్లంగీకరించినయెడలఁ, బదములు కర్థము లగునవి యభిన్నములుగానే యన్వయింపవలసియుండుటంజేసి, నిషాదపదమున కర్థము, స్థపతిపదమున కర్థమగు 'అధిపతి' యను దానితో, నభిన్నముగా నన్వయించుటకై, నిషాదపదమునకు, 'నిషాదులకు సంబంధించువాఁడు' అనునర్థము చెప్పవలసియున్నది. కనుక, నట్టి యర్థమును జెప్పుటకై లక్షణ[3] నంగీకరింపవలసియుండును.

కాని యీ రెండువిషయములకును నీక్రిందిభేదము[౪] గలదు. నిషాదున కధ్యయనవిధిచే సిద్ధించుజ్ఞానము లేకుండుటంజేసి, నిషాదేష్టిని విధించు విధివాక్యమువలననే, యాయిష్టి కావశ్యకమగు జ్ఞానముమాత్ర మతని కుండు నని, యాక్షేపప్రమాణమూలముగాఁ దెలిసికొనంబడఁగలదు. పత్ని కన్ననో, యధ్యయనవిధిచే సిద్ధిం

౧. "చండాలప్లవమాతంగ దివాకీర్తిజనంగమాః, నిషాదశ్వపచా వంతేవాసి చాండాలపుల్కసాః." అను నమరశ్లోకమువలన, నిషాదశబ్దమునకు 'మాలవాఁడు' అని యర్థము తెలియుచున్నది. "నిషాదు లనఁగా, బ్రాహ్మణునివలన శూద్రస్త్రీయందుఁ బుట్టి శూద్రుఁడు చేయు పనులయందు నియుక్తు లయిన యొకజాతివారు" అని కొందఱు మీమాంసకులు చెప్పుదురు.

౨. స్థపతి = శిల్పి, 'బృహస్పతియాగమును జేసినవాఁడు' అని యమరము. ఇచట స్థపతిశబ్దమునకు 'అధిపతి' యర్థ మని, మీమాంసకుల సిద్ధాంతము.

3. ఆలోచింపఁగా, నిచటఁ గర్మధారయసమాసము నంగీకరించుపక్షమునందు, నిషాదున కీయిష్టి కావశ్యకమగు జ్ఞాన ముండు నని తెలియఁజేయుశక్తి, నీ వాక్యమునకుఁ గల్పించుట యను క్లేశము గలదు. అయినను, దానివలన సిద్ధించుఫలమునుబట్టి, యీక్లేశము దోషావహము కానేర దని గ్రహించునది. ఈవిషయము "ఫలముఖగౌరవస్యాదోషత్వాత్" అను న్యాయమువలన నేర్పడుచున్నది.

౪. నిషాదేష్టిని విధించువాక్యమువలన, దానికిమాత్ర మావశ్యకమగు జ్ఞాన మితని కుండు నని, యాక్షేపమూలముగాఁ దెలియఁజేయఁబడుచుండుటంజేసి, యతని కాయిష్టిని జేయునధికార మెట్లంగీకరింపఁబడుచున్నదో యట్లే, స్త్రీకిఁగూడ నట్టిజ్ఞాన ముండు నని, యాక్షేపప్రమాణమూలముగాఁ దెలియుటంజేసి, స్త్రీ కట్టిజ్ఞానము లభించుటకొఱకు, కధ్యయన మేల యంగీకరింపఁగూడదు? అనుశంక మనసున నూహింపఁబడి, యిట్లు నివారింపఁబడుచున్నది.

చు జ్ఞానము లేకున్నను, యజమానునితో సహాధికార ముండుటంజేసియు, యజమానుని కట్టియధ్యయనవిధిచే సిద్ధించుజ్ఞాన ముండుటంజేసియు, నా జ్ఞానముచేతనే యీ మెఱుఁగూడ యజమానుఁ డాచరించు కర్మమువలన జనించు ఫలము లభింపఁగలుగుటం జేసియు, ముం దాచరింపఁబోవు క్రతువులను విధించు విధివాక్యములకుఁ, బత్ని కట్టి జ్ఞాన ముండు నని యాక్షేపప్రమాణముమూలముగాఁ దెలియంజేయు శక్తిని గల్పించుట యుక్తము కాదు. కావున, యజమానుఁడే చేయఁదగు క్రియ లుండుస్థలములందు, అతనిజ్ఞానముచేతనే యా క్రియలవలన జనించుఫల ముభయులకును లభించినను, యజమానుఁడు చేయఁదగనివై, పత్నియే చేయందగు నాజ్యావేక్షణము మున్నగు క్రియలు, పత్ని కట్టి జ్ఞానము లేనిచో చేయుట కశక్యము లగుటంజేసి, యా క్రియలను విధించు విధివాక్యములు, పత్ని కట్టి జ్ఞాన ముండు నని యాక్షేపప్రమాణముమూలమునఁ దెలియఁజేయఁగలుగున ట్లంగీకరింపఁబడుచున్నవి. [1]ఇ ట్లధ్యయనవిధిచే సిద్ధించు వేదార్థజ్ఞానమును, నాధానముచే సిద్ధించు త్రేతాగ్నులను గలిగియుండుటయును, ముందు జరుపఁదగిన కర్మముల నాచరించునధికారి కావశ్యకములగు విశేషణము లగుచున్న వని సిద్ధించుచున్నది.

ఇట్లే సామర్థ్యముకూడ నధికారికి విశేషణ మగుచున్నది. 'కర్మముల నాచరింపవలయునను భావనను బోధించు నాఖ్యాతమునకుఁ, బాగుగ నుండవలసిన దేహదార్థ్యము సహాయపడును' అనున్యాయమువలన, దేహదార్ఢ్య మనెడి సామర్థ్యము లేనివాఁడు, [2]కర్మముల నాచరింపఁదగఁ డని విధివాక్యము బోధించుచున్నదిగదా!

అట్టిసామర్థ్యము, జ్యోతిష్టోమము మున్నగు కామ్యకర్మములయందలి యంగములను, ప్రధానములనుగూడ నాచరించుట కావశ్యకము.

కామ్యకర్మములయందలియంగముల, నాచరింప సమర్థుఁడు కానేరక, యందలి ప్రధానములనుమాత్ర మాచరింప సమర్థుఁ డగువాఁడు, కామ్యకర్మముల నాచరింప నధికారి కానేరఁడు. అంగములను బోధించువిధులతో, నేకాన్వయమును బొందు

౧. ఇట్లనుటవలనముగా, యజమానుఁ డధ్యయన మైనసిదప, నాచరింపఁబోవు క్రతువులను విధించు విధివాక్యము లన్నిటికిని, నాయా క్రతువుల కావశ్యకమగు వేదార్థజ్ఞాన మంతయుఁ బత్నికుండు నని యాక్షేపముమూలమునఁ దెలియఁజేయుశక్తిని గల్పించుట, యనుచితము కాదని తాత్పర్యము.

౨. కావుననే. సామర్థ్యము లేకుండుటంజేసి, జంతువులును, శరీరము లేకుండుటంజేసి దేవతలును, గర్మముల నాచరించుట కధికారులు కానేర రని తెలియుచున్నది.

ప్రధానయాగమును విధించువిధి, అంగములతోఁ గూడిన ప్రధానకర్మము నాచరింప సమర్థత గలవాఁడే, యట్టికర్మము నాచరింపవలయు నని బోధించుచున్నది. ఫలము నపేక్షించువాఁ డెట్టికర్మ, మా ఫలమును సిద్ధింపఁజేయుటకు వినియోగించునో, యట్టి కర్మము[1] నాచరించుట, కధికారిగా నుండవలయును గదా! కామ్యకర్మమును బోధించువిధి, సమర్థుఁ డైనవాఁడే యట్టికర్మమునందుఁ బ్రవర్తింపవలయు నని బోధించునపు, డేదే నొకశ్రుతికి విరోధము సంభవించుపక్షమున నసమర్థుఁడుకూడ నట్టికర్మము నాచరించుట కధికారి కావచ్చును. అట్టి విరోధ మేమియు లేదు. "యజేత స్వర్గకామః" అను శ్రుతి, సమర్థుఁ డైనవాఁడే యట్టియాగమును జేయ నధికారి కాఁగలఁ డని బోధించునపుడు, ఏ శ్రుతికిని విరోధము సంభవింపదుగదా! "మీఁదు మిక్కిలి" యీ కామ్యకర్మమును బోధించువిధి, 'అసమర్థుఁడుకూడ నీ కర్మమును జేయుట కధికారి కాఁగలఁ' డని బోధించునెడ, నసమర్థుఁ డీ కర్మమును జేయునపుడు, కొన్నియంగములు లోపించుటంజేసి, యంగములను బోధించు విధులతో నేకాన్వయమును జెందు ప్రధానవిధినుండి,[2] లభించు ప్రధానము లంగములతోఁ గూడి యుండుట యనుసాహిత్యము లేకపోవలసివచ్చెడిని. అంగముల నొకప్పు డాచరించుటయు, నొకప్పు డాచరింపకపోవుటయు, సంభవించుటంజేసి, వాని కార్త్స్న్యం తికలోపము[3] సంభవింపదే యని శంకింపవలదు. కామ్యకర్మమును బోధించు విధియందుఁ దప్పక యాచరింపఁబడవలసినవిగా వినఁబడునంగము, లసమర్థునిచే నారంభింపఁబడినపక్షమున, నొకప్పు డాచరింపఁబడుటయు, నొకప్పు డాచరింపఁబడకపోవుటయును, సంభవించెడినిగదా! కావున, నంగములతోఁ గూడిన ప్రధానప్రయోగము నాచరింప సమర్థుఁ డైనవాఁడే, కామ్యకర్మము నాచరింప నధికారి కాఁగలఁడు. నిత్యకర్మముల నాచరించునపు డన్ననో, యజమానున కుండెడు శక్తినిబట్టి, యచటి యంగముల నాచరింపవచ్చును. ఆ యంగములు, "యావజ్జీవ

౧. సాంగ మగు ప్రధానమే, ఫలమును జనింపఁజేయఁగలుగును గనుక, నా ఫలమును గోరువాఁ డంగములను, బ్రధానములనుగూడఁ జేయుటకు సమర్థుఁడుగా నుండవలయును.

౨. ప్రధానయాగమును బోధించువిధి.

3. కార్త్స్న్యముగా లోపించుట.

మగ్నిహోత్రం జుహోతి”[1] “యావజ్జీవం దర్శపూర్ణమాసాభ్యాం యజేత”[2] అనునట్టి యావజ్జీవశ్రుతిచే,[3] బ్రదికి యున్నంతవఱకును గర్తవ్యములుగా విధింపఁబడుచున్నవి. ఎవఁడును, బ్రపకి యున్నంతకాలమును, బ్రధానప్రయోగమును సంగములతోఁ గూడున ట్లాచరించుటకు సమర్థుఁడు కానేరఁడు. కావున, నిత్యకర్మములందలి ప్రధానప్రయోగములనుమాత్రము చేయ సమర్థుఁ డగువాఁ, డా నిత్యకర్మముల నాచరించునధికారి కాఁగలఁడు. అందలి యంగము లన్ననో, యెన్నిటిని జేయుటకు యజమానునికి శక్తి యుండునో, యంతవఱ కాచరింపవచ్చును. ఈవిషయము, తంత్రరత్నము, న్యాయరత్నమాల, మున్నగు గ్రంథములయందుఁ, బార్థసారథిమిశ్రుఁడు మొదలగు మీమాంసకులచే బాగుగ వివరింపఁబడినది గనుక, నింతటితోఁ జాలింతము. కాఁగాఁ, గర్మమునుండి జనించు ఫలము ననుభవించుట యనెడి యధికారమును బోధించువిధి, యధికారవిధి యని సిద్ధించుచున్నది. ఇట్లు. ౧. ఉత్పత్తివిధి, ౨ వినియోగవిధి, ౩. ప్రయోగవిధి, ౪. అధికారవిధి, అని నాలుగు విధములగు విధిని వివరముగా నిరూపించుటమూలమున, విధి, స్వర్గము మున్నగు ప్రయోజనములను గలిగించు కర్మములను గర్తవ్యములుగా బోధించుచున్న దని, తెలియుచున్నది.

ఇట్లు మీమాంసాన్యాయ ముక్తావళియందలి పూర్వార్థము ముగిసినది.



౧. బ్రదికి యున్నంతకాలమును నగ్నిహోత్ర మను హోమము నాచరించుటచే నిష్టము నుత్పాదింపవలెను.

౨. బ్రదికి యున్నంతవఱకును దర్శపూర్ణమాసముల నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.

౩. బ్రదికి యున్నంతవఱకును నాచరింపవలసిన కర్మములను బోధించుశ్రుతి.

# ఆంధ్రమీమాంసాన్యాయముక్తావళి



## ఉత్తరార్ధము

## మంత్రములు

ప్రయోగములయందలి క్రియలను వానికి సంబంధించువిషయములను స్మరింపఁజేయు వాక్యములకు మంత్రము లని పేరు. అవి యట్టివిషయములను స్మరింపఁజేయుట మూలముగానే ప్రయోజనము కల వగుచున్నవి. కాని వానియుచ్చారణ మదృష్టము కొఱకుఁ గానేరదు. దృష్టమగు ఫలము సంభవించునెడ నదృష్టమును గల్పించుట న్యాయ్యము కాదుగదా! ప్రయోగములయందలి యర్థమును స్మరించుట యనుదృష్ట ప్రయోజనము పురోహితులయుపదేశవాక్యములు ప్రయోగములు తఱచు చూచుట మున్నగు నితరకారణములవలన సిద్ధింపఁదగియుండఁగా నట్టిప్రయోజనముకొఱకే మంత్రముల నుచ్చరించుట వ్యర్థ మయ్యెడిని, అని శంకింపరాదు. మంత్రముల నుచ్చరించుటమూలముననే వానియందుండునర్థమును స్మరింపవలె నను, నియమవిధి యంగీకరింపఁబడుచున్నది గదా!

## నియమవిధి మొదలగు మూఁడువిధులు

అనేకసాధనములచే సాధింపఁదగిన క్రియవిషయమై, యొకసాధనము ప్రవర్తించునపుడు, మఱియొకసాధనము ప్రవర్తింపనేరకయుండ, నట్టి ప్రవర్తింపఁజాలని సాధనమును, దప్పక ప్రవర్తింపఁజేయువిధి, నియమవిధి యగుచున్నది. ఇందులకు:—

"విధి^1 రత్యంత మప్రాప్తౌ నియమః పాక్షికే సతి,
తత్ర చాన్యత్ర చ ప్రాప్తౌ పరిసంఖ్యేతి గీయతే."

అనునది ప్రమాణముగాఁ గల దని మీమాంసకులు చెప్పుదురు. దీనియర్థ మీక్రింద వివరింపఁబడును.

౧. తం. వా. ౧-౨-౪ పేజీ ౬౧.

## అపూర్వవిధి

ప్రమాణాంతరముచేఁ దెలియని "ఈ కర్మ మీ ఫలమును జనింపఁజేయును' అను నిట్టిదానిని దెలియఁజేయువిధి, అపూర్వవిధి యగుచున్నది. ఉదా:—"యజేత స్వర్గకామః" అనునీరీతిగా నుండునది. "ఈయాగము స్వర్గము నుత్పాదించును" అను విషయము, ప్రమాణాంతరముచేఁ బ్రాప్తింపక, యీ విధివాక్యమందే విధింపఁబడుచున్నది గాన, నీ విధి యపూర్వవిధి యగుచున్నది.

## నియమవిధి

రెండుసాధనములచే సాధింపఁదగిన ప్రయోజనమును సిద్ధింపఁజేయుటకై, వానిలో నొకసాధనము ప్రవర్తించుపక్షమున, రెండవసాధనము ప్రవర్తింపఁజాలనిదైయుండ, నట్టి సాధనమునే తప్పక విధింపఁజేయువిధి, 'నియమవిధి' యగుచున్నది. ఉదా:—"వ్రీహీ నవహన్తి" అను నీరీతిగా నుండువిధి. ఈవిధి, యొకపక్షమందుఁ బ్రాప్తింపఁజాలనిదాని నెట్లు విధించుచున్నది? యను ప్రశ్నమున కీక్రిందిది సమాధానము. అవఘాతముచేతఁ[1] బొట్టును దొలఁగించుట యనునది, లోకమునం దన్వయవ్యతిరేకములచే[2] సిద్ధింపఁగలదు గాన, నీ విధిచే నిట్టి లోకప్రసిద్ధమగు విషయము తెలియఁజేయఁబడుట లేదు. మఱేమన, 'నొకపక్షమందుఁ బ్రాప్తింపఁజాలనియంశమును బోధించుట' యనునియమము తెలియఁబడుచున్నది. పొట్టును దొలఁగించుట యనేకములగు నుపాయములచే సాధింపఁదగియుండుటం జేసి, 'అవఘాతము' ను మాని, మఱియొకయుపాయము నవలంబించునపుడు, 'అవఘాతము' ప్రాప్తింపఁజాలదు గనుక, దానిని (అవఘాతమును) విధించుటయను 'ప్రాప్తింపఁజాలని యంశములను బూరించుట'యే, యీవిధిచేఁ జేయఁబడుచున్నది. కావున, నొకపక్షమునందుఁ బ్రాప్తింపఁజాలని యంశమును బూరించుటయనునియమమే, యీ నియమవిధి కర్థ మగుచున్నది. 'గోళ్లతో నొలుచుట' మొదలగు నితరసాధనములు

౧. అవఘాతము = దంచుట = అవహననము.

౨. ఒకటి యుండుచో, రెండవది యుండుట యన్వయము. అది లేనిచో, రెండవదియును లేకుండుట వ్యతిరేకము. ఇట్టి సంబంధములకే యన్వయ వ్యతిరేకము లని పేరు. ఉదా — మృత్తుండినచో ఘటమ్ముండును. మృత్తుండనిచో ఘటమును నుండదు. ఇట్టి సంబంధము, కార్యకారణములకెప్పుడును నుండును.

ప్రాప్తించుపక్షమునందుఁ, బ్రాప్తింపఁజాలని యవఘాత, మీవిధియందు విధింపఁబడు చున్నదిగదా! కాని, యపూర్వవిధియందువలె, నేవిధముగాను దెలియనివిషయ, మిచ్చటఁ గర్తవ్యముగాఁ దెలియంజేయఁబడుట లేదు.

## పరిసంఖ్యావిధి

ఒకప్రయోజనము నుత్పాదించుటకు రెండు సాధనము లొకటేసారి ప్రవర్తింపఁదగి యుండఁగా, వానిలో నినిష్టమగు సాధనమును నివర్తింపఁజేయు (ప్రవర్తింపకుండఁజేయు)విధికి, 'పరిసంఖ్యావిధి' యని పేరు. ఉదా: "పంచ పంచనఖా భక్ష్యాః" అనునీతివాక్యము. ఈవాక్యముచే, నైదుగోళ్లుగలజంతువులలోఁ బైని పరిగణింపఁబడిన యైదుజాతులజంతువులను భక్షించుట విధింపఁబడుట లేదు. లోకమునం దట్టిభక్షణము ఇష్ట మున్నవారిచేఁ జేయఁబడుచునే యున్నదిగదా! ఇది నియమమును దెలియఁజేయునదియును గాదు. అయిదుగోళ్లుగల జంతువులలో నాయైదుజాతులజంతువులను భక్షించుటయు, వానికంటె నితరములైన యైదుగోళ్లుగల జాతులజంతువులను భక్షించుటయు నొకటేసారి ప్రాప్తింపవచ్చును గాన, నొకపక్షమునందుమాత్రమే ప్రాప్తించుట యనునది లేదు. కావున నిది పంచనఖములుగల జంతువులలోఁ, బై నుదాహరింపఁబడిన యైదుజాతులను దక్కఁ దక్కినజాతుల భక్షణమును నివర్తింపఁజేయున దగుటం జేసి, పరిసంఖ్యావిధి యగుచున్నది.

అది శ్రౌతియగు పరిసంఖ్య, లాక్షణికియగు పరిసంఖ్య అని రెండువిధములుగా నున్నది. ఇచట, 'అత్ర హ్యేవావపంతి' అనునది, శ్రౌతియగు పరిసంఖ్య. ఈవాక్యమునందు నిశ్చయమును దెలియఁజేయు 'ఏ' అనుశబ్దముచేఁ, బవమానఋక్కులకంటె వేఱుఋక్కులతో స్తోత్రము చేయుట నివర్తింపఁజేయఁబడుచున్నదిగదా! 'పంచ పంచనఖా భక్ష్యాః' అనువాక్య మున్ననో, లాక్షణికి యగు పరిసంఖ్య యగుచున్నది. ఇం దనిష్టమగు నితరమైనదానిని నివర్తింపఁజేయుటను సూచించునది యేదియు లేదుగదా! కావుననే, యీలాక్షణికియగు పరిసంఖ్య మూఁడుదోషములు గలిగియున్నది. అవి (౧) శ్రుతహాని, (౨) అశ్రుతకల్పన, (3) ప్రాప్తబాధము అనునవి. పరిసంఖ్యయందు

౧. అయిదుగోళ్లుగల జంతువులలో ౧. కుందేలు, ౨. ఏదుపంది, 3. ఉడుము, ౪. ఖడ్గమృగము, ౫. తాఁబేలు - అను నైదుజాతులుమాత్రమే భక్షింపఁదగినవి. ఇది రామాయణమునందు శ్రీరామునిగూర్చి, వాలిచేఁ జెప్పఁబడిన "...బ్రహ్మక్షత్రేణ రాఘవ, శల్యకః శ్వావిధో గోధా శశః కూర్మశ్చ పంచమః." అనువాక్యమునందుఁ గలదు. రామా. కిష్కింధ. ౧౭-3౯.

(౧) వినఁబడునర్థమును బరిత్యజించుట, (౨) వినఁబడనిదానిని గల్పించుట, (3) ప్రాప్తించినదానినివృత్తి, అనునీమూఁడును సంభవించును గాన, నీ విధి మూఁడుదోషములుగలది యగుచున్నది. ఇచట (౧) వినఁబడునట్టి పంచనఖములుగల జంతువులలోఁ బైని వివరింపఁబడిన మైదుజాతులభక్షణము విడువఁబడుచున్నది. (౨) వినఁబడని పైనివివరింపఁబడిన మైదుజాతులు దక్క నితరములగు పంచనఖములు గలజంతువులను భక్షింపకుండుట కల్పింపఁబడుచున్నది. (3) రాగము (తీవ్రమగునభిలాష)చేఁ బ్రాప్తించిన పైని వివరింపఁబడిన మైదుజాతులు దక్క నితరములగు పంచనఖములు గల జంతువులభక్షణము నివర్తింపఁజేయఁబడుచున్నది. ఈ మూఁడుదోషములలో మొదటి రెండుదోషములును శబ్దమునాశ్రయించియుండి శబ్దమూలముగానే తెలియంజేయఁబడుచున్నవి. మూఁడవదియగు ప్రాప్తబాధ మన్ననో యర్థమూలముగానే తెలియంజేయఁబడుచున్నది. ఇట్లే యితరపరిసంఖ్యావిధులయందుఁగూడ నీ దోషములను గ్రహించునది. కాఁగా 'నాచరింపఁబడు క్రియలు మంత్రముల నుచ్చరించుటమూలముగానే స్మరింపఁబడవలసినవి' అనునియమవిధి యంగీకరింపఁబడుటంజేసి మంత్రముల నుచ్చరించుట వ్యర్థము కానేర దని సిద్ధించుచున్నది. కావున మంత్రములు ప్రయోగమునందలి క్రియలను స్మరింపఁజేయుటమూలమున సార్థకము లగుట యుక్తముగా నున్నది.

ఈ మంత్రములు సార్థకములై ప్రయోజనము గలవగురీతి, ఈ క్రింద వివరింపఁబడుచున్నది. సార్థకము లగు మంత్రములలో నేవి యెచ్చటఁ[1] బఠింపఁబడినవై, యచటి ప్రయోగములయందలి క్రియలను దెలియఁజేయుట యనెడి ప్రయోజనము నుత్పాదింపఁగలవో, యా మంత్రము లచటనే వినియోగింపఁజేయఁబడుచున్నవి. ఏ మంత్రములు పఠింపఁబడిన సందర్భమునందలి క్రియలను దెలియఁజేయుట యనెడి ప్రయోజము నుత్పాదింపవో, యట్టి మంత్రము లన్ననో, యేసందర్భమునం దట్టి ప్రయోజనము నుత్పాదింపఁగలవో, యట్టి సందర్భమునందే బాగుగ వినియోగింపఁబడును. ఉదా:—పూషాద్యనుమంత్రణము లను మంత్రము, లట్లు విశేషించి వినియోగింపఁజేయఁబడు నని, పూర్వము లింగప్రమాణమును వివరించిన సందర్భమునందుఁ జెప్పఁబడినది.

ఏ మంత్రములు, ఏ ప్రయోగసందర్భమునందునుగూడ నందలి క్రియలను స్మరింపఁజేయనేరవో, యట్టి హుం, ఫట్, ఇత్యాది మంత్రము లన్ననో, వాని

౧. ఏకర్మముయొక్క ప్రకరణమందు, లేదా, సందర్భమునందు.

నుచ్చరించుటచే దృష్టమగు ప్రయోజన మేమియుఁ గలుగకుండుటంజేసియుఁ, బ్రయోజన మేమియు లేకుండిన నవి వ్యర్థము కావలసి యుండుటంజేసియు, నదృష్ట మగు ప్రయోజనము గల్పింపఁబడుచున్నది. కావున నట్టి మంత్రము, లధ్యయనవిధిచే విధింపఁబడిన వగుటవలన, నెంతమాత్రము నప్రమాణములు కానేరవు.

## నామధేయ విచారము

నామధేయములు కూడ, విధింపఁబడు కర్మములను నిర్ణయించుటమూలముగాఁ బ్రమాణము లగుచున్నవి. అది యెట్లంటేని:—"ఉద్భిదా[1] యజేత పశుకామః" అను వాక్యమందలి 'ఉద్భిత్తు' అను శబ్ద మిందు విధింపఁబడు యాగమునకు నామధేయ మగుచున్నది. ఈ శబ్దముచే, 'విధింపఁబడు యాగ మిట్టి' దని తెలియం జేయఁబడుచున్నది. ఈ యుద్భిచ్ఛబ్దము నామధేయ మెట్లగుచున్నదో యారీతి, యీ క్రింద వివరింపఁబడుచున్నది.

ఈ వాక్యమునందుఁ బ్రమాణాంతరముచేఁ బ్రాప్తింపని యాగ మొకటి పశు వను ఫలము నుద్దేశించి, విధింపఁబడుచున్నది. ఇచ్చట నేదేనొక యాగసామాన్యము విధింపఁబడినచోఁ బ్రయోజనము లేదు గనుక, యాగవిశేషము విధింపఁబడుచున్నది. 'అట్టి యాగవిశేషమేది?' యని, యాకాంక్ష కలుగఁగా, నిందలి ఉద్భిత్తు అనుశబ్దమువలన, నీయాగవిశేషము ఉద్భిత్తను యాగ మని తెలియుచున్నది. ఈ విధికి 'ఉద్భిత్తను యాగముచేఁ బశువు నుత్పాదించునది' అనునది యర్థ మగుచుండఁగా, ఉద్భిత్తనుపదము యాగపదముతో సామానాధికరణ్యము కలిగియుండుటంజేసి, యా యాగమునకు నామధేయముగా నన్వయించుచున్నది గదా!

ఆ యుద్భిచ్ఛబ్దమునకు,[2] "యజ్' (యాగము) ధాతువుతో సామానాధికరణ్యము 'నీలోత్పల' మున్నగు సమాసములయం దుండు పదములకువలెఁగాదు.

౧. తాండ్యబ్రాహ్మణము ౧౯-౭-౨.

౨. 'ఉద్భిచ్ఛబ్దమునకును, యజ్ ధాతువునకును, సామానాధికరణ్యము (ఒకటేయర్థమును బోధించుట) నంగీకరించుపక్షమున, నీ రెండింటికిని వేఱువేఱు ప్రవృత్తినిమిత్తము (ప్రసిద్ధము లగునర్థము) లుండవలెను. వీనిలో నుద్భిచ్ఛబ్దమునకు, వాచ్యమై ప్రసిద్ధమగు నర్థ మేమియు లేకుండుటంజేసి, దీనికిఁ బ్రవృత్తినిమిత్తమే లేదు గనుక, నీ రెండింటికిని సామానాధికరణ్య మెట్లు కలుగును' అనుశంక మనమున నూహింపఁబడి యిట్లు నివారింపఁబడుచున్నది. 'అన్వయవ్యతిరేకాభ్యాం యో యమర్థం న ముంచతి, స ఏవ తస్య వాచ్యోఽర్థో గుణం చైవ న ముంచతి' (= ఏశబ్ద మన్వయవ్యతిరేకములమూలముగా, నే యర్థమును దప్పక బోధించునో, యది యాశబ్దమునకు వాచ్యమగు నర్థ మగుచున్నది. అట్టి యర్థము, గుణమైనను నాశబ్దముచేఁ దప్పక బోధింపఁబడును). అను, అరుణాధికరణమునకు సంబంధించు వార్త్తికమునందు, వివరింపఁబడినరీతిని, నీలశబ్దమునకు 'నల్లనిరంగు' అను గుణమే వాచ్యార్థము (శక్యార్థము) అగుచున్నది.

ఏల యన? నట్టి సమాసములయందు ‘ఉత్పల’ శబ్దమున కర్థ మగు ‘కలువపూవు’ అనుదానికంటె వేఱగు, ‘నల్లనిరంగు’ అను నర్థము, నీలశబ్దముచే శక్తిమూలముగా బోధింపఁబడుచున్నది. కాని యీ నీలశబ్దము లక్షణమూలమున నట్టి గుణము గల ద్రవ్యము (నల్లని వస్తువు) ను బోధింపఁగలదు గనుక, దీని కుత్పలశబ్దముతో సామానాధికరణ్యము కుదురుచున్నది. ఉద్భిచ్ఛబ్ద మన్ననో, యొక విశేషమును దెలియఁజేయుటం జేసి, యజ్ ధాతువున కర్థమగు యాగసామాన్యమునందలి విశేషముకంటె వేఱగు నర్థమేదియు దీనిచే (ఉద్భిచ్ఛబ్దముచే) బోధింపఁబడుట లేదు. కావున యాగనామధేయము, యజ్ ధాతువున కర్థమగుదానికంటె వేఱగు నర్థమును బోధింపకుండుటం జేసి, నీలశబ్దమున కుత్పలశబ్దముతోఁ గల, సామానాధికరణ్యము వంటి సామానాధికరణ్యము, నామధేయపదమునకు ‘యజ్’ ధాతువుతో నుండ నేరదు. మఱి మన ‘సా వైశ్వదేవ్యామిక్షా[1]’ ఈ మున్నగు వాక్యమునందలి, ‘ఆమిక్షా’ పదమునకు ‘వైశ్వదేవీ’ యను నామధేయముతో నెట్టి సామానాధికరణ్యము కలదో యట్టి సామానాధికరణ్య, మీ యుద్భిచ్ఛబ్దమునకు, యజ్ ధాతువుతోఁ గలదు. అది యెట్లంటేని:—వైశ్వదేవీశబ్దము, దేవతను బోధించు ‘అణ్’ అను ప్రత్యయ మంతమందుఁ గల దగుటచేతను, నా తద్ధితప్రత్యయము, ‘సాఽస్య దేవతా’ (పాణిని ౪-౨-౨౪) అను సూత్రముచే ‘ఆయా దేవతగల యిది’ అను సర్వనామరూప మగు నర్థమును బోధించుటచేతను, సర్వనామము, లుపస్థితములగు ద్రవ్యవిశేషములను బోధించుటచేతను, నీవాక్యమందలి ‘వైశ్వదేవీ’ శబ్ద, మొక ద్రవ్యవిశేషమును బోధించుచున్నది. ఈ వైశ్వదేవీ శబ్దముచే బోధింపఁబడు ద్రవ్యవిశేష మేది? యను నాకాంక్ష కలుగఁగా, దీని సమీపమున నామిక్షా పద ముండుటంజేసి, యామిక్ష యనెడు ద్రవ్యవిశేషము ‘వైశ్వదేవీ’ శబ్దము వలన బోధింపఁబడుచున్న దని తెలియుచున్నది. దీనికి “పాణిని”-౨ వ్యాకరణము నందలి ‘సాఽస్య దేవతా’ అను నధికారమునందు విధింపఁబడి ‘వైశ్వదేవీ’ అను

౧. ‘సా వైశ్వదేవ్యామిక్షా, వాజిభ్యో వాజినమ్’’ (= విశ్వదేవుల కామిక్షయును, వాజిదేవతలకు వాజినమును నిచ్చి యజించుటమూలముగా నిష్టము నుత్పాదించుకొనవలయును. అని యర్థము.) మై. సం. ౧-౧౦-౧౦. వేఁడిపాలలోఁ బెరుఁగు పోసి విఱుగునట్లు చేయఁగా, దానియం దుండు గట్టిపదార్థము, ఆమిక్ష యనియు, నీరు వాజిన మనియుఁ జెప్పఁబడును.

౨. “ఆమిక్షాం దేవతాయుక్తాం వద త్యేవైష తద్ధితః, ఆమిక్షాపదసాన్నిధ్యా త్తస్యైవ విషయార్పణమ్.” (తం. వా. ౨-౨-౯. పే. ౫౩౩.)

పదమునం దుండెడి 'అణ్' అనుతద్ధితప్రత్యయమే విశ్వదేవు లనెడి దేవతలతో సంబంధించు నామిక్ష యనెడి ద్రవ్యవిశేషమును దెలియఁజేయుచున్నది. ఈ తద్ధిత ప్రత్యయము, సమీపమునందుండు ద్రవ్యవిశేషమును బోధించుటకై విధింపఁబడుటం జేసి, దగ్గఱ వినఁబడు నామిక్షాపదముమూలముగా, నామిక్ష యనెడు ద్రవ్యవిశేషమును దెలియఁజేయుచునేయున్నది." అనువార్త్తికమును, "ఈవిధియం¹ దుపపదమగు (సమీపమున నుండు పదమగు) ఆమిక్షయను పదమున, కర్థమైన, యామిక్ష, తద్ధిత ప్రత్యయాంత మయిన వైశ్వదేవీశబ్దమున కర్థమైన 'దీని కాదేవత సంబంధించియున్నది.' అనువాక్యమునం దుండు, 'ఇది' అనెడు సర్వనామముచేఁ బ్రత్యక్షముగా బోధింపఁబడుచున్నది. ఆ యర్థమే, వైశ్వదేవీపదమునం దుండు 'అణ్' అను తద్ధితప్రత్యయముచే బోధింపఁబడుచున్నది. కావున, ఉపపదమయిన యామిక్షా శబ్దము, తద్ధితప్రత్యయము, సర్వనామము నను నీమూఁడింటికిని, నొకటేవాచ్యార్థము కలుగుచున్నది." అను వార్త్తికమును, బ్రమాణము లగుచున్నవి. కాఁబట్టి యీవిధియందలి యామిక్షాపదము, వైశ్వదేవీశబ్దముచేఁ దెలియఁదగు, ద్రవ్యవిశేషమును దెలియంజేయుటమూలముగా, నా వైశ్వదేవీశబ్దముతో నెట్లు సామానాధికరణ్యమును బొందుచున్నదో, యట్లే యాగసామాన్యము విధింపఁబడఁదగకుండుటంజేసి, నామధేయపదము, 'యజ్' ధాతువున కర్థమగు యాగమునందలి విశేషమును (యాగవిశేషమును) దెలియఁజేయుటమూలముగా 'యజ్' ధాతువుతో సామానాధికరణ్యమును బొందుచున్నది. కాఁగా; యాగనామధేయములైన పదములు, విధింపఁబడు కర్మములను నిర్ణయించుటమూలముగాఁ బ్రమాణము లగుచున్నవని సిద్ధించుచున్నది. ఇందుకు "విధివాక్యములచే విధింపఁబడు యాగములందలి విశేషములు (యాగవిశేషములు)అందు వినఁబడు నామధేయములచే నిర్ణయింపఁబడుటంజేసి, యట్టినామధేయములు ప్రయోజనము గలవై ప్రమాణము లగుచున్నవి" అను ప్రమాణము గలదు.

(i) మత్వర్థలక్షణవలనిభయము. (ii) వాక్యభేదమువలని భయము (iii) తత్ప్రఖ్యశాస్త్రము (iv) తద్వ్యపదేశశాస్త్రము - అను నాలుగుప్రమాణములవలన, విధివాక్యములం దుండు నాయాపదములు, యాగనామధేయము లని నిర్ణయింపఁబడుచున్నవి.

౧. "శ్రుత్యైవోపపదస్యార్థః సర్వనామ్నా ప్రతీయతే, తదర్థ స్తద్ధితేనైవ త్రయాణా మేకవాక్యతా." ఇతి. తం. వా. ౨-౨-౧౦ పే. ౫౩౩.

# మత్వర్థలక్షణవలనిభయముచే నామధేయమును నిర్ణయించుట

ఉదా: 'ఉద్భిదా యజేత పశుకామః' అనువాక్యమందలి 'ఉద్భిత్' అను శబ్దము మత్వర్థలక్షణవలనిభయముచే నిచట విధింపఁబడు యాగమునకు నామమగుచున్నది.

అది యెట్లంటేని:—ఈవిధియందలి 'ఉద్భిత్' శబ్దము 'గడ్డపాఱ' అనుగుణమును బోధించుటంజేసి, 'సోమేన యజేత' అనెడునుత్పత్తివిధిచే విధింపఁబడిన జ్యోతిష్టోమయాగము నుద్దేశించి, గడ్డపాఱ యనెడుగుణము విధింపఁబడఁగల దని చెప్పుట తగదు. అట్లయినచో యజ్ ధాతువుమూలమున జ్యోతిష్టోమయాగమే యుద్దేశింపఁబడుటంజేసి, పశు వనెడు ఫల ముద్దేశింపఁబడ నేరకపోవుటచేతను, పశు వనెడు ఫలము గూడ, విధేయ మగు గుణమునుగూర్చి యుద్దేశింపఁబడినచో, వాక్యభేదము సంభవించెడిని గనుకను, ఫలమును బోధించుపశుపదము వ్యర్థము కావలసివచ్చునుగదా! ఈవిధిచేఁ[౧] బశువను ఫలము నుద్దేశించి, యాగము విధింపఁబడుచున్న దనియు, యాగము నుద్దేశించి, యుద్భిత్తను గుణము విధింపఁబడుచున్న దనియును జెప్పుటకు వీలు లేదు. అట్లు చెప్పినను[౨] వాక్యభేదము సంభవించెడినిగదా!

లేదా; "దధ్నేంద్రియకామస్య జుహుయాత్" అనువిధియందు, ఇంద్రియ మనెడు ఫలము నుద్దేశించి, దధియనెడు గుణము, హోమమున కావశ్యకమైన ద్రవ్యముగా, వాక్యభేదము రాకుండ నెట్లు విధింపఁబడుచున్నదో, యట్లే యిచటఁగూడఁ

౧ ఫలము నుద్దేశించి యాగము విధింపఁబడినచో ఫలపదమును, యాగము నుద్దేశించి గుణము విధింపఁబడినచో గుణపదమును, వ్యర్థములు కానేరవని శంకకుని తాత్పర్యము. ఇచట యాగ మొకసారి యావృత్తిచే, ఫలముతోను గుణముతోను సంబంధించుటమూలముగా 'యాగేన ఫలం భావయేత్', 'ఖనిత్రేణ గుణేన యాగం భావయేత్' అను విధిరూపములగు రెండు వేఱువాక్యములు సంభవించెడి నని భావము.

౨. ఇచట, ధాత్వర్థము స్వయముగా భావన కంగ మగునట్లు విధింపఁబడకపోవుటచేతను, దన్నుద్దేశించి మఱి యే దయినను విధింపఁబడకపోవుటచేతను, ధాత్వర్థమయిన యాగము, విధేయముగాని యుద్దేశ్యముగాని యగుటలేదు గనుక, యజధాతువు నూరక యుచ్చరించుట తగకుండుటంజేసి, పశువునకును నుద్భిచ్ఛబ్దార్థమునకును గల సంబంధమును విధింప నావశ్యకమై కేవలము ప్రయోగింప నయోగ్యమయిన 'త' (విధి) ప్రత్యయమును బ్రయోగించుటకొఱకే యజధాతువు ఆ ప్రత్యయముతోఁగూడ (యజ + త) నుచ్చరింపఁబడుటమూలముగాఁ బరాధీన మగుచున్నది.

బశు వనెడిఫలము నుద్దేశించి, గడ్డపాఱ యనెడిగుణము, జ్యోతిష్టోమయాగమునకు సాధనమైన ద్రవ్యముగా, వాక్యభేదను రాకుండ విధింపఁబడవచ్చునే! యనినైనను జెప్పవలదు. 'యజ్' ధాతువున కర్థమగు యాగముకంటె, వేఱగు నుద్భిత్పదమున కర్థమైన గడ్డపాఱను విధించునెడ, 'యజేత' పదమునందలి 'త' ప్రత్యయమున కర్థమయిన భావనకు, నెక్కువ దూరముగానున్న పదార్థము, సాధనముగా విధింపఁబడవలసియుండెడిని.

మఱియు, నిట్లిచట యజధాతువు వ్యర్థము కావలసివచ్చునుగదా! ఇచట నుద్భిత్పదమున కర్థమగు గుణము, కరణముగా నన్వయించుచుండుటంజేసి, యజ్ ధాతువుచేఁ గరణము బోధింపఁబడుటలేదు. పశువు భావ్యము(ఫలము)గాఁ నన్వయించుచుండుటంజేసి, యజ్ ధాతువుచే ఫలమైనను బోధింపఁబడుటలేదుగదా!

గుణమునకును ఫలమునకును గల సంబంధమును విధించు విధివాక్యమునందు, ఫలము నుద్దేశించి విధింపఁబడు గుణము నెడు, కరణమున కాశ్రయము (ఆధారము) గా, ధాత్వర్థ మగు యాగ మన్వయించు నని యంగీకరింపఁబడుచుండఁగా, నిచటి ధాతువునకు వ్యర్థత యెట్లు సంభవించెడి నని శంకింపరాదు. 'యజేత' అను శబ్దమునందు, "ఆశ్రయ మగుట" ను శక్తిమూలముగాఁ దెలియఁజేయు పద మేదయు లేదుగదా! ఈ 'ఉద్భిదా యజేత పశుకామః' అనువాక్యమును 'ఉద్భిత్తను పేరుగల యాగముచే పశు వనెడిఫలము నుత్పాదించుకొనవలయును' అను నుత్పత్తివిధిగా నంగీకరించు సిద్ధాంతమునందు, యజ్ ధాతువున కర్థమగు యాగమునందుండు కరణత్వము, తన్ను బోధించు తృతీయావిభక్తి లేకుండుటచే, 'యజ్' ధాతువువలననే లక్షణమూలమున నెట్లు బోధింపఁబడుచున్నదో, యట్లే, యీ ధాత్వర్థమగు యాగమునందుండు నాశ్రయత్వముకూడ యజ్ ధాతువుచేతనే లక్షణామూలముగాఁ దెలియఁజేయఁబడఁ గలదు' అని చెప్పరాదు. ఆశ్రయత్వముకంటెఁ గరణత్వము సులువైన దగుటంజేసి, దానిని బోధించుటకొఱకే, లక్షణ యంగీకరించుట యుక్త మగుచున్నది గదా! ఫలము నుద్దేశించి విధింపఁబడు గుణము, దేనితో సాధనముగా సంబంధించునో యది యాశ్రయము. అట్టి యాశ్రయ మగుటయే యాశ్రయత్వము. కరణత్వమన్ననో తృతీయావిభక్తిప్రత్యయముచే బోధింపఁబడు శక్తియే[1] స్వరూపముగాఁ గల

౧. ఇట్టి శక్తికల ద్రవ్యము, క్రియకుఁ గరణ మగుచున్నది.

దని యంగీకరింపఁబడుటంజేసి, తన్ను నిరూపించెడి యాశ్రయత్వముకంటె మిక్కిలి సులు వగుచున్నది.

మఱియు నీ విధివాక్యము, గుణమునకును ఫలమునకును గల సంబంధమును విధించు నెడ, "దధ్నేంద్రియకామస్య జుహుయాత్" అను విధియందువలె, నిచట ఫలము నుద్దేశించి కరణ మగు గుణము గాని, దానియం దుండు శక్తిరూపమైన కరణత్వము గాని, విధింపఁబడవలసియున్నది. ఈ రెండింటిలో, మొదటిపక్షమునఁ గరణత్వ మనునది కరణమైన గుణమున కుపసర్జన[౧] మగునట్లు తెలిసికొనఁబడుట, లక్షణమూలముననే కావలెను. కరణత్వము, తృతీయావిభక్తి యను ప్రత్యయమున కర్థ మగుటచేఁ, బ్రాధాన్యము[౨] గలుగున ట్లుపస్థిత మగుచున్నదిగదా!

గుణమునం దుండు కరణత్వము, ఫలము నుద్దేశించి విధింపఁబడు నను రెండవ పక్షమునందుఁగూడ, ఫలభావనయందుఁ గరణముగా నన్వయింప యోగ్యమయిన గుణమునం దుండెడు కరణత్వ, ముపస్థితమగుట లక్షణమూలముననే కావలసియున్నది. తృతీయావిభక్తిచే బోధింపఁబడి క్రియతో నన్వయింప యోగ్యమగు కరణత్వ మను కరణకారకము, ఫలభావనయందుఁ గరణముగా నన్వయింప నయోగ్య మగుచున్నది గదా! కరణమును బోధించు శబ్దముచేఁ దెలిసికొనఁబడు కరణకారకము, కరణముగా నన్వయింప యోగ్య మగును గాని తృతీయావిభక్తిచేఁ దెలియంజేయఁబడు కరణత్వ మను శక్తిరూపమగు కరణకారక మట్లు కరణముగా నన్వయింప యోగ్యము కానేరదు. అట్లయినచోఁ గరణశబ్దముకంటెఁ దృతీయావిభక్తి వచ్చునట్లుగ నా తృతీయావిభక్తికంటెఁగూడఁ, దనచే బోధింపఁబడు కరణత్వ మనెడు శక్తిరూపమైన కరణకారకమునందలి కరణత్వమును బోధించుటకై, యింకొక తృతీయావిభక్తి రావలసియుండెడిని. కావునఁ గరణముగా నన్వయింప యోగ్య మగు గుణమునందుండు కరణత్వము, లక్షణమూలముననే యుపస్థితము కావలసియున్నది. లక్షణమూలముగా

౧. = అప్రధానము = విశేషణము.

౨. = ప్రధాన మగుట. ప్రధాన మగున ట్లుపస్థిత మగు నది యుపసర్జనముగాఁ దెలియుట, లక్షణమూలముగాఁ గాక, వేఱువిధమున సంభవింపనేరకుండుటంజేసి, యిచట లక్షణ యావశ్యకముగా నంగీకరింపవలసి యుండు నని భావము. కరణత్వవిశిష్టమైన గుణమే, ఫలభావనయందుఁ గరణముగా నన్వయించుచుండుటంజేసి, కరణత్వము, గుణమునకు విశేషణ మగుటమూలమున నుపసర్జన మగుచున్నది.

నుపస్థిత మగు కరణత్వము గాని, కరణ మగుగుణము గాని, ఫలభావనయందుఁ గరణ మగుటకూడ, లక్షణద్వారముగానే కావలసియున్నది. ఈ విధియందలి యుద్భిచ్ఛబ్ద ముకంటె వినఁబడు తృతీయావిభక్తి, యుద్భిత్తనెడు గుణముమాత్రమే యాగమునకుఁ గరణ మని తెలియఁజేయుచున్నది గదా! ఇట్టి దోషము సంభవించునను భయము చేతనే, "గోదోహనేన పశుకామస్య ప్రణయేత్" అను నీ మున్నగు వాక్యమునందు, గోదోహన మనుపదము 'పశుకామ' పదమునకు దగ్గఱగా నుచ్చరింపఁబడుటంజేసి, యిచట విధింపఁబడు గోదోహనము మున్నగు గుణములు క్రత్వర్థమైన ప్రణయనముతో సంబంధించుట మూలమునఁ, గ్రతువున కుపకరించునుఁ బశువనెడు ఫలము నుత్పాదించుట కుపయోగించుచున్నవి" అని తంత్రరత్నమునందలి నాలుగవ యధ్యాయమందుఁ బార్థసారథిమిశ్రునిచే వివరింపఁబడినది. కావున, నీ విధి, గుణమునకు ఫలముతోఁ గల సంబంధమును విధించునెడ ధాతువు మిగులఁ బరాధీనము కావలసి వచ్చుట, మున్నగు ననేకదోషములు సంభవించుటంజేసి, యుద్భిత్పదము గడ్డపాఱ యను గుణమును బోధించునట్లును, నట్టి గుణముతోఁ గూడిన యాగ మిచట విధింపఁబడునట్లును నంగీకరింపవలెను. అట్లయినచో యజధాతువుచేత, సులువగు కరణత్వముమాత్రము, లక్షణమూలమున బోధింపఁబడవలసి యుండును. ఉద్భిచ్ఛబ్దముచేఁగూడ 'ఉద్భిత్తు గలది' అను నర్థముమాత్రము లక్షణమూలముగా బోధింపఁ బడవలసి యుండును గాన, గుణఫలములకు సంబంధమును విధించుపక్షముకంటె, నీ పక్షమునందు సులువు కలుగుచున్నది. ధాతువాచ్యాంశము పరాధీనము కావలసి యుండుట యన్ననో, యా పక్షమునందేకాని, యీ పక్షమునందు సంభవింపదు. ఇచట ధాతువున కర్థమగు యాగమే, ఫలము నుద్దేశించి ఫలభావనయందుఁ గరణముగా విధింపఁబడుచున్నది గదా! కాఁగా నుద్భిచ్ఛబ్దము, గడ్డపాఱ యనుగుణమును బోధించుటచే, 'నట్టిగుణము కలది'యనునర్థము, నా యుద్భిచ్ఛబ్దమువలన సంపాదించుటమూలముగా, నిచట నుద్భిత్తను గుణముతోఁ గూడినకర్మము, ఫలము నుద్దేశించి విధింపఁబడుచున్న దని యంగీకరింపవలయును. ఇట్లీవాక్యమువలన 'ఉద్భిత్తు గుణముగాఁగల యాగముల నాచరించుటచేఁ బశు వనెడి ఫలము నుత్పాదించుకొనవలయును.' అనునర్థ మేర్పడుచున్నది.

౧. కుమారిలభట్టుచే రచింపఁబడిన టుప్టీకకుఁ బార్థసారథిమిశ్రునిచేఁ జేయఁబడిన వ్యాఖ్యానము.

౨. గుణఫలములకు సంబంధమును విధించుపక్షము.

ఇందలి యుద్భిచ్ఛబ్ద, మిచట విధింపఁబడు కర్మమునకు నామధేయ మని యంగీకరించుపక్షమున నన్ననో, ఉద్భిచ్ఛబ్దము, లక్షణామూలమున 'ఉద్భిత్తు కలది' అను నర్థమును బోధించునావశ్యకత లేదు. 'ఉద్భిత్తను యాగము నాచరించుటచేఁ, బశువనెడు ఫలము నుత్పాదించుకొనవలయును,' అనురీతిని ఉద్భిచ్ఛబ్దము, శక్తి యనెడు ముఖ్యవృత్తిచే, యాగమును బోధించు యజ్ ధాతువుతో, సామానాధికరణ్యమును బొందుటమూలముగా, ఫలభావనయం దన్వయింపఁగలదుగదా! శక్తి యనెడు ముఖ్యవృత్తిచేఁ దెలియంజేయఁబడు నర్థము కుదురుచుండఁగా, మఱియొక యర్థముకొఱకు, లక్షణ నంగీకరించుట యుక్తము కాదు. 'యజేత' పదమునందలి 'త' ప్రత్యయమున కర్థ మగు భావనయందు, సమీపమున నుండు ధాతువున కర్థ మగు యాగము, కరణముగా విధింపఁబడుట యన్ననో, యీ రెండుపక్షములందును[౧] సమానముగానే యున్నది.

ఇట్లు గుణవిధి సంభవించుచున్నను మత్వర్థలక్షణవలని భయముచే, నా గుణమును బోధించుపదము, కర్మనామధేయముగా నంగీకరింపఁబడినచో, 'సోమేన యజేత' అను వాక్యమునుగూడ, గుణవిధిగా నన్వయించునెడ మత్వర్థలక్షణ నంగీకరింపవలసి యుండుటంజేసి, యట్లు కాకుండుటకై, సోమపదమును గర్మనామధేయముగానే యన్వయింపవచ్చునే? యని చెప్పరాదు. సోమపదము, సోమలత యనెడి లతావిశేషమునందు రూఢమై[౨] యుండుటంజేసి, యాగమునకు నామధేయముగా నన్వయింపనేరదు గనుక, యాగముతో సామానాధికరణ్యము(విశేషణ మగుట)కుదురుటకై యది,

౧. గుణవిశిష్ట మైన యాగమును విధించుపక్షము, ఉద్భిత్తను శబ్దమునునందలి యాగమునకు నామధేయముగా నన్వయించుపక్షము, నను రెండు పక్షములు. ఇందు గుణవిశిష్టయాగమును విధించు పక్షమునందు, లక్షణ నంగీకరించుట యను దోష మొకటి సంభవించును. నామధేయపక్షమం దన్ననో యా దోషముకూడ సంభవింప దని సూచింపఁబడుచున్నది.

౨. "పద మజ్ఞాతసందిగ్ధం ప్రసిద్ధై రపృథక్శ్రుతి, నిర్ణీయతే నిరూఢంతు న స్వార్థాదపనీయతే" అను న్యాయమునుబట్టి, యప్రసిద్ధమగు పదముయొక్క యర్థము, ఏదేనొక ప్రసిద్ధ పదముతో సమభివ్యాహారముద్వారమున నిర్ణయింపఁబడఁగలదు. కాని, ప్రసిద్ధ మగు పదముయొక్క యర్థముమాత్ర, మితరపదముతో సమభివ్యాహారము మూలముగాఁ గాని సులువుగా నన్వయము కుదురుటకొఱకుఁ గాని, మార్పఁబడనేరదు. కాఁగా, దధి, సోమము, మున్నగు పదము, లొక్కొక్క యర్థవిశేషమునందు రూఢములై యుండుటంజేసి, యజధాతువుతో సామానాధికరణ్యము కలుగున ట్లన్వయింపనేర కుండుటచేఁ, గర్మనామధేయములుగా నన్వయించుట మిగుల దుర్లభము గనుక, వేఱు గతిలేమి, నా సామానాధికరణ్యము కుదురుటకై, యీ పదములు లక్షణమూలముగా 'నాయా రూఢ్యర్థములు గలవి' యను నర్థమును బోధించు నని యంగీకరింపఁబడుచున్న దని తాత్పర్యము.

(సోమపదము), లక్షణమూలముగా 'సోమము కలది 'యనునర్థమును బోధించు నని యంగీకరింపఁబడుచున్నదిగదా! ఉద్భిచ్ఛబ్దముచే నన్ననో, ముఖ్యావృత్తి యగు శక్తి మూలమున బోధింపఁబడు ప్రసిద్ధ మగు నర్థ మేదియు లేదు. ఉద్భిచ్ఛబ్దముచే, నవ యవార్థముమూలమున, 'దీనిచే ఫల ముత్పాదింపఁబడును.' (ఫలము నుత్పాదించు సాధనము)అను నర్థము బోధింపఁబడవచ్చు నను పక్షమునం దన్ననో, యట్టి యర్థము గుణముగా నన్వయించునట్లే, ఫలము నుత్పాదించు సాధనమగు యాగముతోఁగూడ, సామానాధికరణ్యము గలుగున ట్లన్వయింపఁగలదు.

కావున, 'ఉద్భిదా యజేత పశుకామః 'అను వాక్యమునందలి యుద్భిత్పదము, గుణమును బోధించు నని కల్పించి యీ వాక్యమును గుణవిశిష్టవిధిగా నన్వయించు నెడ, నీ యుద్భిత్పదమునందు మత్వర్థలక్షణ యనెడి దోషము సంభవించుటంజేసి, దానిని బరిహారించుటకై, యీ యుద్భి త్తనుపదమును యాగనామధేయముగానే యంగీకరింపవలయు నని సిద్ధించుచున్నది.

## వాక్యభేదమువలనిభయముచేఁ గర్మనామధేయమును నిర్ణయించుట

'చిత్రయా యజేత² పశుకామః' అను వాక్యమునందు, వాక్యభేదమువలని భయముచే 'చిత్రా '[3]అను పద మిందు విధింపఁబడు యాగమునకు నామధేయ మగు

౧. ఉత్తను నుపసర్గ పూర్వమందుఁగల 'భిద్' అను ధాతువునకుఁ బైకిఁ జీల్చుట యనునర్థ ముండుటచే నుద్భిచ్ఛబ్దము 'ఉద్భిద్యతే + అనేన' ( = దీనిచే భూమి పైకిబ్రద్దలు చేయఁబడును. అను నవయవార్థముమూలమున గడ్డపాఱ యనెడి యర్థమును బోధింపఁగలుగుటంజేసి యట్టి యర్థమునకు యజ ధాతువుతో సామానాధికరణ్యములేమిని నా యుద్భిత్పదము యాగనామధేయముగా నన్వయింపనేరదే యను శంక రాఁగా, ధాతువున కనేకార్థము లుండుటంజేసియు, 'వైదూర్యభూమి ర్నవమేఘ శబ్దా దుద్భిన్నయా రత్నశలాకయేవ ' (కుమారసంభవము ౧-౨౪) అనుచోట నీధాతు వుత్పాదించుట యనునర్థమునందుఁ బ్రయోగింపఁబడుటంజేసియు, 'ఉద్భిత్పదము, ఫలము నుత్పాదించు సాధనము ' అను నర్థమును బోధించుటమూలముగా గుణమును దెలియంజేయునట్లే, యాగమునుగూడఁ దెలియఁ జేయును గనుకను నా యుద్భిత్పదమును యాగమునకు నామధేయముగానే యన్వయించుట యుక్త మని సమాధానము చెప్పంబడుచున్నది.

౨. (తై. సం. ౨-౪-౬-౧) పశువును గోరువాఁడు 'చిత్ర ' అను పేరుగల యాగముచే నిష్టము నుత్పాదించుకొనునది.

3. ఈ యాగమునందు విచిత్రము (పలువిధము) లగు ద్రవ్యము లుండుటవలన, దీనికి 'చిత్రా' అను పేరు సార్థక మగుచున్నది.

చున్నది. అది యెట్లంటేని:—ఈ వాక్యమునందుఁ[౧] జిత్రత్వము, స్త్రీత్వము సను ధర్మములతోఁ గూడిన ద్రవ్యముగల యాగము విధింపఁబడనేరదు. "దధి మధు పయో ఘృతం ధానా ఉదకం తండులా స్తత్సంసృష్టం ప్రాజాపత్యం" (=పెరుఁగు, తేనె, పాలు, నేయి, వేఁపుడుబియ్యము, జలము, బియ్యము, అను నేడుద్రవ్యముల సముదాయమును, ప్రజాపతిదేవతకొఱకు సమర్పించి, యాగము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనునది)అను విధివాక్యముచే, యాగము[౨] విధింపఁబడుచుం డఁగాఁ జిత్రత్వ మనెడు గుణముతోఁ గూడిన యా యాగమే యిచట విధింపఁబడుట తగదుగదా! మఱియు[౩] ద్రవ్యము, దేవత మున్నగునవి, యుత్పత్తివిధితో నన్వ యించు గుణములు. దేశము, కాలము, కర్త మున్నగునవి ప్రయోగముతో నన్వ యించు గుణములు. 'రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత' అనువాక్యము నందలి 'రాజా' అను పదమున కర్థ మగు రాజు, ప్రయోగవిధితో నన్వయించు గుణ మగుటవలన, వేఱొకచోట ననుమత్యాది వాక్యములయం దుత్పన్నమైన కర్మ ములు, మరల నీ రాజసూయవాక్యమునందు, రా జను గుణముతోఁ గూడునట్లు విధింపఁబడుటమూలమున, నీ వాక్యము ప్రయోగవిధి యగుట యుక్తము. ప్రకృత మగు చిత్రావాక్యమునం దన్ననో, చిత్రత్వ మను గుణ ముత్పత్తివిధితో నన్వయిం చునదే కాని, ప్రయోగవిధితో నన్వయించునది కాకపోవుటంజేసి, వేఱొకచోట

౧. ఇచట 'చిత్రా' శబ్దము 'చిత్రత్వము' అనెడు గుణమును, శక్తిమూలమున బోధించుటం జేసి, యట్టిగుణముతోఁ గూడిన యొకకర్మ మిచట విధింపఁబడవచ్చును. లేదా, కర్మమును, ద్రవ్య మును, వేఱొకచోట విధింపఁబడినపక్షమున, వాని ననువదించి యిచట వాక్యభేదము లేకుండఁగనే, చిత్రత్వ మనెడు గుణము విధింపఁబడవచ్చును. ఇట్లుండఁ జిత్రాపదము నామధేయముగా నేల యంగీకరింపవలయును? అను శంక మనమున నూహింపఁబడి యిట్లు నివారింపఁబడుచున్నది.

౨. ఇచట నొకటేయాగము విధింపఁబడుచున్న దని, న్యాయసుధాకారులమతము. ఖండదేవులు మున్నగు నవీను లన్ననో, "సప్తదశ ప్రాజాపత్యాన్" అను విధియందువలె, నిచటఁగూడ, ననేక యాగములు విధింపఁబడుచున్న వని, యంగీకరించుచున్నట్లు, మీమాంసాకౌస్తుభమునందలి చిత్రాధికరణ మందు స్పష్ట మగుచున్నది.

౩. అనుమతీష్టి మున్నగువానిని విధించు వాక్యములచే, వేఱువేఱుగాఁ బ్రాప్తించిన కర్మములు, స్వారాజ్య మను ఫలముకొఱకు, రా జనెడి కర్తతోఁ గూడునట్లు, 'రాజా రాజసూయేన స్వారాజ్య కామో యజేత' అను వాక్యముచే, వాక్యభేదము లేకుండ నెట్లు విధింపఁబడుచున్నవో, యట్లే వేఱొక చోటఁ బ్రాప్తించిన కర్మము, పశుఫలముకొఱకు, మరల 'చిత్రత్వ' మనెడు గుణముతోఁ గూడునట్లు చిత్రావాక్యముచే విధింపఁబడవచ్చునే? యనుశంక యిట్లు పరిహరింపఁబడుచున్నది.

నుత్పన్నమైన కర్మ, మీ చిత్రత్వగుణముతోఁ గూడుటచేఁ గలుగు ప్రయోగవిధి, యిచట సంభవింపనేరదు. కావున, వేఱొకచోటఁ బ్రాప్తించిన యాగమునకు, ఫలముతోను, గుణముతోను, సంబంధ, మీ చిత్రావాక్యమున విధింపఁబడునెడ వాక్యభేదము రాకతప్పదు.

పూర్వపక్షి వేఱొక ప్రకారముగా నిచట వాక్యభేదము రాదని యిట్లు చెప్పుచున్నాఁడు:—చిత్రాశబ్దము, చిత్రత్వము, స్త్రీత్వము అను రెండు ధర్మములను దెలియఁజేయుటంజేసి, వీనిలో స్త్రీత్వ మను ధర్మము, సహజముగాఁ బ్రాణులయందే యుండును గనుకఁ బెరుఁగు మున్నగు ద్రవ్యములు గల ప్రస్తుతకర్మమునందు వినియోగింపనేరకుండుటవలన, నీవాక్యముచేఁ, బ్రకృతకర్మము నుద్దేశించి గుణము విధింపఁబడనేరదు. మఱేమన, నీ చిత్రావాక్య మనారభ్యాధీత[1] మగుటంజేసి, దీనిచేఁ బ్రాణముతోఁ గూడిన ద్రవ్యము గల కర్మము నుద్దేశించి గుణము విధింపఁబడుచున్నది. అనారభ్యాధీతములుకూడ, "ప్రకృతౌ వాఽద్విరుక్తత్వాత్" అను న్యాయమూలమునఁ బ్రకృతియాగములతో సంబంధించుటంజేసియుఁ, బ్రాణముతోఁ గూడిన ద్రవ్యముగల యాగములకు, "ద్వైతస్య[3] చేతరేషు" (పూ. మీ. ద. ౮-౧-౧౩)అను న్యాయమూలముగా, నగ్నీషోమీయయాగము ప్రకృతి యగుటంజేసియు, నగ్నీషోమీయయాగము ననువదించి, చిత్రత్వ మనెడు గుణ మీ చిత్రావాక్యముచే విధింపఁబడుచున్నది. ద్వైతయాగము,[4] జ్యోతిష్టోమయాగమున కంగ మగుటంజేసి, దానికి స్వతంత్ర మగు ఫలమునుగూర్చి యాకాంక్ష లేకుండుటవలన, నీ చిత్రావాక్యమందలి 'పశుకామ' అనుపదము, క్రొత్తగా ఫలమును సంబంధింపఁజేయదు. మఱేమన, నగ్నీషోమీయపశుయాగమున కంగముగాఁ బ్రాప్తించిన కోరిక, నిచట ననువదించుచున్నది. కావున, నిచట నగ్నీషోమీయయాగమునకుఁ, జిత్రత్వగుణముతోడి సంబంధ మొక్కటి మాత్రమే, విధింపంబడుటంజేసి, వాక్యభేదము రానేరదు.

౧. ఏ ప్రకరణము నారంభింపక ప్రత్యేకముగాఁ జెప్పఁబడినవాక్యములు.

౨. ఇది పూర్వము వివరింపఁబడెను.

౩. ద్వైత మనెడి నామాంతరముగల యగ్నీషోమీయయాగమునందలి పశువునకు సంబంధించు నంగములు, సవనీయయాగము మున్నగు నితరపశుయాగములం, దతిదేశముచేఁ బ్రవర్తించుటంజేసి, యగ్నీషోమీయయాగ, మితరపశుయాగములకుఁ బ్రకృతి యగుచున్నది.

౪. అగ్నీషోమీయపశువు ననువదించి, 'చిత్రత్వ'గుణముతోను, పశుఫలముతోను సంబంధము విధింపఁబడునెడ, వాక్యభేద మనుదోష మట్లే యుండునే, యనుశంక యిట్లు పరిహరింపఁబడుచున్నది.

ఇట్లు పూర్వపక్షి చెప్పినదానికి క్రిందిది సమాధానము:—పూర్వపక్షి చెప్పిన రీతిని వాక్యభేదము రాకుండుట సత్యమే. అయినను చైత్రయాగము ననువదించి, యచట 'చిత్రత్వము' 'స్త్రీత్వము 'ననునీ రెండింటిని విధించుటంజేసి, వాక్యభేదము వచ్చెడిని. ఒకవేళ నీరెండింటిని ప్రత్యేకముగా విధింపక, 'ధేనుర్దక్షిణా 'అను వాక్యమునందువలె, వేఱొకచోటఁ బ్రాప్తించినకర్మము ననువదించి, చిత్రత్వముతోఁ గూడినదియు, 'చిత్రయా' అనుపదమందలి తృతీయావిభక్తిచే బోధింపఁబడునదియు, నగు నొక కారకమునుమాత్రమే విధించినను, నీ చిత్రావాక్యమునం దన్వయక్లేశ మనెడి వాక్యభేదము, రానేవచ్చెడిని (తప్పక సంభవించెడిని). అనేకములను విధించుటచేఁ గలుగు వాక్యభేదముకంటె, నన్వయక్లేశ మనెడి వాక్యభేదము, విధి ననేకపర్యాయములు ప్రవర్తింపఁజేయుట యనెడి దోషము లేని దగుటంజేసి, సులువే యగు నని యూహింపరాదు. 'ధేనుర్దక్షిణా 'అను వాక్యమునందలి కరణకారకము, వేఱొకచోటఁ బ్రాప్తింప కుండుటంజేసి, యచట ననేకగుణములతోఁ గూడిన యొక కరణకారకమును విధించుట, యుక్త మయినను, ప్రకృత మగు చిత్రావాక్యమునందలి కరణకారకము, దానికి సంబంధించు నుత్పత్తివాక్యముచేఁ బ్రాప్తించుటవలన, నట్లు విధింపంబడిన కరణకారకము, మరల నీ చిత్రావాక్యమునందు విధింపఁబడుట సంభవింపనేరదు.

'పశుకామ' శబ్దమునందలి 'కామ' పదము, స్వారస్యమునుబట్టి ఫలమును బోధించుచుండఁగా, నట్టిబోధ బాధింపఁబడి, యీ కామపదము పశువును సంహరించుకోరిక ననువదించుట యనెడు దోష మొకటియు, నాకోరిక ప్రాప్తించుచుండఁగా, దానినిఁ బ్రవర్తింపఁజేయరాని యనువాదము నంగీకరించుట యనెడి దోష మింకొకటియును, సంభవించెడిని. ఈ కోరిక కలుగుటకుఁ బూర్వ, మీ యజమానున కేవరైన నొక పశువు నిచ్చినయెడల, నట్టికోరిక యింకఁ గలుగనేరదు గనుక, నీ యాగము నాచరించువానికిఁ, బశువును సంహరించుకోరిక యెల్లపుడును నియతముగా నుండు నని యూహింప వీలు లేకుండును గాఁబట్టి, దాని ననువదించుట సంభవింపనేరదు. కావున, నీ చిత్రావాక్యమునందలి 'పశుకామ' పదము, నిత్యముగా వినఁబడుట బాధింపఁబడును. 'వ్రీహిభిర్యజేత' అను వాక్యమునందలి వ్రీహులకు, స్వతంత్రముగా వినఁబడిన యాగకరణత్వము[1] 'యవైర్యజేత' అను వేఱు

౧. యాగమునకుఁ గరణ మగుట.

వాక్యముతో నన్వయించునపుడు, పాక్షిక[౧] మని యెట్లంగీకరింపఁ బడుచున్నదో, యట్లే పక్షప్రాప్త మైన కోరిక, యీ చిత్రావాక్యమునందలి పశుకామపదముమూలముగా ననువదింపఁబడవచ్చునే, యని యూహింపరాదు. "సా వైశ్వదేవ్యామిక్షా" అను వాక్యముచే విధింపఁబడిన వైశ్వదేవయాగ, ముత్పత్తి శిష్టగుణ మైన యామిక్షతో సంబంధించి యుండుటంజేసి, యా యాగమునే యనువదించి, మరల 'వాజిభ్యో వాజినమ్' అను వాక్యముమూలమున, వాజిన మను వేఱొక గుణమును విధించుట యెట్లు తగదో యట్లే, 'అగ్నీషోమీయం పశు మాలభేత' అను వాక్యముచే విధింపఁబడిన దైక్షయాగము, 'పశుమ్' అను పదమునందు వినఁబడు పుంస్త్వ మనెడు నుత్పత్తిశిష్టగుణముతో సంబంధించియుండఁగా, నా యాగమునే యనువదించి, మరల నీ చిత్రావాక్యముమూలమున స్త్రీత్వమును విధించుట తగదు. ఉత్పత్తివాక్యము నందు వినఁబడు పశుపదము, స్త్రీజాతియందుఁగూడఁ బ్రయోగింపఁబడుటంజేసి, "ఛాగస్య వపాయా మేదసః" అను మంత్రవర్ణమునందలి ఛాగపదమునం దుండునట్లు వినఁబడు పుంస్త్వము, అనారభ్యాధీత మైనను, ప్రత్యక్షమైన చిత్రావాక్య మనెడు విధిచే విధింపఁబడెడు స్త్రీత్వమును బాధింపనేరదు గనుక, నీ చిత్రావాక్యమునందు స్త్రీత్వము విధింపఁబడవచ్చునే యని యూహింపరాదు.

పాంచదశ్యముతో సంబంధించిన దర్శపూర్ణమాసేష్టు లనెడి ప్రకృతులం దనారభ్యాధీత మైన సాప్తదశ్య మన్వయించుట యెట్లు సంభవింపదో యట్లే, అగ్నీషోమీయయాగము "కృష్ణసారంగోఽగ్నీషోమీయః"[౨] అను విశేషవిధిచే విధింపఁబడినదియుఁ, దనదగ్గఱఁ బఠింపఁబడినదియునగు నలుపువర్ణముతో సంబంధించి యుండఁగా, నా యంగమునే యనువదించి, చిత్రత్వ మనెడు గుణము, అనారభ్యాధీత మగు చిత్రావాక్య మనెడు సామాన్యశాస్త్రముచే విధింపఁబడుట తగదు.

ఇచట నొక పూర్వపక్షి యిట్లు చెప్పుచున్నాఁడు. అగ్నీషోమీయపశువు నను వదించి చిత్రత్వము స్త్రీత్వము నను రెండుధర్మములును, నీ చిత్రావాక్యముచే విధింపఁ

౧. ఒకపక్షమందుమాత్రమే ప్రాప్తించునది.

౨. నల్లనిచుక్కలుగల లేడివంటి రంగు కలిగియుండుట, లేదా, నల్లనిరంగు కలుగుటచే శ్రేష్ఠ మైన యవయవములు గలది.

బడుట లేదు. మ తే మన, "సారస్వతీం[1] మేషీ "అను వాక్యముచే విహితమయిన యాగమున కంగ మగు, నాఁడుమేఁక ననువదించి, చిత్రత్వ మను గుణ, మీ చిత్రా వాక్యమునందు విధింపఁబడవచ్చును. 'చిత్రా 'అను పదమునందలి 'ఆ' అనెడు స్త్రీ లింగమును బోధించు ప్రత్యయముమూలమున, ఆఁడుమేఁక యనెడు స్త్రీకారక మను వదింపఁబడుటంజేసి, చిత్రత్వముమాత్రము గుణముగా విధింపఁబడుచుండుటవలన, నీ చిత్రావాక్యమునందు వాక్యభేదము రానేరదు. ఇచట 'చిత్రా 'పదము 'చిత్ర'అను ప్రకృతిమూలమున విధేయమును, 'ఆ' అను స్త్రీప్రత్యయముమూలమున నుద్దేశ్యమును, బోధించుటచే, ఏకప్రసరతాభంగము[2] సంభవించెడి నని శంకింపవలదు. 'యజేత ' పదమందలి యజిధాతువు, స్త్రీత్వముతోఁ గూడిన పశువు ద్రవ్యముగాఁగల యాగ మనెడి యుద్దేశ్యమును బోధించు ననియు, 'చిత్రా 'పదమందలి 'ఆ' ప్రత్యయము, తాత్పర్యమునుమాత్రము గ్రహింపఁజేయుననియు, నంగీకరించుటవలన నట్టి యన్వయభంగము సంభవింపదు. అట్లు కాక 'ఆ 'ప్రత్యయముమూలమున, నాఁడు మేఁకనే యుద్దేశించి, చిత్రత్వము విధింపఁబడునెడ, నా చిత్రత్వము, ఆఁడుమేఁకకు మాత్రమే యంగము కావలసి వచ్చుటంజేసి యాగమున కంగము కానేరదు గనుక, 'పశ్వేకత్వాధికరణము[3] (౪-౧-౨౪)నందలి పూర్వపక్షన్యాయముచే వివక్షింపఁబడక పోవలసి వచ్చును. ప్రకృతియాగమునుగూర్చి వినఁబడు కృష్ణసారంగవర్ణముచే, నందలి పశువున కుండు 'వర్ణ మేది? 'యను నాకాంక్ష యుపశమించుచుండఁగా, దానిని గూర్చియే, చిత్రవర్ణ మనుగుణము విధింపఁబడుట యుక్తము కా దని చెప్పవలదు. స్వతంత్రముగా నుపదేశింపఁబడిన[4] చిత్రత్వముచే, వేఱొకచోటనుండి యతిదేశింపఁ బడిన మఱియొకవర్ణము బాధింపఁబడఁదగును. కావున సారస్వతయాగమునందలి యాఁడుమేఁక ననువదించి, చిత్రావాక్యమునందుఁ జిత్రత్వ మొక్కటిమాత్రమే విధింపఁబడుటంజేసి, యీ చిత్రావిధి, వాక్యభేదము రాకుండఁగనే గుణవిధి కావచ్చును.

౧. ఆఁడుమేఁకను సరస్వతికొఱకు సమర్పించి యజించుటమూలముగా నిష్టము నుత్పాదించుకొన వలయును (మై. సం. ౪-౭-౮.)

౨. ఒకపదముయొక్క యర్థమున, కొకటే యన్వయము కలుగకుండుట.

౩. 'పశునా యజేత' అను వాక్యమునందలి పశువునం దుండు నేకత్వము వివక్షింపఁబడక, యిచట ననేకపశువులు యాగమున కంగము లని పూర్వపక్షము. ఈ యేకత్వము వివక్షింపఁబడవలె ననియు, నిచటియాగమున కొకటేపశు వంగ మనియు సిద్ధాంతము.

౪. విధింపఁబడిన

ఇట్లు పూర్వపక్షి చెప్పినమాట తగదు. 'చిత్రయా' అను నొక్కపదముచే, నాఁడుమేఁక యను స్త్రీకారక ముద్దేశింపఁబడుటయుఁ, జిత్రత్వమును విధించుటయు సంభవింపనేరవు. అట్లయినచో, వేఱువేఱు పదార్థములయం దుండఁదగిన యుద్దేశ్యత్వము విధేయత్వము ననునవి, యొకపదముచేతనే యొకటేసారి బోధింపఁబడ శక్యము కాకుండుటంజేసి, యేకప్రసరతాభంగ మనెడి వాక్యభేదము సంభవించెడినిగదా! కావుననే "వషట్కర్తుః ప్రథమభక్షః" అను వాక్యమునందు, 'వషట్' అను మంత్రము నుచ్చరించు హోత యను ఋత్విక్కు నుద్దేశించి, ప్రాథమ్యముతోఁ[౩] గూడిన భక్షణము విధింపఁబడుచున్నది గాని, 'ప్రైతుహోమశ్చమసః' అను మున్నగు[౪] వాక్యములచే విధింపఁబడిన సోమరసభక్షణము ననువదించి, యిచటఁ బ్రాథమ్యముమాత్రము విధింపఁబడుట లేదని, మీమాంసాదర్శనము తృతీయాధ్యాయమునందలి యైదవపాదమునందుఁ జెప్పఁబడినది. ఇంతే కాక, యాఁడుమేఁక ననువదించి యీ చిత్రావాక్యమునందుఁ జిత్రత్వగుణము విధింపఁబడునెడ, ఫలమును బోధించు పశుకామపదము వ్యర్థ మయ్యెడిని. ఈఫలము మేషీయాగమునందుఁ బ్రాప్తింపకుండుటంజేసి యాఫలమును జిత్రత్వగుణమును గూడ[౫] విధించినచో వాక్యభేదము కలిగెడిని. ఇచ్చటఁ బ్రకృత మగు "దధి మధు" ఈమున్నగు వాక్యముచే విహిత మైన యాగమునందు, ఫలము వినఁబడ కుండుటంజేసియు, నా యాగము ఫలముతోఁ గూడునట్లు విధింపఁబడిన యే యాగసందర్భమునందును బఠింపఁబడ కుండుటంజేసియు, "నీ ాగమునం దుత్పన్న మైన ఫలాకాంక్ష, నివర్తించుట లేదు.

౧. చిత్రాపదమునందలి స్త్రీప్రత్యయము, తాత్పర్యమాత్రమును గ్రహింపఁజేయునదిగా నంగీకరింపఁబడినను, నుద్దేశ్యమును బోధించు 'స్త్రీత్వముతోఁ గూడిన పశువు ద్రవ్యముగాఁగల యాగము' అను సామగ్రియం దంతర్గత మైయుండుటంజేసి యేకప్రసరతాభంగభయము నివారింపఁబడకయే యుండు నని భావము.

౨. వషట్మంత్రము నుచ్చరించు 'హోత' హోమము చేయఁగా చమసమునందు మిగిలిన సోమరసమును దక్కిన ఋత్విజులకంటె ముందుగానే భక్షింపవలయును.

౩. మొదటి దగుట.

౪. "గ్రావభి రభిసుత్యాహవనీయే హుత్వా ప్రత్యఞ్చః పరేత్య సదసి భక్షయంతి, యథా చమస మన్యాం శ్చమసాం శ్చమసినో భక్షయన్తి, అథైతస్య హారియోజనస్య సర్వ ఏవ లిప్సన్తే"

౫. ప్రాప్తించినకర్మమునుగూర్చి యనేకగుణములు విధింపఁబడనేరవని పూర్వము చెప్పఁబడినది.

విశ్వజిన్న్యాయముచే, నేదే నొకఫలమును గల్పించినయెడల నన్వయక్లేశము కలిగెడిని. ఇట్లీ చిత్రావాక్య మనెడి యధికారవాక్యమునకు ' దధి మధు ' మున్నగు నుత్పత్తివాక్యముతో నుండునట్లు తెలిసికొనఁబడఁదగిన యేకవాక్యతకు బాధ కలుగుటంజేసి, యిచట వాక్యభేదము సంభవించెడిని. ఇచటి చిత్రాపద, మిందు విధింపఁబడుపశుమునం దన్ననో, యిచ్చటఁ బ్రస్తుత[2] మైన పెరుఁగు తేనె మున్నగు ద్రవ్యములు గల కర్మము, ఫలము నపేక్షించుచుండుటంజేసి, యట్టి ఫలముతో సంబంధము మాత్ర మీ చిత్రావాక్యమునందు విధింపఁబడుటవలన, వాక్యభేదము రానేరదు. ఇచటఁ బ్రస్తుత మగు యాగము, పెరుఁగు, తేనె మున్నగు ననేక ద్రవ్యములు గలదగుటఁజేసి దీనికి ' చిత్రా ' పదము నామధేయముగా నుంచుటకుఁ దగినది. కాఁగా, 'చిత్రా' వాక్యమునందలి చిత్రాపదమును వేఱువిధముగా నన్వయించినచో వాక్యభేదము సంభవింపవలసియుండుటంజేసి దానిని నివారించుటకై యీ చిత్రాపద, మిందు విధింపఁబడు కర్మమునకు నామధేయ మగుచున్న దని సిద్ధించుచున్నది.

## తత్ప్రఖ్యశాస్త్రముచేఁ గర్మనామధేయమును నిర్ణయించుట

“ అగ్నిహోత్రం[3] జుహోతి ” అను విధియందలి ' అగ్నిహోత్ర ' పదము తత్ప్రఖ్యన్యాయముచే, నిందు విధింపఁబడు కర్మమునకు నామధేయ మగుచున్నది' తత్ప్రఖ్యము = తత్ + ప్రఖ్యము. ఇందు ' తత్ ' అను శబ్దమునకు ' అగ్ని . యనెడు గుణ మనియు, ' ప్రఖ్యము ' అను పదమునకుఁ ' బ్రకటించునది ' అనియు నర్థము. కాఁగా, ' తత్ ప్రఖ్యము ' అను పదమునకు ' అగ్ని యనెడు గుణమును బ్రకటించునది ' అని యర్థము. అగ్నిని గుణముగాఁ బ్రకటించు నిట్టిశాస్త్ర ముండుటంజేసి, ' అగ్నిహోత్రము ' అనుపద, మిచట విధింపఁబడు కర్మమునకు నామధేయ మగుచున్నది—అని తాత్పర్యము. అది యెట్లంటేని : — ఏది వేఱువిధముగాఁ దెలి

౧. ఇది పూర్వము వివరింపఁబడినది.

౨. ఉద్దేశింపఁబడిన.

3. (తై. సం. (౧-౫-౯-౧) పూర్వపక్షి చెప్పెడురీతిని అగ్నిహోత్రపదముచే బోధింపఁబడునదియు, నీ వాక్యమునందలి హోమమునుగూర్చి గుణముగా విధింపఁబడఁదగినదియు నగు ' అగ్ని ' యనెడి గుణము.

యఁబడదో, యట్టిదే విధివాక్యమువలన విధింపఁబడవలయును. "విధి¹ మున్నగు శాస్త్రము, వేఱువిధముగాఁ దెలియనివిషయమును దెలియఁజేయుటమూలముగానే, ప్రయోజనము గల దగుచున్నది" అను న్యాయ మున్నదిగదా! అగ్నిహోత్రశబ్ద మిచట గుణవిధిని బోధించుచున్న దని యంగీకరించుపక్షమున, నా శబ్దముమూల మున, నేది గుణముగా విధింపఁబడఁదగి యున్నదో, యట్టి యగ్ని యనునది, వేఱొక విధిశాస్త్రముచే నింతకుముందే తెలియఁజేయఁబడియున్నది. అది యెట్లని యంటివా? వినుము.

'అగ్నిహోత్రమ్' అనుశబ్దమునకు 'ఈ కర్మమున నగ్నియందు హోమము జరుపఁబడును.' అని సప్తమీబహువ్రీహిసమాసముమూలముగా నర్థము వివరించి, 'అగ్నిహోత్రం జుహోతి' అనువాక్యమునందు, 'అగ్ని' యనెడుగుణము హోమ మున కాధారముగా విధింపఁబడును — అని చెప్పనెడ, 'యదాహవనీయే జుహోతి' అనువాక్యముచేతనే, యగ్ని హోమమున కాధార మగు గుణముగాఁ బ్రాప్తించు చుండుటంజేసి, మరల నీ 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యముచే నాయగ్నినే గుణముగా విధించుట నిష్ప్రయోజన మయ్యెడిని.

'అగ్నిహోత్రమ్' అను శబ్దమునకు 'ఈ కర్మమునం దగ్నికొఱకు హోమము జరుపఁబడును' అని చతుర్థీబహువ్రీహిసమాసముమూలముగా నర్థమును వివ రించి, యీ 'అగ్నిహోత్రం జుహోతి' అనువాక్యముచే 'అగ్ని యను దేవత గుణముగా విధింపఁబడవచ్చునే!' అని చెప్పందగదు. ఆ యగ్ని దేవత శాస్త్రాంతరముచేఁ బ్రాప్తించుచున్నదిగదా! ఆ శాస్త్ర మెయ్యది యంటివేని వినుము. ఈ విషయ మును గూర్చి న్యాయసుధాకారులు మున్నగు కొందఱు మీమాంసకు లిట్లు చెప్పుచున్నారు. 'యదగ్నయేచ ప్రజాపతయేచ సాయం జుహోతి' (మై. సం' ౧-౮-౭.) అను శాస్త్రాంతరముచే, హోమము ననువదించి అగ్ని, ప్రజాపతి యను నిరువురు దేవతలు విధింపఁబడియుండుటంజేసి, ప్రకృత వాక్యమునందలి యగ్ని హోత్రపదము, అగ్ని యను దేవతను గుణముగాఁ దెలియఁజేయనేరదు. 'యదగ్నయే' అను వాక్యమునందు వేఱొకచోటఁ బ్రాప్తించిన కర్మము నుద్దేశించి,

౧. "అప్రాప్తే శాస్త్ర మర్థవత్"

౨. సాయంకాలమునం దగ్నికొఱకును, ప్రజాపతిదేవతకొఱకును హోమమును జేయుట మూల ముగా నిష్టమును సంపాదించునది.

యిరువురు దేవతలు విధింపఁబడినచో, వాక్యభేదము సంభవించెడి నని చెప్పవలదు. ఈ వాక్యమునం దొండొంటితో నన్వయింపరాని యిరువురు దేవతలు విధింపఁబడు పక్షమునందు, 'అగ్నయే జుహోతి' 'ప్రజాపతయే జుహోతి' అను నన్వయము కలుగుటంజేసి, యీ రెంటిలో నొక్కొక దేవత, వేఱువేఱుగాఁ గ్రియతో నన్వయిఁ చుటవలన విధివ్యాపారము రెండుమాఱులు ప్రవర్తించుట యనెడి వాక్యభేదము సంభవించెడిని.

ఈ వాక్యమునందు వినఁబడు సముచ్చయమును[1] బోధించు 'చ' శబ్దము యొక్క సామర్థ్యముచే నన్ననో, సుబంతముయొక్క యర్థము నిపాతముయొక్క యర్థముతో నన్వయించుట వ్యుత్పన్న మగుటంజేసి, వాక్యభేదము రానేరదు గనుక 'నగ్ని ప్రజాపతి' యనెడి సుబంతముల యర్థము, నిపాతమైన 'చ' శబ్దముయొక్క యర్థ మగు సముచ్చయముతో నన్వయించుటవలన, నీ యిరువురు దేవతలును నొం డొంటితో సంబంధించియే భావనయం దన్వయింతురు, గనుక నిచట నీ యుభయ దేవతలవిధానము వాక్యభేద మనెడు దోషము నాపాదింపనేరదు. కావున నిచట ననేక దేవతలను విధించుట దోషము కాదు.

కావుననే,[2] 'ఋత్విగ్భ్యో[3] దక్షిణాం దదాతి' అను వాక్యముచే విధింపఁ బడిన దక్షిణ ననువదించి, 'గౌశ్చాశ్వశ్చాశ్వతరశ్చ గర్దభశ్చాజా శ్చావయశ్చ వ్రీహ యశ్చ యవాశ్చ తిలాశ్చ మాషాశ్చ తస్య ద్వాదశశతం దక్షిణా' అను వాక్యమునందలి గోవు మున్నగునవి యన్నియు సమీపమునందు వినఁబడు చశబ్దముయొక్క యర్థ ముతో సంభవించుటమూలముననే వాక్యభేదము లేకుండ, భావనయం దన్వయిం చుటంజేసి, యివియన్నియు నీవాక్యమువలన విధింపఁబడుచున్న వని మీమాంసాదర్శ. దశమాధ్యాయమునం దుండు మూఁడవపాదమునం దుండెడు పదుమూఁడవ యధి కరణమునందుఁ జెప్పఁబడిన విషయము సరిగానే యున్నది.

౧. సముచ్చయము = కూడిక.

౨. ఇది దోషము కాదను విషయ, మింకొక దృష్టాంతముమూలముగా నిఁక వివరింపంబడు చున్నది.

3. ఋత్విజులకొఱకు దక్షిణ నిచ్చుటచే నిష్టము నుత్పాదించుకొనునది.

౪. గోవు, గుఱ్ఱము, కంచరగాడిద, గాడిద, మేఁకలు, గొఱ్ఱెలు, వడ్లు, యవలు, నూవులు, మినుములు, నూటపంౘెండు రూపాయలు ననునవి యన్నియు, ఋత్విజులకు దక్షిణగా నిచ్చి యజిం చుటమూలముగా నిష్టము నుత్పాదించుకొనవలయును.

అట్లు[1] కానిచో వేఱువాక్యముచే విధింపఁబడిన దక్షిణ ననువదించి గోవు మున్నగు ననేకము లగునవి, యొకవాక్యమునందు విధింపఁబడుట కుదురకపోయియే యుండెడివి.

'యదగ్నయే' ఈ మున్నగు వాక్యమునందు 'అగ్ని, ప్రజాపతి', అను రెండు శబ్దములకం తెను, వేఱువేఱుగా సంప్రదానకారకమును దెలియంజేయు చతుర్థీవిభక్తి వినఁబడుటం జేసి, ప్రత్యేకముగా దేవత లై యుండు 'అగ్ని ప్రజాపతి' అను నిరువురకును సముచ్చయ మిచటఁ గలదు గాని, యొండొంటితోఁ గలసి యుండు నగ్ని ప్రజాపతి యను నీ యిరువురును నొకటే దేవతగా భావనయం దన్వయించుట లేదు.

'చ'కారమున కర్థమగు సముచ్చయము, చతుర్థీవిభక్తి కర్థమగు దేవతాత్వముతోఁ నన్వయించుటం జేసి, యప్రధాన మగుచున్నదిగదా! కావున 'అగ్నీషోమీయమ్, ఇంద్రాగ్నిభ్యామ్' మున్నగు చోటులందు నిరువురు దేవతలనుబోధించు 'అగ్ని-సోమ', 'ఇంద్ర-అగ్ని' మున్నయిన రెండేసిశబ్దములకంటె, క్రమముగా, దేవతాత్వమును బోధించు తద్ధితప్రత్యయము, చతుర్థీవిభక్తియను నొకటేప్రత్యయము, నుండుటం జేసి, 'అగ్ని-సోముఁడు', 'ఇంద్రుఁడు-అగ్ని' మున్నయిన యిరువురేసి వ్యక్తులు కలసి, యెట్లు జంటదేవత లగుచున్నారో, యట్లు కాక, 'యదగ్నయే' అను వాక్యమునందు 'అగ్ని, ప్రజాపతి', అను రెండుశబ్దములకంటెను, దేవతాత్వమును బోధించు వేఱువేఱువిభక్తు లుండుటంజేసి, అగ్నిప్రజాపతి యను నిరువురును, ప్రత్యేక దేవతలై, సమీపమున నుండు 'చ'శబ్దసామర్థ్యముచే నొండొంటితోఁ గలసి, భావనయం దన్వయించుచున్నారు. ఇట్లు న్యాయసుధాకారులు మున్నగు మీమాంసకులచేఁ జెప్పంబడినది.

పార్థసారథిమిశ్రుఁడు మొదలగువా రన్ననో, యగ్ని దేవత, యంతకుముందే ప్రాప్తించిన దను విషయమును, వేఱొకవిధముగాఁ బ్రతిపాదించుచున్నారు:—"యదగ్నయే చ" మున్నగు వాక్య మగ్నిని ప్రాప్తింపఁజేయుట లేదు. ఈవాక్యము హోమము ననువదించి, ప్రజాపతిదేవతనుమాత్రమే యంగముగా విధించుచున్నది

౧. గోవు మున్నగునవి యొండొంటితోఁ గలసియే యిచట విధింపఁబడుచున్న వని యంగీకరింపఁబడనిపక్షమున.

౨. దేవత యగుట.

గదా! అగ్ని ప్రజాపతి యను నీ యిరువురిలో, నొక దేవతను విడిచి, రెండవదానిని మాత్రమే యీ వాక్యము విధించుచున్న దని నిర్ణయించుటకుఁ, బ్రమాణము లేమిని, నిరువురు దేవతలునుగూడ, నిచట విధింపఁబడుట యుక్తమే యని చెప్పవలదు. ఏది వేఱువిధముగాఁ బ్రాప్తింపలేదో, యట్టదియే విధివాక్యముచే విధింపఁదగినది. సాయం కాలము, ‘సాయం జుహోతి’ అను వచనాంతరముచేఁ బ్రాప్తించిన దగుటంజేసి, ‘య దగ్నయే’ అను వాక్యమునందు ‘సాయం’శబ్దము వినఁబడుచున్నను, నది యీ వాక్యముచే నెట్లు విధింపఁబడుట లేదో, యట్లే అగ్ని దేవతకూడ, “అగ్ని ర్జ్యోతిః ర్జ్యోతి రగ్నిస్స్వాహా” అను మంత్రవర్ణముచేతనే ప్రాప్తించిన దగుటవలన, నీ ‘య దగ్నయే’మున్నగు వాక్యముమూలమున, విధింపఁబడుట లేదు. విధివాక్యమే కాక మంత్రవర్ణముకూడ దేవత నంగముగాఁ దెలియఁజేయఁగలదు.[2] కావుననే యుపాంశు యాజమునందలి, విష్ణువు[3] మున్నగువారు దేవతలగుచున్నా రని మంత్రవర్ణముల

౧. (మై. సం. ౧-౮-౬) అగ్నే, జ్యోతిస్స్వరూప మైనది. దీనికొఱకు హోమ మనఁగాక.

౨. అగ్నీషోమీయ, వైశ్వదేవి, మున్నగు పదములందలి తద్ధితప్రత్యయము దేవతాత్వమును బోధించు నని, వ్యాకరణమువలనఁ దెలియుచున్నది. చతుర్థీవిభక్తికూడ, నట్లే బోధించు ననుటకు వ్యాకరణప్రమాణము లేకున్నను, దీనివలన సంప్రదానత్వము బోధింపఁబడు ననుటకు, వ్యాకరణప్రమాణ ముండుటంజేసి, దేవతాత్వము, సమర్పింపఁబడు ద్రవ్యమున కుద్దేశ్య మగుట మూలముగా, సంప్రదానత్వమునం దంతర్గత మైయుండుటవలనఁ, జతుర్థీవిభక్తిచే బోధింపఁబడుచున్నది. మంత్రవర్ణ, మట్టి దేవతాత్వమును బోధింపఁగలదనుటకుఁ, బ్రమాణ మేమియు లేదు. కాని సిద్ధ మైన మంత్రవినియోగవిధిచే గాని, మంత్రవర్ణముచేఁగల్పింపఁబడిన మంత్రవినియోగవిధివలనఁగాని, మంత్రవర్ణములు, ప్రధానయాగమున కంగము లని తెలిసికొనఁబడఁగా, వానిచేఁ బ్రతిపాదింపఁబడు నగ్ని మున్నగునవి దేవతలు కానిచో, యవి యట్లు ప్రధానమున కంగ మగుట సిద్ధింపనేరకుండుటంజేసి, యీ మంత్రవర్ణములచేఁ బ్రతిపాదింపఁబడు నగ్ని మున్నగునవి, దేవత లగు నని కల్పింపఁబడును, గనుక మంత్రవర్ణముకూడ దేవతలను దెలియఁజేయుట యుక్తమని తాత్పర్యము. మంత్రవినియోగవిధి యనఁగా, మంత్రముల, నాయా కర్మముల కంగము లని తెలియఁజేయు ‘ఈ మంత్రముచే నీ కర్మము నాచరింపవలెను’ అనునట్టి వినియోగవిధి.

౩. విష్ణువు, ప్రజాపతి, అగ్నీషోములు నను దేవతలు తై. బ్రా ౩-౫-౧౦. ఆగ్నేయయాగమునకు సంబంధించు యాజ్యావాక్యామంత్రములు రెండింటికిని, అగ్నీషోమీయయాగమునకు సంబంధించు యాజ్యావాక్యామంత్రములు రెండింటికిని, నడుమఁ బ్రజాపతిని దేవతగా బోధించు “ప్రజాపతే న త్వ దేతాని, స వేద పుత్రః పితరమ్” అను యాజ్యా వాక్యామంత్రములు రెండును బఠింపఁబడుచున్నవి. ఐతరేయబ్రాహ్మణమం, దాగ్నేయయాజ్యావాక్యామంత్రములు రెండింటికిని, ఐంద్రాగ్నయాజ్యా వాక్యామంత్రములు రెండింటికిని నడుమ, విష్ణువును దేవతగా బోధించు ‘ఇదం విష్ణు ర్విచక్రమే, ప్రతద్విష్ణు స్తవతే’ అను యాజ్యావాక్యామంత్రములు రెండును బఠింపఁబడుచున్నవి. ఆ బ్రాహ్మణము

మూలముననే తెలియుచున్న దని, (మీ. ద. ౨ అధ్యా) ఉపాంశుయాజాధికరణము నందుఁ జెప్పఁబడియున్నది.

ఇచట నొక పూర్వపక్షి యిట్లు శంకించుచున్నాఁడు. ఇట్లు మంత్రవర్ణ మగ్నిని దేవతగాఁ దెలియఁజేయు నని యంగీకరించినపక్షమునఁ బ్రజాపతి దేవతచే నగ్నికి బాధ సంభవించెడిని. అది యె ట్లంటేని:— 'ప్రజాపతయే' అను పదమునందలి చతుర్థీవిభక్తిచేఁ బ్రజాపతి దేవతగా వినియోగింపఁ జేయఁబడుచున్నాఁడు. అగ్ని యన్ననో పై నుదాహరింపఁబడిన మంత్రవర్ణముచే, దేవతగాఁ దెలియఁజేయఁబడు చున్నాఁడు. ఆలోచింపఁగా, 'తద్ధిత' ప్రత్యయము, దేవతాత్వమును బోధించు ననుటకు 'సాఽస్య దేవతా' (౪-౨-౨౪ పాణిని) అను సూత్రము ప్రమాణముగా నున్నట్లు చతుర్థీవిభక్తి దేవతాత్వమును బోధించు ననుట, కట్టి ప్రమాణము లేదు. 'సంప్రదానే చతుర్థీ' అను పాణినిసూత్రముచేఁ, జతుర్థీవిభక్తి సంప్రదానత్వమునే బోధించునని తెలియుచున్నది.అయినను దేవతాత్వ మనఁగా సమర్పింపఁబడు ద్రవ్యమున కుద్దేశ్య మగుట. సంప్రదానత్వ మనునది, త్యజింపఁబడు ద్రవ్యమున కుద్దేశ్య మగుచు, దానిని బ్రతిగ్రహించున దగుటంజేసి, దేవతాత్వము సంప్రదానత్వమునం దంతర్గత మయియే యున్నది. కావున దేవతాత్వము సంప్రదానత్వమునం దంతర్గత మై యుండుటమూలముగాఁ జతుర్థీవిభక్తివలనఁ దెలియఁజేయఁబడుచునే యున్నది. మంత్రవర్ణముచే నన్ననో, దేవతాత్వము తెలియఁజేయఁబడుట లేదు. మఱేమన, వ్యక్తిమాత్రము తెలియంజేయఁబడుచున్నది. కనుక, మంత్రవర్ణము చతుర్థికంటె దుర్బలమైనది. ఇందులకు "తద్ధితముచేతను[3] గాని, చతుర్థిచేతను గాని, మంత్రవర్ణముచేఁ గాని, దేవత విధింపఁబడును. వానిలోఁ బూర్వపూర్వముకంటె, నుత్తరోత్తరము దుర్బల మగును." అను మీమాంసకుల నిర్ణయము ప్రమాణముగాఁ గలదు

నందే అగ్నీషోములను దేవతగా బోధించు 'ఆన్యం దివో మాతరిశ్వా, అగ్నీషోమా వో అద్య వామ్' అను యాజ్యావాక్యామంత్రములు రెండును బఠింపఁబడుచున్నవి. ఇట్లే యితరశాఖలందుఁ బఠింపఁబడిన యాజ్యావాక్యామంత్రముల మూలముగా విష్ణువు మున్నగువారు దేవత లని తెలియుచున్నది.

౧. అది దీనికి దేవతగాఁ గలదు, అనునర్థమందు, అణ్ మున్నగు ప్రత్యయములు వచ్చును.

౨. సంప్రదానత్వమును బోధించుటకుఁ జతుర్థీవిభక్తి వచ్చును. (పా. సూ. ౨-3-౧3.)

3. తద్ధితేన చతుర్థ్యా వా మంత్రవర్ణేన వా పునః, దేవతాయా విధి స్తత్ర దుర్బలం తు పరంపరమ్. తం. వా. ౨-౨-౯ పృష్ఠమ్. ౫3౧.

గదా! కావునఁ బ్రబలప్రమాణముచే బోధిత మగు ప్రజాపతి దేవతవలన, దుర్బలప్రమాణముచే బోధితమగు, నగ్నికి, బాధ తప్పక సంభవించెడిని.

ఇట్లు పూర్వపక్షి చేసిన శంక కీ క్రిందిది సమాధానము :— పూర్వపక్షి చెప్పినమాట సత్యమే. 'య దగ్నయే చ' అను నీ మున్నగు వాక్యముచే, కేవలము ప్రజాపతి దేవత యొకటియే విధింపఁబడు నెడల, దానివలన నగ్నికి బాధ కలుగనేకలుగును. కాని, యీ వాక్యముచే విధింపఁబడు ప్రజాపతిమాత్రము, మంత్రవర్ణముచేఁ బ్రాప్తించి యిచట ననువదింపఁబడిన యగ్నితోఁ గూడి యుండియే హోమమున కంగముగాఁ దెలియఁజేయఁబడుచున్నది. ఒండొరులతోఁ గలసి యుండు నీ దేవత లిరువురను విధించుటకంటె వేఱొకచోటఁ బ్రాప్తించిన యగ్ని ననువదించి, దానితోఁ గూడిన ప్రజాపతినిమాత్రము విధించుట సుఃలు వగుచున్నది కదా! కనుక, నగ్నితో సంబంధము నపేక్షింపని ప్రజాపతిదేవత యొకటి మాత్రమే, యిచట విధింపఁబడుట లేదు కావున, నిచటఁ బ్రజాపతిదేవత యగ్నిని బాధింప నేరదు. పూర్వపక్షిమతమున, అగ్ని ప్రజాపతు లిరువురను హోమము నుద్దేశించి విధించుటఁజేసి, ప్రయోజనము సమాన మగుటవలన, వా రిరువురకును, వికల్పము రావలసియుండఁగా, వా రిరువుర కూడికను విధించుటచేఁ, బ్రజాపతి యొక పక్షము నందుమాత్రమే యగ్నిని బాధించుట యెట్లు కుదురదో యట్లే, మంత్రవర్ణమువలనఁ బ్రాప్తించిన యగ్ని ననువదించి, దానితోఁ గూడిన ప్రజాపతిని విధించునపుడును, నా ప్రజాపతి యగ్నిని బాధింపనేరకుండుట, పూర్వపక్షిచేఁ గూడ నంగీకరింపఁబడ వలసియే యున్నది. అ ట్లంగీకరింపనిచోఁ, బూర్వపక్షిమతమున, నగ్నిప్రజాపతులకు వికల్పము సంభవించెడిని.

"అగ్ని మంత్రవర్ణముచేఁ బ్రాప్తించు నని యంగీకరించినపక్షమున, స్పష్టమైన యొకటేలింగము గల మంత్రవర్ణమువలె, వేఱువేఱు లింగములుగల మంత్రవర్ణముకూడ, దేవతను బ్రాప్తింపఁజేయవలసి యుండుటంజేసి, 'అగ్ని[1] ర్జ్యోతి ర్జ్యోతి స్సూర్య స్స్వాహా' అను మిశ్రలింగములుగల[2] మంత్రవర్ణముయొక్క సామర్థ్యము వలన, సాయంకాలహోమము, అగ్ని సూర్యుఁడు నను నిరువురు దేవతలు గలది యయ్యెడి" నని శంకింపరాదు. అగ్నిసూర్యు లిరువురును మిశ్రలింగకమంత్రవర్ణములచేఁ

౧. తై. బ్రా. ౨-౧-౨-౧౦.

౨. అనేక దేవతలను బ్రాప్తింపఁజేయునవి.

ప్రాప్తించినను, నట్లు ప్రాప్తించిన యగ్నితోఁ గూడిన ప్రజాపతి, "య దగ్నయే" అను వాక్యముచే సాయంకాలహోమమున కంగముగా విధింపఁబడునట్లు, మంత్రవర్ణముచేఁ బ్రాప్తించిన సూర్యునితోఁ గూడిన ప్రజాపతి, యే బ్రాహ్మణవాక్యముచేతను విధింపఁబడుట లేదు గనుక, చతుర్థీవిభక్తి యనెడు ప్రబలప్రమాణముచే బోధింపఁబడిన ప్రజాపతివలన, దుర్బలప్రమాణ మయిన మంత్రవర్ణముచేఁ బ్రాప్తించిన సూర్యునికి, బాధ యుండనేయుండును.

"అగ్ని మంత్రవర్ణముచేఁ బ్రాప్తించు నని యంగీకరించినపక్షమునఁ, బ్రజాపతి, యావృత్తి కలుగునట్లు చేయుటవలనఁ బ్రాతఃకాలహోమముతోను, సాయంకాలహోమముతోను గూడ, సంబంధింపఁజేయఁగలుగుటఁజేసి, యాదేవత నట్లు విధించుట 'ప్రజాపతయే జుహోతి' అను నొకటేవాక్యముమూలముగా సిద్ధింపఁగలదు గనుక, 'య[1] దగ్నయే చ ప్రజాపతయేచ సాయం జుహోతి' 'యత్సూర్యాయ చ ప్రజాపతయే చ ప్రాత ర్జుహోతి' అను వాక్యములు రెండును వ్యర్థము లయ్యెడిని" అనియైనను జెప్పవలదు. ప్రజాపతిని విధించుటమాత్రమే వివక్షింపఁబడునెడల, నివి వ్యర్థము లగుట సత్యమే. కాని సాయంకాలహోమమునుగూర్చి యగ్నితోఁ గూడిన ప్రజాపతిని విధించుటయుఁ, బ్రాతఃకాలహోమమును గూర్చి, 'సూర్యో[2] జ్యోతి ర్జ్యోతి స్సూర్య స్స్వాహా' అను మంత్రవర్ణముచేఁ బ్రాప్తించిన సూర్యునితోఁ గూడిన ప్రజాపతిని విధించుటయును వివక్షింపఁబడుచున్నవి. ఇవి, 'ప్రజాపతయే జుహోతి' అను నొకటేవాక్యముమూలముగా సిద్ధింపనేరవు. కావున నీ రెండు[3] వాక్యములును సార్థకము లగుచున్నవి.

౧. ఇచటఁ 'ప్రజాపతయే జుహోతి' యను నొకవాక్యముమాత్రమే, ప్రజాపతిని రెండు హోమములతోను సంబంధింపఁజేయుటకుఁ జాలును గనుక, నీవాక్యమునందలి 'అగ్నయే, సాయం' అను పదములు రెండును, 'యత్సూర్యాయ చ ప్రజాపతయే' అను మున్నగు రెండవవాక్యమును వ్యర్థ మయ్యెడి నని పూర్వపక్షియొక్క తాత్పర్యము. ఇది మై. సం. ౧-౮-౪. నందు వివరింపఁబడినది.

౨. మై. సం. ౧-౮-౧.

3. సాయంకాలహోమమునుగూర్చి, యగ్నితోఁ గూడిన ప్రజాపతిని విధించుట, యిష్ట మగుటంజేసి మొదటివాక్యమునందు 'అగ్నిస్సాయం' అను పదము లావశ్యకము లగుచున్నవి. ప్రాతఃకాల హోమమునుగూర్చి, సూర్యునితోఁ గూడిన ప్రజాపతి యెచటను బ్రాప్తింపకపోవుటంజేసి, యందులకై రెండవ "య త్సూర్యాయ చ" మున్నగు వాక్య మావశ్యక మగుచున్నదని తాత్పర్యము.

ఇచట మరల నొకఁ డిట్లు శంకించుచున్నాఁడు: అగ్ని మంత్రవర్ణముచేఁ బ్రాప్తించు నని యంగీకరించుపక్షమున, నా మంత్రవర్ణము, "అగ్ని [1]ర్జ్యోతి జ్యోతి రగ్ని స్స్వాహేతి సాయం జుహోతి" అను వాక్యముచే సాయంకాలహోమమందు వినియోగింపఁబడుటం జేసి, యా మంత్రవర్ణముచేఁ దెలియఁజేయఁబడు నగ్నికూడఁ, బ్రజాపతితోఁ గూడి, యా సాయంకాలహోమమునందే దేవత యగు నని తెలియుట వలన, "య దగ్నయే చ" మ్మన్నగు వాక్యమునందలి 'సాయమ్' అను శబ్దము వ్యర్థ మయ్యెడిని. ఇట్లే "సూర్యో జ్యోతి జ్యోతిస్సూర్యస్స్వాహా" అను మంత్ర వర్ణము, "సూర్యో జ్యోతి ర్జ్యోతి స్సూర్య స్స్వాహేతి ప్రాత ర్జుహోతి" అను వాక్యముచేఁ, బ్రాతఃకాలహోమమునందు వినియోగింపఁబడుటంజేసి, యా మంత్ర వర్ణముచేఁ బ్రకాశింపఁజేయఁబడు సూర్యుఁడుకూడఁ, బ్రజాపతితోఁ గూడి, ప్రాతః కాలహోమమందే దేవత యగునట్లు తెలియుటవలన, "య త్సూర్యాయ చ ప్రజా పతయే చ ప్రాత ర్జుహోతి" అను వాక్యమునందలి, 'ప్రాతర్' అను శబ్దము వ్యర్థ మయ్యెడిని. ఇంతే కాక, "అగ్ని ర్జ్యోతి ర్జ్యోతి రగ్ని స్స్వాహా" అను మంత్రవర్ణము నందు, అగ్ని, జ్యోతిస్సు అను రెండు పదములును, సమానవిభక్తికము లై సమా నాధికరణములుగా నుండుటంబట్టి యా మంత్రవర్ణముచే, జ్యోతిష్ట్వ [2] మను గుణ ముతోఁ గూడిన యగ్ని తెలియంజేయఁబడుటంజేసి యీ గుణముతోఁ గూడిన యగ్ని [3] యే యిచట దేవత కావలసియుండును.

అట్టి శంకయును సరి కాదు. ఏల యన:—'య దగ్నయే చ ప్రజాపతయే చ సాయం జుహోతి' అను వాక్యముచే అగ్ని ప్రజాపతి అను నిరువురు దేవతలును, హోమమున కంగములుగా విధింపఁబడుదు రని, యంగీకరించుపక్షమునందుఁ గూడ, హోమమునకు సంబంధించు దేవతలను బ్రకాశింపఁజేయు, "అగ్నిర్జ్యోతిః... స్వాహా", "సూర్యో...స్వాహా" అను మంత్రవర్ణములయందలి అగ్ని-సూర్యుఁడు అను పదములయం దుండు లింగములమూలముననే, యా యుభయులును నాయా హోమ

౧. ఈ మంత్రముచే, సాయంకాలమునందు హోమము నాచరించుటమూలముగా, నిష్టమును సంపాదించుకొనవలయును. ఐ. బ్రా. పం. ౫ అ. ౫. ఖం, ౩౧., తై. బ్రా. ౨-౧-౯-౨.

౨. జ్యోతి స్సగుట.

౩. సిద్ధాంతమునం దన్ననో, కేవలాగ్నియే ప్రజాపతితోఁ గూడునట్లు విధింపఁబడుటంజేసి, జ్యోతిష్ట్వ మనెడు గుణముతోఁ గూడినయగ్నియే, దేవతగాఁ గావలసిన దను నాపత్తి సంభవింప నేరదని తాత్పర్యము.

ముల కంగములగుట తెలియుచుండఁగా, మరల నా యుభయులనే, యాయా హోమ ముల కంగములుగా వినియోగింపఁజేయు 'అగ్ని ర్జ్యోతి ర్జ్యోతి రగ్ని స్స్వాహేతి సాయం జుహోతి' 'సూర్యో జ్యోతి ర్జ్యోతి స్సూర్య స్స్వాహేతి ప్రాత ర్జుహోతి' అను రెండువాక్యములును, వ్యర్థములు కావలసివచ్చును.[౧] ఒకవేళ నీ రెండు విధివాక్య ములును లేనియెడలఁ, బాఠముచేఁగాని, ప్రకరణాదిప్రమాణములమూలముగాఁ గాని, సాయంహోమమునకును, ప్రాతర్హోమమునకును నంగములుగాఁ బ్రాప్తించు శుద్ధలిం గములుగల[౨] "అగ్ని ర్జ్యోతి...స్వాహా", "సూర్యో...స్వాహా" అను మంత్రవర్ణ ములు రెండును, "అగ్ని...స్వాహేతి సాయం జుహోతి" "సూర్యో...స్వాహేతి ప్రాత ర్జుహోతి" అను వాక్యములమూలమున, వినియోగింపఁజేయఁబడు, మిశ్రలింగములు గల[౩] "అగ్ని...స్వాహా, సూర్యో...స్వాహా" అను మంత్రవర్ణములచేత బాధింపఁబడ వలసి యుండుటంజేసి, మరల నా శుద్ధలింగములుగల మంత్రవర్ణములు రెండింటిని, ప్రతిప్రసవమురీతిని,[౪] బ్రాప్తింపంజేయుటకు, నీ రెండువాక్యములును నావశ్యకములే యగు నని యూహించినను, నీ రెండువిధివాక్యములయం దుండు 'సాయం, ప్రాతః', అను పదములవైయర్థ్యము నివారింప శక్యము కానేరదు. ఈ రెండువాక్యములచే విధింపఁబడు మంత్రవర్ణములు రెండును, బ్రత్యేకముగ సాయంప్రాతర్హోమములకు నంగములుగాఁ బ్రాప్తించుట సంభవించుటంజేసి, యా వాక్యములచేఁ బ్రకాశింపఁ జేయఁబడు నిరువురు దేవతలును, నట్లె క్రమముగా సాయంప్రాతర్హోమముల కంగ మగుట సిద్ధించుచున్నదిగదా![౫] ఈ రెండువాక్యములయందు 'సాయం, ప్రాతర్' అను శబ్దములు రెండును, వేఱువిధముగాఁ దెలియంజేయఁబడిన, హోమముల నను

౧. సిద్ధాన్త మగు మతమందు, "య దగ్నయే చ" అను వాక్యమునందలి సాయంశబ్దమును, 'య త్సూర్యాయ చ' అను వాక్యమునందలి ప్రాతశ్శబ్దమునుమాత్రమే, వ్యర్థము కావలసి యుండును. పూర్వ పక్షిమతమం దన్ననో, యీ రెండువాక్యములును వ్యర్థము కావలసి యుండుటంజేసి, తేలు కుట్టు నసుధ యముచేఁ బరుగిడుచు, సర్పబిలమునందుఁ బడునట్లున్న దని భావము.

౨. శుద్ధలింగములు = ఒకటే దేవతనుగూర్చి, హోమము మున్నగు కర్మములను విధించునవి.

౩. మిశ్రలింగములు = అనేకదేవతలనుగూర్చి, హోమము మున్నగు కర్మములను విధించునవి.

౪. ప్రతిప్రసవము = ప్రసంగముచేఁ బ్రాప్తించుదానికి, వేఱుకారణముచే నివృత్తి కలుగంబోవు చుండఁగా, దానిని బ్రాప్తింపఁజేయుటకై మరల విధించుట.

౫. ఇట్లగుటచే, 'అగ్ని ర్జ్యోతిః' అను వాక్యమునందలి సాయంశబ్దమును, 'సూర్యో జ్యోతిః' అను వాక్యమునందలి ప్రాతశ్శబ్దమును వ్యర్థములే యగు నని తాత్పర్యము.

వదించుట, కావశ్యకము లని యంగీకరించుట యన్ననో, "య దగ్న యే చ ప్రజాపతయే చ సాయం జుహోతి" అను వాక్యమునందలి సాయంశబ్దమునకును, 'య త్సూర్యాయచ ప్రజాపతయే చ ప్రాత ర్జుహోతి' అను వాక్యమునందలి ప్రాతశ్శబ్దమునకును, సమానముగానే సిద్ధింపఁగలదు. గనుక, నిచటఁ బూర్వపక్షి చేసినయాక్షేపము సరికానేరదు.

"అగ్నిర్జ్యోతిః...స్వాహా" అను మంత్రవర్ణముచే, నగ్ని ప్రకాశింపఁజేయఁబడినను, గేవల మగ్నిమాత్రమే దేవత యగును గాని, జ్యోతిష్ట్వ మనెడు గుణముతోఁ గూడినయగ్ని, దేవత కానేరదు. మంత్రవర్ణమునందుఁ బఠింపఁబడు గుణము, లందలి దేవతలకు విశేషణములు కానేర వనియు, నా దేవతను విధించు విధివాక్యమునందలి గుణములే, యా దేవతకు విశేషణములు కావలసి యుండు ననియును, బదవయధ్యాయమునందు నిర్ణయింపఁబడినది. కనుక, "య దగ్న యే చ" అనువాక్యమునందును, "అగ్నేః పూర్వాహుతిః"అను బ్రాహ్మణమునందును, గేవల మగ్నిమాత్రమే పఠింపఁబడుటంజేసి, కేవల మగ్నియే యిచట దేవత యని తెలియుచున్నదిగదా! ఉపాంశుయాజమందలి, విష్ణువు మున్నగువారు, మంత్రముచేఁ దెలియంజేయఁబడినను, "విష్ణు రుపాంశు యష్టవ్యః, అజామిత్వాయ" అను నర్థవాదమునందుఁ గేవలము విష్ణువే కాని, గుణముతోఁ గూడినవిష్ణు వెట్లు కానేరఁడో, యట్లే యీ సాయంహోమమునందలి దేవత, కేవల మగ్నియే కాని, గుణముతోఁ గూడినయగ్ని కానేరఁడని, గ్రహింపవలయును. కాఁగా, నగ్ని, మంత్రవర్ణముచేఁ బ్రాప్తించు నని యంగీకరించుపక్షమునందుఁగూడ, దోషము లేవియు సంభవింపనేరవు గనుకను, 'య దగ్న యే చ' అను వాక్యముచే అగ్నియుఁ బ్రజాపతియు నను నిరువురును విధింపఁబడునెడ నన్వయక్లేశ మను గౌరవము సంభవించును గనుకను, వేఱొకచోట మంత్రవర్ణముచేఁ బ్రాప్తించినయగ్ని ననువదించి, దానితోఁ గూడిన ప్రజాపతి యొకఁడుమాత్రమే యీ వాక్యమునందు దేవతగా విధింపఁబడుచున్నాఁడు. సాయంకాలమునందలి హోమము ననువదించి, యగ్నిప్రజాపతుల నుభయులను, దేవతలుగా విధించినచో, వాక్యభేదము తప్పక సంభవించెడినిగదా!

౧. తై. బ్రా. ౨-౧-౨-౧౦.

౨. ఇచట వినఁబడు ప్రజాపతిపదమునకు, 'అగ్నితోఁ గూడినప్రజాపతి' అను విశిష్టార్థమును, ఇతరపదములకు 'తాత్పర్యమును గ్రహింపఁజేయుట' అను నర్థమును, గల్పించుటవలన, నన్వయక్లేశము సంభవించు నని భావము,

ఈ 'యదగ్న యేచ' అను వాక్యమునందు సముచ్చయ[1]మును దెలియఁ జేయు 'చ' అను నిపాతము వినఁబడుటంజేసి, యీ యగ్ని ప్రజాపతు లిరువురును, స్వాతంత్ర్యముగా విధియం దన్వయింపక, యీ నిపాతమున కర్థమగు సముచ్చయము తోనే యన్వయించుటమూలమున, నొండొంటితో సంబంధింపఁగలవు గనుక, నిచట వాక్యభేదము సంభవింపనేరదే! అని చెప్పవలదు. ఏల యన, సముచ్చయ మనునది, యిచటి నిపాత మగు చకారమున కర్థము.

ఈ చకారము సముచ్చయమును ప్రధానముగా బోధించు పక్షమునఁ ప్రధాన మగునది యనేక విశేషణములతోఁ గూడి యుండఁగలుగుటంజేసి "అరుణయా పింగాక్ష్యా ఏకహాయన్యా గవా సోమం క్రీణాతి" అను వాక్యమునందలి గుణములగు 'ఎఱ్ఱని రంగుగలుగుట, పచ్చని కన్నులు గలుగుట, ఒక సంవత్సరము వయసుండుట" యనునవి ప్రధానమైన సోమమును గొనుట యనెడు భావనకు వశమగుటంజేసి, యాగుణములతోఁ గూడిన యా క్రయభావన నే విధింపఁబడుటవలన, వాక్యభేద మెట్లు కలుగదో, యట్లే యిచటఁగూడ, నగ్ని, ప్రజాపతి, యను రెండు కారకముల సముచ్చయమునే విధించుటచే, వాక్యభేదము కలుగనేరదు. 'చ' కారము, సముచ్చయము నితరపదార్థముల కుపసర్జనము (అంగము) గానే బోధించు[2]చున్నది గాని, ప్రధానముగా బోధింపదు.

కావుననే, దశమాధ్యాయమునందు, భాష్యకారులగు శబరస్వామి, 'చ' కారమునకును, సముచ్చయ మను శబ్దమునకును, భేదము కల దని యిట్లు వివరించిరి: సముచ్చయపదమే, సముచ్చయ మను నర్థమును బోధించును గాని, 'చ' కార మట్లు బోధింపదు. 'చ' కారమే యట్టి యర్థమును ప్రధానముగా బోధించునేని, నా 'చ' కారముచే బోధింపఁబడు సముచ్చయ మను నర్థము, క్రియలతోను, గుణములతోను, సంబంధింప నగును. అట్లయినచో, "సముచ్చయము[3] శోభనమైనది", "సముచ్చయము చూడఁదగినది" అని ప్రయోగించునట్లు, 'చ' శోభనమైనది, 'చ' చూడఁదగినది- అనికూడఁ బ్రయోగింపఁదగియుండెడిని. సముచ్చయ

౧. సముచ్చయము = కూడిక.

౨. ఇట్లే యుపసర్గములుకూడ, నితరపదార్థముల కంగమగు నర్థమును బోధించుస్వభావము గలవని గ్రహింపవలయును.

3. ఇచట, సముచ్చయ మనునర్థము, గుణములతోను, క్రియతోను, సంబంధించుచున్నది.

శబ్దమువలె, 'చ' శబ్దముకూడ, సముచ్చయ మనునర్థమును బ్రధానముగా బోధించు పక్షమున, "ధవఖదిరయోః సముచ్చయః" అని ప్రయోగించునట్లే, సముచ్చయమునకు విశేషణములను బోధించు, ధవ, ఖదిర శబ్దములమీఁద, షష్ఠీవిభక్తులను జేర్చి, "ధవఖదిరయోః చ" అనికూడఁ బ్రయోగింపందగియుండెడిని.

కనుక, 'చ' శబ్దము, సముచ్చయ మనునర్థమును బ్రధానముగా బోధించుట లేదు. అట్లు బోధించునెడఁ, బ్రధాన మొక్కటియే విధింపంబడుటంజేసి, వాక్యభేదము సంభవింపకపోయెడిని. కాని, 'చ' శబ్దము, సముచ్చయ మనునర్థమును, నిచటి రెండు కారకములకును నుపసర్జనముగానే బోధించుచున్నది. కనుక, నీ వాక్యమునందు, "కూడియుండు నగ్ని ప్రజాపతు లిరువురు" అను నర్థము సిద్ధించుచున్నది. కాఁగా, "గ్రహం సమ్మార్ష్టి" అను వాక్యమునందుఁ, బ్రాప్తించిన గ్రహము నుద్దేశించి, సమ్మార్జనమును, 'గ్రహమ్' అను పదమునందలి యేకవచనమును గూడ, విధించినచో, వాక్యభేద మెట్లు కలుగునో, యట్లే రెండు ప్రధానములను విధించుపక్షమున, వాక్యభేదము తప్పక సంభవించెడిని.

ఆలోచింపఁగా, 'చ' శబ్దము, సముచ్చయ మను నర్థమును బ్రధానముగా బోధించును. అయినను, నా సముచ్చయ మనునర్థ, మిచటి కారకముల రెండింటిని గూర్చి, ప్రధానము కానేరదు. విభక్తిచే బోధింపఁబడు కారకములు రెండును, గ్రియ కుపసర్జనము లగుటంజేసి, సముచ్చయ మను నర్థమున కుపసర్జనములు కానేరవుగదా! కృదంతము[3] మున్నగు శబ్దములచే బోధింపఁబడు కారకము, క్రియకంటె నితరమగు శబ్దముతో నన్వయింపఁగలదు. కావున, "కారకములయొక్క సముచ్చయము కరణములయొక్క సముచ్చయము," అను నిట్టి ప్రయోగములు సిద్ధించుచున్నవి. విభక్తిచే బోధింపఁబడునది యన్ననో, క్రియతోనే యన్వయించును. కారకములు క్రియతోనే యన్వయింపఁదగి యున్నవి గదా! కాఁగా, 'చ' శబ్దముచే బోధింపఁబడు సముచ్చయ మనునర్థము, అచటికారకముల కుపసర్జనముగానే బోధింపఁబడుచున్నది. ఆ కారకములు రెండును బ్రధానము లగుచున్నవి. ఒకదాని నుద్దేశించి, రెండు ప్రధానములను విధించునపుడు, వాక్యభేదము తప్పక

౧ ధవఖదిరములయొక్క సముచ్చయము.

౨. గ్రహము లనఁబడు, పాత్రములను తుడుచునది.

3. కారకము అను శబ్దము.

సంభవించును. ఇందులకు, "ఆలోచింపఁగా, నొకటే కారకము, వేఱువేఱర్థములను బోధించు వేఱువేఱు ప్రాతిపదికములతో, సంబంధించి యుండవచ్చును. అయినను, నా కారకమునం దుండు ప్రత్యయము, నావృత్తి చేయుదే, యీ కారకమును విధించుట శక్యముగాదు" అను ఆగ్నేయాగ్నిహోత్రాధికరణమునందలి తంత్రవార్తికము ప్రమాణముగాఁ గలదు.

"దక్షిణ ననువదించి, గోవు మున్నగు ననేకద్రవ్యములను విధించునపుడు, నెట్లు వాక్యభేదము కలుగదో యట్లే, రెండు కారకములను విధించునపుడుకూడ, వాక్యభేదము కలుగనేరదు." అనియును జెప్పరాదు. "గోవును నశ్వమును..." అను నీ మున్నగు వాక్యమునందుఁ, బైని చెప్పఁబడినరీతిని వాక్యభేదము కలుగు ననుభవము వలన, దక్షిణ ననువదించి గోవు మున్నగువాని విధింపఁబడుట లేదు. ఇందలి గోవు, అశ్వము మున్నగుపదములమీఁదఁ గారకవిభక్తులు లేకుండుటచేసి, దగ్గఱ నుండు 'చ' శబ్దమున కర్థమగు సముచ్చయముతో, నెల్లని నన్వయించుటమాత్రమగును, వాక్యభేదము పరిహరింపఁబడఁదగి యున్నను, 'చ' శబ్దము, తనసమీపమున నుండు గోవు మున్నగు ద్రవ్యముల సముచ్చయమునే, తెలియఁజేయును గాని, యీ ద్రవ్యముల యొక్కయు, వానితో సంబంధించునట్లు వినఁబడిన ద్వాదశశత మను సంఖ్యయొక్కయు, సముచ్చయమును దెలియఁజేయనేరదు గనుక, దక్షిణ నుద్దేశించి గోవు మున్నగు ద్రవ్యములు, సముచ్చయముమాత్రముగ విధింపఁబడఁగా, నప్రాప్త మగు సంఖ్యకూడ విధింపఁబడవలసి యుండుటవలనఁ బ్రాప్తించిన దక్షిణ నుద్దేశించి, గోవు

౧. వాస్తవముగా నిచటఁ గారకములుకూడ ననేకము లుండుటచేసి, వానిని విధింపఁజేయు ప్రత్యయమున, కావృత్తి చేయుట యావశ్యకమని గ్రహింపవలయును. ఇచటఁ బ్రజాపతిశబ్దము, 'ప్రజలకుఁ బతి' అను వ్యుత్పత్తిచే, నగ్నికి విశేషణముగా నంగీకరించి, యీ విశేషణముతోఁ గూడిన యగ్ని యను, నొకటే దేవత యచటఁ గలదని చెప్పునపుడుకూడ, నీ యగ్ని ప్రజాపతు లిరువురును, క్రియతో నన్వయించుటకుఁ బూర్వము, వారి కుండు విశేషణవిశేష్యభావము, తెలియకుండుటచే, నొక్కొకదానికే ప్రత్యేకముగా, విధివ్యాపార ముండుటంబట్టి, విధిప్రత్యయమున కావృత్తి యావశ్యకమే. ఇట్లుండఁ, బ్రజాపతిశబ్దమునర్థాంతరమునందు రూఢమగుటవలన, నగ్నికి విశేషణము కానేరకపోవుటంజేసియు, నగ్ని, ప్రజాపతిశబ్దములమీఁద, వేఱువేఱు విభక్తు లుండుటంజేసియు, నీ యిరువురును వేఱువేఱు కారకము లగు ననుటకు, సంశయ మేమి యుండును?

౨. అనేకపదసంబద్ధం యద్యేకమపి కారకం, తథాపి తదనావృత్తైః ప్రత్యయైర్న విధీయతే. తం. వా. ౨-౨-౫ పేజీ ౫౦౩.

మున్నగు ద్రవ్యములు, సంఖ్యయు నను ననేకములను విధించుటద్వారమునం గలిగెడి, వాక్యభేదము పరిహరింప నశక్యమే యగును. 'ఆధ్వర్యవము'[1] అను పేరుగల శాఖయందు "గౌశ్చ అశ్వాశ్చ..." ఈ మున్నగువాక్యమును "తస్య ద్వాదశశతమ్" అను వాక్యమును గలసి, పఠింపఁబడుటచేత, నీ రెండును నొకటేవాక్యముగా నన్వయింప వలయు నని, పదియవ యధ్యాయమందుఁ జెప్పంబడియున్నది. కావున నీ వాక్యముచే, గవాదిద్రవ్యములతోడను, 'నూటపండ్రెండు' అను సంఖ్యతోడను, గూడిన దక్షిణయే, విధింపఁబడుచుండుటం జేసి, యిచట వాక్యభేదము గాదు. కనుకనే, పార్థసారథిమిశ్రులు, పదవయధ్యాయమునం దచ్చటచ్చట "గవాదిద్రవ్యములు, సంఖ్యయు నను నీరెండింటితోడఁ గూడినదక్షిణ, విధింపఁబడుచున్నది" అని మూఁడవపాదమునం దుండు దక్షిణాధికరణమునందును,[2] అనేకము లగు గోవులు మున్నగువానితోఁ గూడిన దక్షిణ యొక్కటే విధింపఁబడుచున్న దని మూఁడవపాదమునందలి ధేన్వధికరణమునందును[3] జెప్పిరి. ఇట్లయినచో, 'ఋత్విజులకొఱకు[4] దక్షిణ నిచ్చుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.' అను విధి నిష్ఫల మగునే, యని చెప్పవలదు. ఈ విధి, పూర్వము విధింపఁబడిన దక్షిణ ననువదించుటకుఁ గాని, యీ దక్షిణ ఋత్విక్కులతో సంబంధించు నని తెలియంజేయుటకుఁగాని, యుపయోగించును గదా! ఈ వాక్యము లేనియెడలఁ బూర్వవిధియం దుండు 'దక్షిణా' పదమునందలి సామర్థ్యమువలన, ఋత్విక్కులతోడను, చమసాధ్వర్యులతోడను[5] గూడ, దక్షిణ

౧. అధ్వర్యుఁడు చేయుకృత్యములను బోధించుశాఖ. సామవేదముయొక్క తాండ్యశాఖయందు 'గౌశ్చ అశ్వశ్చ...' అనునీ మున్నగు వాక్యముకంటె "తస్య ద్వాదశశతమ్" (౧౧౨) అనునీ వాక్యము భిన్నముగా నుండుటంజేసి, ద్రవ్యములయొక్కయు, సంఖ్యయొక్కయు, విధానమువలనఁ గలిగెడి వాక్యభేదము సంభవింపనేరదు-అని గ్రహింపవలయును.

౨. ౧౦-౩-౧౧.

౩. ౧౦-౩-౧౪.

౪. "ఋత్విగ్భ్యో దక్షిణాం దదాతి"

౫. జ్యోతిష్టోమమందు బ్రహ్మ, హోత, యజమానుఁడు, ఉద్గాత, మైత్రావరుణుఁడు, బ్రాహ్మణాచ్ఛంసి, పోత, నేష్ట, భావకుఁడు, ఆగ్నీధ్రుఁడు నను పదుగురు ఋత్విక్కులకును సంబంధించు, పది చమసములు గలవు. చమస మనఁగా, సోమరసము నుంచు పాత్రవిశేషము. ఈ చమసములం దుండు సోమరసముతో హోమము చేయుట, యధ్వర్యునిచే నాచరింపఁబడవలసి యున్నది. అధ్వర్యుఁ డెప్పుడైన వేఱుకార్యము చేయుచుండినచో, చమసములందలి సోమరసముతో హోమము చేయుటకు, వరింపఁబడు పురుషులు, చమసాధ్వర్యు లని పిలువంబడుచున్నారు.

సంబంధింపవలసియుండెడిది. ఈ వాక్య ముండినపక్షమున, నట్లు తెలిసికొనఁబడదు. ఋత్విక్శబ్దము, విహిత మగు ఋతువునందు యజించుట యను ధర్మమును నిమిత్తముగాఁ గొని, యజమానునితోఁ జేరి పదునేడుగు రగు బ్రహ్మ మున్నగు పురుషులనుమాత్రమే బోధించుటం జేసి. చమసాధ్వర్యులు, ఋత్విక్కులు కానేర రని, తృతీయాధ్యాయమందలి, నేడవపాదమం దున్న, పదునాల్గవ యధికరణమునందు, వివరింపఁబడియున్న దిగదా !

కావుననే, 'గోవును, గుఱ్ఱమును...' అనునీ మున్నగు వాక్యమునందు, గోవు, గుఱ్ఱము, మొదలగు ద్రవ్యములతోఁగూడిన, దానము యొక్కటియే, విధింపఁబడుటం జేసి, వాక్యభేదము సంభవింపదు. 'య దగ్నయే చ...' ఈ మున్నగు వాక్య మున్నచో, నందలి హోమము, 'అగ్నిహోత్రం జుహోతి' అను వేఱువాక్యముచేఁ బ్రాప్తించుటవలన, అగ్నియుఁ, బ్రజాపతియు ననునీ యిరువురు దేవతలతోఁ గూడిన, హోమమును విధించునది కానేరదు. కనుక, వేఱొకచోటఁ బ్రాప్తించిన హోమము నను వదించి, సముచ్చయముగా నీ యిరువురు దేవతలను, విధించుపక్షమున, వాక్యభేదమును, అన్వయక్లేశమును సంభవించుటం జేసి, యీ 'య దగ్నయే' అను నీ మున్నగు వాక్యమువలన, నగ్నిప్రజాపతు లనెడు నిరువురు దేవతలును విధింపఁబడుట లేదు. మ ఱేమన, "అగ్నిర్జ్యోతి...స్వాహా" అను మంత్రవర్ణముచేఁ బ్రాప్తించిన యగ్ని ననువదించి, దానితోఁ గూడిన ప్రజాపతి యను దేవత యొక్కటే, హోమమున కంగముగా విధింపఁబడుచున్నది.

కాఁబట్టి, "య దగ్నయే చ" అను నీ మున్నగు వాక్య, మగ్నిని దేవతగాఁ బ్రాప్తింపఁజేయదు. మ ఱేమన, "అగ్నిర్జ్యోతిః" ఈ మున్నగుమంత్రవర్ణమే, యగ్ని నట్లు ప్రాప్తింపఁజేయుచున్నది. కాఁగా, నగ్ని నామంత్రవర్ణముచేఁ బ్రాప్తించుటం జేసి "అగ్నిహోత్రం జుహోతి" అను వాక్యమందలి 'అగ్నిహోత్రమ్' అనెడి పదము, అగ్ని యనెడు దేవతను బ్రాప్తింపఁజేయునది కానేరదు. మ ఱేమన, నీ వాక్యమునందు విధింపఁబడు హోమమునకు, నామధేయమే యగుచున్నది. 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యమునందలి "అగ్నిహోత్రమ్" అనెడిపదము పైని వివరింపఁబడిన తత్ప్రఖ్యశాస్త్ర మనెడు ప్రమాణమువలన, నిందు విధింపఁబడెడి, హోమ మనెడు కర్మమునకు నామధేయ మగుచున్న దని సిద్ధించుచున్నది.

ఇట్లే "సమిధో యజతి, తనూనపాతం యజతి, ఇడో యజతి, బర్హిర్యజతి, స్వాహాకారం యజతి," అను వాక్యములచే విధింపఁబడు, ప్రయాజము లనెడి హోమ ములయందలి, సమిత్తు, తనూనపాత్తు, ఇడ, బర్హిస్సు, స్వాహాకారము, అనెడు దేవ తలు, "సమిధోఽగ్న ఆజ్యస్య వియన్తు, తనూనపా దగ్న ఆజ్యస్య వేతు, ఇడో అగ్న ఆజ్యస్య వియన్తు, బర్హిషోఽగ్న ఆజ్యస్య వియన్తు, స్వాహాకారోఽగ్న ఆజ్యస్య వేతు" అను మంత్రవర్ణములవలనఁ బ్రాప్తించుటంజేసి, "సమిధో యజతి "మున్నగు వాక్యములయం దుండు 'సమిత్తు', 'తనూనపాత్తు 'మున్నగు శబ్దములు, తత్ప్రఖ్య శాస్త్ర మను ప్రమాణమువలన, నాయా వాక్యములందు విధింపఁబడు కర్మము లకు, నామధేయము లగుచున్నవి. ఇందులకు:—"అగ్నిహోత్రము[3] మున్నగు శబ్ద ములు, గుణములను విధించు నని యంగీకరించుపక్షమున, నా శబ్దములచే విధించుట కుద్దేశింపఁబడు, నగ్ని మున్నగు గుణములను, బ్రాప్తింపఁజేయు, మంత్రవర్ణములు మొ దలగు శాస్త్రాంతరము లుండుటంజేసి, యా గుణములనే మరల నీ శబ్దములచే విధిం చుట వ్యర్థమయ్యెడిని గనుక, నీ యగ్నిహోత్రము మున్నగు పదము, లాయా వాక్య ములందు విధింపఁబడు కర్మములకు, నామధేయములుగా నంగీకరింపఁబడుచున్నవి" అను వాక్యము ప్రమాణముగాఁ గొనుఁడు. ఇట్లే యిటువంటి వాక్యములం దుండు పదము, లీ తత్ప్రఖ్యశాస్త్ర మను ప్రమాణమువలనను, నాయా వాక్యములందు విధింపఁబడు కర్మములకు, నామధేయము లని తెలిసికొనవలయును.

## తద్వ్యపదేశ మను శాస్త్రమువలనఁ గర్మనామధేయమును నిర్ణయించుట

"శ్యేనేనాభిచరన్ యజేత"[4] అను వాక్యమందలి శ్యేన మనుశబ్దము, తద్వ్యప దేశ మను ప్రమాణమువలనను, నిందు విధింపఁబడు కర్మమునకు, నామధేయ

౧. సమిత్తను దేవతగలయాగము నాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును. ఇట్లే మిగిలిన వాక్యములకును నర్థము నూహించుకొనునది.

౨. కా. పశా. ౧-౪.

౩. తం. వా. ౧-౪-౪ పృష్ఠము ౨౯౬.

౪. ఆ. శ్రౌ. సూ. ౨౨-౪-౧౩ శత్రువధము గోరువాఁడు శ్యేన మనుపేరుగల యాగము నాచరించు టచే, నిష్టము నుత్పాదించుకొనవలయును. ఇచట వధ యనఁగా, మరణమును గలిగించు వ్యాపారవిశే షము.

మగుచున్నది. తద్వ్యపదేశము అను పదమునందు, 'తత్ + వ్యపదేశ' అను రెండు పదములు గలవు. వీనిలో 'తత్' అను పదమువలన, శ్యేనశబ్దముచే విధించుటకు నిష్ట మగు శ్యేనపక్షి[౧] యనెడు గుణము బోధింపఁబడుచున్నది. వ్యపదేశ మనఁగా, భిన్న మగు నుపమానముగాఁ జెప్పుట. కనుక, 'తద్వ్యపదేశ' మను శబ్దమువలన, నిచట విధించుటకు నిష్ట మగు గుణమున కుపమానముగాఁ జెప్పుట, గుణవిధి నంగీకరించుపక్షమునఁ గుదురకపోవుటచే, నీవాక్యమునందలి శ్యేనపద, మిందలి కర్మమునకు నామధేయమే యగుచున్న దని తాత్పర్యము. అది యెట్లనఁగా:—ఏది విధింపఁబడఁ దగినదో, యదియే స్తుతింపఁబడును. ఈ వాక్యమును గుణవిధిగా నంగీకరించుటమూలమున, నిచట శ్యేనపక్షి (డేగ) విధింపఁబడునెడ, నీపక్షిగాని యీ విధికి సంబంధించు నర్థవాదములచే స్తుతింపఁబడవలసి యుండును. "యథా వై శ్యేనో నిపత్యాదత్తే, ఏవ మయం ద్విషన్తం భ్రాతృవ్యం నిపత్యాదత్తే" అను నర్థవాదముచే, నీవాక్యమునందు గుణముగా విధించుట కిష్టమగు డేగ స్తుతింపఁబడలేదు. శ్యేన మను నుపమానముచే, దానికంటె వేఱగునదియే,[౩] స్తుతింపఁబడఁదగినదిగదా! శ్యేన మను నుపమానముచే, శ్యేనమే, దానికంటె వేఱు కాకుండుటచే స్తుతింపఁబడ నేరదు. ఒండొంటికంటె భిన్నములై,[౪] యొకదానితో నొకటి పోలి యుండు రెండు వస్తువులే, యుపమానోపమేయములుగా గ్రహింపఁదగి యున్నవికదా! ఈ వాక్యముచే, శ్యేన మనుపేరుగల యొకయాగము, విధింపఁబడుచున్న దని, యంగీకరించుపక్షమునం దన్ననో, శ్యేనపక్షి నుపమానముగా వర్ణించు నర్థవాదముచే, నీ శ్యేన మను యాగము స్తుతింపశక్యమగుచున్నది గనుక, నీ వాక్యమందలి శ్యేనశబ్ద, మిట్లు వివరింపఁబడిన 'తద్వ్యపదేశ'[౫] మను ప్రమాణముమూలమున, నిచట విధింపఁబడు

౧. డేగ.

౨. డేగ, యాకాశమునం దెగురుచు, భూమియం దుండు నేదే నొకవస్తువును జూచి, తటాలున దానిపైఁ బడి, దాని నెట్లు పట్టుకొనునో, యట్లే యదియు, యజమానుని ద్వేషించు శత్రువులపైఁ బడి, పట్టి పీడించును. మరణించునట్లు చేయు నని తాత్పర్యము.

౩. ఉపమేయ మెప్పుడును, నుపమానమునకంటె, వేఱుగనదియై, దానిని బోలి యుండవలెను.

౪. 'సాదృశ్య ముపమా భేదే' అని యుపమాలంకారమునకు లక్షణము, కావ్యప్రకాశికాకారునిచే, నందలి-పదవ యుల్లాసమునందుఁ జర్చింపఁబడియున్నది.

౫. ఉద్భిత్పదమును యోగనామధేయముగా నిర్ణయించు న్యాయము, యౌగికశబ్దములవిషయమే కాని, రూఢశబ్దములవిషయమై ప్రవర్తింపకుండుటంజేసి, యిచట రూఢ మగు శ్యేనశబ్దమువిషయమునఁ

యాగమునకు నామధేయ మగుచున్నది. కావున, నిట్లు వివరింపఁబడిన నాలుగు విధము లగు ప్రమాణములచే, నాయా విధివాక్యములయం దుండు శబ్దము, లందందు విధింపఁబడిన కర్మములకు నామధేయము లని సిద్ధించుచున్నది.

## 'ఉత్పత్తిశిష్టగుణము బలీయ మగుట' అను ప్రమాణముచేఁ గర్మనామధేయమును నిర్ణయించుట

ఉత్పత్తిశిష్టగుణమునందలి[1] బలాతిశయ మను, నైదవ ప్రమాణముకూడఁ, గొన్ని విధులయందలి పదముల, నందు విధింపఁబడు కర్మములకు, నామధేయము లుగా నిర్ణయింపఁగల దని, కొందఱు[2] చెప్పుదురు.

"వైశ్వదేవేన[3] యజేత" అను వాక్యమునందుఁ, బైని వివరింపఁబడిన, 'మత్వర్థ లక్షణాభయము' మున్నగు ప్రమాణములు ప్రవర్తింప నేరకుండుటంజేసి, 'యుత్పత్తి

ప్రవర్తింపనేరదు. చిత్రాపదమును, యాగనామధేయముగా, నిర్ణయించు న్యాయ మైనను, వాక్యభేదము సంభవించు భయము లేకుండుటచే, నిచటఁ బ్రవర్తింపనేరదు. ఈ వాక్యమునందలి 'శ్యేన' పదమున కర్థ మను డేగ యను పక్షిని, గుణముగాఁ బ్రాప్తింపఁజేయు వేఱొకశాస్త్రము లేకుండుటంజేసి, తత్ప్రఖ్యన్యాయ మైనను నిచటి శ్యేనపదమును, గర్మనామధేయమునుగా నిర్ణయింపఁజాలదు. కాఁగా, తద్వ్యపదేశ మను న్యాయముచేతనే, యిచటి శ్యేనపద, మిందు విధింపఁబడు యాగమునకు నామధేయముగాఁ జెప్పఁబడవలసి యున్న దని తాత్పర్యము.

౧. కర్మము నుత్పాదించు, కర్మోత్పత్తివాక్యమునందే, కర్మముతోఁగూడ విధింపఁబడు గుణము నకు, "ఉత్పత్తిశిష్టగుణము" అని పేరు. కర్మోత్పత్తివాక్యముకంటె, వేఱొక వాక్యమునం దా కర్మము ననువదించి విధింపఁబడు గుణము, ఆ కర్మ ముత్పన్న మైనపిదప విధింపఁబడుగుణ మగుటంజేసి, యుత్పన్న శిష్టగుణ మనఁబడుచున్నది. శిష్టము = విధింపఁబడినది.

౨. న్యాయసుధాకారులు మున్నగువారు.

3. చాతుర్మాస్య మను పేరుగల యాగమందు ౧. వైశ్వదేవము, ౨. వరుణప్రఘాసము, 3. సాకమేధము, ౪. సునాసీరీయము నను నాలుగు పర్వములు గలవు. అందు వైశ్వదేవ మను పేరు గల మొదటి పర్వమందు (i) 'ఆగ్నేయ మష్టాకపాలం నిర్వపతి' అను నాగ్నేయ యాగము (ii) 'సౌర్యం చరుం నిర్వపతి' అను సౌర్యయాగము (iii) 'సావిత్రం ద్వాదశకపాలం నిర్వపతి' అను సావిత్రయాగము (iv) 'సారస్వతం చరుం నిర్వపతి' అను సారస్వత యాగము (v) 'పౌష్ణం చరుం నిర్వపతి' అను పూషయాగము (vi) 'మారుతం సప్తకపాలం నిర్వపతి' అను మారుతయాగము (vii) 'వైశ్వదేవ్యామిక్షా' అను వైశ్వదేవయాగము (viii) 'ద్యావా

శిష్టగుణబలాతిశయము' అను నైదవ ప్రమాణముచేతనే, యిచటి వైశ్వదేవశబ్ద మిందలి కర్మమునకు నామధేయ మగుచున్నది. అది యెట్లనఁగా:—మత్వర్థలక్షణ సంభవించు నను భయముచే, నిచటి వైశ్వదేవశబ్దము కర్మనామధేయ మగు నని చెప్పుట తగదు. వైశ్వదేవ అను పదమునందలి తద్ధితప్రత్యయముచేతనే, 'ఈ దేవత దీనికిఁ గలదు' అని యుపస్థిత మగు యాగము తెలియఁజేయఁబడుచున్నది గదా! ఏదే నొక దేవతను బోధించు పదముపైని, 'ఈ దేవత దీనికిఁ గలదు' అను నర్థమును బోధించుటకుఁ దద్ధిత ప్రత్యయము విధింపఁబడుచున్నది. ఆలోచింపఁగా, 'సూక్త హవిషోః' అను వార్తికమును బట్టి, తద్ధితముయొక్క యర్థమునందంతర్గత మగు, 'దీనికి' అను సర్వనామము, సూక్తమునుగాని, హవిస్సునుగాని, నియతముగా ననువదించుచుండుటం జేసి, దానికంటె వేఱగు యాగమును గ్రహింపఁజేయ నేరదు. అయినను, సర్వనామము ఉపస్థితము నగువానినే తెలియఁజేయును గనుకను, సూక్తము హవిస్సు ననునవి యిచట నుపస్థితములు కానేరవు గనుకను, నీ వాక్యమునందలి 'యజేత' పదముచే నుపస్థిత మగు యాగమే 'దీనికి' అను సర్వనామముచేఁ దెలియఁజేయఁబడుచున్నది కావున, నచటి యాగమును బోధించుటకు, మత్వర్థలక్షణ యావశ్యకము కానేరదు. విశ్వదేవరూప మగు నొకటే దేవత విధింపఁబడుటంజేసి, యిచట వాక్యభేద మయినను సంభవింపదు లేక, తత్ప్రఖ్యశాస్త్ర మయినను, నిచట వైశ్వదేవపదమును, యాగమునకు నామధేయముగా సిద్ధింపఁజాలదు. 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యమునందలి యగ్నిహోత్రశబ్దము మున్నగు నెచట, గుణవిధి నంగీకరించుపక్షమున, విధించుట క్లిష్టమగు గుణము, నేదొక వాక్యముచేఁ బ్రాప్తించునో యచట, 'తత్ప్రఖ్యశాస్త్రము'చే నగ్నిహోత్ర మున్నగు పదము, లందలి యాగములకు నామధేయములుగా సిద్ధింపఁగలవు. ఇచట నన్ననో, యాగ్నేయయాగము మొదలగు నెనిమిది యాగములు ప్రకృతములై యున్నవి. వానిలోని యేయొక యాగమునందుమాత్రము విశ్వదేవు లను దేవతలు 'వైశ్వదే

పృథివ్యా మేకకపాలం నిర్వపతి' అను ద్యావాపృథివీయాగము నను నెనిమిది యాగములును విహితము లగుచున్నవి. వానిసన్నిధియందు 'వైశ్వదేవేన యజేత' అను విధి వినఁబడుచున్నది. పయి యెనిమిది విధులయందు నుండు దేవత లుత్పత్తిశిష్టగుణము లగుచున్నారు. ఆ యెనిమిదియాగముల సంఘమే యుత్పన్నమై 'వైశ్వదేవేన యజేత' అను వాక్యమందుండు 'యజేత' అను పదముచే ననువదింపఁబడుచున్నది గాన నీ వాక్యమునందలి, విశ్వదేవు లను దేవత, లుత్పన్నశిష్టగుణము లగుచున్నారు. కావున, నిచటి వైశ్వదేవశబ్ద, మీ యెనిమిది యాగములకును, నామధేయ మగుట, యుత్పత్తిశిష్టగుణబలీయస్త్వ మను ప్రమాణమువలననే, యని తెలియునది.

వ్యామిక్షా[౧]' అను వాక్యమువలనఁ బ్రాప్తించుచున్నారు. కాని, వారు తక్కిన యాగ్నేయము మున్నగు నేడు యాగములయందును బ్రాప్తింపకుండుటఁజేసి, 'వైశ్వదేవేన యజేత' అను వాక్యముచేతనే విధింపఁబడునెడ, వానిని విధించు తత్ప్రఖ్య మనెడి వేఱొకశాస్త్రము లభింపదు. అట్లుండినఁ దత్ప్రఖ్యశాస్త్ర మనెడు ప్రమాణముమూలమున, నీ వైశ్వదేవశబ్ద మిచట యాగమునకు నామధేయముగా సిద్ధించెడిని. తత్ప్రఖ్యశాస్త్ర మనెడి ప్రమాణముచే, నీవైశ్వదేవశబ్ద, మామిక్షా యాగమునకే నామధేయము కావచ్చు నని చెప్పవలదు. అట్లు చెప్పెదవో, 'వైశ్వదేవేన యజేత' అను వాక్యము వ్యర్థ మయ్యెడిని గదా! ఇందలి వైశ్వదేవశబ్ద మామిక్షాయాగమునకుమాత్రమే నామధేయ మగునెడ నా యాగమే యీ వైశ్వదేవశబ్దముచే ననువదింపఁబడఁదగి యుండెడిని. ఆయొక్క యాగమునుమాత్రమే యనువదించుటవలనఁ గలుగు ప్రయోజన మేమియుఁ గనుపట్టదు. 'వైశ్వదేవేన యజేత' అనువాక్యము లేకున్నను, 'ప్రాచీనప్రవణే వైశ్వదేవేన యజేత' (మై. సం. ౧-౧౦-౭.) అను విధివాక్యముచే విధింపఁబడుచున్న, "తూర్పు దిక్కునందలి పల్లపుఁ ప్రదేశము", ఆమిక్షాయాగము విశ్వేదేవులతో సంబంధించుటఁజేసి, యామిక్షా యాగముతోనే సంబంధింపఁ దగునుగదా!

వైశ్వదేవశబ్ద, మాగ్నేయము మున్నగు నెనిమిది యాగములకును, నామధేయ మని యంగీకరించుపక్షమునం దన్ననో, 'వైశ్వదేవేన యజేత' అను వాక్యము వ్యర్థము కానేరదు. వైశ్వదేవశబ్ద, మా యెనిమిది యాగములకును బేరగుటవలన, దీనిచే నా యెనిమిది యాగములు ననువదింపఁబడఁగలవు. 'య ఏవం విద్వాన్ పౌర్ణమాసీం యజతే' అను నీ మున్నగు విద్వద్వాక్యములయం దుండు, 'దర్శ', 'పూర్ణమాస' అను పదములచే, మూఁడేసి యాగము లనువదింపఁబడుటంజేసి, "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" అను ఫలవాక్యమునందలి, దర్శ, పూర్ణమాస శబ్దములచే నాఱు యాగము లెట్లు గ్రహింపఁజేయఁబడుచున్నవో యట్లే, యీ యెనిమిది యాగములును నొకపదముచే ననువదింపఁబడుటమూలమున నొకటే సంఘముగా గ్రహింపఁబడుటంజేసి, యీ యెనిమిది యాగములకును, వైశ్వదేవశబ్దము

౧. ఇచట 'యజేత' పదము లేకున్నను ఆమిక్ష యను ద్రవ్యమును, విశ్వేదేవులను దేవతలను, నొండొంటితో సంబంధించి యుండుటంజేసి, యిచట యాగము విధింపఁబడుచున్న దని తెలియుచున్నది.

నామధేయ మగు నని సిద్ధించుచున్నది. ఇట్లయినచో 'ప్రాచీన ప్రవణే వైశ్వదేవేన యజేత' అను వాక్యమునందలి, వైశ్వదేవశబ్దముచే, నెనిమిదియాగములు ననువదింపఁబడి, 'తూర్పు దిక్కునందలి పల్లపుప్రదేశ' మా యాగముల కంగముగా విధింపఁబడుట, సిద్ధించుచున్నది. "వైశ్వదేవేన యజేత" అను వాక్యము లేనిపక్షమునం దన్ననో, 'ప్రాచీన ప్రవణే' ఈ మున్నగు వాక్యమువలన, 'తూర్పుదిక్కునందలి పల్లపుప్రదేశము' ఆమిక్షాయాగమునకుమాత్రమే, యంగముగా సంబంధించెడిని. కావున, 'ప్రాచీన ప్రవణదేశము' ఈ యెనిమిది యాగములకు నంగముగా నన్వయించుటయే, 'వైశ్వదేవేన యజేత' అను వాక్యమునకుఁ బ్రయోజన మగుచున్నది. కనుక, 'వైశ్వదేవ' శబ్ద, మీ యెనిమిది యాగములకును, నామధేయ మగుచున్నది. ఇట్లగుటకుఁ దత్ప్రఖ్యాశాస్త్రము ప్రమాణము కానేరదు. విశ్వేదేవు లను దేవతలు, ఆమిక్షాయాగము గాక, మిగిలిన యేడు యాగములయందును బ్రాప్తించుట లేదుగదా! కాఁగా, "వైశ్వదేవశబ్దము, తత్ప్రఖ్యాశాస్త్రముచే యాగనామధేయము కానేరదు" అని సిద్ధించుచున్నది.

శ్యేనపదమునకు సంబంధించు, వ్యపదేశమువంటి వ్యపదేశ మీ వైశ్వదేవ శబ్దమునకు లభింపమి, నీ వైశ్వదేవశబ్దము, 'తద్వ్యపదేశము' అను ప్రమాణముచే, యాగమునకు నామధేయము కాఁగల దని యైనను, జెప్ప వీలు లేదు. కాఁగా, నీ వైశ్వదేవశబ్దము, యాగనామధేయ మని నిర్ణయించుటకు, నింతవఱకు వివరింపఁబడిన నాలుగు న్యాయములును, బ్రమాణములుగా నుపకరింప నేరకుండుటం జేసి, ముందు వివరింపఁబోవు 'ఉత్పత్తిశిష్టగుణబలీయస్త్వ' మనునదియే, ప్రమాణ మగుచున్నది.

అది యెట్లంటేని, "వైశ్వదేవేన యజేత" అను వాక్యమునందుఁ బ్రకృతములు కాని కర్మములను, 'యజేత' పదముచే ననువదించి, వానిగుఱించి విశ్వదేవులను, దేవతలుగా విధించుట సంభవింపనేరదు. కర్మములు నిచట నుపస్థితములుగాఁ జేయు, ప్రకరణము మున్నగు ప్రమాణములు లేకుండుటచేతను, నీ వాక్యమునందు వినఁబడు 'యజేత' పదమునందలి యజధాతువు, యాగసామాన్యమునే కాని, యాగ విశేషమును దెలుపఁజాల కుండుటచేతను, నీ కర్మము లీ వాక్యమునం దుపస్థితములు

౧. 'వసంతే వైశ్వదేవేన యజేత' అను వాక్యముచే, వసంతర్తు వను కాలముకూడ, నీ వైశ్వదేవయాగమున, కంగముగా విధింపఁజేయఁబడుచున్న దని తెలియునది.

కానేరవుగదా! లేదా, విశ్వేదేవులనెడి దేవతలతోఁగూడిన, వేఱొక కర్మము నిచట విధించుట యైనను, సంభవింపనేరదు. అట్లు చేసిన, నీవాక్యమునం దతిదేశమూలమున, వేఱొక విధివ్యాపారము నంగీకరించుట యనెడి క్లేశమును, ఆగ్నేయము మున్నగు నెనిమిది యాగములం దుండు, నెనిమిది హవిస్సులతోఁ గూడి, తొమ్మిది హవిస్సు లగుటంజేసి, వేఱుగతి (ప్రయోజనము) లేని 'అష్టౌ హవీంషి' అను లింగముతో విరోధమును, సంభవించెడినిగదా! కావున, నీ 'వైశ్వదేవేన యజేత' అను వాక్యముచేఁ, బ్రకృతకర్మము ననువదించి దేవతలు విధింపఁబడుచున్నారని చెప్పవలయును. వానిలో, నామీక్షాయాగమునందు, విశ్వదేవు లీ వాక్యముచేతనే విధింపఁబడుచున్నా రని చెప్పవలసియుండెడిని ఆ యేడు యాగములును, నుత్పత్తిశిష్టము లగు నగ్ని మున్నగు దేవతలతోఁ గూడియుండుటంజేసి, వానియందు విశ్వేదేవులు ప్రాప్తించుట సంభవింపనేరదు. వేనితోనైన, నాకాంక్ష యున్నపుడే, వానితో సంబంధము కలుగును గదా! ఆగ్నేయయాగము మున్నగు నేడు యాగములకు నుండు, దేవతాకాంక్ష, యుత్పత్తిశిష్టము లగు నగ్ని మున్నగాఁ గల దేవతలతోనే, యుపశాంతించినది గనుక, నచట మరల విశ్వేదేవులను విధించుట యుక్తము కాదు. కావున, 'ఉత్పత్తి[3]శిష్టగుణ బలీయస్త్వము' అను నైదవ ప్రమాణమువలననే యీవాక్యము నందలి వైశ్వదేవశబ్దము, మిందలి కర్మమునకు నామధేయ మగుచున్నది. ఇందులకు, ఏదే నొక కర్మము, తన యుత్పత్తివాక్యముచే విహిత మగు, నేదే నొక గుణముతో, వ్యాప్త మైయుండుటంజేసి, యా వాక్యమందు లేని వేఱొక గుణము, ఆ కర్మమునకే యంగముగా సంబంధించు నవకాశమును బొందనేరదు. ఈ రెండు గుణ

౧. తై. బ్రా. ౧-౬-3-౪. మై. సం. ౧-౧౦-౧ ఇచట "నవ ప్రయాజా ఇజ్యంతే నవానూయాజాః, అష్టౌ హవీంషి, ద్వా వాఘారౌ, ద్వా వాజ్యభాగౌ, త్రింశత్సంపద్యన్తే" అని వైశ్వదేవ ప్రకరణమునఁ జెప్పంబడియున్నది.

౨. లింగము = ప్రమాణము.

3. ఆగ్నేయాది యాగములందలి యగ్ని మున్నగు దేవత, లుత్పత్తిశిష్టము లగుటవలన, బలవత్తరము లగుటంజేసి, 'వైశ్వదేవేన యజేత' అను వాక్యమునందలి విశ్వదేవు, లీ యాగ్నేయము మున్నయిన యేడు యాగములందును, గుణములుగా గ్రహింపనేర కుండుటవలన, నీ వైశ్వదేవశబ్దము, తా నుండు వాక్యమున విధింపఁబడు యాగమునకు నామధేయ మగుచున్న దని భావము.

౪. తం. వా. ౧-౪-౧౧ పు 3౦౯. "గుణాంతరావరుద్ధత్వా న్నావకాశో గుణోఽపరః, వికల్పోఽపి న వైషమ్యా త్తస్మా న్నామైవ యుజ్యతే" అనుచు.

ములును, వేఱువేఱు[1] ప్రకారములుగా విహితము లగుటమూలమున, వైషమ్యము కల వగుటంజేసి, యీ రెండును వికల్పముగానైనఁ బ్రవర్తింపనేరవు. కనుక నట్టి యవకాశము లేనిగుణము, తా నుండు వాక్యమున విధింపఁబడు కర్మమునకు, నామధేయ మగుచున్నది.” అను వార్తికము ప్రమాణముగాఁ గలదు. ప్రకృతమం దాగ్నేయము మొదలగు కర్మములు వానివాని యుత్పత్తివాక్యములచే విధింపఁబడు, నగ్ని మొదలయిన దేవత లనెడి గుణములచే వ్యాప్తము లై యుండుటంజేసి, విశ్వదేవు లనెడు దేవతలు, ఆ కర్మములందు గుణములుగా సంబంధింప నవకాశమును బొందనేరవు. లేదా, అగ్ని మొదలగు దేవతలు, తద్ధితశ్రుతిచే బోధితము లగుటంజేసియు, విశ్వదేవు లన్ననో, వాక్యముచేఁ దెలియఁబడుటంజేసియు, నీ రెండును విషమముగా విధింపఁబడుటవలన, వికల్పముగా నైన, నీ యాగ్నేయము మొదలయిన కర్మములతో సంబంధింపనేరవు. కావున నీ వైశ్వదేవశబ్దము, ‘వైశ్వదేవేన యజేత’ అను వాక్యమునందు విధింపఁబడిన కర్మమునకు నామధేయమే యగుచున్న దని గ్రహింపవలయును. ఇది న్యాయసుధాకారుల మతము.

పార్థసారథిమిశ్రు లన్ననో, యీ వైశ్వదేవశబ్దము, తత్ప్రఖ్యశాస్త్రము మూలముగనే, కర్మనామధేయము కాఁగల దని, యిఁక వివరించుచున్నారు. ఏ శబ్దము తనయం దుండు దేని, నే కర్మమునందు గుణముగా సంబంధించునట్లు బోధించునో యా కర్మమున, కట్టి గుణసంబంధము, వేఱొక శాస్త్ర (ప్రమాణ) ముచేఁ దెలియఁజేయఁబడినయెడల, నా శబ్దము, తత్ప్రఖ్యశాస్త్ర మను ప్రమాణముచే, నాకర్మమునకు నామధేయ మగుచున్నది. అట్టి శాస్త్రాంతరము, విధి యైనను, నర్థవాద మైనను, గావచ్చును. ‘అగ్నిహోత్ర’ శబ్దమునందలి యగ్ని, హోమమునకు గుణముగా సంబంధించు నని బోధించు శాస్త్రాంతరము, విధియే. వైశ్వదేవశబ్దము, తనయం దుండు విశ్వదేవు లాకర్మమునందు గుణముగా సంబంధింతు రని, బోధించుచున్నది. ఈ విశ్వదేవులే, యాగ్నేయము మున్నగు నెనిమిది యాగములయందును సంబంధింతు రనునది, “యద్విశ్వేదేవా స్సమయజన్త, తద్వైశ్వదేవస్య వైశ్వదేవత్వమ్” అను నర్థవాదమునుండి తెలియుచున్నది.

౧. అగ్ని మున్నగు దేవతలు, తద్ధితప్రత్యయ మనెడు శ్రుతిచే బోధింపఁబడుచున్నారు. విశ్వదేవు లన్ననో, వాక్య మను ప్రమాణముచే బోధింపఁబడుచున్నారు.

౨. తై. బ్రా. ౧-౪-౧౦-౫ వైశ్వదేవ మను కర్మమును, విశ్వదేవు లాచరించిరి గనుక, దీని కీ నామము కలిగెను.

తత్ప్రఖ్యశాస్త్ర మనునది, విధియే కావలయును గాని, యర్థవాదము కాఁగూడదు, అని చెప్పుటకుఁ బ్రమాణ మేమియుఁ గానరాదు. కావుననే, "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను విధియందలి, 'జ్యోతిష్టోమ' పదము, ఈ విధియందు విధింపఁబడు యాగము జ్యోతిస్సు లను పేరు గల స్తోమములతో సంబంధించునని "ఏతాని వావ తాని జ్యోతీంషి య ఏతస్య స్తోమాః" అను నర్థవాదమునుండి తెలియుటంజేసి, సోమయాగమును బోధించునదియై, తత్ప్రఖ్యశాస్త్ర మనెడి ప్రమాణమూలమున, నా సోమయాగమునకుఁ బేరగుచున్నది. ఇట్లే ప్రకృతమందుఁ గూడ, వైశ్వదేవశబ్దము, తత్ప్రఖ్యశాస్త్రమూలముననే, కర్మనామధేయ మగునని యూహింపవలసియున్నది. ఈ నాలుగు మార్గము కంటె వేఱగు నైదవ మార్గమును గల్పించుటకుఁ బ్రమాణ మేమియును లేదు గదా! కనుకనే, వార్తికకారుఁడైన, కుమారిలభట్టు, వైశ్వదేవాధికరణమునందు, వైశ్వదేవశబ్దము, తత్ప్రఖ్యశాస్త్రమూలముగనే, యాగ్నేయము[3] మున్నగు నెనిమిది యాగములకును, నామధేయ మగుచున్న దని, స్పష్టముగాఁ జెప్పి, యీ యధికరణవిషయమును ముగించెను. 'ఉత్పత్తిశిష్టగుణము బలవత్తర మయినది.' అని వేఱొకయిత్తముగా నుపపాదింపఁబడినది యున్నదో, యచట గుణవిధి సంభవింపకుండునట్లు చేయుట, కిది యొక యుక్తివిశేషమే కాని, వేఱొండు కాదు. కాఁగా, 'వైశ్వదేవేన యజేత' అను వాక్యమునందలి వైశ్వదేవశబ్దము, తత్ప్రఖ్యశాస్త్రము మూలముగా, నిందలి యజధాతువుచే ననువదింపఁబడు, నాగ్నేయము మున్నగు నెనిమిది యాగములకును, నామధేయ మగుచున్నదని సిద్ధించుచున్నది.

ఇచట నొకఁ డిట్లు శంకించుచున్నాఁడు: పశుసోమాధికరణమునందు, 'సోమేన యజేత' అను విధియందు, యజ్ధాతువు ప్రత్యక్షముగా వినఁబడుటఁజేసి,

౧ తై. బ్రా. ౧-౫-౧౧-౨ జ్యోతిష్టోమశబ్దమును నిర్వచించుసందర్భమున, ఈ యాగమునందలి జ్యోతిస్సు లను పేరుగల స్తోమము లేవి? యని ప్రశ్న కలుగఁగా, త్రివృత్ స్తోమము, పంచదశస్తోమము, సప్తదశస్తోమము, ఏకవింశస్తోమము, అను స్తోమము లీ యాగమునందుఁ గల వని సమాధానము చెప్పంబడినది. స్తోమము = స్తోత్రమునకు సాధన మగు ఋక్కుల సముదాయము.

౨. 'వైశ్వదేవేన యజేత' అను వాక్యమునందలి వైశ్వదేవపద, మందు విధింపఁబడు యాగమునకు నామధేయ మని నిర్ణయించు నధికరణము.

3. ఈ యెనిమిది యాగములును, నింతకుముందు వివరింపఁబడినవి.

౪. పశుయాగమును విధించు 'అగ్నీషోమీయం పశు మాలభేత' అను వాక్యమును, సోమయాగమును విధించు 'సోమేన యజేత' అను వాక్యమును, నుదాహరించి 'ద్రవ్యసం

"ఐంద్రవాయవం[౧] గృహ్ణాతి, మైత్రావరుణం[౨] గృహ్ణాతి", ఆశ్వినం[౩-౪] గృహ్ణాతి" అను నీ మున్నగు వాక్యములందు 'యజ' ధాతువును గల్పించుటలేదు. ఆన్యాయము ననుసరించి, 'వైశ్వదేవేన యజేత' (మై. సం. ౧-౦-౧) అను వాక్యమునందు యజ్ ధాతువు ప్రత్యక్షముగా వినఁబడుటంజేసి, 'వైశ్వదేవ్యామిక్షా' (మై. సం. ౧-౧౦-౧) అను వాక్యమునందుఁగూడ, యాగ ధాతువు కల్పింపఁబడ నక్కఱలేదు. కావున, నీ 'వైశ్వదేవేన యజేత' అను వాక్యముచేతనే, విశ్వేదేవు లనెడు దేవతలతోఁ గూడిన కర్మము విధింపఁబడుఁగాక. ఆ కర్మమునకు ద్రవ్య మేది యను నాకాంక్ష కలుగఁగా 'వైశ్వదేవ్యామిక్షా' అనువాక్యముచే వైశ్వదేవీశబ్దసామర్థ్యమున, నా వైశ్వదేవయాగము నుద్దేశించి, 'ఆమిక్ష'[౩] యనెడు ద్రవ్యము విధింపఁబడవచ్చును. ఇట్లు చేసినయెడల, నీ రెండు[౪] వాక్యములును, గర్మము ననువదించునవి కానేరవు. లేదా, పైని వివరింపఁబడినరీతిని, వైశ్వదేవయాగమున, కామిక్షవంటి, వేఱుగు ద్రవ్య మేదియు లేకుండుటవలన, మఱియొక ప్రయోజన మేదియు లేని 'అష్టౌ[౫] హవీంషి' అను వాక్యము కుదరకపోవుటయును సంభవింప నేరదు.

యాగాద్వోదనా పశుసోమయోః' (పూ. మీ. ౨-౨-౧౭) అను నీ మున్నగు సూత్రముల మూలమునఁ జేయఁబడిన విమర్శనము గల యధికరణము, పశుసోమాధికరణము. అందు 'సోమేన యజేత' అను వాక్యమునందు యజ్ ధాతువును 'అగ్నీషోమీయం పశు మాలభేత' అను వాక్యమునందు 'ఆలభ్' ధాతువును ప్రత్యక్షముగా వినఁబడుటంజేసి, ఆయా వాక్యములయందే, యాగములు విధింపఁబడుచున్న వనియు, 'ఐన్ద్రవాయవం గృహ్ణాతి' అను నీ మున్నగు వాక్యములచే, యాగద్రవ్య మగు సోమరసమునకు, 'గ్రహించుట' యనెడి సంస్కారమాత్రమును "హృదయస్యాగ్రే అవద్యతి, అథ జిహ్వాయాః, అథ వక్షసః" అను నీ మున్నగు వాక్యములచే యాగమునకు హవిస్సగు, హృదయము మున్నగు నవయవముల నుద్దేశించి, యవదానము (కోసి వేఱు చేయుట) అనెడి సంస్కారమాత్రమును, విధింపఁబడుచున్న వనియును, నిర్ణయింపఁబడినది.

౧. ఇంద్రుఁడు, వాయువు, నను జంటదేవతలకొఱకు నుద్దేశింపఁబడిన, గ్రహములయం దుండు, సోమరసమును గ్రహించునది.

౨. ౩. ౪. కు ౨ వలె నర్థ మూహించునది.

౩. విఱిగినపాలలో నుండు గట్టిపదార్థము.

౪. 'వైశ్వదేవేన యజేత' అను వాక్యము దేవతతోఁ గూడినకర్మమును విధించున దగుటవలన వ్యర్థము కానేరదు. 'వైశ్వదేవ్యామిక్షా' అను వాక్యముకూడ ఆమిక్ష యనెడి ద్రవ్యమును గుణముగా విధించున దగుటవలన, వ్యర్థము కానేరదు. కావున నీరెండు వాక్యములును ననువదించునవిమాత్రమే కానేరవని తాత్పర్యము.

౫. వైశ్వదేవపర్వ ప్రకరణమునందు నెనిమిది హవిస్సులుగల యెనిమిది యాగము లాచరింపఁబడవలసినవిగాఁ జెప్పఁబడినవి.

ఇట్లు చేయంబడినశంక కీ క్రిందిది సమాధానము: ఇట్లు చేయఁబడినశంక తగదు. 'వైశ్వదేవ్యామిక్షా' అను వాక్యమునందు యజ్ధాతువును గల్పింపని పక్షమున, దేని ననువదించి[2] యామిక్ష ద్రవ్యముగా విధింపఁబడుచున్నదో, యట్టి దానిని నిర్దేశించి చెప్పవలసియున్నది. వైశ్వదేవశబ్దముద్వారమున నుపస్థితు లగు విశ్వదేవుల నుద్దేశించి, యామిక్షాద్రవ్యము విధింపఁబడుచున్న దని చెప్పనెడ, నీ ద్రవ్యము దేవతకే యంగ మగును గాని యాగమున కంగము కానేరదు. ఇంతే కాక, యీ వైశ్వదేవీశబ్దము 'ఈ దేవత దీనికిఁ గలదు' అను నర్థమును బోధించు తద్ధిత ప్రత్యయ మంశమందుఁ గల దగుటవలన, నామిక్ష యనెడి ద్రవ్యము, విశ్వదేవులతో సంబంధించు నని తెలియఁజేయఁగల దనువిషయ మింతకుముందే చెప్పఁబడినది. తద్ధితప్రత్యయ మంశమందుఁగల వైశ్వదేవీశబ్దము వినఁబడుటచేసి యీ శబ్దము మూలముననే, విశ్వదేవుల నుద్దేశించి, యామిక్షాద్రవ్యము విధింపఁబడవలసి యున్నది. యజేతపదమునందలి 'త' ప్రత్యయముచే బోధింపఁబడు నర్థభావన యందు 'కరణ' మేది యని యాకాంక్ష కలుగఁగా 'యజేత' అను నొకపదము వినఁబడుటంజేసి, దగ్గఱ నుండు వేఱొక పదముమూలముగాఁ గాక, యీ పదమందుండు 'యజ్' ధాతువుచేతనే యాగము బోధింపఁబడి యీ భావనయందుఁ గరణముగా నన్వయింపఁజేయఁబడుచున్న దని, భావార్థాధికరణమునందుఁ జెప్పంబడి యున్నది. అట్లే యిచటఁగూడ వైశ్వదేవీశబ్దమునందలి ప్రకృతి యను విశ్వదేవశబ్దముమూలముగా, దేవత యనువదింపఁబడి, తద్ధితప్రత్యయముమూలమున ద్రవ్యమా దేవతకంగముగా విధింపఁబడవలసి యున్నది. కాని 'వషట్కర్తుః[3] ప్రథమభక్షః' అను వాక్యము "'వషట్' శబ్దము నుచ్చరించుచు ఋత్విక్కు హోమము చేయఁగా మిగిలిన హవిస్సును భక్షింపవలయును. ఇతర ఋత్విజులకంటె ముందుగా నతఁడే భక్షింపవలయును." అని యన్వయించినచో వాక్యభేదము కలుగు నను భయమువలన "వషట్శబ్దము నుచ్చరించు ఋత్విక్కు హోమము చేయఁగా మిగిలిన హవిస్సును ముందు భుజింపవలెను." అనునర్థ మెట్లు వివరింపఁబడినదో యట్లే 'యజేత' పదమందలి, 'త' ప్రత్యయముచే బోధింపఁబడు భావన నుద్దేశించి ప్రకృతి యగు 'యజ్' ధాతువున కర్థ మగు యాగము కరణముగా విధింపఁబడినదో

౧. ఉద్దేశించి.

౨. 'ఆమిక్షాం దేవతాయుక్తాం వదత్యేవైష తద్ధితః' అను వార్తికమునందు వివరింపఁబడినది.

౩. 'వషట్' శబ్ద ముచ్చరించు ఋత్విక్కు, హోమశేషమును మొదట భుజింపవలయును.

వాక్యభేదము సంభవించు నను భయమువలన సంప్రాప్త మగు భావనతోఁ గూడిన యాగము విధింపఁబడియే యున్నది. ప్రకృతమం దన్ననో, దేవత ప్రాప్తించుటంజేసి విధింపఁబడ నేరదు గనుక, దాని నుద్దేశించియే, ద్రవ్యమును విధించుట యావశ్యక మైయున్నది కావున, నేకాన్వయమునకు భంగము కలుగు ననెడి దోషము, నివారింపఁబడకయే యుండును. కావున, యాగము నుద్దేశించియే, ద్రవ్యమును విధించుటకు, 'వైశ్వదేవ్యామిక్షా' యను వాక్యమునందు, యజ్ధాతు వవశ్యముగాఁ గల్పింపంబడవలసి యున్నది. కావున, 'ఐంద్రవాయవం గృహ్ణాతి' అను వాక్యము నందు, 'సోమరసమును గ్రహించుట[2]' యింద్రవాయువు లనెడి జంటదేవతలతోఁ గూడునట్లు, విధింపఁబడుటవలన, 'యజ్' ధాతు, విచటఁ గల్పింపఁబడ కుండుటం జేసి, 'పశుసోమాధికరణము' నందలి న్యాయ, మీ వైశ్వదేవాధికరణమునందు వర్తింప నేరదు. యజ్ధాతువును గల్పించుపక్షమున, 'వైశ్వదేవ్యామిక్షా' అను వాక్యమునందు, యాగమునకు ముఖ్యస్వరూపము లగు, ద్రవ్యము[3] దేవతయు నను రెండు వినఁబడుటంజేసి, యీ వాక్యమునందే, ద్రవ్యదేవతలు రెండింటితోను, గూడిన కర్మము విధింపఁబడుట యుక్తము కాని, "వైశ్వదేవేన యజేత" అను వాక్యమునందు, దేవతతోఁ[4]గూడిన కర్మము విధింపఁబడుచున్న దని యంగీకరించుట, యనెడి క్లేశము యుక్తము కాదు. ఇట్లయిన, "వైశ్వదేవ్యామిక్షా' అను వాక్యము, 'యజ్' ధాతువును గల్పించుటమూలమున, యాగమును విధించునదియై, ద్రవ్యదేవతలకుఁ గల సంబంధముమూలముగ, యాగమును విధించున ట్లంగీకరింపఁబడిన," ఆగ్నేయోఽష్టాకపాలః[5]", "సౌమ్యశ్చరుః", అను నీ మున్నగు వాక్యములనడుమఁ బఠింపఁబడుట, యుక్తమగుచున్నది. అట్లుగాక కానిచో,[6] "ఆగ్నేయోఽష్టాకపాలః" అను

౧. ఎచటను బ్రాప్తింపని లేక యెచటను విధింపఁబడని.

౨. మంత్రము నుచ్చరించుచుఁ జేతితోఁ దీసికొనుట.

3. ఆమిక్ష యనెడు ద్రవ్యము, విశ్వదేవు లనెడి దేవతలు.

౪. విశ్వదేవు లనెడు దేవతలతో.

౫. (మై. సం. ౧-౧౦-౧) ఇచట నగ్నికిని, అష్టాకపాల మను పురోడాశమునకును, సంబంధ ముండుటవలన, నీ వాక్యముచే నొకయాగము విధింపఁబడుచున్న దని తెలియుచున్నది. ఇట్లే 'సౌమ్యశ్చరుః' మొదలగు వాక్యముల యర్థ మూహించునది.

౬. 'వైశ్వదేవ్యామిక్షా' అను వాక్యమునందు యజ్ధాతువును గల్పింపక, ఆమిక్ష యను ద్రవ్య మొక్కటిమాత్రమే విధింపఁబడుచుండున ట్లంగీకరించినచో, నని యర్థము.

నీ మున్నుగాఁ గల వాక్యములయందు, ద్రవ్యదేవతలకుఁ గల సంబంధముద్వారమున, యాగము విధింపఁబడునట్లు కల్పించుటయు, వానినడుమనుండు నీ "వైశ్వదేవ్యామిక్షా" అనువాక్యమునందుమాత్రము ద్రవ్య మొక్కఁడానినే విధించుటయు, ననువైషమ్యము[1] సంభవించెడిని. మఱియు, "వైశ్వదేవేన యజేత" అనువాక్యమునందలి, వైశ్వదేవశబ్దము, విశ్వదేవుల నెడు దేవతలను యాగమునకు సంబంధించు గుణముగాఁ దెలియఁజేయుచున్న దని యంగీకరించు పక్షమున, 'యద్విశ్వేదేవాస్సమయజన్త, తద్వైశ్వదేవస్య వైశ్వదేవత్వమ్' (విశ్వదేవు లాగ్నేయము మున్నగు నెనిమిది యాగముల నాచరించిరి. కనుక, నీయెనిమిదియాగములసమూహమునకు, వైశ్వదేవ మను పేరు గలిగెను.) అను నర్థవాదము, ప్రమాణముకాకపోవలసివచ్చెడిని. ఆగ్నేయము మున్నగు నెనిమిదియాగములసముదాయమునకు విశ్వదేవులు కర్త లగుటంజేసి, వైశ్వదేవశబ్ద, మీ యాగముల సమూహమును బోధించు నని, యీ యర్థవాదమువలనఁ దెలియుచున్నది. ఈ 'వైశ్వదేవేన యజేత' అను వాక్యమునందు విశ్వదేవులు యాగమునకు సంబంధించు గుణముగా బోధింపఁబడున ట్లంగీకరింపఁబడు నెడ, నన్న, నీ యర్థవాదమునుండి తెలిసిన విషయము సంగతమయ్యెడిని. ఇదియునుంగాక, 'వైశ్వదేవేన యజేత' అనువాక్యముచే, యాగమువిధింపఁబడుపక్షమున, 'ఆమిక్ష' యాగోత్పత్తి గల యీ విధివాక్యమునందు వినఁబడకుండుటంజేసి, యుత్పత్తిశిష్టము కానేరదు. కావున, ఆమిక్షయు, వాజినము,నను నీ రెండును నుత్పన్నశిష్టము లగును గనుక, నామిక్షచే వాజినము నివర్తింపఁజేయఁబడ కుండుటంజేసి, యీ రెండును, యాగమున కంగములు గావలసివచ్చును. కావున, నీ రెండింటికిని[2], వికల్పము సంభవించెడిని. అట్టి వికల్ప మెనిమిది దోషములతోఁ గూడి యుండును గనుక, "వైశ్వదేవ్యామిక్షా" అను వాక్యమునందే యాగము విధింపఁబడుచున్నది. 'వైశ్వదేవేన యజేత' అను వాక్య మన్ననో, యీ యాగము ననువదించుచున్నది. ఇ ట్లనువదించినను, నీ వాక్యము వ్యర్థము కానేర దని యింతకు ముందే విశదీకరింపఁబడినది. కనుక, నింతటితోఁ జాలింతము. కాఁగా, 'వైశ్వదేవేన యజేత' అను వాక్యమునందలి, వైశ్వదేవశబ్దము, తత్ప్రఖ్యన్యాయముమూలముగాఁ గాని, 'ఉత్పత్తిశిష్టగుణ బలీయస్త్వము' అను నైదవప్రమాణము మూలముగాఁ

౧. వైరూప్యము = విరోధము = ఒండొంటితోఁ బోలిక లేకుండుట.

౨. పూ. మీ. ౧౨-౩-౧౦ "ఏకార్థస్తు వికల్పేరన్" అను సూత్రమునందలి ద్వాదశిక న్యాయముమూలముగా, నీ వికల్పము కలిగెడిని.

గాని, కర్మమునకుఁ బేరగు నని సిద్ధించుచున్నది. ఇట్లు మత్వర్థలక్షణ మొదలగు నాలుగు ప్రమాణములను వివరించుటమూలమున, నామధేయ మనునది, తా నుండు విధివాక్యముచే విధింపఁబడు కర్మమును, నిట్టిదిగ నిర్ణయించుటద్వారమున, సార్థకమై ప్రమాణ మగు నని తెలియఁజేయఁబడుచున్నది.

## నిషేధవాక్యముల విచారము

పైని వివరింపఁబడిన రీతిని నామధేయములను నిర్ణయించుట కుపయోగించు, ప్రమాణముల నుపపాదించి, యిఁకముందు, నిషేధవాక్యములు ప్రమాణ మగు ప్రకారము, నిరూపింపఁబడుచున్నది. విధివాక్యములు, మఱియే ప్రమాణము చేతను దెలియని 'యాగము మొదలగు కర్మములు, స్వర్గము మున్నగు సుఖములను గలిగించును' అను విషయమును బోధించుచు నట్టి సుఖమును గోరుపురుషుని, యాగము మున్నగు కర్మములం బ్రవర్తింపఁజేయుటమూలముగ, నెట్లు పురుషార్థము నుత్పాదించున వగుచున్నవో యట్లే, నిషేధవాక్యములుకూడఁ బ్రమాణాంతరముచేఁ దెలియని, "అసత్యమును బలుకుట మొదలగు కర్మములు, దుఃఖము నుత్పాదించును' అను విషయమును బోధించుచుఁ బురుషు నట్టి కర్మములనుండి నివర్తింపఁ జేయుటమూలముగా, నా కర్మములవలన జనించు దుఃఖము కలుగకుండఁజేయుట యనెడి, పురుషార్థము నుత్పాదింపఁగలవు. అది యెట్లంటేని, "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః" అను నిట్టి విధివాక్యములు, 'జుహుయాత్' పదమునందలి 'యాత్' అనెడి లిఙ్ ప్రత్యయముమూలమునఁ,[1] ప్రవర్తనను[2] బోధించుచు, నట్లు బోధించుటమూలముగా, అగ్నిహోత్రహోమము మున్నగు కర్మము లిష్టసాధనము లని యనుమాన[3] ప్రమాణముచేఁగాని, యర్థాపత్తి ప్రమాణముచేఁగాని, యూహింపఁజే

౧. పా. సూ. ౩-౩ ౧౮. "విధి నిమంత్రణా మంత్రణాధీష్ట సంప్రశ్న ప్రార్థనేషు లిఙ్."

౨. ప్రవర్తన = ఒక మనుజు నేదేనొకపనియందుఁ బ్రవర్తింపఁజేయుట. దీనికే 'ప్రేరణ, చోదన' యను నామాంతరములు గలవు.

3. అనుమానప్రమాణము:— "యాగో నుదిష్టసాధనమ్, అయ మత్ర ప్రవర్తితా మిత్యాకారక వ్యాపారవిషయీభూత కృతివిషయత్వాత్, యథా గవానయనమ్." లోకమునందు 'గోవును దీసికొనిరమ్ము' అని యొకవృద్ధుఁడు పలుకఁగా, నా వాక్యమును వినినయువకుఁడు, 'ఇతఁడు నన్ను గోవును దీసికొనివచ్చుట, యను పనియందుఁ బ్రవర్తింపఁజేయువ్యాపారమును జేయుచున్నాఁడు కనుక

యుచు, స్వర్గము మున్నగునాయా ఫలములనుగోరు పురుషుని, నాయా కర్మములందుఁ బ్రవర్తింపఁజేయుచున్నవి. ఇట్లే "ఎట్టియుల్లిని భక్షింపరాదు" అను నిట్టి నిషేధ వాక్యములుకూడ, నివర్తనను (—పురుషుని నొకపనినుండి నివర్తింపఁజేయు వ్యాపార మును) బోధించుచు, నట్లు నివర్తింపఁజేయుటకై, యానివర్తనమూలమున, అనుమాన ప్రమాణముచేఁగాని, యర్థాపత్తిప్రమాణముచేఁగాని, "ఎట్టియుల్లిని భక్షించుట మొద లగు కర్మము లనిష్టమును (= అనర్థమును) గలిగించును" అని యూహింపఁజేయుచుఁ, బురుషుని 'ఎట్టియుల్లిని భక్షించుట' మున్నగు కర్మములనుండి నివర్తింపఁజేయును. ఒక పూర్వపక్షి యిట్లు శంకించుచున్నాఁడు.

నిషేధవాక్యములు, నివర్తన నెట్లు బోధింపఁగలవు? "కలఞ్జం నభక్షయేత్"[1] (ఎట్టియుల్లిని భక్షింపరాదు.), 'బ్రాహ్మణో న హన్తవ్యః'[2] (= బ్రాహ్మణుని జంప రాదు) అనునిట్టి నిషేధవాక్యములయందు 'న' శబ్దము, 'భక్ష' 'హన్' అను ధాతువులకు సమీపమున నుండుటంజేసియు, వాక్యమునందలి పదముల కుండు 'సామీప్యము' అను 'ఆసత్తి' కూడ, శాబ్దబోధనుగూర్చి కారణ మగుటంజేసియు, నశబ్దమున కర్థ మగు 'అభావము', భక్షధాతువున కర్థ మగు 'భక్షించుట' యను కర్మముతో నన్వయించు నెడ, ఆ ధాత్వర్థము లిఙ్ ప్రత్యయార్థముతో నన్వయింపఁగా, నిషేధవాక్యములయం దెల్ల, ధాతువున కర్థమగు కర్మమును విడుచుటయే కర్తవ్య మని తెలియుచున్నది. కాఁగా; 'యజేత'[3] అను నిట్టి విధివాక్యమునందు, 'యాగము చేయఁబడవలసినది.' అనునది యెట్లు వాక్యార్థ మగుచున్నదో యట్లే, 'న భక్షయేత్' అను నిట్టి వాక్యములయందు, 'ధాత్వర్థము (= భక్షించుట) ను

నీపని నా యిష్టమును సాధింపఁగలదు.' అని యె ట్లూహించునో యట్లే, విధివాక్యము, తనయం దుండు లిఙ్ మున్నగు ప్రత్యయములమూలముగా, నన్ని యాగము మున్నగు కర్మములయందుఁ బ్రవర్తింపఁజేయు వ్యాపారమును బోధించుచున్నది గనుక, నీ యాగము మున్నగు కర్మములు, నా యిష్టము నుత్పాదింపఁగలవు - అని పురుషుఁ డూహించుట. అనుమానప్రకారము: ఈ నిషేధవాక్యము, కలంజభక్షణము నాచరింపఁజేయకుండునట్టి వ్యాపార మనెడు, నివర్తనను బోధించుచుండుటంజేసి, యీ కలంజభక్షణము, త న్నాచరించువాని కనర్థమును గలుగఁజేయు నని, నిశ్చయముగా నూహించుట.

౧. నిషేధవాక్యము = "న కలంజం భక్షయేత్".

౨. నిషేధవాక్యము = "బ్రాహ్మణో న హంతవ్యః"

౩. విధివాక్యము—"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత." ఇది 'న' శబ్దములేని విధివాక్య మున కుదాహరణము—

విడుచుట యావశ్యకము' అనునది వ్యాకార్థ" మగుచున్నది గాని, నివర్తన యనునది వాక్యార్థము కానేరదు.

ఇట్లు పూర్వపక్షి చేయుశంక సరికాదు. నిషేధవాక్యమునందలి ధాత్వర్థము (భక్షించుట) 'న' శబ్దమునకు సమీపమం దున్నను, 'లిఙ్' ప్రత్యయార్థమునకు విశేషణముగా నుపస్థిత మగుటంజేసి, 'న' శబ్దార్థముతో[1] నన్వయింపనేరదుగదా! ఒకదానికి విశేషణ మగునది, మఱియొకదానితో నన్వయింపనేరదు. 'రాజపురుషునిఁ[2] దీసికొనిరమ్ము' అను వాక్యమునందు, 'రాజ' పదార్థము 'పురుష' పదార్థమునకు విశేషణ మగుటవలన, 'ఆనయ' అను క్రియాపదమున కర్థ మగు 'తీసికొనిరమ్ము' అనుదానితో నన్వయింపనేరదు. కావున, 'న' శబ్దమునకును, ధాతువునకును, అవ్యవధాన[3] మున్నను, 'న' శబ్దార్థము, ధాత్వర్థముతో నన్వయింపదు. "అరుణయా పింగాక్ష్యా ఏకహాయన్యా గవా సోమం క్రీణాతి" అను వాక్యమందు 'ఆరుణ్య' పదార్థ మగు "ఎఱ్ఱనిరంగు కలుగుట" అనునది, 'గో' పదార్థమగు గోవు' అనెడి కరణకారకమునకు, విశేషణ మగుటంజేసి, 'ఏకహాయనీ' అను పదమున కర్థమగు "ఒకసంవత్సరము వయస్సుగలది" అనుదానితో, నెట్లన్వయింపనేరదో, యట్లే యిచట 'న' శబ్దార్థము, ధాత్వర్థముతో నన్వయింపనేరదు. లేదా, యీ 'న' శబ్దార్థము, నిషేధవాక్యమునందలి 'కలంజము' మున్నగు పదముల యర్థములతో నైన, నన్వయింపనేరదు. 'అరుణయా...' అను నీ మున్నగు వాక్యమందు, 'ఏకహాయనీ' పదార్థము, గో వను కారకమునకు విశేషణ మగుటంజేసి వేఱుగా నుండు 'అరుణ' శబ్దముయొక్క యర్థముతో నెట్లన్వయింపదో, యట్లే, నిషేధవాక్యములందలి 'కలంజము' మున్నగుపదముల యర్థములు, ఆ పదముల మీఁద నుండు 'ప్రత్యయము' ల కర్థము లగు, కారకములకు విశేషణము లగున

౧. 'న' శబ్దము. 'భక్షయేత్' అను పదమునం దుండు లిఙ్ ప్రత్యయముయొక్క యర్థముతో నన్వయించునెడ కూడ, నీ వాక్యమువలనఁ బ్రవర్తనాభావమే (= ప్రవర్తన లేకుండుటే) బోధింపఁబడుచున్నది గాని, నివర్తనను బోధించుపదము లేకుండుటంజేసి, నివర్తన బోధింపఁబడుట లేదు.

౨. 'రాజపురుషమ్ ఆనయ' = రాజపురుషుని దీసికొనిరమ్ము = రాజుతో సంబంధించు పురుషుని దీసికొనిరమ్ము.

3. నడుమ నేదియు లేకుండుట.

ట్లుపస్థితము లగుటంజేసి, వేఱుగాఁ నుండు 'న' శబ్దముయొక్క యర్థముతో నన్వయింపనేరవు. కనుక "అరుణయా..." అను నీమున్నగు వాక్యమందు, 'ఆరుణ్యము' మొదలగు పదార్థము, లితరపదార్థములతో నన్వయింపనేరక, 'క్రీణాతి' ( = కొనవలెను) అను క్రియాపదమునం దుండు, ప్రత్యయార్థ మగు భావనతోనే యె ట్లన్వయించునో, యట్లే 'న కలంజం భక్షయేత్' అను నిషేధమందలి 'న' శబ్దార్థము, కలంజ మను నితరపదార్థముతో నన్వయింపనేర కుండుటంజేసి, 'భక్షయేత్' పదమునం దుండు నంశములలోఁ, బ్రధానమగు ప్రత్యయార్థముతోనే సంబంధించి యన్వయించును. అచటఁగూడ 'న' శబ్దార్థము, 'భక్షయేత్' పదమందలి, 'త' ప్రత్యయమునం దుండు, నాఖ్యాతత్వ మను నంశముచే బోధింపఁబడు నర్థభావనతో నన్వయింపదు. ఈ యర్థభావనకూడ, ఆ 'త' ప్రత్యయమునం దుండు 'లిఙ్' త్వ మనునంశముచే బోధింపఁబడు, ప్రవర్తన యనుదానికి, విశేషణముగా నుపస్థిత మగుచున్నది గదా! కావునఁ, బ్రవర్తన యనునది, యిట్టి నిషేధవాక్యమునం దుండు పదార్థము లన్నిటిలోఁ బ్రధాన మగుటంజేసి, యందలి 'న' శబ్దము, లిఙ్త్వ మను నంశముతోనే సంబంధించును. 'న' శబ్ద, మే పదముతో సంబంధించునో, యా పదార్థమునకు విరోధి యగుదానిని బోధించుట, నశబ్దమునకు స్వభావ మైయున్నది. నాస్తి (న + అస్తి = ఉండలేదు.) అను వాక్యమందు, 'న' శబ్దము, ఉనికిని బోధించు 'అస్తి' అను క్రియతో సంబంధించుటంజేసి, 'ఉనికి' యనునర్థముతో విరోధించు 'లేదు' అను నర్థమును బోధించుచున్నది. 'న కలంజం భక్షయేత్' అను నిషేధ వాక్యములయందు, 'భక్షయేత్' పదమునందలి, లిఙ్త్వ మనెడి యంశమునకుఁ, బ్రవర్తన యనునది యర్థ మగుచున్నది. కనుక, నా 'లిఙ్త్వ' మను నంశముతో సంబంధించు, 'న' శబ్దము, ప్రవర్తన యనునర్థమునకు విరోధించు, నివర్తన యను దానిని దెలియఁజేయుచున్నది. ఏదే నొక విధివాక్యమును వినిన పురుషుఁడు, 'ఈ వాక్యము న న్నే దే నొకపనియందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది.' అని తెలిసి

౧ 'కలంజమును'...మొదలగు పదములయందలి (ప్రకృత్యర్థము, (కలంజపదార్థము) ప్రత్యయార్థ మైన కారకముతో నన్వయించుటయే, శాస్త్రసమ్మత మగుటచేతను, ప్రకృతి, ప్రత్యయము, ననునీ రెండింటిలో, ప్రత్యయార్థమే ప్రధాన మని వ్యాకరణనియమ ముండుటచేతను, బరిపూర్ణ మగు పదమే, పదాంతరముతో నన్వయింపఁదగును. ప్రకృత్యర్థము, మొదట, తా నుండు పదమునందలి ప్రత్యయార్థ మగు కారకముతో నన్వయింపక, వేఱుగా నుండు 'న' శబ్దముయొక్క యర్థముతో నన్వయించుట, సంభవింప దని తాత్పర్యము.

కొనినట్లే, యెవఁడేనొక నిషేధవాక్యమును వినినవాఁడు, 'ఈ వాక్యము, నన్ను, ఇందు వినఁబడు కర్మమునుండి, నివర్తింపఁజేయుచున్నది' అని తెలిసికొనును. కనుక, నిషేధవాక్యము, పురుషుని నొకపనినుండి నివర్తింపఁజేయు వ్యాపార మనెడు, నివర్తనను దెలియంజేయుచున్నదిగదా!

కాఁగా, నిషేధవాక్యము లన్నిటిచేఁ దెలియంజేయునర్థ మింతకుముందు వివరింపఁబడిన నివర్తనయే యగుచున్నది. ఇట్లు విధివాక్యమును, నిషేధవాక్యమును, బరస్పరవిరుద్ధము లగు నర్థములను, దెలియంజేయునవి యగుచున్నవి. 'న హంతవ్యః' అను నీమున్నగువాక్యములకు, "చంపుట మున్నగు కర్మములను విడుచుట, యాచరింపవలసినది." అనునది యర్థ మని యంగీకరించునెడల, ఫలమునందన్ననో, 'ఆచరింపఁదగి యుండుట' అనునది, విధి, నిషేధవాక్యములచేఁ దెలియంజేయఁబడునర్థ మగుటంజేసి, యీ రెండువాక్యములకును, నొకయర్థము సంభవించెడిని. అది యుచితము కానేరదు. ఇందులకు క్రిందికారికలు రెండును, బ్రమాణము గాఁగలవు. బ్రహ్మహత్యా మిక్కిలి యుత్కృష్టమైన పాప మగుటచేతను, అశ్వమేధము, 'అశ్వమేధము నాచరించువాఁడు, సమస్తపాపములనుండియే కాక, బ్రహ్మహత్య యను మహాపాతకమునుండికూడ, విముక్తుఁడు కాఁగలఁడు.' అని, బ్రహ్మహత్యనుగూడ నశింపఁజేయునదిగా వేదమునందు వినఁబడుటచేతను, అశ్వమేధమునకును, బ్రహ్మహత్యకును, బరస్పరము నెంత విరోధము గలదో, విధినిషేధములకుఁగూడఁ, బరస్పరము నంత విరోధము గలదు.

విధివాక్యము,[౨] ఫలము[౧] బుద్ధి,[౨] ప్రమేయము,[౩] అధికారి,[౪] బోధించు[౫] శబ్దము, నను నీ యైదంశములయందును, నిషేధవాక్యములకంటెను వేఱుగుచుండుటం జేసి, విధినిషేధములు రెండును, బరస్పరమును భిన్నములగుచున్నవి.

౧. న్యాయసుధయం దుదాహరింపఁబడిన, బృహట్టీకయందలి కారికలు "అంతరం యాదృశం లోకే బ్రహ్మహత్యాశ్వమేధయోః, దృశ్యతే తాదృగేవేదం విధానప్రతిషేధయోః. సర్వం పాప్మానం తరతి, తరతి బ్రహ్మహత్యాం, యోఽశ్వమేధేన యజతే." తై. సం. ౫ కాం ౩ ప్ర. ౧౧ అను. ౨ వాక్యము.

౨. "ఫల, బుద్ధి, ప్రమే, యాధికారి, బోధకభేదతః, పంచధాఽత్యన్తభిన్నత్వాద్భేదో విధినిషేధయోః"

౧. ఫలము:—విధియందు స్వర్గము మున్నగు నిష్టము ఫలము. నిషేధమందన్ననో, నరకము మున్నగు నయినిష్టములు నివర్తించుట (సంభవింపకుండుట)యే ఫలము.

(i) విధి రిష్టఫలో ఽనిష్టపరిహారఫలో ఽపరః ప్రేరితో ఽస్మీతి పూర్వే ధీః, వారితో ఽస్మీతి చాపరే (ii) విషయస్యేష్టహేతుత్వం విధినాచ ప్రమీయతే, నిషేధేన నిషేధ్యస్య ప్రత్యవాయనిమిత్తతా (iii) విధి శ్చాధికరో త్యన్యకారణే నాప్రవర్తితమ్. రాగాదినా ప్రవృత్తం తు నిషేధ స్తద్విలక్షణమ్. (iv) నఞ్ వర్జితో లిఙాదిశ్చ విధిబోధస్య కారణమ్, లిఙా ద్యనుగృహీతస్తు నఞ్ నిషేధస్య బోధకః.

మండనమిశ్రుఁడు మొదలగు నెవ్వరిమతమున, లిఙ్గు మొదలగు ప్రత్యయము, లిష్టసాధనత్వమును బోధించు నని, యంగీకరింపఁబడుచున్నవో, వారిమతమునందుఁ గూడ, 'లిఙ్' మున్నయిన ప్రత్యయములతో నన్వయించు 'న' శబ్దము, ఇష్టసాధనత్వమునకు విరుద్ధ మగు, ననిష్టసాధనత్వమును బోధించుట మూలముగా నివర్తననే° బోధింపఁగలదు. కావున నందఱమతములందును, లిఙ్గు మొదలగు ప్రత్యయములయర్థము ప్రధాన మగుటం జేసి, 'న' శబ్దార్థ, మా ప్రత్యయార్థముతోనే యన్వయించును. అట్లన్వయించునపు, డేదేనొక యనుపపత్తి సంభవించునెడ

౨. బుద్ధి:—విధి వినఁబడునపుడు, "దీనిచే నేదే నొకపనియందుఁ బ్రవర్తింపఁజేయఁబడుచున్నాను" అను నర్థము బోధింపఁబడును. నిషేధము వినఁబడునపు డన్ననో, 'దీనిచే, నే నీ కర్మమునుండి, నివర్తింపఁజేయఁబడుచున్నాను.' అను నర్థము బోధింపఁబడును.

౩. ప్రమేయము:—విధియందు 'యాగము' మున్నగునవి యిష్టమును సాధింపఁగలుగుటయు, నిషేధమునందు, "కలంజభక్షణము" మున్నయినవి యనిష్టమును సంభవింపఁజేయఁ గలుగుటయుఁ బ్రమేయము లగుచున్నవి.

౪. అధికారి:—విధులచే విధింపఁబడు కర్మములవిషయమై, 'ఆయావిధులందు వినఁబడు విశేషణములతోఁ గూడినట్టియు, స్వర్గము మున్నగు ఫలములను గోరునట్టియు, లేదా, ముఖ్యకాలాతిక్రమణము మొదలగు నిమిత్తములు కలిగినట్టియు, స్వయముగాఁ బ్రవర్తింపనట్టియు, మఱి యే యితర ప్రమాణముచేతను, బ్రవర్తింపఁజేయఁబడనట్టియుఁ బురుషుఁ డధికారి యగుచున్నాఁడు. నిషేధములయం దన్ననో, నిషేధింపఁబడువానియందుఁ దీవ్ర మయిన యభిలాషతోఁ బ్రవర్తించువాఁ డధికారి యగుచున్నాఁడు.

౫. బోధించుశబ్దము:—'న' శబ్దముతో నన్వయింపని, లిఙ్, లోట్, తవ్య, అను నీ మూఁడింటిలో, నేదే నొకటి, విధిని బోధించుశబ్ద మగుచున్నది. లిఙ్గు మున్నగువానిలో, నేదే నొకదానితో నన్వయించు 'న' శబ్దము, నిషేధమును బోధించెడిపద మగుచున్నది. ఇట్లయిదువిషయములయందును నొండొంటితో భేదించుటచే, విధినిషేధములు పరస్పరము భిన్నము లగుచున్నవి. ఈ భేదించువిషయము న్యాయసుధయం దీక్రింది నాలుగు శ్లోకములమూలముగా వివరింపఁబడుచున్నది.

౧. ఏదే నొకకర్మ మిష్టసాధన మని తెలిసికొనుపురుషుఁ, డట్టి కర్మమునం దెట్లు ప్రవర్తించునో యట్లే, యొకకర్మ మనిష్టమును గలిగించు నని తెలియుపురుషుఁ, డట్టి కర్మమునుండి నివర్తించు నని తాత్పర్యము.

నన్ననో, వేఱుగతి లేకుండుటంజేసి, 'న' శబ్దార్థము ధాత్వర్థముతోనేఁ యన్వయించును. అట్టి యనుపపత్తి రెండువిధములుగా నుండును. (i) "అతని (స్నాతకుని) కీ క్రిందిది వ్రతము." అను నుపక్రమము.[2] (ii) ఎనిమిది దోషములతోఁ గూడిన వికల్పము సంభవింపవలసియుండుట. అట్టి రెండువిధములగు ననుపపత్తి యుండుటంజేసి, వానిని వారించుటకై, 'న' శబ్దముగల వాక్యములందుఁ బర్యుదాసమే యాశ్రయింపఁబడును. అట్టి యనుపపత్తులు లేనపుడు, 'న' శబ్దములుగల వాక్యములయందు, నిషేధమే[3] యాశ్రయింపఁబడును.

పర్యుదాసః[4] మనఁగా, 'న' శబ్దముగల వాక్యమునందు విధి ప్రధానముగాను, నిషేధ మప్రధానముగాను, నుండునట్లు, 'న' శబ్దార్థము, క్రియను బోధించు నాఖ్యా

౧. ధాతువుచే బోధింపఁబడు నర్థము.

౨. "ఏకాదశ్యాం న భుంజీత పక్షయో రుభయో రపి, వనస్థయతిధర్మోఽయమ్" ( = రెండుపక్షములయందును, భుజింపకుండునట్లు సంకల్పించునది. ఇది వనప్రస్థులకును, యతులకును నాచరింపందగిన ధర్మము) అను నిట్టి స్థలములయందు 'ఉపసంహారము' కూడ ననుపపత్తి యగుచున్నది. కావుననే, తంత్రవార్తికమునందలి, కర్త్రధికరణమునందు, 'పర్యుదాస' నిమిత్తములను వివరించు సందర్భమున, 'నహి దార్శపౌర్ణమాసికే కశ్చిత్ పర్యుదాసహేతు రస్తి. వ్రతశబ్ద ప్రయోగో వికల్పప్రతిపత్తి ర్వా' అను వాక్యమునందు 'ఉపక్రమ' అను పదమును విడిచి 'ప్రయోగ' అను పదమే ప్రయోగింపఁబడినది.

3. ఇచట నీక్రిందివిషయమును గ్రహింపవలయును. 'న తౌ పశౌ కరోతి' ( = పశుయాగమునం, దాజ్యభాగము లనెడి రెండంగముల నాచరింపరాదు). అను వాక్యమునందు, 'పశుయాగమునందు, ఆజ్యభాగములకంటె వేఱగు, నంగముల సముదాయము, నాచరింపవలయును.' అనునర్థము నంగీకరించుటకనుకూలముగాఁ, బర్యుదాస మాశ్రయింపఁబడినను, బశుయాగసందర్భమునందలి, 'అగ్నయ ఆజ్య స్యానుబ్రూహి, సోమా యాజ్య స్యానుబ్రూహి'. అను ఆజ్యభాగముల కంగములగు, మంత్రపాఠములబలమున, నాజ్యభాగములు రెండును, కర్తవ్యము లని తెలియుటచే, వాని కాత్యంతికమగు నివృత్తి లేకుండుటంజేసి, యా యాజ్యభాగములకు వికల్పమే సంభవించుచున్నది. కనుకఁ, బర్యుదాసము నాశ్రయించిన, ప్రయోజనము లేమి, నిచటఁ 'బశుయాగమునం దాజ్యభాగములను రెండింటిని నాచరింపరాదు.' అను నిషేధమే యాశ్రయింపఁబడుచున్నది. ఇట్లు చెప్పుటచే, 'న తౌ......అను నీ వాక్యమునందు, వికల్పము సంభవించు ననుభయమువలనఁ, బర్యుదాస మాశ్రయింపవలసి యున్నది'. అని ప్రాభాకరులవాక్యము నిరాకరింపఁబడినది. ఇచట వికల్పము నంగీకరింపనిపక్షమునఁ, బశుప్రకరణమునం, దాజ్యభాగముల కంగములగు మంత్రములను బఠించుట, వ్యర్థ మయ్యెడినిగదా!

౪. "ప్రధానత్వం విధే ర్యత్ర ప్రతిషేధేఽప్రధానతా,
పర్యుదాస స్స విజ్ఞేయో యత్రోత్తరపదేన నఞ్"
"అప్రాధాన్యం విధే ర్యత్ర ప్రతిషేధే ప్రధానతా
ప్రసజ్యప్రతిషేధోఽయం క్రియయా సహ యత్ర నఞ్."—వాక్యపదీయము,

తముకంటె, వేఱగు దగ్గఱనుండు పదముయొక్క యర్థముతో నన్వయించుట. ప్రతిషేధ మనఁగా, 'న' శబ్దముగల వాక్యమునందు విధి యప్రధానముగాను, నిషేధము ప్రధానముగాను, నుండునట్లు 'న' శబ్దార్థ మాఖ్యాతార్థమగు క్రియతో నన్వయించి, నిషేధమును దెల్పుట. ఆ రెండింటిలో 'ఆ స్నాతకున కీ క్రింద వివరింపఁబడు వ్రతము (=నియమము) కలదు' అని యుపక్రమించుటవలన, దానితరువాతి దగు "నేక్షే తోద్యన్త మాదిత్యమ్"[౧] (న + ఈక్షేత + ఉద్యన్తమ్ + ఆదిత్యమ్) అను నీ మున్నగు వాక్యమునందుఁ బర్యుదాసము నవలంబించి యర్థము వివరింపవలసి యున్నది.

అది యెట్లంటేని:—ఆ స్నాతకునకీ క్రిందిది వ్రతము. అను వాక్యమునందలి 'వ్రత' శబ్దముచేఁ జేయందగినకర్మ మొకటి బోధింపఁబడుచున్నది. కనుక స్నాతకుఁడు, చేయఁదగిన కర్మములు, వివరింపఁబడఁబోవున ట్లుపక్రమింపఁబడుట వలన, నా చేయందగినకర్మము లేవి యను నాకాంక్ష కలుగఁగాఁ, బిదప నుండు 'నేక్షే తోద్యన్త మాదిత్యమ్' అనునీ మున్నగు[౩] వాక్యమునం దట్టి కర్తవ్యములగు

౧. ఈ వాక్యమునకు సాధారణముగా, 'ఉదయించుచున్న సూర్యునిం జూడరాదు.' అని నిషేధరూప మగునర్థమును జెప్పవలసియుండఁగా, ముందు వివరింపఁబోవురీతిని, బర్యుదాసరూప మగు నర్థము చెప్పంబడును.

౨. మనుస్మృతి. ౪. ౧౩ "అతోఽన్యతమయా వృత్త్యా జీవంస్తు స్నాతకో ద్విజః, స్వర్గాయుష్యయశస్యాని వ్రతానీమాని ధారయేత్" అను శ్లోకముచే స్నాతకుఁడగు ద్విజుఁడాచరింపవలసిన స్వర్గము మన్నగుఫలముల నిచ్చుకర్మము లిచ్చటి వ్రతశబ్దము గలవిగా ముందు వివరింపఁబడు నని సూచింపఁబడుచున్నది.

౩. "నేక్షే తోద్యన్త మాదిత్యం నాస్తంయన్తం కదాచన, నోపసృష్టం న వారిస్థం న మధ్యం నభసో గతమ్. న లంఘయేద్వత్సతంత్రీమ్" ఈ మున్నగునవి—("సూర్యుఁ డుదయించునపుడును, నస్తమించునపుడును, రాహుగ్రస్తుఁ డైనపుడును, నీటిలోఁ బ్రతిఫలించినపుడును, నాకాశమధ్యమున నధిష్ఠించినపుడును జూడరాదు. దూడను గట్టుత్రాటిని దాఁటరాదు") అనునిట్టి యర్థమీసందర్భమునం దుండు 'న' శబ్దముతోఁ గూడిన యిట్టివాక్యములచే సామాన్యముగా బోధింపఁబడును. కాని యిచటి సందర్భమునుబట్టి పర్యుదాస మాశ్రయించుటచే నీ వాక్యము లన్నిటికిని 'న' శబ్దమును ధాతువుతోనే యన్వయింపఁజేసి 'ఆయాపనులను జేయరాదు' అను సంకల్పమే యర్థమని గ్రహింపవలసి యున్నది.

ఉపక్రమమును దెలియంజేయు పూర్వవాక్యము:—

ఇచట నీ క్రిందివిషయమును గ్రహింపవలయును. ఆలోచింప 'నేక్షేతోద్యన్త మాదిత్యమ్' అను మున్నగు వాక్యమునుబట్టి పై నుదాహరింపఁబడిన మనుస్మృతియందలి వాక్యములే యిచట లక్ష్యముగా గ్రహింపఁబడవలసియున్నవి. కాని 'తస్య వ్రతమ్' అను నుపక్రమమును సూచించువాక్యము కాని

కర్మములు వివరింపఁబడవలసి యున్నవి. ఏ సందర్భమునం దైన, నాకాంక్షితము లగు విషయములే విధింపఁబడవలసి యున్నవిగదా! అట్లు కాక యాకాంక్షను దెలియం జేయు వాక్యముతో సంబంధము లేకయే, యేదే నొకటి విధింపఁబడునెడ, 'అనావశ్యక మగుదానిని విధించుట' యనెడి దోషమును, ఉపక్రమమును దెలియంజేయు పూర్వవాక్యమున[1] కుండు నాకాంక్ష[2] యుపశమింపకుండుటం జేసి, యా వాక్యమున కప్రామాణ్యమును[3] సంభవించెడిని. చేయందగుకర్మము, ముందు వివరింపఁబడబోవునట్లుపక్రమింపఁబడి,[4] పిదప విధింపఁబడుటమూలముగా వివరింపఁబడనియెడల, నా యుపక్రమమును బోధించు పూర్వవాక్యమునకు సంబంధించు నాకాంక్ష, యుపశమింప నేరదుగదా! ఉపశమింపని యాకాంక్ష గల వాక్యమునకుఁ బ్రామాణ్యము[5] గలుగ నేరదు. అట్లయినచో 'గౌః, గుణము, పురుషుఁడు' అను నిట్టి యాకాంక్షగల పదములతోఁ గూడిన వాక్యమునకుఁగూడఁ బ్రామాణ్యము సిద్ధించెడిని. మఱియు, 'నేక్షేత' అను నీ మున్నగు కడపటివాక్యముచే వ్రతమునకు సంబంధింపని వేఱొకయర్థము బోధింపఁబడుటవలన, నీవాక్యమునకు 'తస్య వ్రతమ్' అను నుపక్రమమును దెలియఁజేయువాక్యముతో నుండునట్లు తెలిసికొనఁబడు నేకవాక్యతా[6] లేకుండకపోయెడిని. కావున నపేక్షిత మగుదానివిధానమును, నిచటఁ దెలియంబడు నేకవాక్యతయును, సిద్ధించుటకొఱకు 'నేక్షేత' అను నీ మున్నగువాక్యమునందుఁ జేయందగినకర్మ మొకటి విధింపఁబడవలసి యున్నది. అట్లు విధింపఁబడవలసి యున్నపు డిందలి 'న శబ్దము,' 'ఈక్షేత' అనుపదమునం దుండు విధిని బోధించు 'త' ప్రత్యయ

'ఏతావతా హ్యైనసా వియుక్తో భవతి' (=పైని వివరించిన వ్రతముల నాచరించువాఁడు పాపము నుండి విముక్తుఁ డగును.) అను కడపటివాక్యము గాని మనుస్మృతియందు లేకుండుటం జేసి పైని జెప్పంబడిన మనుస్మృతియందలి వాక్యముల నుదాహరణములుగా గ్రహించుట యుచితము గాదు. మఱి యీ మన నావాక్యములతో సమానార్థకము లగునట్టియు 'ఏతావతా' ఈ మున్నగు కడపటివాక్యము కలదియునగు వేఱొకస్మృతిని గాని శ్రుతిని గాని యుదాహరణముగా నిచట గ్రహింపవలసియున్నది.

౧. "ఆ స్నాతకున కీ క్రిందివ్రతము కర్తవ్యము". అనునది.

౨. 'ఈ వ్రత మెట్టిది' యను ప్రశ్నమున కుత్తరము తెలిసికొనవిచ్ఛ.

3. ప్రమాణము కాకపోవుట. అనఁగా యథార్థజ్ఞానమును గలిగింపకపోవుట.

౪. ఆరంభింపఁబడి.

౫. ప్రమాణ మగుట = యథార్థజ్ఞానమును గలిగించుట.

౬. రెండు వేఱువాక్యము లొకటేవాక్యముగా నన్వయించుట.

ముతో సంబంధింపనేరదు. అట్లు సంబంధించినయెడల నీ వాక్యమందుఁ, జేయందగిన కర్మ మేదియు బోధింపఁబడుట వీలుపడదుగదా![౧] కనుక నిచట 'న శబ్దము' ప్రత్యయముతో సంబంధింపక తనదగ్గఱ నుండు ఈక్ష్ ధాతువుతో సంబంధించు చున్నది. అట్లు సంబంధించునపుడు[౨] 'న' శబ్దము ప్రతిషేధమును[3] బోధింపదు. 'న' శబ్దము విధిని బోధించు 'త' ప్రత్యయముతో సంబంధించునపుడుమాత్రమే ప్రతిషేధ మును బోధింపఁగలదుగదా! ప్రతిషేధమును బోధించుట యనునది, విధిని బోధిం చుట యనుదానికి విరుద్ధ మగునర్థముగదా!

నామము గాని ధాతువు గాని విధిని బోధింపనేర కుండుటంజేసి 'న' శబ్ద మా రెండిటితో సంబంధించునపుడుమాత్రము, నిషేధమును బోధింపనేరదు. దీనివిష యమున "'న' శబ్దము నామముతోఁ గాని ధాతువుతోఁ గాని సంబంధించునపుడు ప్రతిషేధమును బోధింపనేరదు. మ త్తే మన నది (నశబ్దము) 'బ్రాహ్మణ' శబ్దముతో సంబంధించునపుడు, బ్రాహ్మణునికంటె వే ఱయి యబ్రాహ్మణుఁ డనఁదగువానిని, 'ధర్మ' పదముతో సంబంధించునపుడు ధర్మమునకు విరుద్ధమగు నధర్మమును, బోధిం చును" అను శ్లోకవార్త్తికము ప్రమాణముగాఁ గలదు. కావున 'నేక్షేత...' అనునీ వాక్యమందు 'న' శబ్దము 'ఈక్ష్' ధాతువుతో సంబంధించుటంజేసి, యా రెండింటి చేతను ధాతువున కర్థ మగు నీ క్షణమునకు[౪] విరుద్ధ మగు, చేయందగిన యొక కర్మము, బోధింపఁబడుచున్నది.

ఇచట నొకఁ డిట్లు శంకించుచున్నాఁడు. 'న' శబ్దము తనతో సంబంధించు పదముయొక్క యర్థముకంటె భిన్న మగుదానిని, దానికి విరుద్ధ మగుదానిని, దాని

౧. న శబ్దము, తనతో సంబంధించుపదముయొక్క యర్థమునకు విరుద్ధ మగునర్థమును బోధించున దగుటంజేసి, యిచట న శబ్దము, 'ఈక్షేత' అనుపదమునందలి 'త' ప్రత్యయముతో సంబంధించి, యా ప్రత్యయార్థమైన ప్రవర్త్తనకు (విధికి) విరుద్ధ మగు నివర్త్తన యనెడి యభావరూప మయిన యర్థమును బోధించును గాని, చేయందగు భావరూప మయిన కర్మమును బోధింపనేర దని తాత్పర్యము.

౨. "విధాయకైరసంయుక్తో నైవ నఞ్ ప్రతిషేధకః" అను వార్త్తికమునం దీవిష యము చెప్పంబడియున్నది.

3. "నామధాత్వర్థయోగీతు నైవ నఞ్ ప్రతిషేధకః
వదత్యబ్రాహ్మణా ధర్మా వన్యమాత్రవిరోధినౌ"
—శ్లోకవార్త్తికము అపోహవాదము, శ్లో. 33 పృష్ఠమ్. ౫౪౫.

౪. చూచుట.

లేమిని,[౧] ( = అది లేకుండుట బోధింపఁగలదు,' అను స్మృతివాక్య మున్నను, నది (నశబ్దము) సుకర మగుటచేఁ, దనతో సంబంధించు పదార్థముయొక్క లేమినే, శక్తి మూలముగా బోధించును గాని, దానికంటె నే అగుదానిని గాని, దానికి విరుద్ధ మగు దానిని గాని బోధింపఁజాలదు. ఈ రెండర్థములును నభావముతో సంబంధించి యుండుటంజేసి యీ రెండింటిని శక్తిమూలముగా బోధించుట క్లేశకరము గదా! 'న' శబ్దమున కనేకార్థములయందు శక్తిని గల్పించుట యనుచితము. కావున 'న' శబ్దము ధాతువుతోఁ గూడునపుడు ధాత్వర్థముయొక్క యభావమునే బోధించును గాని దానికి విరుద్ధ మగునర్థమును బోధింప నేరదు- అను శంక కిక్రిందిది సమాధానము.

శంకకుఁడు చెప్పినమాట సత్యమే. నశబ్దమున కభావమునందే శక్తి గలదు. "తత్సాదృశ్యమ్" అను నీమున్నగు వ్యాకరణస్మృతి యున్నదో, యభావము గాక మిగిలినయర్థములు న శబ్దముచేఁ దెలియంజేయఁబడుచున్నవి. కాని, యీ యర్థముల యందు న శబ్దమునకు శక్తిలేదు' అని సూచించుచున్నది. 'నామము గాని'...ఈ మున్నగు వాక్యముకూడ 'నభావము గాక తక్కినయర్థములు న శబ్దముచే నేకరీతిని దెలియంజేయఁబడుచున్నవి' అని బోధించుచున్నది. అయినను 'నేక్షేత' అను వాక్యమునందు, 'త' ప్రత్యయము, నశబ్దముతో సంబంధింపమిని, నీవాక్యమునందే దేనొక 'చేయుందగినకర్మము' విధింపఁబడవలసియున్నది. ఇచట ధాతువున కర్థ మగు నీక్షణము విధింపఁబడ నేరదు. 'న' శబ్ద, మాధాత్వర్థముయొక్క లేమిని బోధించునుగదా! లేదా, యభావము విధింపఁబడనేర కుండుటంజేసి, ధాత్వర్థ మైన యీక్షణముయొక్క యభావ మైనను, విధింపఁబడనేరదు. కావున, నిచట న శబ్దము, 'ఈక్ష్' ధాతువు, నను నీ రెండిటిచేతను విధింపఁబడఁదగినదియు, ధాత్వర్థమైన యీక్షణమునకు విరుద్ధ మైనదియు, నగుకర్మము, లక్షణమూలమునఁ దెలియంజేయఁబడు చున్నది.

౧. ఈవిషయమున 'అ-మా-నో-నాః ప్రతిషేధే' ( = అ-మా-నో-న అనుపదములు నిషేధమును బోధించును.) అను స్మృతియు, నశబ్దము నివృత్తి యనెడి నిషేధమును బోధించును- అను భాష్యవచనమును, "తత్సాదృశ్య మభావశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ ప్రకీర్తితాః" అను వైయాకరణభూషణమునందుండు కారికయుఁ బ్రమాణములుగాఁ గలవు.

౨. లేమి.

అట్టి యీక్షణమునకు విరుద్ధ మగునదియు, లక్షణమూలమున బోధింపఁబడు నదియు నగు కర్మము "నేను జూడను" అను సంకల్పమె యగుచున్నది. అట్టిసంకల్పము, ధాత్వర్థ మగు నీక్షణమునకు విరుద్ధ మగునదిగదా! ధాత్వర్థ మగు నీక్షణమునకు విరుద్ధము లగు నితరకర్మము లున్నను, 'నేను జూడను' అను సంకల్పము, సర్వకర్మములందును దప్పక యావశ్యక మగుటచే, లక్షణమూలమునఁ దెలియుటంజేసి, 'నేక్షేత' అను వాక్యమునం దదియే కర్తవ్యముగా విధింపఁబడుచున్నది. ఇట్లయినచో నీ వాక్యమునుండి, 'నేను జూడను' అను సంకల్పముచేఁ 'దనయిష్టము నుత్పాదింపవలయును' అనునర్థ మేర్పడుచున్నది. ఈ సంకల్పముచే దేని నుత్పాదింపవలెను? అను భావ్యాకాంక్ష కలుగఁగా, 'నేక్షేత' అను మున్నగు వాక్యముతో సంబంధింపఁదగు కడపటివాక్యమైన 'పయిని వివరింపఁబడిన కర్మముల నాచరించువాఁడు పాపమునుండి విముక్తుఁ డగును.' అనుదానినుండి తెలియు పాపక్షయము, భావ్యముగా నన్వయించును. ఇట్లిచటి యీ సంకల్పము పాపక్షయముకొఱకుఁ గర్తవ్యముగా విధింపఁబడుటవలన, నీ సంకల్పమును బోధించు 'నేక్షేత' మున్నగు వాక్యమున, కుపక్రమమును బోధించు 'తస్య వ్రతమ్' అను వాక్యముతో, నేకవాక్యత సిద్ధించుచున్నది. కాఁగా 'తస్య వ్రతమ్' అను వాక్యము, ర్తవ్యముగా వివరింపఁబడఁబోవు కర్మముల నుపక్రమింపఁజేయున దగుటంజేసి, దీని యనంతరమే యుండు 'నేక్షేత' మున్నగు వాక్యమునందు 'పర్యుదాసము' ఆశ్రయింపఁబడుచున్నది. "నానూయాజేషు యేయజామహం కరోతి"[౧] (=అనూయాజములకంటె నితరములగు యాగములయందు

౧. "ఆశ్రావయేతి చతురక్షరమ్, అస్తు శ్రౌష డితి చతురక్షరమ్, యజేతి ద్వ్యక్షరమ్, యేయజామహ ఇతి పంచాక్షరమ్, ద్వ్యక్షరో వషట్కారః, ఏష వై సప్తదశః, ప్రజాపతి ర్యజ్ఞ మన్వాయత్తః" (తై. సం ౧ కాం ౬ ప్ర ౧౦ అనువాకము). దీనియర్థము. అధ్వర్యుండు ప్రధానయాగరూప మగు హోమమును జేయుటకై హవిస్సుతోఁ గూడిన జుహువును జేతనుంచుకొని, యాగ్నీధ్రుఁ డను ఋత్విజునకు 'ఆశ్రావయ' ( = ఇప్పుడు హవిస్సు మీ కియ్యఁబడును.' అని యిచట యజింపఁబడఁబోవు దేవతకు వినిపింపుము ) అని ప్రేష (ఆజ్ఞ) నిచ్చును. అపు డాగ్నీధ్రుఁడు 'అస్తు శ్రౌషట్' (సరియే ఓ దేవతలార! మీకొఱ కిపుడు హవిస్స నిచ్చు ప్రయోగమును వినుఁడు.) అని బదులు చెప్పును. పిదప నధ్వర్యుఁడు 'యజ' (ఇచట యజింపఁబడు దేవతలకు సంబంధించు 'అగ్నిం యజ' 'విశ్వాన్ దేవాన్ యజ' అను నిట్టి యాజ్యావాక్య మనెడి మంత్రమును బఠింపుము). అని హోత యను ఋత్విజునకు 'ప్రేష' ఇచ్చును. ఇట్లధ్వర్యుండు, ప్రేష నియ్యఁగా, హోత, 'యేయజామహే' ( = అధ్వర్యునిచే 'యజ' అను ప్రేష పొందిన మేము,

'యేయజామహే' అను మంత్రము నుచ్చరింపవలయును.) అను సందర్భములందు 'న' శబ్దమును, నిషేధమును దెలియఁజేయుదానినిగా నన్వయించునెడఁ బ్రాప్తించు వికల్పమును వారించుటకై, పర్యుదాస మాశ్రయింపఁబడుచున్నది. అది యెట్లంటేని.

ఈ వాక్యమందలి 'న' శబ్ద మిచటి పదార్థములలోఁ బ్రధాన మైనదానితో సంబంధము నొందవలయు ననునిచ్ఛచే 'కరోతి' పదమందలి పనిని బోధించెడు 'తి' ప్రత్యయముతో, నన్వయించుపక్షమున, "అనూయాజము లనెడి యాగములందు, 'యేయజామహే' అను మంత్రము నుచ్చరింపరాదు. అని యీ 'నానూయాజేషు' మున్నగు వాక్యముచే, 'యేయజామహే' అను మంత్రము నుచ్చరించుట, అనూయాజము లనెడు యాగములందు, నిషేధింపఁబడుచున్నది." అని చెప్పవలసియున్నది. ప్రతిషేధింపఁబడుదానికి, మొదటఁ బ్రాప్తి యుండవలసియుండును గనుక, 'యేయజామహే' అను మంత్రము ననూయాజములం దుచ్చరించుటకుఁ బ్రాప్తి లేనిదే దానికి నిషేధము సంభవింపనేరదు.

కనుకనే యంతరిక్షమందుఁ గాని స్వర్గలోకమునందుఁ గాని అగ్నిచయన మను క్రతువు, చేయుట యశక్య మగుటవలన, దాని కచటఁ బ్రాప్తియే లేకుండుటంజేసి, 'నాంతరిక్షే న దివి' అను వాక్యముచే నంతరిక్షము స్వర్గము నను రెండులోకములందును నగ్నిచయనము నిషేధింపఁబడుట లేదు. కావుననే నిషేధము, ప్రాప్తించుదానికే సంభవించెడి స్వభావము కలది. కనుకనే "బ్రాహ్మణో న హన్తవ్యః" (=బ్ర"

'యాజ్యావాక్య' యనుమంత్రమును, 'వషట్' (దీనికి 'వౌషట్' అను రూపాంతరము గలదు. దీని కర్థము. దేవతలార! ఈ హవిస్సు మీ కీయఁబడుచున్నది.) అను మంత్రమును నుచ్చరింతురు. ఇచట 'వౌషట్' అను కడపటిమంత్రము నుచ్చరించుకాలముననే, యధ్వర్యుని చేతినుండి హవి స్సగ్నియందు వేల్వఁబడును.

౧. ఈయాగము, భూలోకమం దే కాని, యంతరిక్షము మున్నగు నితరలోకములందుఁ జేయ శక్యము కాకుండుటంజేసి, యచట దానికిఁ బ్రాప్తి లేదని తాత్పర్యము.

౨. మరియు "హిరణ్యం నిధాయ చేతవ్యమ్ (= క్రింద హిరణ్యముంచి దానిపై నగ్నిని సంస్కారపూర్వకముగా స్థాపించుట యనెడి యగ్నిచయన మను యాగము నాచరింపవలెను.) అను విధి, యీ "నాంతరిక్షే" మున్నగు వాక్యముచే స్తుతింపఁబడుచున్నది. అది యెట్లన:—అంతరిక్షమందుఁ గాని, స్వర్గమునందుఁ గాని యగ్నిచయన మెట్లప్రసిద్ధమో, యట్లే హిరణ్యముంచని వట్టిభూమియం దగ్నిచయన మప్రసిద్ధము. కావున భూమిపై హిరణ్యము నుంచి దానిపైనే యగ్నిచయనము నాచరింపవలెను-అని

హ్మణుఁడు చంపఁదగినవాఁడు కాఁడు.) అను నిషేధముచేఁ, బురుషు డెల్లపుడును జంపుట యను నిషిద్ధకర్మమునుండి నివర్తింపఁ జేయఁబడుట యుక్తమగుచున్నది. అది యెట్లంటేని:—ప్రతిపురుషుఁడును, నొకప్పుడు చంపుట మున్నగు నిషిద్ధకర్మములందుఁ బ్రవర్తించును. ఒకానొకపు డట్టికర్మములం దభిలాష లేనిచో వానియందు స్వయముగానే ప్రవర్తింపఁడు. ఇట్లుండ నిషేధవాక్యమనెడి శాస్త్రము, తనచే నిషేధింపఁబడునది ప్రాప్తించుస్థలమునందే ప్రవర్తించు ననెడి నియమము లేనియెడల, రాగము[1] మున్నగు నిమిత్తముల ననుసరించి, హననము[2] మొదలగు నిషిద్ధకర్మములందు స్వయముగానే ప్రవర్తింపనిపురుషునిఁగూర్చియు, నిషేధవాక్య మనెడి శాస్త్రము ప్రమాణముగాఁ బ్రవర్తించి చరితార్థ మగుచుండుటచేసి, రాగము మున్నగు నిమిత్తములవలన హననము మొదలైన నిషిద్ధకర్మములందుఁ బ్రవర్తింపఁబోవు పురుషునిగూర్చి, యీ నిషేధము మరలఁ బ్రవర్తింపనేరదు గాన, నా పురుషున కట్టి కర్మములనుండి నివృత్తి కలుగకుండెడిని.

నిషేధవాక్యము, తనచే నిషేధింపఁబడునది ప్రాప్తించుస్థలమునందే ప్రవర్తించు ననెడి నియమ మంగీకరింపఁబడుపక్షమునం దన్ననో, స్వయముగా హననము[3] మున్నగు నిషిద్ధకర్మములందుఁ బ్రవర్తింపని పురుషునివిషయమై ప్రసక్తి లేకుండుటంబట్టి, నిషేధశాస్త్ర మచటఁ బ్రవర్తింపదు కనుక, రాగము మొదలగు నిమిత్తములవలనఁ బురుషుఁ డట్టి హననాది నిషిద్ధకర్మములందుఁ బ్రవర్తింపఁబోవు చుండఁగా, ఇష్టసాధనతాజ్ఞాన[4] మనెడి రాగము, నిషేధవాక్యమున కుపజీవ్య[5] మగుటచేఁ, బ్రబల మైనను, బలవదనిష్టమును గలుగఁజేయు దని యూహింపఁబడుటవలన

౧. అభిలాష = కుతూహలము.

౨. చంపుట.

3. = ఆవశ్యకత = అక్కఱ.

౪. "నేఁ జేయఁబోవుకర్మము నా యిష్టము నుత్పాదింపఁగలదు." అ నియూహించుట—యట్టి కర్మము చేసినను దాత్కాలిక మగు సంతోషము కలుగవచ్చును. కనుక నట్టికర్మములనుగూర్చి కలుగు నిష్టసాధనతాజ్ఞానము, యథార్థమే కావచ్చును. అయినను గాలాంతరమునందు, గొప్ప యనిష్టమును గలిగించు నిషిద్ధకర్మములవిషయమైనను, 'ఈ కర్మమునుండి యనిష్ట మేమియు రాదు' అని తత్కాలమునందుఁ గలుగు నూహతోఁ గూడిన యిష్టసాధనతాజ్ఞాన మనెడి రాగము, భ్రాంతిరూపమే యగుచుండు నని భావము.

౫. ఆధారము, ఉపజీవకము = ఆధారపడినది.

భ్రాంతిరూప మగుటంజేసి, యుత్తరక్షణమునందు గలుగు నిషేధశాస్త్ర మనెడు ప్రమాణజ్ఞానముచే, నత్యంతము బాధింపఁబడఁగలదు. కావున, నచట నిషేధ శాస్త్రము ప్రవర్తింపఁగా, హననము మున్నగు నిషిద్ధకర్మములందుఁ బ్రవర్తింపఁ బోవు పురుషుఁ డా కర్మములనుండి నివర్తించుట యుచిత మగుచున్నది.

కాఁబట్టి, "వ్రీహీ నవహన్యాత్" (= వ్రీహులను దంపుటచే నిష్టము నుత్పాదింపవలయును.) అను విధి వడ్లను బియ్యముగా మార్చుటకై యితరోపాయములు ప్రవర్తింపక దంచుట యనెడియుపాయమే తప్పక ప్రవర్తింపవలె నని యెట్లు బోధించుచున్నదో, యట్లే "బ్రాహ్మణో న హన్తవ్యః" అను నిషేధము, హననము మున్నగు నిషిద్ధకర్మములందు స్వయముగనే ప్రవర్తింపని పురుషునివిషయమై నివృత్తి యనావశ్యక మగుటంజేసి, రాగము మున్నగు నిమిత్తములవలన నట్టి నిషిద్ధకర్మములందుఁ బ్రవర్తింపఁబోవు పురుషునిఁగూర్చియే, నివృత్తి నియతముగా నావశ్యక[1] మని బోధించుచున్నది. అది యెట్లంటేని:—

"వ్రీహీ నవహన్యాత్" అను శాస్త్రము వడ్లను బియ్యముగా మార్చుటకై దంచుట యను నుపాయమును స్వయముగానే యవలంబించు పురుషునిఁగూర్చి ప్రవర్తించుట వ్యర్థ మగుటంజేసి, యచటఁ బ్రవర్తింపక, దంచుటకంటె నితరము లగు నఖవిదళనము[3] మున్నగు నుపాయముల నవలంబించు పురుషునిఁ గూర్చియే ప్రవర్తించును. ఇట్లే "బ్రాహ్మణం న హన్యాత్" అనెడు శాస్త్రము అట్టికర్మములనుండి స్వయముగానే నివర్తించు పురుషునిఁగూర్చి ప్రవర్తించుట వ్యర్థ మగుటంజేసి, యచటఁ బ్రవర్తింపక, రాగాదినిమిత్తములచే హననమునందుఁ బ్రవర్తింపఁ బోవు పురుషునిగూర్చియే ప్రవర్తించును. 'ఏది చేయఁబడఁబోవునో దానిని జేయరాదు.' అని చేయంబడునట్లు ప్రసక్త మగుదానికే నిషేధము కలుగును

౧. నిషేధవాక్యము రాగాదులవలన నిషిద్ధకర్మములందుఁ బ్రవర్తింపఁబోవు పురుషునిగూర్చియే ప్రవర్తించి వాని నట్టి కర్మములనుండి నివర్తింపఁజేయు నని భావము.

౨. విధి, 'అపూర్వవిధి నియమవిధి పరిసంఖ్యావిధి' యని యెట్లు మూఁడువిధములుగా నున్నదో, యట్లే, నిషేధమును, 'అపూర్వనిషేధము నియమనిషేధము పరిసంఖ్యానిషేధము' నని మూఁడువిధములుగా నున్నది. అపూర్వనిషేధము ఉ:—"నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి" "దీక్షితో న దదాతి" "నతౌ పశౌ కరోతి" అను నీమున్నగునవి—నియమనిషేధము ఉ:—"బ్రాహ్మణో న హన్తవ్యః."

౩. గోళ్లతో నొలుచుట.

గదా! కనుకఁ బ్రతిషేధములు, ప్రాప్తి యుండువానినిగూర్చియే యావశ్యకము లగుటంజేసి యనూయాజము లనెడి యాగములందు, 'యేయజామహే' అను మంత్రమును బఠించుట నిషేధింపఁబడుచుండుటవలన, నీ మంత్రమున కనూయాజములందుఁ బ్రాప్తి యుండవలయు నని చెప్పఁదగియున్నది. అట్టి ప్రాప్తి, హననము మొదలైన కర్మములనుగూర్చివలె, రాగమువలనఁ గలుగనేరదు. కావున, "యజతిషు యే యజామహం కరోతి" (యాగములందు 'యేయజామహ' మను మంత్రమును బఠించి యిష్టము నుత్పాదింపవలయును.) అను సామాన్యశాస్త్రమువలన, 'యేయజామహే' అను మంత్రము, అనూయాజములందుఁ బ్రాప్తించు నవి చెప్పవలసియున్నది. ఒక శాస్త్రముచేఁ బ్రాప్తించుదానికి వేఱొకశాస్త్రముచే నిషేధము కలుగునపు, డా రెండింటికిని, బలము సమాన మగుటచే వికల్పము గలుగును. నిషేధశాస్త్రముచే భ్రాంతిమూలముగా నేర్పడు రాగమునకు, బాధ కలుగునట్లు, ప్రాప్తిని దెల్పు శాస్త్రాంతరమున కత్యంతబాధ కలుగనేరదుగదా!

ఇచట నొకఁ డిట్లు శంకించుచున్నాఁడు. జ్యోతిష్టోమప్రకరణమున, "అరుణయా పింగాక్ష్యా ఏకహాయన్యా గవా సోమం క్రీణాతి" అనువిధి ననుసరించి, యాగమునకై సోమలతను గొనుటకై యొకగోవును గోశాలనుండి సోమమును గొను స్థానమునకుఁ దీసికొనివచ్చుచుండఁగా, నాగోవు వేయు నేడవయడుగునందు "సప్తమే పదే జుహోతి" అను విశేషవిధివలన, నొకహోమము కర్తవ్యముగా విధింపఁబడుచున్నది. మఱియు, నశ్వమేధయాగమునకై కశ్వమును దీసికొని వచ్చుచుండఁగా, నది వేయు ప్రతియడుగునందును 'అశ్వస్య[1] పదేపదే జుహోతి' అను వేఱొక విశేషవిధిచే హోమము కర్తవ్యముగా విధింపఁబడుచున్నది. ఇచట 'పదము'[2] (అడుగు) ను, హోమము చేయు విశేషస్థానముగా విధించు 'సప్తమే పదే జుహోతి', 'అశ్వస్య పదేపదే జుహోతి' అనెడి విశేషశాస్త్రములచే, 'ఆహవనీయాగ్నిని' హోమము లన్నియు సామాన్యముగాఁ జేయు స్థానముగా విధించు, "య దాహవనీయే జుహోతి" అను సామాన్యశాస్త్రము బాధింపఁబడుచున్నది. ఇట్లే 'యేయజామహే' అను మంత్రోచ్చారణమును 'అనూయాజము' లనెడి

౧. అశ్వము వేయు ప్రతియడుగునందును హోమము చేసి యజించుటచే నిష్టము నుత్పాదించుకొనవలెను.

౨. పదమునందే హోమము చేయుట.

విశేషయాగములందు నిషేధించు, '**నానూయాజేషు**' అనెడి విశేషశాస్త్రముచే, '**యేయజామహే**' అనుమంత్రమును యాగములందు సామాన్యముగా విధించు '**యజతిషు యేయజామహం కరోతి**' అను సామాన్యశాస్త్రముకూడ బాధింపఁబడ వచ్చునే! అని యిట్లు చేయుశంక సరికాదు. ఎచట నొకశాస్త్ర మింకొకశాస్త్రము నపేక్షించియుండదో, యచట, మొదటిశాస్త్రము రెండవదానిని బాధింపఁగలదు. **హోమమును** ప్రత్యేకముగాఁ బదమునందు విధించు 'సప్తమే పదే జుహోతి' అను నిట్టి విశేషరూపమయిన పదశాస్త్రము, తనయందు వినఁబడు విశేషాంశమును విధించుటకై, **హోమమును** సామాన్యముగా నాహవనీయాగ్నియందు విధించు సామాన్య శాస్త్ర మగు '**య** దాహవనీయే జుహోతి' అనెడి యాహవనీయశాస్త్రము నపేక్షించియుండలేదు.

కనుకఁ బదశాస్త్ర **మాహవనీయశాస్త్రమును** బాధింపఁగాదు. 'యేయజామహే' అను మంత్రమును, అనూయాజము లనెడి యాగవిశేషములందు నిషేధించు 'నానూయాజేషు' అనెడు నిషేధశాస్త్ర మున్ననో, తాను ప్రవర్తించుటకై యనూయాజములందే 'యేయజామహే' అను మంత్రముయొక్క ప్రాప్తి యావశ్యక మగుటంజేసి, 'యేయజామహే' అను మంత్రమును యాగసామాన్యమును, బోధించు '**యజతి**' పదముమూలముగా, యాగసామాన్యమునం దంతర్గతము లగు అనూయాజము లనెడి యాగవిశేషములందుఁ బ్రాప్తింపఁజేయు 'యజతిషు యేయ జామహం కరోతి' అను (సామాన్య) విధి నతిక్రమించుచునేయున్నది. కాఁగా నిషేధశాస్త్ర, మేదే నొకవిశేషమును దెలియంజేయున దగుటచే, నెట్లు ప్రబల మగుచున్నదో, యట్లే విధిశాస్త్రముకూడ, నిషేధశాస్త్రమున కుపజీవ్య మగుటమూల ముగాఁ బ్రబలమే యగుటంజేసి, నిషేధశాస్త్రముచే విధి యత్యంతము బాధింపఁ బడుట యుక్తము కానేరదు. కనుక 'యేయజామహ' మను మంత్రము, అనూయాజ ములందు విధింపఁబడి ప్రతిషేధింపఁబడుచుండుటంజేసి, యీ మంత్రమున కిచట వికల్పము౧ సంభవించెడిని. అట్టి వికల్ప ముచితము కాదు. ఏలయన, వికల్పము

౧. 'విధిస్తదధీనాత్మలాభేన ప్రతిషేధేన తుల్యబలో భవతి':— (= ప్రతిషేధము యొక్క స్వరూపము విధి నాధారముగాఁ జేసికొనియే యుండుటంబట్టి, విధి, ప్రతిషేధముతో సమాన బలము గలిగియేయుండును.) అను న్యాయము ననుసరించి, యిచట విధికిని బ్రతిషేధమునకును సమానబలము సిద్ధించుచున్న దని భావము.

౨. ఈవిషయము అష్టదోషదుష్టమైన వికల్పమును నిరూపించుసందర్భమున సంపూర్ణముగా వివరింపఁబడియున్నది.

నంగీకరించునెడ నొకశాస్త్రము ప్రవర్తించునపుడు రెండవశాస్త్రము విడువఁబడుచుండుటవలనను, నా శాస్త్ర మపు డప్రమాణ మని నిశ్చయింపఁబడక, యట్లు విడువంబడుట సంభవింపదు గనుకను, నా రెండవశాస్త్రమున కప్పు డప్రామాణ్యము రాకతీఱదు. ' వ్రీహిభి ర్యజేత 'అను శాస్త్రమును బ్రమాణముగా నెంచి, మొదట వ్రీహులను యాగమునకొఱకు వినియోగించునమయమునందు, ' యవలను వినియోగింపఁజేయు ' యవై ర్యజేత 'అను శాస్త్రమున కెట్లు ప్రామాణ్యము కలుగనేరదో యట్లే, ' యజతిషు యేయజామహం కరోతి ' అను సామాన్యవిధిని బ్రమాణముగా నెంచి, మొదట ' యేయజామహ 'మను మంత్రము ననూయాజములం దుచ్చరించునపుడు, ' నానూయాజేషు 'అను నిషేధశాస్త్రమునకుఁ బ్రామాణ్యము కలుగనేరదు. ఇంతేకాక, వికల్పము నంగీకరించుపక్షమున, రెం డదృష్టములను గల్పించుట కూడ సంభవించెడిని. అది యెట్లంటేని:—' యజతిషు యేయజామహం కరోతి ' అను అనారభ్యాధీత మగు విధినుండికూడ, అనూయాజములందు ' యేయజామహే ' అను మంత్రము నుచ్చరించుటవలన నీ యాగముల కేదో యొక యుపకారము[2] సిద్ధించు నని తెలియుచున్నది. దర్శపూర్ణమాసేష్టులసందర్భమున వినంబడు, " నానృతం వదేత్ "అను విధివాక్యమునుండి ' ఈ యిష్టుల నాచరించునపు డనృత మాడకుండుటచే' నీ యిష్టుల కొకయుపకార మెట్లు సిద్ధించు నని తెలియుచున్నదో, యట్లే ' నానూయాజేషు 'అను నిషేధశాస్త్రమునుండికూడ ' అనూయాజములందు ' యేయజామహే 'అను మంత్రము నుచ్చరింపకుండుటచే నీయాగముల కొక యుపకారము సిద్ధింపఁగల దని తెలియుచున్నది. అట్టియుపకార మదృష్టరూప మైనదియే కనుక నిచట (ఈ వికల్పమునందు) రెండుపర్యాయము లదృష్టమును, గల్పించుట యావశ్యకమయ్యెడిని. కావున,[3] (పై రెండు కారణములచే) వికల్పము నంగీకరించుట యుక్తము కాదు. కాఁగా ' నానూయాజేషు ' అను వాక్యమునందుఁ బ్రతిషేధము నాశ్రయించినచో, నట్టివికల్పము సంభవించును గనుక, నిచటఁ బ్రతిషేధము నాశ్రయించుటకు వీలులేదు.

౧. ప్రత్యేకముగా నేదే నొకయాగవిశేషము నుద్దేశింపక యాగసామాన్యములయొక్క సందర్భమున వినంబడువిధి.

౨. ఉపకారము = అపూర్వము.

3. ఒక్కొక్కపక్షమునం దొక్కొక్కశాస్త్రమున కప్రామాణ్యము సంభవించుట, రెండుమాఱు లదృష్టమును గల్పించుట యను రెండుకారణములు.

మఱే మన, 'నానూయాజేషు' అను వాక్యమందలి 'న + అనూయాజ' శబ్దములు రెండింటిచేతను, లక్షణమూలముగా ననూయాజములకంటె భిన్నము లగు యాగములు బోధింపఁబడుటంజేసి, "అనూయాజములకంటె నేఱగు యాగముల యందు, 'యేయజామహే' అను మంత్రము నుచ్చరించుటచే, నిష్టము నుత్పాదింప వలెను." అనునర్థ మేర్పడును గనుక, నీవాక్యమందలి 'న' శబ్దమును 'అనూయాజ'శబ్దముతో సంబంధింపఁజేయుటద్వారముసఁ బర్యుదాస మాశ్రయింపఁబడుచున్నది. 'యేయజామహే' అను మంత్రము, 'యజతిషు యేయజామహం కరోతి' అను విధిచేతనే విధింపఁబడి యుండుటంజేసి, యీ 'నానూయాజేషు' అను వాక్యము నందుఁ గర్తవ్యముగా విధింపఁబడుట లేదు. మఱే మన, 'యజతిషు యేయజామహం కరోతి' అను సామాన్యశాస్త్రముచే విహితమైన 'యేయజామహే' అను మంత్రము నుద్దేశించి, యామంత్రమున కనూయాజములకంటె భిన్నము లగు యాగములందు వినియోగము, ఈ 'నానూయాజేషు' అను వాక్యముచే విధింపఁబడు చున్నది. అట్లు విధింపఁబడుటవలన 'యజతిషు యేయజామహం కరోతి' అను సామాన్యశాస్త్రము, అనూయాజములకంటె భిన్నము లైన యాగములందే ప్రవర్తించు నని యర్థ మేర్పడుచున్నది. కాఁగా "యజతిషు యేయజామహం కరోతి" అను సామాన్యశాస్త్రము, తాను బ్రవర్తించుటకొఱకు విశేషవిషయము నపేక్షించు చుండఁగా, నట్టి విశేషవిషయము 'అనూయాజములకంటె నేఱగు యాగములే' యని 'నానూయాజేషు' అను వాక్యములచేఁ దెలియఁజేయఁబడుచున్నది. కనుక, 'యేయజామహే' అను మంత్రము 'అనూయాజవ్యతిరిక్తము లైన యాగములందుఁ బఠింపఁబడవలసినదిగాఁ బ్రాప్తించుచున్నది.—అనూయాజములందన్ననో, యీ మంత్రము పఠింపఁబడవలసినదిగాఁ బ్రాప్తించుట గాని, లేదా నిషేధింపఁబడుట గాని లేకుండుటంజేసి యీ 'యనూయాజములందీ మంత్రమునకు వికల్పము రాలేదు. 'యేయజామహే' అను మంత్రము ననూయాజవ్యతిరిక్తము లగు యాగములందుఁ బఠింపవలె నను విధి, 'యజతిషు యేయజామహం కరోతి' అను సామాన్యవాక్యముచేతనే యుపపన్న మగుచున్నను, 'నానూయాజేషు' అను వాక్యమునందలి 'న' 'అనూయాజ' అను రెండుపదములచే లక్షణమూలమున బోధింపఁబడు, అనూయాజవ్యతిరిక్తము లగు యాగములు, "యజతిషు యేయజామహం కరోతి" అను సామాన్యవిధి కావశ్యక మగు విశేషవిషయముగాఁ గల్పింపఁబడుటవలన, 'అనూయాజములం దీ మంత్రము నుచ్చరింపరాదు,' అను ప్రయోజనము సిద్ధించుచున్నది. కనుక నీ 'నానూయాజేషు' అను వాక్యమునకు, "తెలిసినవిషయమునే తెలియఁ

జేయుట' అనెడి యప్రామాణ్యము గాని, ప్రయోజన[1] మేమియు లేకుండుట గాని సంభవింపనేరదు. కావున 'నానూయాజేషు' అను వాక్యమునందుఁ, బర్యుదాసము నాశ్రయించినయెడలఁ, బైని వివరించినరీతిగా ననుపపత్తి యేమియు లేదు.—కాఁగా 'నానూయాజేషు' అను వాక్యమునందుఁ బైని వివరింపఁబడినప్రకారముగా వికల్పము సంభవించు ననెడి భయమునుబట్టి, యట్టిభయము గలుగకుండుటకై, పర్యుదాస మాశ్రయింపఁబడిన దని సిద్ధించుచున్నది.

ఇచట మఱియొకఁ డిట్లు శంకించుచున్నాఁడు "ఓయీ! పర్యుదాసము నాశ్రయించుపక్షమున, "యజతిషు యేయజామహం కరోతి" అను శాస్త్రముచే యాగసామాన్యమునందుఁ బఠింపఁబడవలసినదిగాఁ బ్రాప్తించిన "యేయజామహే" అను మంత్రము, 'నానూయాజేషు' అను శాస్త్రముచే ననూయాజవ్యతిరిక్తము లగు యాగములందు సంకోచింపఁజేయఁబడుటంజేసి,[2] పర్యుదాసమున కుపసంహారముతోఁ బ్రాప్తించునది కొన్నిటియందుమాత్రమే సంకోచింపఁజేయఁబడును. (నియమింపఁ నభేదము[3] సంభవించెడిని. ఉపసంహారమునందు, సాధారణముగా నన్నిటియందును బడును.) ఉదా:—"పురోడాశం[4] చతుర్ధా కరోతి" అని, సాధారణముగాఁ బురోడాశసామాన్యము నుద్దేశించి ప్రాప్తించిన చతుర్ధాకరణము, (నాలుగు భాగములుగా

౧. ఈ వాక్యము లేనియెడల 'యేయజామహే' అను మంత్ర, మన్ని యాగములందును బ్రవర్తించెడిని. ఇది యున్నయెడల నన్ననో, "యజతిషు యేయజామహం కరోతి" అను సామాన్యశాస్త్రముచే విహిత మైన "యేయజామహే" అను మంత్రము, అనూయాజవ్యతిరిక్తము లైన యాగములందుమాత్రమే ప్రవర్తించు నని తెలియుచుండుటంజేసి, యీ మంత్ర మనూయాజములందుఁ బ్రవర్తింపకయుండును. కావున, నీ మంత్ర మనూయాజములందుఁ బ్రవర్తింపకయుండుట యనెడి ఫలము సిద్ధించుచుండుటంజేసి, యీ 'నానూయాజేషు' అను వాక్యమునకు నిష్ప్రయోజనత్వము లే దని భావము.

౨. అన్నిస్థలములయందును సామాన్యముగా విధింపఁబడునది కొన్నిస్థలములయందుమాత్రమే వేఱొక శాస్త్రముచే నియమింపఁబడుట.

3. వేఱు కాకుండుట. = భిన్నము కాకుండుట.

౪. స్విష్టకృద్యాగ మైనపిదప, ఇడాభక్షణము చేయఁగా మిగిలిన పురోడాశమును, అధ్వర్యుఁడు, హోత, ఆగ్నీధ్రుఁడు, బ్రహ్మ యను నలుగురు ఋత్విజులును భక్షించుటకు, నాలుగుభాగములుగా విభజింపవలెను. (ఇడాభక్షణము = ఇడ యనుపాత్రమందు, హోమము చేయఁగా మిగిలిన పురోడాశమును భక్షించుట.)

విభజించుట.) 'ఆగ్నేయం చతుర్ధాకరోతి' అను వాక్యముచే నగ్ని దేవతకొఱకు హోమము చేయఁగా మిగిలిన పురోడాశవిశేషమందు సంకోచింపఁజేయఁబడుచున్నది." ఇట్లు చేయుశంక సరిగా లేదు.

ఉపసంహారము ప్రవర్తించు 'ఆగ్నేయం చతుర్ధా కరోతి' అనునిట్టి స్థలములం[1], దేది యెచట విధింపఁబడునో, యది యచటనే సంకోచింపఁజేయఁబడు ననియుఁ, బర్యుదాసము ప్రవర్తించు 'నానూయాజేషు' అనునిట్టి స్థలములందు 'న'శబ్దముతో సంబంధించు పదముయొక్క యర్థముకంటె వేఱగుదానినిమాత్ర ముద్దేశించినచో, సంకోచము (=నియమము) కలుగు ననియును న్యాయసుధాకారులు మొదలగు మీమాంసకులు చెప్పుదురు. పార్థసారథిమిశ్రులు మొదలగు నితరమీమాంసకు లన్ననో యుపసంహార మనఁగా, సామాన్యముగా నన్నిచోట్లను బ్రాప్తించుదానిని విశేషించి కొన్నిటియందుమాత్రమే సంకోచింపఁజేయువిధియొక్క వ్యాపారవిశేష మనియుఁ, బర్యుదాస మనఁగా, 'న'శబ్దము విధిని బోధించు లిఙాదిప్రత్యయములకంటె భిన్నమై తన సమీపమున నుండు ధాతువుతో సంబంధించుట యనియుఁ, జెప్పుచున్నారు. ఇట్టి యభియుక్తులవచనము[2] ననుసరించి, పర్యుదాసము ప్రవర్తించుస్థలములందు 'న'శబ్దము విధిని బోధించు లిఙాది ప్రత్యయములకంటె భిన్నమైన ధాతువుతోఁ[3] గాని, నామవాచకముతోఁ[4] గాని సంబంధించును. కావునఁ బైని వివరింపఁబడిన రీతి, నుపసంహార మొకానొక విధివ్యాపార మగుచుండుటచేతను, బర్యుదాసము, ధాతువు మున్నగువానితో సంబంధించిన 'న' శబ్దముయొక్క వ్యాపార మగుచుండుటచేతను, నీ రెండింటికిని స్వరూపమువిషయమై భేదము స్పష్టముగానే యున్నది.

స్వరూపమువిషయమై యిట్టి భేద మున్నను, బర్యుదాస మెచట నుండునో యచటనే యుపసంహారముకూడ నుండినయెడల, నీ రెండింటికిని నభేద

౧. దర్శపూర్ణమాసప్రకరణమందు ఆగ్నేయము, అగ్నీషోమీయము, ఐంద్రాగ్నము నని మూఁడు పురోడాశములు గలవు. ఆ మూఁటికిని జతుర్ధాకరణము ప్రాప్తించుచు, 'ఆగ్నేయం చతుర్ధా కరోతి' అను వాక్యముచే నాగ్నేయపురోడాశమందే సంకోచింపఁజేయఁబడుచున్న దని యర్థము.

౨. అభియుక్తులు = శాస్త్రజ్ఞు లగు పెద్దలు.

౩. 'నేక్షేతోద్యంత మాదిత్యమ్' అనునిట్టి స్థలములు.

౪. 'నానూయాజేషు' అను నిట్టిస్థలములు.

ముందున గ్రహింప శక్య మయ్యెడిని. కాని, యీ రెండును నొకచోట నుండుట కుదురదు. ఏల యన, 'నేక్షే తోద్యన్త మాదిత్యమ్' అను వాక్యమునందుఁ బైని వివరింపఁబడినరీతిని, బర్యుదాస మున్నను ఉపసంహారము లేదు. ఆగ్నేయం చతుర్ధా కరోతి' అను వాక్యమునందువలె, నిచట సామాన్యముగా నన్నిటియందును బ్రాప్తించిన దేదియుఁ బ్రత్యేకముగాఁ గొన్నిటియందుమాత్రమే సంకోచింపఁజేయఁబడుట లేదు. ఈ 'నేక్షే తోద్యన్త మాదిత్యమ్' అను వాక్యమందుఁ, బాపక్షయ మను ఫలము నుద్దేశించి, యనీక్షణసంకల్పముమాత్రమే[1] విధింపఁబడుచున్నదిగదా! ప్రకృత మగు 'నానూయాజేషు' అను నుదాహరణమునం దన్ననో 'యజతిషు యేయ జామహం కరోతి' అను వాక్యముచే యాగసామాన్యమునందుఁ బ్రాప్తించిన 'యేయజామహే' అను మంత్రము 'నానూయాజేషు' అను వాక్యముమూలముగా, ననూయాజవ్యతిరిక్తము లగు యాగములందు సంకోచింపఁజేయంబడుటం జేసి, యీ విధి,[2] యుపసంహారరూప మగువిధి యైనపక్షమున, విధికార్య మగు నుపసంహార మీ వాక్యముచేతనే సిద్ధించుటవలనను, 'అనూయాజ' శబ్ద మనెడి నామవాచకముతోఁ గూడిన 'న' శబ్దముయొక్క కార్యము, పర్యుదాసముచే సిద్ధించుటవలనను, నీ పర్యుదాసోపసంహారములు రెండింటికిని ఒకటేఫలమును గలుగఁజేయుట యనెడి విరోధము రానేరదు. ఈ 'యజతిషు' మున్నగు విధి లేనిదో విధివలన సిద్ధించునుపసంహారము, పర్యుదాసముచే నెట్లు సిద్ధింపనగును? అట్లు సిద్ధింపదు. కావున, నీ రెండింటికిని విరోధము స్పష్టముగా నుండెడిని. కాని యిచట[3] విధి లేకపోలేదు. 'నానూయాజేషు' అను వాక్యమునందలి 'న' శబ్ద మనూయాజశబ్దముతో సంబంధించుటం జేసి, యిచటి విధికి ('కరోతి' యను పదమునందలి 'తి' ప్రత్యయమునకు) నుండు విధింపఁజేయుశక్తి, క్షీణము కానేరదుగదా! 'ఆగ్నేయం చతుర్ధా కరోతి' అను వాక్యమునందలి యాగ్నేయ పదము, చతుర్ధాకరణము నుద్దేశించి యగ్నికొఱకుమాత్రమే యియ్యఁబడు పురోడాశమునే విషయముగా నెట్లు బోధించుచున్నదో, యట్లే యీ 'నానూయాజేషు' అను వాక్యమం దుండు పర్యుదాసము, అనూయాజవ్యతిరిక్తము లగు యాగములను మాత్రమే విషయములనుగా బోధించి వానియందుమాత్రమే 'యేయజామహే 'అను

౧. 'చూడను' అను సంకల్పము.

౨. 'నానూయాజేషు' అను విధి.

౩. 'నానూయాజేషు' అను వాక్యమందు.

మంత్రమును వినియోగింపవలె నని స్పష్టపఱుచుచున్నది. ఉపసంహార మన్ననో, యీ 'యజతిషు యేయజామహం కరోతి' 'నానూయాజేషు' అను వాక్యములచే బోధింపఁబడువిధియే యగుచున్నది.

"ఉపసంహారవిధిగా నంగీకరింపఁబడిన 'ఆగ్నేయం చతుర్ధా కరోతి' అను వాక్యమునందుఁ బురోడాశసామాన్యము నుద్దేశించి విధింపఁబడు చతుర్ధాకరణము, ఇచట వినఁబడు నాగ్నేయపురోడాశమునందుమాత్రమే, యెట్లు సంకోచింపఁజేయఁబడుచున్నదో, యట్లు ఈ 'యజతిషు యేయజామహం కరోతి' 'నానూయాజేషు' అను వాక్యమునందు, యాగసామాన్యమందు విహిత మైన 'యేయజామహే' అను మంత్రము, అనూయాజములందుమాత్రమే సంకోచింపఁజేయఁబడక, వానికంటె భిన్నము లగు యాగములందు సంకోచింపఁజేయఁబడుచున్నది. కనుక నిచట నుపసంహార మున్న దని చెప్పుటకు వీలులేదు." అని శంకింపవలదు. ఏదియందు వినఁబడు దానియందుమాత్రమే సంకోచింపఁజేయఁబడవలయు ననఁగా నర్థ మేమి? చతుర్ధాకరణము, ఆగ్నేయపురోడాశమునందుమాత్రమే సంకోచింపఁజేయఁబడవలయు ననియా? సామాన్యముగా నన్నిటియందును బ్రాప్తించినది, ప్రత్యేకముగాఁ గొన్నిటియందుమాత్రమే సంకోచింపఁజేయఁబడవలయు ననియా? మొదటిపక్షము నవలంబించినచో, అనారభ్యాధీత మగు సాప్తదశ్యమునకు,[1] మిత్రవిందము మున్నగు నిష్టుల ప్రకరణమునం దున్న వాక్యముచే నచటి యాగ్నేయమునందు సంకోచము లేకుండుటం జేసి, యుపసంహారము సిద్ధింపకపోయెడిని. రెండవపక్షము నంగీకరించినచోఁ బురోడాశసామాన్యము నుద్దేశించి ప్రాప్తించిన చతుర్ధాకరణమునకు, ఆగ్నేయపురోడాశమునందుమాత్ర మెట్లు సంకోచము కలుగుచున్నదో, యట్లే, యాగసామాన్యము నుద్దేశించి విధింపఁబడుటమూలముగాఁ బ్రాప్తించిన, 'యేయజామహే' అను మంత్రమున కనూయాజవ్యతిరిక్తము లగు యాగములందు సంకోచ ముండుటం జేసి, యిచట నుపసంహారము తప్పక యుండును. కాని యీ రెండు స్థలములయందును నీ విశేషము కలదు: 'ఆగ్నేయం చతుర్ధాకరోతి' మున్నగు వాక్యములందు, ఆగ్నేయపురోడాశము మొదలైన విశేషవిషయము, లాయా యాగ్నేయము మొదలైన పదములచేతనే బోధింపఁబడుచున్నవి. ప్రకృత మగు "నానూయాజేషు" అను వాక్యమునం దన్ననో, యనూయాజవ్యతిరిక్తము లగు యాగము లనెడు విశేషవిషయ

౧. పదునేడు సంఖ్య కలుగుట.

ములు, పర్యుదాసమూలముగా బోధింపఁబడుచున్నవి. సామాన్యము నుద్దేశించి ప్రాప్తించినది, విశేషమునందు సంకోచింపఁజేయఁబడుట యనెడి యుపసంహార మన్ననో, యీ రెండు స్థలములయందును సమానముగానే యున్నది.

"ఏపదమునుగూర్చి పర్యుదాస మవలంబింపఁబడునో, యా పదముయొక్క యర్థముకంటె వేఱగు నర్థమైన విశేషమందే, సామాన్యము నుద్దేశించి ప్రాప్తమైనదానిని సంకోచింపఁజేయుటయే, పర్యుదాసమునకు ముఖ్యప్రయోజన మగుటం జేసి, 'ఆగ్నేయం చతుర్ధా కరోతి'........'నానూయాజేషు' అను రెండుస్థలములందును వైలక్షణ్యము[1] కలుగుచున్నది. అని మఱియొక శంకకుఁడు చెప్పినది సరికాదు. 'నేక్షేతోద్యన్త మాదిత్యమ్' అనుచోటఁ బర్యుదాస మున్నను, సామాన్యమునందుఁ బ్రాప్తించినదానికి విశేషమందు సంకోచము లేదుగదా! ఇచట, 'న + ఈక్ష' అను రెండు శబ్దములచే లక్షణమూలమున బోధింపఁబడు 'నేను జూడను' అను సంకల్పముమాత్రము విధింపఁబడుచుండుటంజేసి, సామాన్యమునందుఁ బ్రాప్తమైనది. 'న' శబ్దముతో సంబంధించుపదార్థముకంటె వ్యతిరిక్తమైనపదార్థమునందు సంకోచింపఁజేయఁబడుట లేదు. కావున 'నానూయాజేషు' అను వాక్యమునందు నిషేధము నవలంబించినచో, వికల్పము సంభవించు ననెడి భయ ముండుటంజేసి, యట్టిభయము కలుగకుండఁజేయుటకై పర్యుదాస మాశ్రయింపఁబడిన దని సిద్ధించుచున్నది.

ఎచటఁ బర్యుదాస మాశ్రయింప నశక్యమో యచట నన్ననో, వికల్పము సంభవింపనై యున్నను నిషేధమే యాశ్రయింపఁబడుచున్నది. "నాతిరాత్రే[2] షోడ

౧. భేదము.

౨. అతిరాత్ర మను సంస్థగల జ్యోతిష్టోమయాగమునందు షోడశి యనుపేరుగల గ్రహము నధ్వర్యుఁడు గ్రహింపరాదు. జ్యోతిష్టోమ మనఁగా సోమయాగము. దీనియందు, అగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, అతిరాత్రము అను నాలుగు సంస్థలు గలవు. సంస్థ యనఁగా నేదే నొకస్తోత్రముతో యాగమునందలి ప్రయోగము ముగియుట. స్తోత్ర మనఁగా ఉద్గాతృగణము సామములను గానము చేయుటచే దేవతలగుణములను వర్ణించుట. ఉద్గాతృగణము = సామమును గానముచేయు నుద్గాతయు, వానికి సాహాయ్యపడు నితరఋత్విజులును, ఏ స్తోత్రముచేఁ గ్రతుప్రయోగము ముగియునో యా స్తోత్రమే యా సంస్థకుఁ బేరగుచున్నది. అగ్నిష్టోమ మనుసంస్థగల జ్యోతిష్టోమమునందు, అగ్నిష్టోమ స్తోత్రము తుదిది. ఉక్థ్య యను సంస్థగల జ్యోతిష్టోమమునందు, అగ్నిష్టోమస్తోత్రమును, ఉక్థ్యస్తోత్ర మును జివర నుండును. 'షోడశి' యను సంస్థగల జ్యోతిష్టోమయాగమునందు, అగ్నిష్టోమ, ఉక్థ్య,

శినం గృహ్ణాతి” అనునది యిచటఁ ‘అతిరాత్రే షోడశినంగృహ్ణాతి’ అనుశాస్త్రముచేఁ బ్రాప్తించిన అతిరాత్రమునందలి షోడశిగ్రహమును గ్రహించుట నిషేధింపఁబడుచుండుటంజేసి, యొకటేవిషయము విహితమై ప్రతిషేధింపఁబడుటవలన, వికల్పము రానైయున్నను, బర్యుదాస మశక్య మగుటచే నాశ్రయింపఁబడుచుండుట లేదు.

అది యెట్లనఁగా:—ఈ‘యతిరాత్రే’ యున్నగు విధియందు, బర్యుదాసము నిమిత్తమై ‘న’శబ్దమునకు షోడశిపదముతో సంబంధము నంగీకరించు నెడ ‘అతిరాత్రయాగమునందు షోడశికంటె వేఱగు గ్రహమును గ్రహింపవలయును.’ అను నర్థమేర్పడి షోడశిగ్రహము గ్రహింపఁబడకపోవుచున్నది. అట్లయిన ‘అతిరాత్రమునందు షోడశిగ్రహమును గ్రహింపవలెను.’ అని విధించు ‘అతిరాత్రే షోడశినం గృహ్ణాతి’ అనెడు ప్రత్యక్షవిధితో విరోధము సంభవించుచున్నది. ఇట్లే ‘న’శబ్దమునకు ‘అతిరాత్ర’ పదముతో సంబంధము నంగీకరింపరాదు. అట్లంగీకరించు నెడ ‘అతిరాత్రమునకంటె వేఱగు యాగమునందు, షోడశిగ్రహమును గ్రహింపవలయును’ అనునర్థ మేర్పడి, ‘అతిరాత్రయాగమునందు షోడశిగ్రహమును గ్రహింపరాదు.’ అను నర్థ మేర్పడి, అతిరాత్రమునందుమాత్రము షోడశిగ్రహము గ్రహింపఁబడకపోవుచున్నది. అట్లయిన ‘అతిరాత్రమునందు షోడశిగ్రహమును గ్రహింపవలెను.’ అని విధించు ‘అతిరాత్రే షోడశినం గృహ్ణాతి’ అనెడు ప్రత్యక్షవిధితో విరోధము సంభవించుచున్నది గదా!

కావున నిచటఁ బర్యుదాస మాశ్రయించుటకు వీలు లేకుండుటవలన, వేఱుగతి లేకుండుటంజేసి నిషేధమే యాశ్రయింపఁబడుచు, వికల్పముకూడ నాశ్రయింపఁబడుచున్నది. కాఁగా, క్రింద వివరింపఁబడునవి సిద్ధాంతము లున్నవి. ఎచట ‘తస్య వ్రతమ్’ మున్నగు నుపక్రమము గాని, వికల్పము సంభవించుటకుఁ బ్రసక్తి గాని యుండదో, యట్టి ‘న కలంజం భక్షయేత్’ మున్నగు స్థలములందుఁ

షోడశి అను మూఁడుస్తోత్రములును వరుసగా తుది నుండును. అతిరాత్ర మను సంస్థగల జ్యోతిష్టోమ యాగమునందు, షోడశిస్తోత్రమునకుఁ బిదప రాత్రి యను మూఁడు స్తోత్రవిశేషములు, ఆశ్వినస్తోత్రమును తుది నుండును. ఒకరాత్రి నతిక్రమించి ముగియుటంజేసి దీనికి అతిరాత్ర మని పేరు గలుగుచున్నది. అత్యగ్నిష్టోమ, వాజపేయ, అప్తోర్యామ అను మూఁడు సంస్థలును బయిని చెప్పఁబడిన నాలుగు సంస్థల యందును నిమిడియే యున్నవి. పయిని వివరింపఁబడిన, అగ్నిష్టోమము, ఉక్థ్యము మున్నగు నేడు సంస్థలుగల జ్యోతిష్టోమయాగవిశేషములకు, అగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, అతిరాత్రము అత్యగ్నిష్టోమము, వాజపేయము, అప్తోర్యామము అని యేడుపేళ్లు వరుసగాఁ గలవు.

౧. అతిరాత్ర మను యాగమునం దధ్వర్యుఁడు షోడశి యనెడు గ్రహమును గ్రహింపవలెను.

ప్రతిషేధ మాశ్రయింపఁబడును. ఎచట వికల్పము సంభవించుటకుఁ బ్రసక్తి యున్నను, బర్యుదాస మాశ్రయింప నశక్యమో యట్టి ‘నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి’ మున్నగు స్థలములందుఁ బ్రతిషేధమే యాశ్రయింపఁబడును. కాని యీ రెండుస్థలములయందును నీక్రింద వివరింపఁబడు వైలక్షణ్యము కలదు. ఎచట విధిప్రతిషేధములు రెండును నొకటేవిషయము గలుగుటచే వికల్పము సంభవించునో, యచట నా విధిప్రతిషేధములు రెండును, ‘గ్ర[౧]‘త్వ’ర్థములే యగుటంజేసి నిషేధింపఁబడునది, యనర్థము నుత్పాదింపనేరదు. ఉదా:—‘అతిరాత్రే షోడశినం గృహ్ణాతి,’ ‘నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి’అనునది. ఎచట వికల్పము సంభవింపదో, ప్రాప్తి శాస్త్రవిహితము కాక రాగమువలననే కలుగునో, ప్రాప్తించినదానిని నిషేధించుట ‘పురుషార్థ[౩]’మగుచున్నదో యట్టి స్థలములయం దన్ననో నిషేధింపఁబడునది య ‘నర్థ’ము నుత్పాదించును. ఉదా:—కలంజమును భక్షించుట.

‘దీక్షితో న దదాతి న జుహోతి’[౪] అనునీ మున్నగు వాక్యములం దన్ననో, దానము హోమము మున్నగునవి శాస్త్రముచేఁ బ్రాప్తించినను, బురుషార్థములుగాఁ బ్రాప్తించుటవలనను, గ్రత్వర్థములుగా నిషేధింపఁబడుటవలనను, వీనికి సంబంధించు విధినిషేధము లొకటేవిషయము గలవి కాకపోవుటచే, వికల్పమునకుఁ బ్రసక్తి లేకున్నను, నీ దానహోమములు రాగముచేఁ బ్రాప్తించునవి కాకపోవుటంజేసి, యనర్థము నుత్పాదింపనేరవు. ఏకర్మము రాగముచేఁ బ్రాప్తించినను గ్రత్వర్థముగా ‘[౫]’ నిషేధింపఁబడునో, యట్టి కర్మమును గ్రతువునం దాచరించుటచే నా క్రతువునకు

౧. క్రతువునిమిత్త మగునవి.

౨. పురుషునికిఁ బ్రత్యవాయము రాకుండునట్లు చేయు స్వభావము గలిగియుండుట.

౩. నరకము మున్నగుననిష్టము. కలంజ మనఁగా నెఱ్ఱయుల్లి ‘కలంజ, పలాండు, పారీరకాః,’ (ఆప. ధ. సూ. ౧-౫-౧౭-౨౬) అను సూత్రమందలి కలంజపదమునకు నెఱ్ఱయుల్లి యని వ్యాఖ్యానము చేయఁబడినది. వీరమిత్రోదయమునందలి యాహ్నికప్రకాశమునందు అభక్ష్యనిరూపణప్రకరణమునఁ బైనిఁ జెప్పఁబడిన యాపస్తంబసూత్రము నుదాహరించి కలంజపదమున కెఱ్ఱయుల్లి యనునదియే యర్థ మని వివరింపఁబడినది.

౪. సోమయాగమునకై దీక్షను బొందిన యజమానుఁ డా దీక్ష ముగియువఱకును బురుషార్థము లగు దానములను గాని హోమములను గాని చేయరాదు.

౫. పురుషునిచేఁ బ్రార్థింపఁబడుదానికంటె భిన్న మైనదాని నుత్పాదించుటకు సాధనముగా విధింపఁబడునది.

లోపమే కలుగును గాని, యజమానుని కనర్థ మేమియు సంభవింపదు. ఉదా:— యాగమునందు స్వస్త్రీగమనము(౧) మున్నగునవి. ఏకర్మము రాగముచేఁ బ్రాప్తించు నదై పురుషార్థముగా నిషేధింపఁబడునో, యట్టి కలంజభక్షణము మున్నగు కర్మ మును, గ్రతుమధ్యమున నాచరించుపురుషుఁడు, ప్రత్యవాయమును బొందునేకాని క్రతువునకు లోప మేమియు రాఁజాలదు. కాఁగా, నిషేధవాక్యములు పురుషార్థము-౨ లను సాధించుటమూలముగాఁ బురుషున కుపకరించు నని యేర్పడుచున్నది. ఇట్లు వేద మంతయుఁ బురుషార్థమును[3] సాధింపఁగలదు.

## అర్థవాదములు

ఇఁకఁ బ్రకృతము ననుసరింతము. 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను నధ్య యనవిధిచేఁ జదువఁదగినవిగా గ్రహింపఁబడు విధులు, మంత్రములు, నామధేయ ములు, నిషేధములు నను నీ నాలుగింటికిని నింతకుముందు వివరింపఁబడినరీతి నప్రా మాణ్య మెట్లు లేదో, యట్లే మిగిలిన యర్థవాదములుగూడ నా యధ్యయనవిధిచేఁ జదువఁదగినవిగా గ్రహింపఁబడుటంజేసి, వాని కప్రామాణ్యము సంభవింపఁదగదు గనుక, నవి తమయందలి వాచ్యార్థమునుమాత్రమే బోధించినచోఁ బ్రయోజనర్[౪] మేమియు లేమిని, వానియందు లక్షణ యంగీకరించి, దాని (లక్షణ) మూలమున, నేదేనొక ప్రయోజనము గల యర్థమును వానివలన గ్రహింపఁదగు నని చెప్పవలసి యున్నది. ఆ యర్థవాదములు విధిశేషములు, నిషేధశేషములు నని రెండువిధము లుగా నుండును. వానిలో "వాయవ్యగ్ శ్వేత మాలభేత భూతికామః"[౫] అనునీ

౧. దర్శపూర్ణమాసప్రకరణమందు 'న స్త్రియ ముపేయాత్' అను వాక్యముచే స్వస్త్రీగమ నము నిషేధింపఁబడుచున్నది.

౨. పురుషార్థము = పురుషునిచే నభిలషింపఁబడుదాని నుత్పాదించుటకై సాధనముగా విధింపఁ బడునది.

3. స్వర్గము మున్నగు ఫలము. లేదా, అనిష్టమగు నరకము మున్నగు ప్రత్యవాయమును బరిహరించుట.

౪. అవి ప్రవృత్తిని గాని నివృత్తిని గాని కలిగింపవు గనుక.

౫. తై. సం. ౧. ౧. ఐశ్వర్యమును గోరువాఁడు వాయుదేవతకొఱకు శ్వేతపశువు నాలంభించి యజించుటచేఁ దన యిష్టము నుత్పాదించుకొనవలయును- అని యర్థము.

మున్నగు విధులకు శేషము లైన[౧] "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా"[౨] అనునీ మొదలైన యర్థవాదము, లాయా విధులయందు విధింపఁబడు నర్థములను స్తుతించుటమూలముగాఁ బ్రమాణము లగుచున్నవి. "బర్హిషి రజతం న దేయమ్"[౩] అను నీ మున్నగు నిషేధములకు శేషము లైన "సోఽరోదీత్ య దరోదీ త్త ద్రుద్రస్య రుద్రత్వమ్" అనునీ మున్నగు నర్థవాదము లన్ననో, యాయా నిషేధములచే నిషేధింపఁబడు వానిని నిందించుటమూలముగా, నాయా నిషేధ్యములనుండి పురుషుని నివర్తింపఁజేయుటచే, ననిష్టమును బరిహరించుట యను ప్రయోజనమును సిద్ధింపఁజేయుచుఁ బ్రమాణము లగుచున్నవి. కావున నాయా యర్థవాదములచే, లక్షణమూలముగాఁ బ్రాశస్త్యము బోధింపఁబడుచున్నది. అట్టి ప్రాశస్త్యజ్ఞానము శబ్దభావనయం దితికర్తవ్యతగా నన్వయించుచున్నది.

ఇది ముఖ్యముగా గమనింపఁదగిన విషయము. ఇట్లు ముందు వివరింపఁబోవు నర్థభావన భావ్యముగాఁ గలదియు, లిఙ్ము మున్నగునవియు, విధిని బోధించునవియు నగు ప్రత్యయముల జ్ఞానము కరణముగాఁ గలదియు, నర్థవాదములచే బోధింపఁబడు ప్రాశస్త్యజ్ఞాన మితికర్తవ్యతగాఁ గలదియు, నగు శబ్దభావన, 'యజేత స్వర్గకామః' అను వాక్యమునందు 'యజేత' పదమునందలి 'త' ప్రత్యయ, మం దుండెడి లిఙ్త్వ మను నంశముచే బోధింపఁబడుచున్నది.

## భావనావిచారము

శబ్దభావన యనఁగాఁ నేమి? యను ప్రశ్నమున క్రిందిది సమాధానము:— భావన యనఁగాఁ బురుషప్రవృత్తిని[౪] గలిగించు, వ్యాపారవిశేషము. లిఙ్[౫] మున్నగు ప్రత్యయములతోఁ గూడిన క్రియాపదమును వినినతోడనే, వినినవాఁడు 'ఈ క్రియను బ్రయోగించినవాఁడు న న్నేదే నొకపనియందుఁ బ్రవర్తింపఁజేయుచున్నాఁడు' అని

౧. విధులతో నేకవాక్యతను బొందునవి.

౨. వాయువు శీఘ్రగామి గనుక నీ యజమానుఁడు తనహవిస్సుతో వాయుసమీపమునకుఁ బోయి యతని నారాధించుటచే నా వాయు వీయజమానునికి నైశ్వర్యము కలుగఁజేయును.

౩. చూ. పేజీ – తై. సం. ౧. ౫. ౧. ౨.

౪. పురుషుఁడు తా నపేక్షించిన ఫలమును గలిగించు నేదేనొక పనిని జేయుటకుఁ బ్రయత్నించుట.

౫. లిఙ్, లోట్, తవ్యప్రత్యయములు.

తప్పక తెలిసికొనును గనుక, బురుషప్రవృత్తి కనుకూలించు వ్యాపారవిశేషమే విధ్యర్థ[౧] మగుచున్నది.[౨] ఇష్టమును సాధింపఁగలుగు నుపాయ మగుట యనునది విధ్యర్థము.' అని పార్థసారథిమిశ్రులు మున్నగు కొందఱు చెప్పెదరు. కాని యీ మతము సరికాదు. ఆమతమునే యంగీకరించినపక్షమున, 'ఇష్టసాధనము' అను శబ్దమునకు 'విధి' శబ్దము పర్యాయము కావలసివచ్చును. అట్లు పర్యాయ మగుట తగదు. ఎట్లన, 'సంధ్యోపాసనము[3] నీ కిష్టసాధన మగుచున్నది కావున నీవు దాని నాచరింపుము' అను వాక్యమునందు 'ఇష్టసాధన' అను పదమును 'ఆచరింపుము' అను విధిశబ్దమును నొకచోటఁ బ్రయోగింపఁబడుచున్నవి. పర్యాయశబ్దముల కిట్టి సహప్రయోగము కూడదుగదా! కనుక, ప్రవర్తనారూపమును, ప్రేరణారూపమును నగు వ్యాపారవిశేషమే, విధ్యర్థము. లోకమునం దొక వృద్ధుని యానతిచే నొకబాలుఁ డొకపనియందుఁ బ్రవర్తించునపుడు, 'నే నీ బాలునిఁ బ్రవర్తింపఁజేయుచున్నాను' అని వృద్ధునకును, 'ఈ వృద్ధునిచేఁ బ్రేరితుఁడనైన నే నీపనిని జేయుచున్నాను.' అని బాలునకును ననుభవ ముండుటంజేసి, పురుషునిఁ బ్రవర్తింపఁజేయునట్టియు, విధ్యర్థ మగునట్టియు వ్యాపారవిశేషము, విధిశబ్దమును బ్రయోగించుపురుషునియం దుండు నభిప్రాయవిశేష మగుచున్నది. వేదమునం దన్ననో, విధిని బ్రయోగించుపురుషుఁడు లేమిని, నా పురుషప్రవృత్తిని గలిగించు వ్యాపారవిశేషము, విధిని బోధించు లిఙ్, లోట్, తవ్యశబ్దములం దుండు ప్రేరణారూప మగునదియే నైయుండును. ఈవిషయ మీ గ్రంథప్రారంభమునందు సూచింపఁబడినది.

ఇచట నొకఁ డిట్లు శంకించుచున్నాఁడు. "ఓయీ! లోకమునందు లిఙ్ మున్నగు శబ్దములకు పురుషునియం దుండు నభిప్రాయరూప మగు వ్యాపారవిశేషమం దే ప్రయోగ ముండుటంబట్టి యీ యర్థమునందే శక్తిజ్ఞాన మున్నది గాని, శబ్దమునందలి, వ్యాపారమందుఁ బ్రయోగము లేకుండుటంజేసి, యట్టి యర్థమునందు శక్తిజ్ఞానము లేకుండుటవలనను, నా యర్థమునందు శక్తిజ్ఞానము గలిగించు నుపాయాంతరములు లేకుండుటవలనను, వేదమునందలి లిఙాదిశబ్దములనుండి ప్రేరణారూప మైన శబ్దనిష్ఠవ్యాపార మెట్లు తెలియఁగలదు"? ఇట్లు చేయుశంక కీక్రిందిది

౧. లిఙాదిప్రత్యయములతోఁ గూడిన క్రియాపదప్రయోగము.

౨. ఇది న్యాయసుధాకారునిమతము ననుసరించి చెప్పఁబడినది.

3. సంధ్యాదేవత నుపాసించుట.

సమాధానము. శంకకుఁడు చెప్పినమాట సత్యమే. లోకమునందు లిఙాదిశబ్దములు, పురుషునియందలి వ్యాపారవిశేషమునందే ప్రయోగింపఁబడుట యథార్థమే. లోకమునం దొకబాలుఁడు తాను రోదనము చేసినవెంటనే, తల్లి తనకుఁ బాలిచ్చుటకుఁ బ్రవర్తింపఁగా, 'పాలీయవలయును' అనెడి తనయభిప్రాయరూప మైన ప్రేరణాజ్ఞానము, తనతల్లికిఁ గలుగుటచే నట్టి పాల నిచ్చుప్రవృత్తి కలిగిన దని నిశ్చయించును. ఇట్లే యొకప్రయోజక[1] వృద్ధుఁడు ప్రయోగించిన విధిశబ్దముతోఁ గూడిన వాక్యము విినతోడనే, ప్రయోజ్యవృద్ధునికి[2] గలిగిన ప్రవృత్తిని దెలిసికొని యా ప్రవృత్తికిఁ బ్రయోజ్యవృద్ధునికిఁ గలిగిన ప్రవర్తనాజ్ఞానము కారణ మని యూహించును.

ఆలోచింపఁగా, భోజనము మున్నగు తృప్తిని గాని సంతోషమును గాని గలుగఁజేయు పనులయందు స్వయముగాఁ గలిగిన ప్రవృత్తి 'యీపని యిష్టసాధన' మను జ్ఞానముచే జనించుటంజేసియుఁ, బ్రయోజకవృద్ధునిచేఁ బ్రేరితుఁడైన ప్రయోజ్యవృద్ధునికిఁ గలుగు ప్రవృత్తికూడఁ దాను జేయుపని తన కిష్టసాధనము కాఁగల దనెడు జ్ఞాన ముండుటచేతనే జనించు నని నిశ్చయించుట యుక్త మగుచున్నది. అయినను పై నుదాహరింపఁబడిన మాతృప్రవృత్తియందు నితరునిచేఁ బ్రేరితుఁడైనవానికిఁ గలుగు ప్రవృత్తి, తనకుఁ (ప్రేరితునికిఁ) గలిగిన ప్రేరణాజ్ఞానముచేతనే

౧. ఒకపురుషుని నేదే నొకపనియందుఁ బ్రవర్తింపఁజేయు వృద్ధుఁడు.

౨. ఒక వృద్ధునిచే నేదే నొక పనియందుఁ బ్రవర్తింపఁజేయఁబడిన వృద్ధుఁడు. ప్రయోజక వృద్ధుఁడు ప్రయోగించిన వాక్యమం దుండు శబ్దము లన్నిటిలో, లిఙాదిశబ్దమును వినినపుడే, ప్రయోజ్యవృద్ధునికిఁ బ్రవృత్తి గలుగటంజేసి, ఈ ప్రవృత్తిని గలిగించు ప్రవర్తనాజ్ఞాన మన్వయవ్యతిరేకముల మూలమున లిఙాదిశబ్దములను వినుటచే జనించుటవలన, లిఙాదివిధిశబ్దమునకు నట్టి ప్రేరణ యనఁబడు ప్రవర్తనయే యర్థ మని యేర్పడును. ఈప్రవర్తన, యిచ్ఛాదిరూప మగుటంజేసియు, పురుషునితో సంబంధమే లేని వేదమునం దట్టి యిచ్ఛారూప మగు ప్రవర్తన యుండనేరకపోవుటంజేసియు, నా ప్రవర్తనకంటె విలక్షణమైన ప్రేరణ యనియు, విధి యనియును చెప్పంబడు నొకధర్మవిశేషము వేదమునందలి లిఙాదిశబ్దమం దున్న దని మీమాంసకులచేఁ గల్పింపఁబడుచున్నది.

ఊహ యనఁగా అనుమితి. నా రోదనానంతరము నా తల్లికిఁ గలిగిన పాలనిచ్చు ప్రవృత్తి, యీమె నా యభిప్రాయరూప మగు ప్రవర్తనను దెలిసికొనుటచే నెట్లు జనించుచున్నదో, యట్లే, యీ ప్రయోజ్యవృద్ధుని ప్రవృత్తి లిఙాదిశబ్దములను వినినతోడనే కలుగుటంజేసి, యతనికిఁ గలిగిన ప్రవర్తనాజ్ఞానముచే జనించుచున్నది.

జనించు ననెడివిషయము, అనుభవసిద్ధమైయుండుటంజేసి, ప్రయోజ్యునికిఁ గలుగు ప్రవృత్తికూడ, నన్యప్రేరితునికిఁ గలిగినప్రవృత్తి యగుటంబట్టి యీ ప్రవృత్తికిఁ బ్రయోజ్యునికిఁ గలిగిన ప్రేరణాజ్ఞానమే కారణ మని నిశ్చయింపఁబడవచ్చును. ప్రయోజ్యునికిఁ గలిగిన యట్టి ప్రవర్తనాజ్ఞానము అన్వయవ్యతిరేకములమూలముగాఁ బ్రయోజకవృద్ధుఁడు ప్రయోగించిన వాక్యమువలన జనింపఁగలదు. ప్రయోజకవృద్ధుఁడు ప్రయోగించిన వాక్యమునం దనేకపదము లున్నను, వానిలో, లిఙ్ అనునట్టి విధిశబ్దమును వినినపుడే ప్రయోజ్యునికి[౧] బ్రవర్తనాజ్ఞానము జనించుటంజేసి, యీవాపోద్వాపములమూలముగా, లిఙ్ మున్నగు విధిశబ్దములకుఁ బ్రవర్తనయందు శక్తి గల దని నిశ్చయింపఁదగును. ప్రవర్తన యనఁగాఁ బ్రవృత్తిని గలిగించు వ్యాపారము. అట్టి వ్యాపారము ప్రైష,[౨] సంప్రశ్న, మున్నగు ననేకరూపములు గల దగుటచే, ననేకవిధములుగ నగుచున్నది. వీనిలో నొకటి యుండినచోఁ దక్కినవి యుండ నేరవు గనుక, నీ యర్థము లన్నిటియందును, విధిశబ్దమునకు శక్తిని గల్పించుట కుదురకుండుటంజేసి, యీ యర్థము లన్నిటియందును ననుగతముగా[౩] నుండు ప్రవర్తనాత్వ మనెడి ప్రవర్తనాసామాన్యమునందే, విధిశబ్దమునకు శక్తి గల దని కల్పింపఁబడుచున్నది. అట్లే శక్తిని గ్రహించుటచే, విధిశబ్దము వినినతోడనే ప్రైష మున్నగు వివిధస్వరూపములు గల ప్రయోక్తయొక్క యభిప్రాయము శక్తిమూలమునఁ బ్రవ

౧. ప్రయోజకవృద్ధుఁడు ప్రయోగించిన 'గామ్ + ఆనయ' అను రెండుపదములను విని, ప్రయోజ్యుఁడు గోవును దీసికొనివచ్చును. మరల ప్రయోజకవృద్ధుఁడు 'గామ్ + నయ; ఘటమ్ + ఆనయ' అను పదములను బ్రయోగించినపుడు వానిని వినిన ప్రయోజ్యుఁడు గోవును దీసికొనివెళ్లి ఘటమును దెచ్చును. ఈ వ్యవహారమును వివేకముతోఁ జూచుటచే నిట్లు నిశ్చయింపవచ్చును. 'గామ్ + ఆనయ, గామ్ + నయ' అను వాక్యములందు గోపద ముండుటవలనను, ఈ రెండు వాక్యములను విని ప్రయోజ్యుఁడు చేసిన రెండుపనులయందును పశువ్యక్తి సమానముగా నుండుటవలనను, గోపదమునకు పశువ్యక్తి యర్థ మని నిశ్చయించుట 'ఆవాపముచేఁ గలుగుచున్నది. ఇట్లే 'గామ్ + ఆనయ, ఘటమ్ + ఆనయ' అను వాక్యములందుండు గో, ఘట అను పదములను వేఱుచేసి సమానముగా నుండు 'ఆ...నయ' అను పదమునకుఁ దీసికొని వచ్చుట యను కర్మ మర్థ మని నిశ్చయించుట 'ఉద్వాపముచేఁ గలుగుచున్నది. కాఁగాఁ బ్రయోజ్యప్రయోజకుల వ్యవహారమువలన, శక్తిని గ్రహించుటకై వినియోగించు నుపాయములకు ఆవాపోద్వాపము లని పేరు.

౨. —ప్రైష = అధ్వర్యుఁడు, హోత, ఆగ్నీధ్రుఁడు మొదలగు ఋత్విజుల కిచ్చు నాజ్ఞావిశేషము.

౩. సమానముగా.

ర్తనాసామాన్యరూపముననే తెలియును గాని, పైని పేర్కొన్నట్లు విశేషస్వరూపముగాఁ దెలియదు. అట్టి విశేషరూపముగాఁ దెలియుట యన్ననో 'అజహత్స్వార్థ' యనెడి లక్షణమూలముననే[౧] కలుగును.

## శబ్దభావన

ఇట్లు లౌకికవాక్యమునందలి లిఙాదిశబ్దములను విన్నపుడువలె, వేదవాక్యమునందలి లిఙ్ మున్నగు శబ్దములను విన్నపుడుకూడఁ బ్రవర్తనాసామాన్య మనెడు వ్యాపారమే యర్థముగాఁ దెలియును. ఆ వ్యాపార మెట్టిస్వరూపము గలది యని యాకాంక్ష కలుగఁగా, లోకమునందుఁ బురుషుఁడు ప్రయోగించు లిఙాదిశబ్దముల వలనఁ దెలియునదియు, పైని పేర్కొన్నట్లు విశేషస్వరూపములు గలదియు నగు వక్తయగుపురుషుని యభిప్రాయము, పురుషసంబంధ మేమియు లేని వేదమునం దుండ నేరకపోవుటంజేసి, ప్రేరణ యను నొకవ్యాపారము, వేదమునందలి లిఙాదిశబ్దములం దుండు నని కల్పింపఁబడుచున్నది. కావున శబ్దములం దుండునదియే యగు ప్రేరణ యను వ్యాపారము, శబ్దభావన యనఁబడుచున్నది. ఆ భావనయే ప్రవర్తనారూప

౧ లక్షణ. యిది యింతకుముందు వివరింపఁబడినది. అట్టిలక్షణ, — 'జహత్స్వార్థ', 'అజహత్స్వార్థ', 'జహదజహత్స్వార్థ' అని మూఁడువిధములుగా నున్నది (౧) శక్యార్థము విడిచి దానికంటె వేఱగు నర్థమును బోధించులక్షణ జహత్స్వార్థ యనఁబడును. ఉదా: — "గంగాయాం ఘోషః" ఇచట గంగాపదము లక్షణమూలమున స్వార్థమైన శక్యార్థమగు జలప్రవాహముకంటె వేఱగు, తీర మనునర్థమును బోధించుచున్నది. కనుక నీ లక్షణకు 'జహత్స్వార్థ' యని పేరు. విడువఁబడుచున్న తనయర్థము గలది. (౨) శక్యార్థమును విడువక, దానితోఁగూడిన వేఱొక యర్థమును బోధించు లక్షణ, అజహత్స్వార్థ యనఁబడును. ఉదా: — ఛత్రిణో యాంతి (= గొడుగులు కలవారు పోవుచున్నారు.) ఇచట గొడుగులు కలవారు అను శబ్దము, సందర్భమునుబట్టి గొడుగులుకలవారిని గొడుగులు లేనివారినికూడ లక్షణమూలముగా బోధించుచున్నది. కనుక నీ లక్షణకు 'అజహత్స్వార్థలక్షణ' యని పేరు. విడువఁబడని తనయర్థముగలది. (3) 'శక్యార్థమునందలి కొన్నియంశములను విడిచి మిగిలిన యంశములనుమాత్రము బోధించులక్షణకు జహదజహత్స్వార్థలక్షణ యని పేరు. జహత్ = విడువఁబడుచున్న, అజహత్ = విడువఁబడని, ఉదా:—'సోఽయం దేవదత్తః' (= కొంతకాలముక్రిందటఁ జూచిన దేవదత్తుఁడనునొకమనుజుని, నీక్షణమున మరలఁ జూచి, పూర్వము చూచినదేవదత్తుఁడే యితఁ డని గుర్తించుట. ఈ దేవదత్తునియాకారము మున్నగు చిహ్నములు, కొంచెము మాఱినందున, వీనిని బరిశీలించి చూడఁగా, జ్ఞప్తికి వచ్చిన పూర్వకాలపుఁజిహ్నములను విడిచి, యతని సహజమైన స్వరూపమునుమాత్రము కనిపెట్టుటచే, నానాఁడు చూచినవాఁడే యితఁ డని, నిశ్చయముగా గుర్తింప వీలగుచున్నది. ఇట్టియర్థమును బోధించు దేవదత్తపదమునం దుండు లక్షణ జహదజహల్లక్షణ యని చెప్పఁబడుచున్నది.

ముగా విధి కర్థ మగుచున్నది. ఈ యర్థమే "లిఙ్గు[1] మున్నగు శబ్దములు విధివ్యాపార రూప మగు భావననే బోధించుచున్నవి." అను వార్తికమునందు వివరింపఁబడుచున్న దని న్యాయసుధాకారుఁడు మున్నగు మీమాంసకులు చెప్పుదురు.

పార్థసారథిమిశ్రులు మున్నగు నితరు లిట్లు చెప్పుచున్నారు. లిఙాదిశబ్దము లకుఁ బ్రవర్తనాసామాన్యమునందే శక్తి యుండునట్లు గ్రహించుటంజేసి, ప్రవర్తనా సామాన్యమే నిజముగా విధి కర్థ మగుచున్నది. ప్రవర్తన యనఁగాఁ బురుషప్రవృత్తిని గలిగించుట కనుకూలించు వ్యాపారము. పైరీతి మున్నగు విశేషస్వరూపములు గలదియు, లిఙాదశబ్దములను బ్రయోగించుపురుషుని యభిప్రాయరూప మగునదియు నగు ప్రవర్తన యనెడి వ్యాపారము, అపౌరుషేయము[2] మగు వేదమునం దుండనేరక పోవుటవలనఁ బురుషప్రవృత్తిని గలిగించు నొక వ్యాపారవిశేషము వేదమునందలి లిఙాదిశబ్దములం దుండునట్లు కల్పింపవలసియున్నది. లిఙాదివిధిశబ్దములచే బోధింపఁ బడు ప్రవర్తనాసామాన్యము, 'నిర్విశేషం న సామాన్యమ్' (సామాన్య, మేదే నొక విశేషరూపముగా గ్రహింపఁబడనిదే, యుపయోగింపనేరదు.) అను న్యాయమును బట్టి యేదే నొక విశేషరూపము నొందనిదే దానియం దుండు 'దీని నేరూపముగా గ్రహింపవలెను?' అను నాకాంక్ష యుపశమింప కుండుటంజేసి, యా వట్టిసామాన్య మును గ్రహించుటవలనఁ బ్రవృత్తి యేమియుఁ గలుగనేరదుగదా!

ఈ ప్రవర్తనయనెడి వ్యాపారమునం దుండు విశేష మెట్టిది యని యాకాంక్ష కలుగఁగా, ధాత్వర్థమైన కర్మమునం దుండు నిష్టసాధనత్వమే ప్రవృత్తిని గలిగించున దగుటంజేసి, విశేష మగుచున్నది. ప్రతిమనుజుఁడును, నొకకర్మము తన యిష్టమును సాధింపఁగల దని తెలిసికొనియే, దానియందుఁ బ్రవర్తించును:—ఇతరునిచేఁ బ్రేరితుఁ డైనవాఁడును, నా యితరునిచే నిర్దిష్టమగు కర్మము తనయిష్టమును సాధింపఁగల దని తెలిసికొనిననేకాని దానియం దెంతమాత్రమును బ్రవర్తింపఁడు[3] "లిఙాదిశబ్దము

౧. "అభిధాభావనా మాహు రన్యా మేవ లిఙాదయః" (తం. వా.) ౨-౧-౧. పృష్ఠమ్. ౩౮౮.

౨. పురుషుఁ డెవఁడును గర్తగా లేనిది.

3. 'కర్తు రిష్టాభ్యుపాయో హి కర్తవ్య మితి లోకధీః' (= లోకమునం దేమనుజునికైనఁ దన యిష్టమును సాధింపఁగలుగుపనినే చేయవలయు నని దృఢమైన బుద్ధి కలుగును) అను న్యాయ మీవిషయమును స్పష్టపఱుచుచున్నది. ఇది మండనమిశ్రులకుఁగూడ సమ్మతము.

లకు నిష్టసాధనతాజ్ఞానముతోఁ గూడని ప్రేరణారూప మగు వ్యాపారమునందే శక్తి నంగీకరించుమతమునందుఁగూడ, ప్రేరణవలనఁ బ్రవృత్తి గలుగుటంజేసి యాప్రవృత్తికి విషయమగు కర్మము, ప్రవృత్తుఁడైన పురుషునియిష్టమును సాధింపఁగలుగునట్లు తెలిసికొనుట యావశ్యక మని యంగీకరింపఁబడుచునే యున్నది. అట్లు తెలిసికొనిన పక్షమున విధిప్రవృత్తి నెంతమాత్రమును గలిగింపనేరదుగదా! కావున నిష్టసాధనత్వమే ప్రవృత్తిని గలిగించుట కావశ్యక మగుటంజేసి, ప్రవర్తనారూపముగా విధి కర్థ మగుచున్నది. కాఁగా, లోకమునందుఁ బ్రయోగింపఁబడు లిఙాదిశబ్దములు, తమకంటె[1] భిన్నులగు ప్రయోక్తృపురుషులయం దుండు ప్రవర్తన యను వ్యాపారమును బోధించుట యెట్లు సిద్ధించుచున్నదో, యట్లే, వేదమునందలి లిఙాదివిధిశబ్దములుకూడఁ దమకంటె వేఱగు యాగములయం దుండు 'ఇష్టసాధనత్వ' మను వ్యాపారమును బోధించుట సిద్ధించుచున్నది. ఇంతేకాక[2] మీమాంసకులు, శబ్దము విభు[3] వని యంగీకరించుటంజేసి, దానియందు చలనము, యత్నము మున్నగు ధర్మము లేవియు నుండనేరవు గనుక, వానికంటె వేఱగు నొక వ్యాపారము శబ్దమునం దున్నట్లు కల్పింపవలసియున్నది.[4] (i) స్వయముగా జనించిన ప్రవృత్తిని గూర్చి కాని యితరుని ప్రేరణవలనఁ గలుగు ప్రవృత్తినిగూర్చి కాని కారణముగాఁ గల్పింపఁబడక ప్రవర్తనాసామాన్య మను రూపము గలుగునట్లు తెలిసికొనఁబడిన

౧. ఇష్టసాధనత్వము లిఙాదిశబ్దముల కర్థ మని యంగీకరించుపక్షమందే, యిది కుదురును. ప్రేరణారూప మగు వ్యాపారమే లిఙాదిశబ్దముల కర్థ మని యంగీకరించుపక్షమం దన్ననో యా వ్యాపారము లిఙాదిశబ్దములయం దుండుటంజేసి, శబ్దము తనయం దుండు ప్రేరణారూప మగు వ్యాపారమునే బోధింపఁగల దని లోకవిరుద్ధముగా నంగీకరింపవలసియుండెడిని.

౨. ఓయీ! ఇట్లయినను లిఙాదిశబ్దముల కప్రసిద్ధమైన యిష్టసాధనత్వ మను వ్యాపారమందు శక్తిని గల్పించుటకంటెఁ బ్రసిద్ధముగాఁ గల్పింపఁబడిన ప్రవర్తన యను వ్యాపారమునందే శక్తిని గల్పించుట యించుక మే లని యొకఁడు చేసినశంక కీక్రిందిది సమాధానము.

3. ఆకారముగల ద్రవ్యము లన్నిటితోఁ గలసి సర్వవ్యాపి యై యుండుట.

౪. ఇందులకు రెండు ప్రమాణములు గలవు.

(i) 'స్పందసమవాయస్తు న సంభవతి. న చాసౌ వస్మాభి శ్శబ్ద స్యేష్యతే' (= శబ్దమునందు చలన ముండు ననుట మాకు సమ్మతము గాదు.) అనియు, 'నహి శబ్దస్య విభో ర చేతనస్య స్పందః ప్రయత్నో వాస్తి' (= అచేతనమై విభువైన శబ్దమందుఁ జలనము గాని ప్రయత్నము గని యుండదు.) అనియును పార్థసారథిమిశ్రులచేఁ జెప్పఁబడినది.

యట్టి చలనాదివ్యతిరిక్త మగు వ్యాపారము ప్రవృత్తిని గలిగించుట కనుకూలించు ననియు, (ii) తనకంటె నితర మగుదానియం దుండు వ్యాపారమును బోధించు నదిగాఁ గల్పింపఁబడిన శబ్దము, తనయం దుండు వ్యాపారమునే తెలియఁజేయఁగల దనియు, (iii) విధినుండి ప్రవృత్తి గలుగుటకై ధాత్వర్థమైన కర్మమునం దిష్టసాధనత్వ మను ధర్మ ముండు ననియు, మూఁడంశములు 'విధిశబ్దమునకుఁ బ్రవర్తనాసామాన్య మనెడు వ్యాపారమునందే శక్తి గలదు.' అని యంగీకరించువానిచేఁ గల్పింపఁబడ వలసియున్నవి. ఇన్ని యంశములను గల్పించుట మిగులఁ గ్లేశకరము. కనుక నిట్లు కల్పించుటకంటె, పరునిప్రేరణవలనఁ గలిగిన ప్రవృత్తినే కాక, స్వయముగాఁ గలిగిన ప్రవృత్తినిగూడ జనింపఁజేయఁగలుగుటంజేసి, యావశ్యకముగాఁ గల్పింపఁబడిన యిష్ట సాధనత్వ మనునది, విధిశబ్దముకంటె వేఱగు ధాత్వర్థమైన కర్మమునం దుండును గనుకఁ, బ్రవర్తనాసామాన్య మను రూపముగా విధి కర్థము కాఁగల దని కల్పించు టయే మిక్కిలి సులువుగా నుండును.

ఇచట నొకఁ డిట్లు చెప్పుచున్నాఁడు. "విధినుండి ప్రవృత్తి తప్పక కలుగుట కొఱకై, స్వతస్సిద్ధముగా నిష్టసాధనము కానేరని ధాత్వర్థమైన యాగాదికర్మము నందు, ఇష్టసాధనత్వము కల్పించుటంజేసి, విధికిఁ బ్రేరణ యను ప్రవర్తనాపేక్షము నందు శక్తిని గల్పింపనిచో, విధినుండి ప్రవృత్తి గలుగుట సంభవింపనేరదు గనుక, ధాత్వర్థమైన యాగాదికర్మమునం దిష్టసాధనత్వమును గల్పించుటకు వినియోగించు నాక్షేపమువంటి ప్రమాణ మేమియు లేకుండఁబోయెడిని." ఇట్లు చెప్పినమాట సరి కాదు. ఇతనిపక్షమందుఁగూడ విధి, మొదట ప్రవర్తనాసామాన్యమును బోధించుట మూలముగానే, ప్రవృత్తిని గలిగించుటచేతను, విధిచే బోధింపఁబడు ప్రవర్తనాసామా న్యము, విశేషరూపముగా నుండనియెడల, వినియోగింపనేరకుండుటవలనఁ బ్రేరణ

(ii) 'న శబ్దే స్పందయత్నౌ హి విభుత్వాచ్చేతనత్వతః' (= అచేతనమై విభు వగు శబ్దమునందుఁ జలనయత్నములు రెండును నుండవు.) అని న్యాయసుధయందుఁ జెప్పఁబడియున్నది.

(iii) ౧. ఇష్టసాధనత్వము ప్రవృత్తికిఁ గారణము కాఁగలదు; శబ్దము తనకంటె నితరమునం దుండు (తన్నుఁ బ్రయోగించు పురుషునియం దుండు) వ్యాపారమును బోధింపఁగలదు. అని రెం డంశములు లోకసిద్ధము లయియే యుండుటవలన, ఇష్టసాధనత్వము విధి కర్థము కాఁగలదు, అనునొక యంశము మాత్రమే కల్పింపవలసియున్నది. కావున, మూఁ డంశములను గల్పించు మొదటిపక్షముకంటె నిదియే మిక్కిలి సులభ మగుచున్నది.

యను విశేషరూపముగా నుండుటచేతను, నీ ప్రేరణ (ప్రమాణము) కుదురుటకై యాక్షేపప్రమాణముమూలముగా ధాత్వర్థ మైన కర్మమునం దిష్టసాధనత్వము కల్పింపఁబడవచ్చునుగదా !

ఇష్టసాధనత్వము విధి కర్థ మగునెడ, "సంధ్యోపాసనం తే[1] ఇష్టసాధనమ్, తత్ త్వం కురు." అను వాక్యమునందలి 'ఇష్టసాధనత్వ' అను పదమునకును, 'కురు' అను పదమునం దుండు 'లోట్' అను విధిశబ్దమునకును, సహప్రయోగము కుదురకపోయెడిని. అని చెప్పవలదు. ఇష్టసాధనత్వము విధి కర్థ మైనను, విధిచే నది ప్రవర్తనాత్వ మను సామాన్యరూపముగానే బోధింపఁబడుచున్నది గాని, సమీ హితసాధనత్వ మను విశేషరూపముగా బోధింపఁబడుటలేదు. ఇష్టసాధనపదముచే నన్ననో, యది సమీహితసాధనత్వ మను విశేషరూపముగానే బోధింపఁబడుచున్నది. కనుక సామాన్యమును బోధించుపదమునకును, విశేషమును బోధించుపదమునకును సహప్రయోగము 'పాంచాలరా జగు ద్రుపదుఁడు'[2] అనునిట్టి వాక్యమునందుఁ గుదురుచున్నది. కావున, సమీహితసాధనత్వమే ప్రవర్తనాత్వరూపముగా విధి కర్థ మగుచున్నది. ఈ యిష్టసాధనత్వమే, యీ ప్రవర్తనాత్వరూపముగా విధిని బోధించు లిఙాదిశబ్దముచే బోధింపఁబడుటమూలముగా, శబ్దభావన యని చెప్పఁబడుచున్నది. పయి నుదాహరింపఁబడిన "అభిధాభావనా మాహు రన్యామేవ లిఙాదయః" అను వార్తికమునకు నీక్రిందిది యర్థము : "ఇష్టసాధనత్వము, విధిచేఁ బ్రవర్తనాత్వరూపముగా బోధింపఁబడుచుఁ బురుషప్రవృత్తిని గలిగించుచుండుటవలన, భావన యని చెప్పఁబడుచున్నది. ఈ భావననే లిఙాదిశబ్దములు శక్తిమూలముగా బోధించుచున్నవి." అని.

ఇందులకు "ధాత్వర్థ[3] మగు కర్మములయం దుండు నిష్టసాధనత్వము తప్పఁ బురుషుని నా కర్మములందుఁ బ్రవర్తింపఁజేయున దేదియు లేదు. పురుషప్రవృత్తిని

౧. సంధ్యోపాసనమ్, అను వాక్యమందు 'ఇష్టసాధన' అనునది సమీహితసాధనత్వమ్, అనెడి విశేషమును బోధించుపదము 'కురు' అను పదమునం దుండు లోట్‌ప్రత్యయము ప్రవర్తనాత్వ మనెడి సామాన్యమును బోధించుపదము.

౨. ఈ వాక్యమందలి పాంచాలరాజపదము సామాన్యమును బోధించును. ద్రుపదపదము విశేషమును బోధించును.

3. 'పుంసాం నేష్టాభ్యుపాయత్వాత్ క్రియాస్వన్యః ప్రవర్తకః, ప్రవృత్తిహేతుం ధర్మంచ ప్రవదంతి ప్రవర్తనామ్' మండనమిశ్రుని విధివివేకము. పే. ౨౮౨.

గలిగించు ధర్మవిశేషమే ప్రవర్తన యనియు, నదియే లిఙాదులచే బోధింపఁబడు ననియు మీమాంసకులు చెప్పుదురు." అనునది ప్రమాణముగాఁ గలదు. కాఁగా, 'యజేత' పదమందలి 'త' ప్రత్యయముచే లిఙ్త్వాంశము మూలముగా శబ్ద భావన బోధింపఁబడుచున్న దని సిద్ధించుచున్నది. ఇట్లు శబ్దభావనను నిరూపించిన పిదప దానియందు భావ్య మగు నర్థభావన యిఁక నిరూపింపఁబడుచున్నది.

## అర్థభావన

'యజేత' అను పదమునం దుండు 'త' ప్రత్యయమునందలి 'ఆఖ్యాతత్వము' అను నంశముచే, శక్తిమూలముగా నర్థభావన బోధింపఁబడుచున్నది. దీనినిగూర్చి యొక వైయాకరణుఁ డిట్లు శంకించుచున్నాఁడు. "ఓయీ! ఈ భావన యనఁగా నేమి? అది కర్తయొక్క వ్యాపార మంటివిగా? అట్టి వ్యాపారము భావన కానేరదు. ధాతువుచే బోధింపఁబడు యాగముకంటె వేఱగు కర్తృవ్యాపార మేమియు లేకుండుటచే, నట్టి యాగము మున్నగు కర్మము, కర్తృవ్యాపారమే యగుటంజేసి, భావన కావలసియుండెడినిగదా! యాగాదికర్మము భావన కానేవచ్చును- అని చెప్పఁదగదు. యాగాదికర్మము ప్రకృతియగు ధాతువునకే యర్థ మగుటంజేసి ప్రత్యయ మగు నాఖ్యాతమున కర్థము కానేరదు, కనుక, భావన కానేరదుకదా!" ఇట్లు వైయాకరణుఁడు చేసినశంక క్రిందిది న్యాయసుధాకారునిమతము ననుసరించిన సమాధానము: భావన నిజముగా యాగము కానేరదు: మ తేమన, స్వర్గమును బొందవలయు ననునిచ్ఛచే జనించునదియు, యాగమును జేయుటకు వినియోగించునదియు నగు పురుషుని ప్రయత్నమే భావన. ఆభావనయే 'యజేత' పదమునం దుండు 'త' ప్రత్యయమునందలి యాఖ్యాతత్వ మను నంశముచే బోధింపఁబడుచున్నది. 'యజేత' పదమునందలి యాఖ్యాత మైన 'త' ప్రత్యయమును వినినతోడనే; 'యాగము చేయుటకు యత్నింపవలెను' అని తప్పక తెలియుచున్నదిగదా! ఎవఁడు ప్రయత్నపూర్వకముగా గమనము మున్నగు

౧. 'సర్వధాత్వర్థసంబద్ధః కరోత్యర్థో హి భావనామ్.' (= 'యజేత' అను పదము నకు యాగం కరోతి అనునది యర్థ మగుచుండఁగా యాగ మనునది 'యజేత' పదమునం దుండు యజధాతువున కర్థ మనియు 'కరోతి' పదమున కర్థమగు యజమానుని యత్నమనెడి భావన యజేత పదమునం దుండు తప్రత్యయమునందలి యాఖ్యాతత్వ మనెడి యంశముచే బోధింపఁబడుచున్న దనియును మీమాంసకులమతము.

పనులను జేయునో, యట్టివానివిషయమై ‘ దేవదత్తుఁడు గమన మనుపనిని జేయుచున్నాఁడు ’ అని, గమనమును బోధించుపదమునకుఁ బిదప, ‘ చేయుచున్నాఁడు ’ అనుపదము ప్రయోగింపఁబడుచున్నది. వాతము మున్నగు రోగములచేఁ గదలినపుడన్ననో ‘ఇతఁడు కదలుటను జేయుట లేదు. మ తేమన వాతాదిరోగములచే వీనికిఁ గదలిక కలుగుచున్నది’ అని ప్రయోగింపఁబడుచున్నది. కావున ‘ కరోతి ’ (= చేయుచున్నాఁడు) అనుపదమున కర్థము ప్రయత్న మగుచున్నది. ‘ యజేత ’ అనుపదమునకు వివరణముగా ‘ యాగేన కుర్యాత్ ’ అనియు, ‘ పచతి ’ అనుదానికి ‘ పాకం కరోతి ’ అనియు, ‘ గచ్ఛతి ’ అనుదానికి ‘ గమనం కరోతి ’ అనియుఁ ప్రయోగము లుండుటంబట్టి ‘ యజేత ’, ‘ పచతి ’ మున్నగు పదములందలి యాఖ్యాతమునకు ‘ కరోతి ’ పదముతో సమానార్థకత్వ ముండునట్లు తెలియుచున్నది. కావున ‘ కరోతి ’ పదమున కర్థ మగు ప్రయత్నము,[1] ఆఖ్యాతముచే బోధింపఁబడుచున్నది. అట్టియత్నము, చేతనునియందే కాని, యచేతనమైన రథమునం దుండనేరదు గనుక, రథ మనెడి కర్తనుగూర్చి ‘ రథో గచ్ఛతి ’ ( రథము నడచుచున్నది ) అని యాఖ్యాతమును[2] ప్రయోగించుట కుదురకపోయెడిని ’ అని చెప్పవలదు. రథమును లాగు గుఱ్ఱములు చేతనము లగుటంజేసి, వానియం దుండు ప్రయత్నమును రథమునం దారోపించుటవలన,[3] ‘ గచ్ఛతి ’ అను నాఖ్యాతప్రయోగ మా ప్రయత్నమును బోధించుటమూలముగాఁ గుదురుచునేయున్నది.

౧. ఇట్లు చెప్పుటచే “ ఘటం కరోతి” అనునర్థమునందు ‘ ఘటం భావయతి ’ అను ప్రయోగ ముండుటవలన ‘ కరోతి, భావయతి ’ అను పదముల కొకటే యర్థ మని తెలియుచున్నది. ‘భావయతి’ అనుపదమునకు ‘ ఒకవస్తువుయొక్క యుత్పత్తి కనుకూలించు వ్యాపారము ’ అర్థము గనుక, నీ వ్యాపారమే కరోతిపదమునకును దానితో సమానార్థక మగు నాఖ్యాతమునకును నర్థము కాఁగలదు. అని ముందు వివరింపఁబోవు మండనమిశ్రునిమతిము నిరాకరింపఁబడుచున్నది.

౨. గచ్ఛతిపదమునందలి ప్రయత్నముమ బోధించు ‘ తి ’ ప్రత్యయము.

౩. ఇందులకు న్యాయసుధయందు ( ౫౭౯ ) వివరింపఁబడిన

“ స్త్రీత్వాభావేఽపి ఖట్వాదౌ టాబాదిప్రత్యయో యథా,
ప్రయుజ్యతే తథాఖ్యాతం యత్నాభావేఽప్యచేతనే.
వోఢ్రశ్వాదిగతం యత్నం రథాదా వుపచర్య, వా,
ఉపపాద్యః ప్రయోగోఽత్ర ముఖ్యార్థానుపపత్తితః. ”

అను శ్లోకములు ప్రమాణముగాఁ గలవు.

ఏమతమున 'ఒకివస్తువు నుత్పాదించుట కనుకూలించు వ్యాపారసామాన్యమే భావన' యని యంగీకరింపఁబడుచున్నదో, యా మతమునందుఁగూడ, రథ మచేతన మగుటంజేసి, దానియందు గమనముకంటె వేఱగు వ్యాపార మేమియు లేకుండుటం బట్టి 'రథో గచ్ఛతి' యను ప్రయోగము, రథమును లాగు గుఱ్ఱములయం దుండు ప్రయత్నమును రథమునం దారోపించుటచేతనే కుదురుచుండుట సమానమే. కావున ప్రయత్నమే యర్థభావన యగుచున్నది. ఇందుకు న్యాయసుధయందు (౫౭౯) చెప్పఁబడిన "ఇచటఁ బ్రస్తుతమగు నర్థభావన యాఖ్యాతముచేఁ బ్రయత్నరూపము గానే బోధింపఁబడుచున్నది గాని, దానికంటె వేఱురూపముగా బోధింపఁబడుట లేదు." అను కారికయే ప్రమాణముగాఁ గలదు. ఇట్లు న్యాయసుధాకారులమతము నిరూపింపఁబడినది. ఇతరులగు పార్థసారథిమిశ్రుల మతమెట్టిదో యిఁక వివరింపఁ బడుచున్నది.

పార్థసారథిమిశ్రుఁ డిట్లు చెప్పుచున్నాఁడు:—భావన యనఁగాఁ బుట్టుచున్నదాని పుట్టుక కనుకూలించు పుట్టించువాని వ్యాపారవిశేషము—ఏ వ్యాపారమును జేసిన పిదప నొకకరణము[2] తా నుత్పాదింపఁగలుగు ఫలము నుత్పాదించునో యట్టి వ్యాపారమే[3] భావన యని తాత్పర్యము. అట్టి భావనయే యాఖ్యాతమున కర్థము. 'కుఠారేణ చ్ఛినత్తి' అను వాక్యమునందలి 'ఛినత్తి' అను నాఖ్యాతమును వినిన తోడనే, 'ఏవ్యాపారము చేసినయెడల కుఠారముచే ఛేదన మను క్రియ జరుపఁ బడునో, యట్టివ్యాపారమునకు సంబంధించునట్లు కుఠారము ప్రవర్తింపవలెను' అని తెలియుచున్నది. ఇట్లే 'యజేత స్వర్గకామః' అను వాక్యమునను 'ఏవ్యాపారము చేసినయెడల యాగముమూలముగా స్వర్గము కలుగునో యట్టివ్యాపారమునకు సంబంధించునట్లు యాగము ప్రవర్తింపవలెను.' అనునది యర్థ మని తెలియుచున్నది. అట్టివ్యాపారము, 'కుఠారముచే ఛేదింపవలెను' అనుచోట, 'కుఠారమును బైకెత్తుట, కఱ్ఱమీఁద సరిగాఁ బడవేయుట మున్నగునదియు' స్వర్గమును గోరువాఁడు 'దర్శపూర్ణమాసము లనెడు నిష్టుల నాచరించి యజించుటచే నిష్టము

౧. "ప్రయత్నవ్యతిరిక్తార్థి భావనా తు న శక్యతే, వక్తు మాఖ్యాతవాచ్యేహ ప్రస్తుతే త్వుప రమ్యతే." న్యాయసుధయందు ౫౭౯.

౨. కరణము = సాధనము.

3. ఫలము నుత్పాదించుటలో దానికరణమునకు సహకారము చేయువ్యాపార మని యర్థము.

నుత్పాదించుకొనవలయును ' అనుచోట, ' అగ్నీ నన్వాదధాతి '[౧] అనుసూత్రముచే విధింపఁబడు అగ్న్యన్వాధానము మొదలుకొని ' బ్రాహ్మణాం స్తర్పయతి '[౨] అను సూత్రముచే విధింపఁబడు బ్రాహ్మణసంతర్పణమువఱకును నుండు పనులరూప ముగా నుండునదియు నగుచున్నది. ఒకపనిచే నొకఫలము నుత్పాదించువిషయమై కథంభావాకాంక్ష కలుగఁగా, నీ వ్యాపార మాయా విశేషరూపమును బొంది, యా యాకాంక్షను బూరించున ట్లన్వయించు నని తెలియుచున్నది.

ఇతరము నుత్పాదించుట కనుకూలించు వ్యాపారసామాన్యమే యాఖ్యాత ముచే బోధింపఁబడుచున్నది. ' రథో గ్రామం గచ్ఛతి ' ( = రథము గ్రామమును గూర్చి పోవుచున్నది.) అను నచేతనము కర్తగాఁగల వాక్యమునందుఁగూడ ' పోవుచున్నది ' అను నాఖ్యాతముచే ' గ్రామమును బొందుట ' యనెడి ఫలమున కనుకూలించు వ్యాపారమే బోధింపఁబడుచున్నది. ఏ వ్యాపారము చేసినపిదప రథము, గమనమమూలముగా, గ్రామమును బొందఁగలుగుచున్నదో, యట్టి వ్యాపారమునకు సంబంధించునట్లు రథము ప్రవర్తించుచున్న దని తెలియుచున్నది[3] గదా! కనుక నిచట నాఖ్యాతముచేఁ బైని వివరింపఁబడిన వ్యాపారసామాన్యమే, బోధింపఁబడుచున్నది. కాని యిచట గమనము ' గచ్ఛతి ' పదమునం దుండు ధాతువుచే బోధింపఁబడుటవలన, ' తి ' అనెడు నాఖ్యాతముచే బోధింపఁబడనేరదు. ఈ గమనమున కనుకూలించు వ్యాపార మెట్టిది యని యాకాంక్ష కలుగఁగా, పూర్వప్రదేశము విడుచుట, ముందుప్రదేశమును బొందుట మున్నగునదియే యా వ్యాపార మని ' గొడ్డలిని బై కెత్తి కట్టమీఁద సరిగాఁ బడవేయుటచే గట్టను ఛేదించుచున్నాఁడు ' అను ప్రయోగమువంటి ' రథము పూర్వప్రదేశమును వీడి, ముం దుండుప్రదేశముతోఁ గలియుటమూలముగా గ్రామమును బొందుచున్నది. ' అను ప్రయోగ మనెడి ప్రమాణాంతరమువలనఁ దెలియుచున్నది. ఇట్లే ' దేవదత్తుఁడు ప్రయత్నించుచున్నాఁడు. ' అను ప్రయోగమునుండికూడ[౪] ' ఎట్లు ప్రయత్నము

౧. ఆపస్తంబశ్రౌతసూత్రము.

౨. ఆప. ౧-౧౬-౧౭.

3. కనుక నిచట చేతనములైన యశ్వములందుండు ధర్మము, అచేతనమగు రథమునం దారోపింపకయే యీ వాక్యముయొక్క యర్థము కుదురుచున్న దని భావము.

౪. ' ఆఖ్యాతార్థము ప్రయత్న మని యంగీకరించువానిమతమునందు ధాత్వర్థ మైన ప్రయత్నమున కనుకూలించు వేఱొకయత్నము, అప్రసిద్ధము గనుక ' దేవదత్తుఁడు యత్నించుచున్నాఁడు.' అను

కలుగునో యట్లు దేవదత్తుఁడు వ్యాపారము చేయుచున్నాఁడు' అనునర్థ మేర్పడు చున్నది గనుక, ఆఖ్యాతమునకు ప్రయత్నమున కనుకూలించు వ్యాపారమే యర్థము గాని, ప్రయత్నము ధాతువుచే బోధింపఁబడుటంజేసి యాఖ్యాతమున కర్థము కానేరదు. అట్టి ప్రయత్నమున కనుకూలించు, నాఖ్యాతమున కర్థ మగు, వ్యాపార విశేష మెట్టిది యని యాకాంక్ష కలుగఁగా గొడ్డలిచే ఛేదించుటవిషయమై 'యెత్తుట', 'పడవేయుట' మున్నగువానివలె 'దేవదత్తుఁడు యత్నించు చున్నాఁడు.' అనుచోట దేవదత్తునియిచ్ఛ మున్నగునది యట్టివ్యాపార మని తెలియుచున్నది. కాఁగా, ఏదే నొకదాని నుత్పాదించుట కనుకూలించు వ్యాపార సామాన్యమే చేతనము[౧] గాని, అచేతనము[౨] గాని కర్త కాఁగలస్థలములయం దెల్ల, ననుగతముగా నుండుటచే, నాఖ్యాతమున కర్థ మగుచున్నది గాని ప్రయత్నమాత్ర మాఖ్యాతార్థము కానేరదు. 'రథము పోవుచున్నది' 'దేవదత్తుఁడు ప్రయ త్నించుచున్నాఁడు.' అనునీ మున్నగు వాక్యములయందు ధాత్వర్థములైన గమనము ప్రయత్నము మున్నగువాని నుత్పాదించుట కనుకూలించు ప్రయత్న మేమియు లేదుగదా! ఇట్టిస్థలములయందు, ఉపచార (= ఆరోప)ము నవలంబించుప్రయత్న మాఖ్యాతార్థ మనుపక్షమును సమర్థించుట తగదు. ముఖ్యార్థము సంభవించు చుండఁగా నుపచారమును గల్పించుట యన్యాయ్యముగదా! 'కరోతి' పదమునకు 'ఇతర మగుదాని నుత్పాదించుట కనుకూలించు వ్యాపారమే' యర్థము గాని ప్రయత్నమాత్ర మర్థము కానేరదు. 'కరోతి' (చేయుచున్నాఁడు.) పదము చేతనము గాని, యచేతనము గాని కర్తగాఁగల యాఖ్యాతములతో సమానార్థ మగుచున్నదిగదా! కాఁగా నేదే నొకదాని నుత్పాదించుట కనుకూలించు వ్యాపా రమే యర్థభావన యని సిద్ధించుచున్నది. అట్టియర్థభావన, క్రియాపదమునందలి యాఖ్యాతాంశముచే బోధింపఁబడుచున్నది గనుక, ఆఖ్యాతమునకు, "ఉత్పాదించు టకు ననుకూలించు వ్యాపారమును జేయుటచే నుత్పాదింపవలయును" అనునర్థ

ప్రయోగమును 'రథము నడచుచున్నది' అను ప్రయోగమునువలె నారోపమునుూలముగా బహుక్లేశ ముతో సమర్థింపవలసియుండును. ఆఖ్యాతార్థము వ్యాపారసామాన్య మనెడుపక్షమం దన్ననో, యట్టి ప్రయోగముకూడ సులభముగా సమర్థింపవచ్చు నని తాత్పర్యము.

౧. దేవదత్తః పచతి.

౨. స్థాలీ పచతి – అనునీ మున్నగు ప్రయోగమువలన నన్నిటియందును ననుగతమైనవ్యాపారమే యాఖ్యాతార్థమైన యర్థభావన కాఁగలదు గాని చేతనమాత్రమునం దుండు ప్రయత్నము అట్లు కాఁజాలదు.

మేర్పడుచున్నది. అట్టి యర్థభావనయం దుండు మూఁడంశములలో భావ్య మేది? యను నాకాంక్ష కలుగఁగాఁ, బురుషునిచే నపేక్షింపఁబడు స్వర్గము మున్నగునది భావ్యముగా సంబంధించుచున్నది. కరణ మేది? యని యాకాంక్ష కలుగఁగా యాగము మున్నగునది కరణముగా సంబంధించుచున్నది. ఇతికర్తవ్యత యేది? యని యాకాంక్ష కలుగఁగాఁ బ్రయాజములు, ననూయాజములు మున్నగునవి యితికర్తవ్యతగా సంబంధించుచున్నవి; కాఁగా "యజేత స్వర్గకామః" అనునీ మున్నగు వాక్యములందు 'యజేత' పదముచే, స్వర్గము మున్నగు ఫలముల నుద్దేశించి యాగము మున్నగునవి విధింపఁబడుటంజేసి "యాగము మున్నగునవి ప్రయోజనము నుద్దేశించి వేదముచే విధింపఁబడుటచే, ధర్మ మగుచున్న" వని సిద్ధించుచున్నది.

అట్టి యీధర్మము దేని నుద్దేశించి యాచరింపఁబడునో దాని నుత్పాదింపఁ గలుగుచున్నది. అట్లు కాక యది, భగవానుఁ డగు గోవిందునికి సమర్పించు నుద్దేశముతో నాచరింపఁబడినయెడలఁ జిత్తశుద్ధిని గలిగించుటమూలముగా, మోక్షము నీయఁగలదు. ధర్మమును భగవంతునికి సమర్పించు నుద్దేశముతో నాచరించు విషయమై ప్రమాణము లేకపోలేదు. ఇందులకు "అర్జునా![౧] దేని నాచరించు చున్నావో, దేనిని భుజించుచున్నావో, దేనిని హోమము చేయుచున్నావో, దేనిని దానము చేయుచున్నావో, ఏతపము నాచరించుచున్నావో వాని నన్నిటిని నాకు సమర్పింపుము." అను భగవద్గీతావాక్య మనెడి స్మృతి ప్రమాణముగాఁ గలదు. ఈస్మృతికూడ, అష్టకలు మున్నగు కర్మవిశేషములను బోధించుస్మృతులవలెఁ బ్రమాణ మగు నని, వార్తికకారులచే, నర్థవాదములను నిరూపించుపాదమునందు, వివరింపఁబడియున్నది.[౨]

సమాప్తము.

---

౧. "యత్కరోషి య దశ్నాసి య జ్జుహోషి దదాసి యత్, య త్తపస్యసి కౌంతేయ! త త్కురుష్వ మదర్పణమ్." భగవద్గీత, ౯వ అధ్యా.

౨. ఈగీత యితిహాసరూపమగు భారతమం దున్నను దీనియందుండు నాఖ్యానము లర్థవాదము [illegible] బోధించుభాగములు ధర్మవిషయమై ప్రమాణము లనియు, వార్తికకారులచే [illegible] భగవంతుఁడగు వాసుదేవునిచే స్వయముగాఁ జెప్పఁబడుటవలన నిది [illegible], దీనిప్రామాణ్యమునుగూర్చి సంశయ మేమియును నుండఁగూడ దని భావము.

# ANDHRA MIMAMSA NYAYA MUKTAVALI

A TREATISE ON

# PŪRVA MIMAMSĀ DARŚANA

BY

**K. Gopalakrishnamma,** M. A., L. T.,

Lecturer in Oriental Language

# కృతజ్ఞత

ఈ గ్రంథములు రచించుటయం దావశ్యకమగు పుస్తకసామగ్రిని సంపాదించి వినియోగించుటయందును, దీనిని ముద్రించుసందర్భమున ప్రూఫులను (proofs) సవరించుట మున్నగు విషయములందును, మిగుల సాహాయ్య మొనర్చిన—రాజమహేంద్రవరములోని గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీపండితులైన శ్రీమాన్ 'విద్వాన్' కలవపూఁడి వేంకటాచార్యులవారికి నేను మిక్కిలిగఁ గృతజ్ఞుఁడను.

కూచిమంచి గోపాలకృష్ణమ్మ.